# ఆముక్తమాల్యద

## (సాహిత్య ఆధ్యాత్మిక సమీక్ష)

కొత్త వెంకటేశ్వరరావు
M.A., LL.B.

సంపాదకులు

కొత్త శ్రీరామచంద్రమూర్తి
M.A.,

# అంకితం



బహు శాస్త్ర విద్యా పారంగతుడు

బహు పురాణ ప్రవచన ప్రవీణుడు

మా నాయనగారు

శ్రీకొత్త గోపాలకృష్ణయ్య చౌదరి గారి

దివ్య స్మృతికి భక్త్యంజలి

కొత్త వెంకటేశ్వరరావు

**ఆముక్తమాల్యద**
సాహిత్య ఆధ్యాత్మిక సమీక్ష
**కొత్త వెంకటేశ్వరరావు**

ప్రచురణ - 2001

ముఖపత్ర రచన
**బాపు**

వెల - రూ॥ 150/-

ప్రతులు - 1000

ప్రతులకు:

1. విశాలాంధ్ర పబ్లిషర్స్, హైదరాబాదు.
2. శ్రీమతి కొత్త రంగమాంబ
   C/o Dr. K. ఉషాలక్ష్మి
   6-3-661/8 సోమాజిగూడ,
   హైదరాబాదు - 500 082
   ఫోన్: 3310568

టైప్ సెట్టింగ్ :
**శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్**
నల్లకుంట, హైదరాబాదు
ఫోన్ : 3399390

ముద్రణ :
**శ్రీ సాయి ప్రెస్,**
నారాయణగూడ, హైదరాబాదు - 500 029
ఫోన్ : 7563075



రచయిత

**కొత్త వెంకటేశ్వరరావు** M.A. LL.B.

**Dr. C. NARAYANA REDDY**
M.A., Ph.D., D.Litt.
JNANPITH AWARDEE
MEMBER OF PARLIAMENT
(RAJYASABHA)

21 FEROZESHAH ROAD,
NEW DELHI-110 001,
TEL.: 3782339

PLOT No. 48, ROAD No.6,
FILM NAGAR, JUBILEE HILLS,
HYDERABAD-500 033 A.P.
TEL.: RES. 3548491

తేదీ: 10-8-2001

## సంస్పందన

తెలుగులో ప్రథమగణ్య ప్రౌఢకావ్యం శ్రీనాథ విరచిత శృంగారనైషధమైతే, అనితరసాధ్య ప్రౌఢతర కావ్యం శ్రీకృష్ణదేవరాయ ప్రణీత ఆముక్తమాల్యద.

ఆముక్తమాల్యదకు వేదం వేంకటరాయశాస్త్రి గారు రచించిన వ్యాఖ్య నిస్తుల కరదీపిక. ఆ విద్వన్మణి స్పృశించని అంశాలను, సూచించని దిశలను కొత్తవెంకటేశ్వరరావుగారు విశ్లేషించి చూపారు. ఆముక్తమాల్యద ఒక విష్ణుచిత్తుని కథగానో, ఒక గోదాదేవి ఆత్మావిష్కృతిగానో రచింపబడలేదు. పద్యగ్రథనానికి, బహువిషయ విక్షేపానికి ఉదాహరణయోగ్యంగా నిలిచిన గ్రంథమిది.

వెంకటేశ్వరరావుగారు సంస్కృతాంధ్ర భాషలతోపాటు ఆంగ్లభాషలో అధికారం కలిగిన కోవిదులు. ఆముక్తమాల్యదను ఆయన ఒక సాహిత్య గ్రంథంగా మాత్రమే కాక వివిధ కోణాలనుంచి విశ్లేషించి చూపారు. ఆ మహాకావ్యంలోని పౌరాణిక, చారిత్రిక, ఆధ్యాత్మిక పార్శ్వాలను అనన్య దిశగా తరచి విమర్శనాంశాలను వెలికితీశారు. ఇంతవరకు పరిశోధకులెవరూ ఎత్తిచూపని పరమవైష్ణవీయ పార్శ్వాలను కట్టెదుట నిలిపారు.

వెంకటేశ్వరరావుగారు ఈ గ్రంథరచనలో వేసుకున్న ప్రణాళిక విస్తృతమైంది. అందులోని కొంతభాగమే ఈ పుస్తకరూపంలో వెలువడుతున్నది. కావ్య పాఠకులకు, ఆధ్యాత్మిక సాధకులకు, అభినవ ప్రేరణ కలిగించే గురుతరవిమర్శన గ్రంథాన్ని రచించిన కొత్త వెంకటేశ్వరరావుగారి కృషికి నా అభినందన. అంతేకాదు ఇది నా హార్దిక సంస్పందన.

సినారె

# అభినందన

**డా॥ వేటూరి ఆనందమూర్తి**

అధ్యక్షులు, (రిటైర్డ్) తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

సహృదయ శిరోమణులైన శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు సాహితీ సమరాంగణ సార్వభౌములైన శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదా ప్రబంధాన్ని గూర్చి కూర్చిన ఆధ్యాత్మిక సాహిత్య సమీక్షా గ్రంథమిది. సహృదయులైన పాఠక మహాశయుల కరకమలాల నలంకరిస్తున్నది. రసికవర్యుల సరససహృదయాల నలరించబోతున్నది. మనోహరమైన వారి యీ కావ్య సమీక్ష చదువరుల తలలూపి ఆపాతమధురమ్మై- 'ఆహా! అనిపిస్తూ, ఆలోచనామృతమై- ఆహా ప్రజ్ఞ!'అనిపింపజేస్తూ ఆనందాశ్చర్యాలలో ఓలలాడింపగలదు.

ప్రబంధతత్వాన్ని శ్రీకృష్ణదేవరాయలూ, రాయల కవి హృదయాన్ని శ్రీ వెంకటేశ్వరరావుగారూ పరస్పరం దర్శించి ప్రదర్శించిన వైఖరి కమనీయంగా ఉన్నది.

**"శ్రీ కమనీయ హారమణి చెన్నుగదాముద గౌస్తుభంబు నం**
**దాకమలా వధూటియు ముదారతదోప బరస్పరాత్మలం**
**దా కలితంబులైన తమ యాకృతు లచ్ఛత బైకిదోచియ**
**స్తోకతనందు దోచెనన శోభిలు వేంకట భర్త గొల్చెదన్**

అనే రాయలవారి కృత్యాది పద్యం ఎదలో మెదలుతున్నది. అంతేకాదు హారమణి స్థానంలో ఆంధ్ర ప్రబంధ కృతి, కౌస్తుభస్థానంలో కావ్య సూక్ష్మాకృతి, వెలకొని "పరస్పరాత్మలం దాకలితంబులైన తమ యాకృతు లచ్ఛత బైకి దోచి యస్తోకతనందు దోచెనన శోభిలు కావ్య సమీక్ష వెంచెదన్" అనిపింపజేస్తున్నది.

డా॥ ఉషాలక్ష్మిగారు, వారి సోదరులు, పితృఋణాన్ని భక్తి శ్రద్ధలతో తీర్చుకొనే విశుద్ధ సంకల్పంతో, తల్లిగారైన శ్రీరంగమాంబగారి ప్రేరణతో, తమ తండ్రిగారి

సాహిత్య విద్యా పరిశ్రమను వెలుగులోకి తెచ్చేయత్నం చేస్తున్నారు. అందుకు ముందుగా వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. కాదనరాని వారి కోరికపై నాలుగు వాక్యాలువ్రాసే నెపాన సహృదయులు, సరసులు, సాహిత్య విద్యాచతురులు, విద్వన్మణులు, ఆత్మీయులు అయిన శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారి సార్వభౌమమైన శేముషీప్రాభవానికీ, స్నిగ్ధ సుకుమారమైన వారి సౌమనస్యానికీ నా జోహారులర్పిస్తున్నాను. ఈ సందర్భంలోనే శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారికీ, వారి మూలంగా శ్రీ కొత్త రామకోటయ్యగారికీ, అలాగే కొత్తవారి కుటుంబ సభ్యులందరికీ పితృపాదులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితోనూ, యోగ సాహిత్య విద్యా జన్మవంశములందు వారిసంతానమై వర్థిల్లి వర్థిల్లిన మిత్రులందరితోనూ గల ఆత్మీయతాను బంధాన్ని చెరిగిపోని తీయని తలపుతో ఇక్కడ స్మరిస్తున్నాను. ఆ జగత్కుటుంబి ప్రేమ సామ్రాజ్యము అఖండమైనది; అవ్యయమైనది.

ఆగస్టు 29, 1950కి పూర్వం శ్రీ శాస్త్రిగారున్నప్పటిలాగానే, ఆ తర్వాతనూ వారున్నట్టుగానే ప్రత్యక్షానుభూతి పొందడం ఈ కుటుంబ సభ్యుల నిత్యానుభూతి.

1939లో శ్రీ శాస్త్రిగారితో వారికి పరిచయమైనది మొదలుగా మా యీ కుంటుంబ సభ్యులలో ఒకరుగా మెలగిన శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు నా తొమ్మిదో యేడు నుండీ నన్నెరుగుదురు. ఆనాటి నుండీ కూడా నా అభ్యుదయాన్ని కాంక్షిస్తూ కృషిని అభినందిస్తూ వచ్చారువారు. 1950లో నాయనగారు భౌతికాన్ని విడచిన తర్వాత, అచ్చుపడిన ఆత్మకథ, "ప్రజ్ఞాప్రభాకరము"నకు శ్రద్ధాంజలిగా, వారే ఒక మహనీయమైన ముందుమాట వ్రాశారు. అది మాస్టర్ యోగతత్త్వాన్ని అనుభూతికి తెచ్చుకొని శ్రీ శాస్త్రిగారి జీవితాన్ని సన్నిహితంగా దర్శించి ప్రదర్శించిన దివ్యరచన. ఈ సమీక్షకృతి రచనకు వారు పూనుకున్న తొలినాళ్ళలో, హైదరాబాదులో వారితో మరింత సన్నిహితంగా మెలిగే అవకాశం నాకు కలిగింది. అప్పుడే వారికి వలసిన ఆకరగ్రంథాలు కొన్నిటిని సేకరించి పెట్టడంలో నేనూ తోడ్పడ్డానన్న తృప్తి నాకున్నది. ఆ తర్వాత వాచవిగా ప్రటించిన "శ్రీకృష్ణదేవరాయులు" అనే లఘు రచనను వారు నాకందించగా చదివి వారి పరిశీలనా శక్తిని, విమర్శ విద్యావైపుణ్యాన్నీ గ్రహించి ఆనందం చెందాను. ఇప్పుడీ సమగ్ర సమీక్షా గ్రంథాన్ని ప్రత్యక్షరమూ తుదముట్టా చదివి ఆనందాశ్చర్యాలు

పొందానని వేరుగా చెప్పడం పునరుక్తి. ఆముక్తమాల్యదా ప్రబంధ రచనలో రాయలవారి సమగ్ర దృష్టిని సర్వ సమగ్రంగా వీరిందు చిత్రించిన వైఖరి రమ్యాతిరమ్యము. ఇదంతా ఎందుకు చెప్పానంటే ఈ గ్రంథ రచన వెనకాల ఎంతటి అధ్యయనము, కృషి, పట్టుదల ఉండినదో, ఎన్నేండ్ల తపస్సున్నదో ఎలాంటి సంస్కార వాసనలు, జీవధర్మం పనిచేస్తూ వుండినవో ఒకసారి వాటోపాటు పాఠకులూ భావనకు తెచ్చుకొని పరిశీలించడానికే!

ప్రబంధ గౌరవాన్ని రీవితో భావనచేసే సందర్భాల్లో కవిరాజ శిఖామణి నన్నిచోడడు, వాదిభంజనం- రాజరంజనం కావించే సందర్భాలు వివరించే పట్టున సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయులు; విష్ణుచిత్తుని దాస్య భక్తినీ వాత్సల్యరక్తినీ పరవశించి వర్ణించేటప్పుడు కనులలో ప్రేమను వర్షించే ప్రభాకర గురుదేవులు; మన్నవారు మొలకనవ్వు పారవశ్యాన్ని వివరించేలాటి సందర్భాల్లో చూచేకళ్ళను, పలికే రసనను కలం పాళీలో కూర్చుకొని తనదైన రీతిలో జాలువార్చే మహాకవి విశ్వనాథ మనకు సాక్షాత్కరిస్తారు; వారిని ఆవేశిస్తారు.

అలాగే "పరమేశ్వర సంకల్పమువలన........విశిష్టాద్వైత పూర్ణయోగమును తులనాత్మకముగా పరిశీలించుట ఆసక్తికరమగు పరిశోధనా విషయము" అనడంలో, పథనిర్దేశకుడైన ఒక ఆధునిక దార్శనికుడు గోచరిస్తాడు. సుసూక్ష్మమైన విశ్లేషణలోనూ రాజనీతి మొదలైన అంశాలలోనూ శాతాలు లెక్కకట్టి విలువలు కట్టడంలో ఒక గణాంకశాస్త్రాచార్యుడు కానవస్తాడు. కావ్యగత శతాంశాలను పరిశీలించి, విశ్లేషించి, అన్వయించి, సమర్థించే సందర్భాలలో వృత్తిలో ఉచ్చదశనందుకొన్న గొప్ప న్యాయవాది దర్శనమిస్తాడు. పైన పేర్కొన్న వారి అందరిదివలెనే వీరిదీ ఒక భౌతిక సమగ్ర దృష్టి. ఒక నవ్యసంప్రదాయ సృష్టి. వాటి అనుసంధానమే, అనుభూతి యోగమే. వారి వీరి జీవిత రచనల్లో వ్యాప్తమై వ్యక్తమయ్యే అభివ్యక్తి.

శిష్ట, విష్ణ రెండూ చక్కగా కుదిరిన వీరి రచనలో కావ్య వస్తువుమీది ఆదరము, రాయల రచనమీది ప్రీతి, ప్రబంధపాత్రలమీది గౌరవము, అడుగడుగునా కానవస్తున్నది. అంతేకాదు; విశ్లేషణలో నైశిత్యము, విమర్శలో సౌకుమార్యము, దర్శనంలో పూర్ణత్వము, వర్ణనలో లాలిత్యము, వాదమున చతుర వాక్పటుత్వము, వివృతిలో పేశలత్వము,

అన్వయమున సామర్థ్యము గ్రంథ గౌరవాన్ని పెంచేవిగా ఉన్నవి. సమీక్ష గ్రంథమంతటా పరచుకొన్న వాస్తవమిది గనుక ప్రత్యేకించి ఉదాహరణలెత్తి చూపనవసరంలేదు. చదువరులే గుర్తించగలరు.

భారతీయ సర్వతత్త్వ దర్శనసారమనదగిన రచనగా వీరు దీని నావిష్కరించారు. రాయలనాటి రసిక జీవనాన్ని ఆవరించియుండిన అప్పటి చారిత్రక రాజకీయ, మత, సామాజిక, కృషి, వాణిజ్య, ప్రాకృతిక పర్యావరణాది సమస్త విషయాలను సమకాలిక దృష్టితోనూ, ఆధునిక దృక్పథంతోనూ, అన్వయిస్తూ వివరించిన తీరు మనోజ్ఞము.

శ్రీ విల్లిబుత్తూరులో ఒక సాత్త్విక యోగభూమిని, గ్రామీణ భోగ కేంద్రాన్ని. మధురలో ఒక రాజసిక, భోగభూమిని; శ్రీరంగంలో భూమికనవతరించిన కేవల మోక్ష భూమిని దర్శించడంలో కవి దర్శించిన ఆంతర దృశ్యాన్ని విమర్శకుడు జ్ఞాన దృష్టితో వెలువరించినట్లున్నది.

"వ్యాఖ్య లేనిచో యేనాడో అంతరించియుండెడిదని.........సహృదయ హృదయరంజకముగా నున్నదని ఈ రచయిత యూహ"- ధీర గంభీరమైన ఆముక్తమాల్యద రచన పైచూపులకు కనపడినంత కఠినంకాదనీ, తాకిచూస్తే లోన వెన్న కనిపిస్తుందనీ వెంకటేశ్వరరావుగారు ఎన్నో సన్నివేశాలలో అనుభూతితో వివరించి నిరూపించారు.

ప్రబంధంలో వైశ్వైక్యముందనీ, లేదనీ వాదించేవారికందరికీ సమగ్ర దృష్టితో కావించిన వీరి యీ సమీక్ష శంకలు తీర్చి మరింత తృప్తినీ, మరిన్ని ఉపపత్తులనూ కూర్చేదిగా ఉన్నది. రాయలు వాచ్యంచేసి చెప్పినవాటినీ, చూపి చెప్పనివాటినీ (నిష్పందప్రైతసుసంవిదాలయుడు: కనపడీ కనపడని విష్ణుచిత్తుని పరిమళి) రావుగారు విశదీకరించిన విధానం వారి రచనా నైపుణ్యానికి నిదర్శనం. మాదిరికి వారిట్టి సమీక్షలో కొన్నే చెప్పినా పాఠకుడు కావ్యాన్ని చదువవలసిన తీరును మాత్రం నిర్దేశిస్తున్నవని చెప్పకతప్పదు. రాయలు చెప్పక చెప్పిన విషయాలనేకం ఈ దృష్టితో పఠించినప్పుడు పాఠకుల దృష్టికందకపోవు. ఉదాహరణకు రాయలు వాచ్యంచేసినా చేయకపోయినా విష్ణుచిత్తునికి రాజు చేసిన సత్కారంలోనూ, పురియేగించుట (ఊరేగించుట నేటి వాడుక)

లోనూ తాళ్ళపాక చిన్నన్న చెప్పినట్లు అన్నమయ్యకు సాళ్వ నృసింహరాయులు చేసిన సత్కారమూ, సోమనాథ కవి తన వ్యాసయోగి చరిత్రలో వివరించినట్లు కృష్ణరాయలు వ్యాసరాయలకు చేసిన సమ్మానము మన దృష్టి నాకర్షించకపోవుకదా! చేలదరికాలువల్లో ముడుచుకొని పరున్న బాతుల్ని స్నానార్థమేగిన వారు ఉదికిపెట్టిన తడిపంచలుగా భావించడంలో అన్నమాచార్యుల పలుకుబడి గోచరిస్తూనే వుంటుంది కదా! సంకీర్తనపు మాహాత్మ్యాన్ని వెలకమ్ముకొని మాలదాసరి వృత్తాంతంలో, దాసరి వర్ణనలో, చిత్ర వృత్తిలో, అన్నమాచార్యుల వారి ప్రవృత్తి మనకు గోచరించడంలేదూ? అంతెందుకు?"

**అది యొండె భక్తి మొదలే!**
**పెదవిశ్లేషైకధీరు వృత్తి ప్రియాలా**
**భదశమ్మాయి దొరగిన**
**హాదవన యదిగాక తక్కినవి నైశికముల్**

అన్న రాయలవారి పద్యం పరమ ప్రేమ స్వరూపాన్ని చిత్రించే అన్నమయ్య పదానికి పరివర్తనమే కదా! (చూ. తాళ్ళపాక వారి పద కవితలు- భాషా ప్రయోగ విశేషాలు). రవి కానని వాటినీ కవి గాంచగల్గునంటారు! కవి వెలిచూపు న గాంచిన వాటినీ, లోచూపున కాంచినా పైకి వినిపించని వాటినీ, సాహిత్య విద్యాచతురులైన సహృదయ విమర్శకులు, మారు కవులై, వెల్లడిస్తూనే వుంటారు. అదే పరవ పాఠనాల్లో వ్యక్తమయ్యే సృజన చమత్కారం. అది నిండుగా గల వారి సమీక్షా గ్రంథం సహృదయుల మన్ననలను, పండితుల ప్రశంసలను అందుకోగలదనీ, సాహిత్య విద్యార్థుల దృష్టినాకర్షించి ప్రయోజనాన్ని పంచిపెట్టగలదనీ, నిండుగా నమ్ముతున్నాను. జిజ్ఞాసను రేకెత్తించే కొత్త వెంకటేశ్వరరావు గారి వాఙ్మయ పరిశ్రమకు మరొక్కమారు జోహారులర్పించి, వారి స్మృతికి అంజలి ఘటిస్తున్నాను.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః

•

**డా॥ వేటూరి ఆనందమూర్తి**

# విష్ణు చిత్తీయం

'అభినవ భారతి'
ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు
విశ్రాంత ఆచార్యులు, ఆంధ్రభారతి,
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం

"అద్దా వాగ్విబుధమ్ము" - అన్న పద్యం ఆముక్తమాల్యదలో 4వ ఆశ్వాసం ప్రారంభంలో వుంది. సందర్భమేమంటే విష్ణుచిత్తుడు పాండ్యరాజ సభలో పండితుల నోడించి స్వమత స్థాపనం చేసినప్పుడు మింట దేవజాతులాశ్చర్యపడి అన్నమాటలు. అలాగే ఈ గ్రంథం చదివినపుడు సహృదయ పాఠకులు - పండితులైతే - అంత ఆశ్చర్యపడక తప్పదు. ఆముక్త కావ్యతత్త్వ మింతగా విస్మయావహంగా ఆవిష్కృతమైనచోట అన్యత్ర కన్పించదు కనుక.

ఈ శతారంభంలో వేదంవారు వ్యాఖ్యానం వ్రాయటం ప్రథమ ఘట్టం. తర్వాత విశ్వనాథ కవిసమ్రాట్టు - వేయిపడగల్లో - ఇతరత్రా - అనేక సందర్భాల్లో - వ్రాసిన విషయాలు రెండోఘట్టం. మూడవ ఘట్టం ఆముక్తమాల్యదా సౌందర్యమన్న విమర్శ గ్రంథావతరణం. తర్వాత చతుర్థ ఘట్టం. ప్రస్తుత గ్రంథం.

ఆముక్తావతరణ జరిగిన రెండువందల ఏండ్ల తర్వాత 4. 5 వ్యాఖ్యానాలు వచ్చాయి. అవేవీ అచ్చుకానందువల్ల అనేకులకు అందుబాటులో లేకుండా పోయినవి. కాగా ఈ శతంలో పైన చెప్పినట్లు వేదం వ్యాఖ్యాన పూర్వమే వావిళ్ళ వారి వ్యాఖ్యానం వచ్చినా, వేదం వ్యాఖ్యానంతోనే ఆముక్త ప్రౌఢి వ్యాప్తమైనది.

కథలూ గాథల్లో కాబోలు చెళ్ళపిళ్ళవారన్నారు! "నాకు తెలిసినంతవరకు ఆముక్తంలో పట్టుమని పది పద్యాలు వచ్చిన పండితుని నేను చూడలేదు. కానీ ఫలానా

వ్యక్తి అపండితుడైనా ఆముక్తంలో చాలా పద్యాలు కంఠతః వచ్చినవాడు"- ఇత్యాదిగా అనటాన్నిబట్టి వేదం వ్యాఖ్యానం రాకపూర్వ స్థితి ఇలావున్నదనుకోవచ్చు కదా!

కానీ ఈ 70-80 ఏళ్ళలో (వేదం, వావిళ్ళ వ్యాఖ్యానాలు 1925 ప్రాంతానికి కానరాలేదు. ఆముక్తానికి పట్టినంత నీరాజనమితర కావ్యాలకు పట్టలేదంటే అది అసత్యమేమీ కాదు. ప్రస్తుత గ్రంథం దీనికి పరమ నిదర్శనం. ఇది ఆముక్త సరస్వతి కెత్తి న అవునేతి దీపం - కర్పూర నీరాజనం.

రాయలవారు వ్రాసినది ఆముక్తమాల్యద కాగా ఈ గ్రంథకర్త వ్రాసినది విష్ణుచిత్తీయం (రాయల వారెక్కడా తన కావ్యాన్ని విష్ణుచిత్తీయమనలేదు. భావమేమంటే ఆముక్తమే మతతత్త్వ - వేదవేదాంగ సంస్కృతిని పునాదిగా, భూమికగా చేసుకొని రసవత్ కావ్యేతిహాసంగా ఆవిష్కృతమైనదో ఆ సంస్కృతి వ్యాఖ్యానం, అదీ ప్రధానంగా విష్ణుచిత్త పాత్ర నిర్మాణంలోని రహస్య తత్త్వాన్ని ఆధారంగా చేసుకొని వచ్చినది కనుక.

గ్రంథమంతా ఆముక్త ప్రథమాశ్వాస వ్యాఖ్యానమే. విష్ణుచిత్తుని కథా తాత్పర్య విస్తరణమే. మిగిలిన కథలూ - ఆశ్వాసాలూ దానిననుసంధించుకొని పరామర్శింపబడినప్పటికీ - ముఖ్యాంశం మాత్రం విష్ణుచిత్తాశ్రితంగా శ్రీవైష్ణవ మతతత్త్వ వ్యాఖ్యానమే. అంతమాత్రమే కాదు. ఈ వ్యాఖ్యాత చేసిన గొప్పపనేమంటే - చారిత్రక సామాజిక ఆవరణాల నడుమనున్న తత్త్వ వివరణ. న్యాయంగా ఆముక్త . మను. పారిజాత కావ్య విమర్శకులు చారిత్రక దృష్టిని కానీ వాటి సమాజ స్వరూపాన్ని కానీ విమర్శించకుండా వాటిని స్పృశించలేరు. ఈగ్రంథకర్తకీవిషయం పుష్కలంగా తెలుసుననటానికి వారుదాహరించిన పరిశీలించిన చరిత్ర గ్రంథాలు సాక్ష్యం చెబుతాయి. ఇంతవరకే అయితే ఏ చరిత్రకారుడైనా చెప్పగలడు. కానీ ఈ గ్రంథకర్త మురారిది మూడవమార్గమన్నట్లు - భారతీయ తత్త్వశాస్త్రాదులతోపాటుగా పాశ్చాత్య తత్త్వ శాస్త్రాలను, వైజ్ఞానిక మనస్తత్త్వ శాస్త్రాదులనెన్నిటినో చదివి, సంస్కారంతో చేసిన విమర్శ కనుక ఈ గ్రంథ వైశాల్యంగానీ, లోతుగానీ సామాన్యజన దుర్గ్రహం. జీవితకాలమంతా పరిశ్రమించి - పరిశోధన మార్గంలో సంతరించబడిన మహాగ్రంథం. పండితులకుపాదేయం, ఆముక్త మహాకావ్యంలాగానే.

కావ్య తత్త్వ నిర్ణయం చేయటానికి పండితుడుదాహరించిన గ్రంథాలు చూస్తే ఈనాటి సమాజానికి ప్రత్యేకించి తెలుగుకు విమర్శ - పరిశోధకులకందనివి - కననివి వినని వి. ఉదాహరణకు- *The Holy mysteriyam - by - Rodolph Ottoj Telhar-de-chanidin,* లకుముకిపిట్ట అంటే ఏమిటో వివరించిన తీరు అధ్యాయం-2 ప్జాపిక 2 క్రింద చర్చలో ఉదాహరించిన *Animal Encxclopeadia* ఆ వివరణ ఎంత అద్భుతంగా వుంది! *Birds in Saskrit Literature Pancharatra by S.R. Bhelt.*

బ్రహ్మ సూత్రాది భాష్యాలు - సీవెల్ -పేయస్ వంటి వారి వ్రాతలు - చదవటంకాక - అన్వయించటంలో సాగము చూడాలి. చల - అచల వీణల విషయ చర్చ విషయం కోసం పోర్చుగీసులు రాయలకంపిన కామకళ్లో వీణలున్నాయనటం ఎంత గాఢపరిశీలన! విజయనగరం 1, 2, 3 ప్రాకారాల మధ్యనున్న తోటలు దొడ్లు, పొలాలున్నాయని చెప్పిన నాటి పోర్చుగీసువారి వ్రాతల నన్వయించినతీరు అలంకారాలపై రాయలవారికున్న ప్రీతిని స్థాపిస్తూ ఏ స్వామికాయనదే అలంకారాలను సమర్పించారో శాసనాధారాలనుబట్టి అన్వయించిన తీరు వారి అన్వయ గాఢతకు నిదర్శనం. శ్రీకార్యపరులు - అన్నమాట అర్థాన్ని స్థాపించటం కోసం నాటి శాసనాలనుదాహరించటం - వారి చారిత్రక దృక్పథానికెత్తిన పతాక కాదా! ఎన్నని ఉదాహరించటం! పరిశీలించాలి తప్ప- మననం చేయాలి తప్ప!

ఇదొక పద్ధతి వివరణం. దీని సారాంశమేమంటే ఇందులో ఉదాహృతాంశాలన్నీ చాలావరకు అనుబంధాల్లోనే. అనుబంధాల్లోనే ఇంతగాఢ విషయాలను చర్చించిన ఈ గ్రంథ నిర్మాణ పథకం. ఆముక్త మహాకావ్య పథానుసరణం. రాయలు ఆశ్వాసాంతాల్లో ఎంత చారిత్రక ఘట్టనలూ - సందర్భాలు - క్రమానుసారంగా గుదిగ్రుచ్చాడో దానికిది నమూనా : (చూ. ఆముక్త సౌందర్యం).

ఈ గ్రంథ నిర్మాణంలో కర్త రచనా ప్రణాళికను చూస్తే 4 అధ్యాయాలన్ని విభాగానికి ముందు 60 పుటల గ్రంథానికి విభాగంలేదు. కనుక దానిని రాబోయే విమర్శకు భూమికగా గ్రహించాలనుకుంటున్నాను. కర్త ఆ ఏర్పాటు చేయలేదు కనుక ఆ ప్రథమ విభాగం ఆముక్తము - దివ్య ప్రబంధము - అన్నది. ఇందులో రెండు విభాగాలు కన్పిస్తాయి.

1. శ్రీకృష్ణదేవరాయలు
2. శ్రీవైష్ణవ విభాగాలు
3. భక్తిరూపాలు

ఇదొక విభాగం- భూమికలో ప్రథమ విభాగం. తర్వాతవి నాల్గు ద్వితీయ విభాగం.

ప్రథమ విభాగం ద్వితీయ విభాగానికి - తర్వాత 4 అధ్యాయాల గ్రంథానికి. అసలైన భూమిక. ఇందులో చర్చించిన అంశాలు ఆముక్త నిర్మాణానికి పునాది. అది భూమిలో కప్పించని లోతైన పునాది. తమిళుల చరిత్ర - మతాదిక విషయమంతా ఆళ్వార్ల సంప్రదాయానికి ఆధారంగా చెప్పబడినది. భక్తి - సంగీత, సాహిత్యమన్న అధ్యాయం ఆళ్వార్ల పాశురాలు - ప్రజా సామాన్య జీవన శైలిగా పరిణమించటానికి సేతువుగా -హేతువుగా సంఘటించటం - ఈ భక్తిమార్గానికి పూర్వ మతాలెలా దోహదం చేశాయో చెప్పటానికి చరిత్ర చెప్పవలసి వచ్చినది. ఇది తెలియకపోతే ఆముక్త కావ్యంలోని వైష్ణవ భేదాలన్న అధ్యాయం అర్థంకాదు.

ఈ విశ్లేషణ అంతా కావ్యాధారంగా చేయబడినప్పటికి, యామునాచార్యులది జ్ఞానభక్తి, ఖాండిక్య కథలోనిది వైష్ణవయోగమన్న నిరూపణ చాలా హేతుబద్ధంగా వున్నది. ఇంతేకాక భారతీయ మత దర్శనముల చర్చలేకుండా ఖాండిక్య కథలో చెప్పిన యోగం పాతంజలంకాదు. దానికదనంగా శ్రీవైష్ణవం చేర్చుకొన్నదనటం సమగ్రంగా అర్థంకాదు కనుక ఆ భాగమంతా ఆముక్తార్థావగాహనకెంతో దోహదం చేస్తున్నది.

భూమికలో ద్వితీయ భాగమున్నదంతా కేవల కావ్య పర్యాలోచన. ద్వివిధ శైలి, ఉన్నచోట చేసిన సూచన -చెప్పిన పద్ధతి ఎందరికో కనువిప్పు. వేదంవారు ప్రౌఢ శబ్ద ప్రయోగ విచారణ చేసినంత అల్పాల్పములైన సులభ-సరళ తెలుగు జాతీయాలు - పలుకుబళ్ళు - శబ్దాలను పట్టించుకోలేదన్నమాట సత్యమేననిపించకపోదు. ఈ రెండవ శైలిని గురించి చెప్పిన తీరు హృద్యంగా వుంది. ఇది రాబోయే అధ్యాయానికి అన్వయిస్తుంది. అంటే వర్ణనము - ఋతువర్ణనలు - విష్ణుచిత్తుని - భగవంతుని సంభాషణలోని సొగసులు - ఇవన్నీ రాబోయే 2వ అధ్యాయంలో శ్రీ విలుబుత్తూరు

వర్ణనలతో కలిపి చదువుకోవాలని తాత్పర్యం. విష్ణుచిత్తుని - మన్నారుస్వామి సంభాషణని కూడ వ్రాయకుండా కేవలం తెలుగు శైలీ మాధుర్యానికుదాహరించి తర్వాత మూడవ అధ్యాయంలో విష్ణుచిత్తుని - భగవంతుని సంభాషణను వివరించి, ముగింపులో ఇదొక చిన్ననాటకమనటం చాలా అందంగా వున్నది. రాయలవారి రచనలో ఈ ప్రతి ఘట్టాన్ని తిక్కనగారిలాగా అలతి అలతి తెలుగు పదాలతో సంభాషణ రూపంలో చిత్రించటం బహుధా కన్పించే శైలీ విశేషం. విశ్వనాథవారూ ఇదే విషయాన్ని ఖాండిక్యకేశిధ్వజ సంవాదంలో యోగధేనువును పులి చంపిన ఘట్టాన్ని అనుసరించి వివరించారు.

శ్రీ విలుబుత్తూరు వర్ణనల్లోని ప్రత్యేకత - సహజతలను వివరిస్తూ చేసిన విశ్లేషణ ఎంత గంభీరంగా వున్నదంటే - ఇదివరకెవ్వరూ ఆ పద్ధతిగా విశ్లేషించలేదు. ప్రకృతి మానవ సమైక్యం, వైష్ణవ వాతావరణం- ఈరెంటిని మేళవించడంలోని రహస్య వివరణలు చూడాలి. దృశ్య విశ్లేషణ- 1) కాల దృష్ట్యా 2) విషయ దృష్ట్యా 3) అలంకార ప్రయోగ, ప్రయోజన దృష్ట్యా 4) ఈ దృశ్యాల వెనుకనున్న విజయనగర స్మృతులు 5) అందలి క్రమోన్మీలనం 6) వర్ణనలందలి విషయ వైవిధ్యం. 7) అలంకార ప్రయోగం వెనుకనున్న కవి మనస్తత్వ విశ్లేషణ-ఇలా సప్త ప్రాకారాల మధ్యనున్న శ్రీ విలుబుత్తూరు వర్ణనల సౌందర్య వ్యాఖ్యానం లోకోత్తరం.

చాలామంది విలుబుత్తూరు వర్ణనల్లోని సహజ మాధుర్యాన్ని వివరించారు కానీ ఈ పద్ధతి విచారణ వినూత్నం.

ఈ వర్ణనల్లో - కథానిర్మాణంలోని కవి సమగ్ర దృష్టిని వివరించిన తీరులో ఎంత సమన్వయమున్నది! కావ్య విమర్శ అంటే కావ్యానుశీలనం. కావ్య నిర్మాణంలో కవి ప్రతిభాపరిష్కృత శిల్పం - అలంకారం - వివిధ శాస్త్ర పాండిత్యరూపమైన ప్రజ్ఞా విశేషం. నిర్మాణగతమైన అనేకాంశాల మధ్య పొసగింపు - ఇవన్నీ రసానుకూలం కావటం - ఈ విషయ సంపుటిని సమన్వయించటం. వీటన్నిటికీ ఆధారభూమిక. క్షేత్రం - కవి ప్రజ్ఞ, శేముషీ వైభవం. దీనిని పరిష్కరించిన అధ్యాయమే "రాయల సమగ్ర దృష్టి ". అది కథా నిర్మాణంలో - పాత్ర నిర్మాణంలో - వర్ణనల్లో ఎలా ప్రతిబింబించింది ప్రదర్శించటం.

ఆముక్తంలో ఐదుగురు రాజులున్నారట. విమర్శక వ్యాఖ్యాత అంటున్నాడు. పాండ్యరాజారిద్దరు - ఖాండిక్య కేశిధ్వజులు - యామునాచార్యులు - (ముందరి నల్గురు చక్రవర్తులందరి రాజధర్మ సమగ్రతా స్వరూపం- రాయలు తనలోని చక్రవర్తినిక్కడే ప్రదర్శించుకొన్నాడు. యామునాచార్యులు కేవలం రాయలవారే) వీరి నిర్మాణం రాయల సమగ్ర దృష్టికి నిదర్శనంగా ఈ గ్రంథం ప్రదర్శిస్తుంది. ఒక మహాకవి, ఒక జాతి సంస్కృతికి, ఐహికాముష్మిక జీవన విధానానికి సేతువు. అతని కావ్యం ఆ జాతియుగాల మీదుగా వాడుకోదగ్గ గీత- ఉద్గీథ. ఎలుగెత్తి పాడుకోదగ్గ గీత) ఈ విషయాన్ని ఈ గ్రంథం అనేక కోణాలలో స్థాపిస్తున్నది.

రాయలవారిది ఉత్ప్రేక్షణం. కనుక ఆయనకే అలంకారం ప్రతిపాత్రం. కానీ అది స్వభావోక్తి మాధుర్యాన్ని ప్రవిస్తుంది. తప్ప కృత్రిమంగా వుండదు. ఆయన అలంకార ప్రయోగంలో అనేక ప్రయోజనాలు సాధిస్తాడు. 1. సందర్భౌచిత్యం 2. పాత్ర మనస్తత్వానుగుణ్యత 3. వైష్ణవమత/రసానుకూలత 4) కవి మనస్తత్వం. ఈ దృష్టి ఈ విశ్లేషణలో దృశ్యాదృశ్యంగా కన్పిస్తుంది. (దీనికి విరుద్ధంగా పరశురామావతార వర్ణనలో వేదం వ్యాఖ్యగా వుదాహరించిన మాటలు వారివికావు. ఇది పొరపాటు. రాయలకీ అలంకార ప్రీతికి కారణం కవి జీవన విధానంలో మనస్తత్వంలో నమ్మిన మతంలోనున్నదన్న విషయం చాలా విమార్శంగా చమత్కారంగా వున్నది. కానీ కవి వ్యక్తిగత సంస్కారాన్ని - కథాసంస్కారాన్ని సమైక్యపరచి నిర్మించటంలోనే కవి శేముషీ వైభవముంటుంది. ఈ మాట గ్రంథకర్తకూ తెలుసుననటానికి సాక్ష్యాలున్నాయి. పాఠకులు చూచుకోవచ్చు.

ఈ గ్రంథాన్ని నేను విష్ణుచిత్తీయమనటానికి కారణం ప్రత్యేకించి ఈ గ్రంథంలోని 3వ అధ్యాయం.

"అందుండుప్ ధ్వయ సద్మ పద్మపదమందన్న విష్ణుచిత్తుని శీలవర్ణనలో రాయలవారెంత శ్రీ వైష్ణవ-యోగ సంవిత్పంపదను గర్భీకరించారో వివరిస్తూ ఈ గ్రంథకర్త ఆ పద్యంలోని ప్రతిపదసార్థక్యాన్ని 17 పుటలలో సుదీర్ఘ విచారణలో

వివరించారు. ఈ పద్యాధారంగా వ్యాఖ్యాత చెప్పిన భారతీయ మతదర్శన చర్చాసారం. అనంతర అధ్యాయాలైన 6, 7, 8 చూడాలి తప్ప, చూచి ఆశ్చర్యచకితులు కావాలి తప్ప మరొక మార్గం లేదు.

ఒక కావ్య నిర్మాణమంత గంభీరంగా వుంటుందా? దాని విమర్శ ఇంత లోతుగా ప్రౌఢంగా వుంటుందా? అన్నదే పాఠకునికి ఆశ్చర్యకారణం. (వెనుక The Roads to X Nad అన్న విమర్శ చదివి దిమ్మెరపోయాము. అలాగే ఇదీ! కావ్య నిర్మాణంలో కవి ప్రజ్ఞాగాఢతను వివరిస్తుంది.) ఈ గ్రంథం ప్రధానంగా ఆముక్త ప్రథమాశ్వాస వ్యాఖ్యానమన్నాను. అంటూనే ఇతర గ్రంథ - కథా భాగానుసంధానం చేస్తున్నదనీ అన్నాను. దానికుదాహరణలుగా-

1. 2వ అధ్యాయంలో బాహ్యజీవనమన్న అంశం క్రింద ప్రథమాశ్వాసంలోని పాచికలాడు పద్మముఖులన్న విషయాన్ని వివరిస్తూ 4వ ఆశ్వాసంలో విష్ణుచిత్తుని పిలుబుత్తూరు ప్రజలు ఊరేగించి ఆహ్వానించిన సందర్భంలో మరలా వీరి ప్రస్తావన వస్తుంది కనుక దానినతకటంవల్ల 1 నుండి 4 ఆశ్వాసాల కథ అనుసంధించినట్లయినది కదా! అలాగే మరలా విష్ణుచిత్తుని ఊరేగింపు విస్తృతం చేయుటం ఆశ్చర్యకరమైన నిర్మాణం కదా!

2. ఆముక్త నిర్మాణమన్న అంశ క్రింద పుర వర్ణనలను గురించి కానీ, ఋతువర్ణనలను గురించి కానీ చెప్పినప్పుడు కావ్యమంతా - సమగ్ర స్వరూపం - సమిష్టి వైభవం - గ్రంథకర్త దర్శన పథంలో వుంది. ఎందుకంటే ఆ ఋతువర్ణన ప్రసక్తి తిరిగి మరొకచోట వస్తుంది. వ్యష్టి/అంగ విచారణ అంగి-దృష్ట్యా చేయుటమే విమర్శ. సమష్టి దృష్టిలేని వ్యష్టి విచారణ గంభీరమైనా అది విమర్శ కాదు. దీనిని కావ్యానికన్వయిస్తూ కావ్య మీమాంసలో రాజశేఖరుడు అవంతి సుందరీ సిద్ధాంతంగా చెబుతూ - కావ్యంలో వర్ణనలెంత ఉదార సుందరంగా వున్నా - వానికి రసానుగుణ్యత లేకపోతే వ్యర్థం. అని. అలాగే విమర్శకూడా. సమష్టి దర్శనంతో వ్యష్టి నన్వయించటం- ఈ వాక్యమెంత అందంగా వున్నది!

"విలుబుత్తూరు వర్ణనలో కనుపించు ప్రకృతి - ప్రాణి - మానవ వర్గములు రాయల సమగ్ర దృష్టికి తార్కాణములు. ఆయన వీని మధ్యనొక క్రియాశీలమగు సంబంధము నేర్పరచును.

ఈ మాట ఈ విమర్శకూ అన్వయిస్తుంది. పరస్పర విరుద్ధాంశ ప్రతిపాదన లేకుండా అంగాంగి సమన్వయం చేయటం అదే! అందమంటే, శ్రీరామ సౌందర్య వర్ణనలో మహర్షి-

"సమ విభక్తాంగ :" అన్నాడు కావ్య నిర్మాణం ఆ నిర్మాణ విశ్లేషణ రూపమైన విమర్శ నిర్మాణమూ అంతే. ఎక్కడ ఎంతవరకు చెప్పాలో - ఎలా చెప్పాలో - అంగి విషయాన్ని ఎలా అంగ విశ్లేషణలో అతకాలో తెలిసి చేసిన విద్య విమర్శ.

దీని ఉదాహరణ మహాకావ్యాలు. ప్రత్యేకించి ఈ ప్రజ్ఞావైశిష్ట్యం బ్రహ్మసూత్రాది భాష్యాల్లో ప్రస్ఫుటంగా సాక్షాత్కరిస్తుంది. అది చూచిన వాడాయన కనుక, ఇంత సంశ్లిష్టరచన చేయగలిగాడు.

విష్ణుచిత్తునికి మన్ననారు కల్పించిన అసాధారణ కార్యములను సమర్థిస్తూ, మోసెస్ వంటి విదేశీయ భక్తుల అనుభవాలనతకటంలో అది గ్రంథకర్త పాండిత్యంలో ఒక అంశమేకదా. అలా అతకటంవల్ల దాని విశ్వజనీనతను స్థాపించటం ద్వారా కావ్య గౌరవాన్ని పెంచటం.

<u>రాజనీతి</u>

రాజపాత్రలను గురించి సమగ్రంగా పరిశీలించిన ఈ గ్రంథంలో రాయలవారి దర్శన, యోగ, మత సంబంధమైన వ్యక్తిత్వాన్ని స్థాపించటంలో కృతకృత్యత వహించిన ఈగ్రంథంలో, రాయని మరొక వ్యక్తిత్వం- రాజధర్మ స్థాపకుని- దర్శకునిగా, శాస్త్రకర్తగా నిరూపించకపోవటం ఒక లోపమేకదా.

రాయల వారిలో ఒక మహావీరుడైన విజేత - ఒక మహా చక్రవర్తి, ఒక గొప్ప పాలకుడున్నట్లుగా ఆ ప్రభువులో ఒక అన్నమాచార్యుడున్నాడు. యామునుని వంటి ఆచార్యుడున్నాడు. ఆయన వంటి రాజధర్మశాస్త్రకర్త వున్నాడు. వీటినితరులు

చూడలేదు. చూచినా పట్టించుకోలేదు. కవి భావనావర్తంలో మునిగినందువల్ల కాబోలు వేదంవారే దీనినంతగా పట్టించుకోలేదు. ఐనా ఈ గ్రంథంలో భూమికలో 2, 3 పుటలలో సంగ్రహించబడినది. దీనిని విస్తృతం చేయలేదు. వారి ప్రణాళిక ప్రధానంగా మత-భక్తి దృష్టి వ్యాఖ్యానం. విష్ణుచిత్త పాత్ర క్రమోన్మీలనంలో కవి తీసుకొన్న మెలకువలు కావటం. ఇందుకే ఋతువర్ణనలు కూడా వ్యాఖ్యానింపబడక పోవటంలోని రహస్యం. రాయలవారి వర్ణనా బాహుళ్యాన్ని ప్రస్తావిస్తూ చేసిన ప్రస్తుతిలో ఈ గ్రంథకర్త ఒకమాటన్నాడు.

'వైష్ణవ వాతావరణమును గూర్చిన..........కళను మరుగుపరచుటలో కళ యిమిడియుండునను నానుడి కిదొక దృష్టాంతము. సరిగా ఈ గ్రంథ రచనా ప్రణాళికలో కూడా ఇదే కళారహస్యమిమిడి ఉండటం ఎంత విస్మయావహమైన విషయం! ఇది తెలిసిచేసిన పనికాదు. కావ్య ధర్మంలో శిల్ప నిర్మాణంలో తాదాత్మ్యం చెందినపుడు ఇలాగే వుంటుంది. జ్ఞానమంటే వస్తుతాదాత్మ్యంతో కలిగిన అనుభవం. రసమన్నా ఇదే. దాని విశ్లేషణ విమర్శ.

భూమికలో రెండు విభాగాలను గుర్తించాము కదా! మొదటిది చరిత్ర. వివిధ మత పర్యాలోచనం, భక్తి రూపాలు, కాగా తర్వాతి సగం కేవల కావ్య సమాలోచనం.

తర్వాతి 4 అధ్యాయాల విషయ సంపుటిని - వర్గీకరణము పరిచేస్తే 2వ అధ్యాయమంతా కావ్య ప్రథమాఖ్యాన సౌందర్య వర్ణన. 3వ అధ్యాయంలో మత-యోగ-భక్తి దర్శన ప్రౌఢ పర్యాలోచన. ఇది సాధారణ అలస పాఠకులకు కొరకుడుపడదు. మరలా 4వ అధ్యాయంలోకిపోతే ఆహా! ఎంత ఆహ్లాదం! ఎంత విశ్రాంతి. కావ్య నిర్మాణ సౌందర్య వర్ణన.

ఈ నిర్మాణం స్తుతింపదగ్గదికదా! కావ్యానుశీలనంలో కావ్య ధర్మమే ప్రతిబింబించటంవల్ల ఈ విమర్శకూడీ మహా కావ్యాన్ని ఎంతగా మననం చేసాడో ఆ భక్తిని తలచుకొంటే తలమున్కలుగా వుంటుంది.

ఇలాంటి వ్యక్తినే, పండితునే రాయలవారంటే సాక్షాత్తు శ్రీ వెంకటేశ్వరస్వామి అవతారమనుకొని ఆయన పట్టాభిషేకోత్సవాలను ప్రతి సంవత్సరం జరిపిస్తూ రాయలవారి చరిత్రవ్రాస్తూ ఆ మహావేశంలోనే కన్నుమూసిన కీ॥శే॥ హోసూరు కోదండ రామయ్యగారిని స్మరించకుండా వుండలేకపోతున్నాను.

వారనేవారు- "నేను తమిళనాడు ఎం.ఎల్.సి.గా ఉంటూ ఆంధ్ర, కర్ణాట, తమిళ రాష్ట్రాల్లో ఊరూరూ తిరిగాను. ఎక్కడకుపోయినా ఆ మహా ప్రభువు విరాణ్మూర్తియే అక్కడ శిలల్లో-శాసనాల్లో- దేవాలయాల్లో-ధ్వజస్తంభాల్లో కన్పించింది" అని. నేనూ ఇది చూచాను. ఈ తన్మయత లేనపుడు విమర్శ కేవల బుద్ధి కర్మమైన తర్కాంకావచ్చు కానీ రసాత్మక కళా విశేషంకాదు. విమర్శ కళ. శాస్త్రంగా ఎదిగితే లోకానికి దూరమై నిస్తేజమౌతుంది. మహిమభట్టు, మధుసూదన సరస్వతుల అలంకార గ్రంథాల్లాగా ధ్వన్యాలోకమంత శాస్త్రగ్రంథమైనా ఎంత కళాత్మకంగా వుంటుంది! ఈ విమర్శ గ్రంథంలో ప్రత్యేకాంశమిది.

శ్రీకృష్ణదేవరాయలన్న అంశంలో యామున కథా స్రవంతిని కలుపుకొని ప్రారంభమైన పల్లాండు తన్మయత విష్ణుచిత్తుని చైతన్య వికాసంలో ముగించటం చూస్తే, ఈ విమర్శ సరిగా, కావ్యం ఇష్టదేవతాస్తుతిలో శ్రీ వేంకటేశ్వర స్తుతితో ప్రారంభమై, గోదా శ్రీరంగేశుల సమ్మేళనంతో ముగిసినట్లుంది. ఇందుకే ఈ కావ్యవస్తువు దివిభువుల పరిణయమని ఈ గ్రంథకర్త ప్రతిపాదించారు. ఇది అపూర్వాంశం. ఎవరూ ఇంతవరకూ అనని మాట. చేయని ప్రతిపాదన.

ఈ గ్రంథ నిర్మాణంలో ఏదో అతుకున్నట్లనిపిస్తుంది. భూమిక ఎప్పుడో వ్రాసి తర్వాత జీవితాసాంతం అధ్యయనంలో మునిగి తలనెరిసిన తర్వాత నాల్గధ్యాయాలు వ్రాసినట్లున్నది. రెంటినీ కలిపి పరిష్కరించలేదు. న్యాయంగా భూమికలో 2వ భాగం నాల్గధ్యాయాల్లో కలసిపోవాలి. ఆ సేతుబంధన సందర్భంలో విమర్శకుడు వ్యగ్రస్తుడైనాడా? అని నా ఆలోచన. ఎందుకంటే భూమికలో కావ్య విమర్శ సూచనప్రాయంగా చెప్పి తర్వాత విస్తరించటం జరిగింది. నిజమే, కానీ పైనచెప్పినట్లు

కొలికి పూసకు ముడిపెట్టలేదు. భూమికను పీఠికగా చెప్పలేదు. పైగా నాల్గధ్యాయాల్లో అవాంతరాధ్యాయాలున్నాయి. వీటిని సూచికలో చేర్చలేదు. కనుక ఈ ఊహాకవకాశమేర్పడినది. నిర్మాణంలో లోపం కాకపోవచ్చుకానీ వారి ఆలోచనలో తర్వాత చేర్దామని అనిపించి, కాలం కలిసిరాక అలా జరిగిందేమో! ఇది ఆకృతి పరిష్కారలోపం మాత్రమే. విషయలోపం కాదు. ఎప్పుడో 20 ఏళ్ళనాడు నేను బెజవాడలో ఆముక్త సౌందర్యమన్న అంశంపై ఉపన్యసించటానికి వెళ్ళినప్పుడు వారు నేను విడిదిచేసిన చోటికివచ్చి "మీ ఆముక్తమాల్యదా సౌందర్యమన్న విమర్శ గ్రంథం చూడలేదు. ఎందుకంటే అది నా ఆలోచనలను ప్రభావితం చేస్తుందన్న భయంతో. కనుక నా స్వతంత్రాలోచనలనే వ్రాయాలని ఊబలాట"మన్నారు. ఈ గ్రంథమిలా వస్తుందని కానీ దానికి నేనిలా నాల్గు మాటలు వ్రాస్తానని కాని ఎవరనుకొన్నారు. కానీ మన కతీతంగా మరొక విరాట్ప్రజ్ఞ వుంటుంది. కనుక రాయల కావ్యోపాసకులనిలా కలిపింది కాబోలు! ఈ గ్రంథానికి పండిత లోకం నీరాజనం పడుతుంది. శాశ్వతకాలం సాహిత్యోపాసకులకు ఆదర్శంగా వుండిపోతుంది.

- ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు

# మైత్రీ రమ్యులు

## శ్రీ కొత్త వెంకటేశ్వర రావు

**శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు**

సంస్కృతాంధ్రాలలో అభిజ్ఞాన శాకుంతలము, ఆముక్తమాల్యదలు బంధుర కవితామయ సుందరరూపక ప్రబంధాలు. కాళిదాసుని శాకుంతలంలో వనసీమలు, ఋష్యాశ్రమాలు, నీవార ధాన్యాలు, వేళ్లు, పూదీగలు, మునికన్యకలు ఆహ్లాదపరుస్తారు. రాయల వారి ఆముక్తమాల్యదలో శ్రీ విల్లిబుత్తూరులోని దిగుడు బావులు, అంతర తామరలు, ధ్వజస్తంభాల గంట మ్రోతలు, మడి చీరలు గట్టి అచ్యుత మజ్జనార్థం నీటిబిందెలను కటిం గీలించి ఉద్యానంపు లోత్రోవంలో దివ్యప్రబంధాలు చదువుకొంటూ వెళ్లే ద్రవిడాంగనలు దర్శనమిస్తారు. కవిత్వాన్ని చూడాలనుకొన్న వారు ఈ రెండు గ్రంథాలను తప్పక చదువవలసినవే.

ఆముక్తమాల్యద ప్రౌఢ ప్రబంధమే కాదు, అదొక దివ్య ప్రబంధం. అదొక అగాధమైన అమృత సరస్సు. అందులో దిగడమే కష్టం కాని, దిగిన వారికి మరొక కావ్యం ససేమిరా రుచించదు. చదివినా చదవకపోయినా, ఆముక్త మాల్యదను శ్రీ వైష్ణవులు తమ యిళ్లల్లో అలంకరించుకొంటారు - ఆరాధిస్తారు.

ఆముక్తమాల్యదను గూర్చి నా బాల్యమిత్రుడు కీ.శే. వెల్దండ ప్రభాకరరావు చాలా కాలం క్రిందట ఒక పర్యాలోకన గ్రంథం రచించాడు. అది రెండుసార్లు ముద్రితమయింది. ఆ తర్వాత మధిర తాలూకాకు చెందినవారు, అప్పట్లో సికింద్రాబాదులో కలెక్టరు పదవిలో ఉండినవారు పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ఆంధ్ర సాహిత్య రథసారథులు అయిన శ్రీ పర్చా వేంకటేశ్వరరావు గారు మరొక

గ్రంథం రచించారు. "ఆముక్త మాల్యదను గురించి నేను వ్రాసిన గ్రంథం మీరు వినాలి" అని ఆయన నన్నాజ్ఞాపించారు. కానీ, నాకా భాగ్యం కలుగలేదు. ఆ మహనీయుడు ఇప్పుడు లేరు. ఆ గ్రంథం ఏమయిందో తెలియదు. వారి వారసులు దాన్ని వెలుగులోకి తెస్తే బాగుండును. ఇప్పుడు శ్రీ పర్వా వేంకటేశ్వరరావు గారిది కాక, శ్రీ కొత్త వేంకటేశ్వరరావు గారి గ్రంథం వెలుగు చూచింది. నా ముందు ఉంది.

దాదాపు ముప్పై ఏండ్లకు పూర్వం పరిచయమయ్యారు శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారు. ఆయనతో నాకెందుకు ఎలా పరిచయమయిందో తెలియదు. 'జనాంతర సౌహృద' మనుకొంటాను. కాచిగూడాలో ఆయన, విద్యానగరులో నేను ఉండేవాళ్లము. కొత్త వెంకటేశ్వరరావు గారు మంచి వర్చస్వి. ఆలోచనాపరుడు. సాహిత్య జిజ్ఞాసి. ఆయన సాహిత్య పరిజ్ఞానం నన్ను ఆకట్టుకొన్నది. ఆదివారాల సాయం సమయాలు ఆయనతో సాహిత్య చర్చ చేస్తూ యూనివర్సిటీ రోడ్డులో చీకటి పడేదాకా గడిపేవాళ్లము.

శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారి అభిమాన గ్రంథం ఆముక్తమాల్యద. అభిమాన కవి - రాయల వారు. శ్రీ వైష్ణవ సిద్ధాంత సంప్రదాయ విశేషాలు తెలుసుకోవడానికి ఆయన కంచిలో వేంచేసియున్న మహాపండితులు శ్రీమాన్ అణ్ణంగరాచార్య మహోదయులను శుశ్రూషించారు. అనంత శయనం అయ్యంగారు, రాజాజీ ప్రభృతులను కూడా కలుసుకొని, వారితో ముచ్చటించి అనేక సంప్రదాయ విశేషాలను సేకరించారు. ఆముక్తమాల్యద శ్రీ రావుగారిలో ఎంతటి తీవ్రమైన జిజ్ఞాసను, ఎంతటి ప్రీతిని రేకెత్తించినదో చెప్పలేము. అది ఆయన జీవితాశయమయింది.

శ్రీ వెంకటేశ్వరరావు గారితో ముచ్చటించేటప్పుడు ఆయన అత్యద్భుతమైన విశేషాలను ఎన్నెన్నో చెప్పేవారు. ఆశ్చర్యంగా వినడమే నా వంతు అయ్యేది. రాయల వారికి గురువైన తాతాచార్యుల వారికంటె, రాయల వారికే శ్రీ వైష్ణవ సిద్ధాంతాలు క్షుణ్ణంగా తెలుసుననడం, వేదం వారి వ్యాఖ్య ఆముక్త మాల్యదకు చాలదనడం, దశావతార స్తోత్రంలో రాయల వారు శ్రీ కృష్ణావతారాన్ని ఎందుకు చేర్చలేదో వేదం వారు ఒక్క ముక్కయినా వ్రాయలేదనడం, నా హృదయాన్ని స్పందింపజేశాయి. ఆలోచింపజేశాయి.

అప్పట్లోనే మిత్రులు శ్రీ బి. రామరాజు గారు దశావతారాలలో శ్రీకృష్ణుడు ఉన్నట్లా? లేనట్లా?-అని నేనేమో ప్రామాణికంగా చెప్పగలనని కాబోలు-నన్నడిగారు. "కృష్ణుడు దశావతారాలలో లేకపోవడమేమిటండీ!" అన్నాను. అలా అన్నందుకు తర్వాత నాలుక కొరుక్కోవలసి వచ్చింది. నా తెలివి తక్కువతనాన్ని శ్రీ బి. రామరాజు గారు మరచిపోయారో ఏమోకాని, నా అజ్ఞానాన్ని నేనిప్పటికీ మరచిపోలేక ఖేదపడుతుంటాను.

శ్రీకృష్ణుడు సర్వావతారావతారి. స్వయం భగవానుడు. గోప వేషంతో వెలసిన సాక్షాత్తు శ్రీమహా విష్ణువు. దక్షిణోత్తర వైష్ణవ సంప్రదాయాలు తెలిసిన రాయలవారు శ్రీకృష్ణ భగవాన్ణి అవతారిగా భావించారే కాని, అవతారంగా చెప్పలేదు. ఈ విషయం అనేక గ్రంథాలు చదివితే కాని, నాకు తెలియలేదు.

శ్రీ వెంకటేశ్వరరావు గారు రచించిన ఈ గ్రంథం అసంపూర్తిగా ఉంది. ఆయన ఇంకా అనేక విశేషాలు ఈ గ్రంథంలో పొందుపరచదలచారన్న విషయం నాకు తెలుసు. అందులో ముఖ్యమైనది మన తెలుగువారైన శ్రీ వల్లభ ప్రభువు రాయల వారి ఆస్థానానికి విచ్చేయడం, వేదాంతశాస్త్ర వాదంలో విజయం పొందిన శ్రీ వల్లభాచార్యుల వారికి రాయల వారు స్వహస్తాలతో కనకాభిషేకం చేయడం, ఆ సువర్ణకణికలలో రెండు మాత్రమే బృందావనంలో ఆలయ నిర్మాణానికిగాను శ్రీ వల్లభులు స్వీకరించడం మొదలైన విషయాలు ముఖ్యమైనవి. శ్రీ వల్లభుల తల్లి "వెంకమ్మగారూ" (ఔత్తరాహులు వాడిన పదం) విజయనగర పరిసరాలకు, రాయలసీమకు చెందిన పుణ్యవతి. శ్రీ వేంకటేశ్వరస్వామికి పరమ భక్తురాలు. విష్ణుస్వామి సంప్రదాయ ప్రవర్తకులైన శ్రీ వల్లభాచార్యులు తిరుమలలో శ్రీ స్వామివారి ఆనంద నిలయంలో కూర్చుండి రెండుసార్లు శ్రీ స్వామి వారికి శ్రీమద్భాగవతం వినిపించినట్లుగా ఔత్తరాహుల గ్రంథాల వల్ల తెలుస్తున్నది. ఈ మున్నగు విషయాలలోని సత్యతను, సమంజసతను శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గ్రహించి, ఆమోదించారు. మరొకటేమిటంటే : విష్ణుపురాణానికి విష్ణుచిత్ వ్యాఖ్య వ్రాసిన వారెవరు? విష్ణు చిత్తులవారా? . అనే సందేహాన్ని కూడా శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారు వెల్లడిస్తుండే వారు.

శ్రీ కొత్త వెంకటేశ్వరరావు ఈ గ్రంథం రచిస్తున్న రోజులలో ప్రముఖ విద్యావేత్త శాసనమండలి సభ్యులు అయిన శ్రీ వి.పి. రాఘవాచార్య మహోదయులు సరస్వతీ పుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి చేత నల్లకుంటలో తిరుప్పావై కాలక్షేపం జరిపించారు. ఆ నెలరోజులు శ్రీ వెంకటేశ్వరరావు గారు విచ్చేసి శ్రీ పుట్టపర్తివారి ప్రసంగాలను విని ఎంతో ఆనందించారు. ఆ సందర్భంలో శ్రీ వి.పి. రాఘవాచార్యులు గారు "రామానుజ దర్శిని" పత్రిక శ్రీ పుట్టపర్తి వారి సన్మాన సంచికగా ప్రచురించడానికి పూనుకొన్నారు. ఆ పనిలో కొంతభారం నాకు అప్పగించారు. నేను శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారిని అర్థించి "విష్ణుచిత్తుని" గూర్చి ఒక వ్యాసం వ్రాయించి ఆ సంచికలో ప్రచురించాము. శ్రీ వెంకటేశ్వరరావు గారి వైదుష్యానికి ముగ్ధులై శ్రీ వి.పి. రాఘవాచార్యులు గారు వారిని పిలిపించుకొని బహుధా ప్రశంసించారు. ఇప్పుడు శ్రీ వెంకటేశ్వరరావుగారు గానీ, శ్రీ వి.పి రాఘవాచార్యులుగారు గానీ లేరు. నేనీ సందర్భంలో ఈ విషయాలను వెల్లడించకపోతే వారి సౌజన్య చరితం లోకానికి ఎలా తెలుస్తుంది?

ఆ రోజులలో శ్రీ వెంకటేశ్వరరావు గారు తమ కుమార్తె మెడిసన్ చదివి జపానులో ఉన్నట్లుగానో, లేదా అక్కడికి వెళ్లినట్లుగానో చెప్పారు. ఆ తర్వాత శ్రీ రావుగారు కాచిగూడా వదలి వెళ్లి, గృహనిర్మాణంలో నిమగ్నమైనట్లు తెలుసుకొన్నాను. ఆ తర్వాత వారి దర్శనం మరీ దుర్లభమయింది. వారు పరమ పదించినట్లు తెలుసుకొని అత్యంత ఖేదం అనుభవించాను. సంచీ నిండా మంచి నిమ్మకాయలు తెచ్చి యిచ్చేవారు. ఆయన ఇక లేరా అని మాయావిడ కూడా ఎంతో చింతించింది.

ఇప్పుడీ గ్రంథాన్ని వెలుగులోనికి తెస్తున్నవారు వారి కుమారులు, కుమార్తెలే-అని తెలుసుకొని సంతోషిస్తున్నారు. శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారెవరో, వారి సంస్కారం ఎలాంటిదో తర్వాత తర్వాత నాకు అవగాహనకు వచ్చింది. సుప్రసిద్ధ రచయిత్రి, ఉత్తమ సంస్కారవతి, శ్రీ కృష్ణానుశీలవతి అయిన శ్రీమతి సి. వేదవతిగారు శ్రీ వెంకటేశ్వరరావుగారి మేనకోడలని తెలుసుకొన్నాను. శ్రీ వెంకటేశ్వరరావుగారి సాహచర్యంలో ఉన్నప్పుడు శ్రీమతి సి. వేదవతిగారెవరో నాకు తెలియదు. శ్రీ కృష్ణానుశీలనమే మమ్మల్ని పరిచయించిందను కొన్నాను. అంతటి కుటుంబ సంస్కార

పరంపరకు చెందినవారు కాబట్టే శ్రీ వెంకటేశ్వరరావుగారు ఆముక్తమాల్యద ఆధ్యాత్మిక సమీక్షకు ఉత్తమాధికారులయ్యారు. శ్రీ వెంకటేశ్వరరావుగారి స్నేహానికి పాత్రుణ్ణి కావడానికి కారణం కూడా నాకిప్పుడే తెలిసింది. శ్రీ వెంకటేశ్వరరావుగారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శిష్యులు. శ్రీ ప్రభాకర శాస్త్రి మహోదయులు మా గురుదేవులు. వారి గృహ ప్రాంగణంలో ఎన్నొప్పుడో చూచి ఉంటారు శ్రీ రావుగారు. అందుచేతనే నేను వారికి ఆత్మీయుడనయ్యానని ఇప్పుడు తెలుసుకొని ఆనందిస్తున్నాను.

ఈ పరిచయ వాక్యాలు వ్రాస్తున్నంత సేపు ఒక సన్నని పొడుగుపాటి పచ్చని వ్యక్తి, దోవతి, ఆకు చెప్పులు ధరించిన సౌజన్యమూర్తి మా మిత్రులు శ్రీ వెంకటేశ్వరరావుగారు పొడగడుతూనే ఉన్నారు. ఈ గ్రంథ ముద్రణతో ఆయన ఆత్మకు శాంతి కలుగుతుందని ఆశిస్తున్నాను. మా స్నేహబంధం గుర్తెరిగి నా చేత ఈ నాలుగు ముక్కలు వ్రాయించిన వారి అమ్మాయి డా॥ కె. ఉషాలక్ష్మీ కుమారికి సాధువాదములు తెలుపుకొంటున్నాను.

- ఉత్పలం సత్యనారాయణాచార్య

10-6-01,

అలకాపురి,

హైదరాబాదు - 35.

**B. N. SASTRY**
M.A.
EPIGRAPHIST, HISTORIAN
*President*, ARCHAEOLOGICAL SOCEITYOF INDIA (Reg.)
*Editor* - Musi Cultural, Historical & Literary Telugu Monthly
H. No. 3-4-245/1, Lingampally, HYDERABAD - 500 027
Phone : 0091-40-7560616

## "ఆముక్తాభినందనం"

సాహితీ సమరాంగణ సార్వభౌములైన శ్రీకృష్ణ దేవరాయల వారి ప్రబంధమైన 'ఆముక్తమాల్యద' విశేష వర్ణనాభరితము. విద్వద్వినోద కావ్యము. నారికేళ పాకములో రచించబడిన ఈ దివ్య ప్రబంధము భక్తునియొక్క కథను ఆధారం చేసుకొని ఎన్నో సైద్ధాంతిక విశేషములను వెల్లడి చేసినట్టిది. స్వయముగా రాజులుగా పరిపాలన సాగిస్తూ రచనలు చేసినవారు చాలా అరుదు. అట్టివారిలో తెలుగు సాహిత్యమునకు సంబంధించి 'శ్రీకృష్ణ దేవరాయల'వారు అగ్రగణ్యులు. వీరు కేవలం కవులే గాక, కవిపండిత పోషకులు. 'భువన విజయము' వీరి ఆస్థానము. ఉత్తమ సాహితీ విలువల కిది కల్పతరువు.

ఈ 'ఆముక్తమాల్యద' ప్రబంధముపై వచ్చిన వ్యాఖ్యలు చాలా అరుదు. కేవలం పద్యకావ్యము యొక్క 'కావ్య విలువల' గూర్చి, పద విశ్లేషణలు, వర్ణనల గూర్చి మాత్రమే ప్రస్తుతము వరకు విశ్లేషణలు గలవు. శ్రీ 'కొత్త వెంకటేశ్వరరావు' గారు ఆముక్తమాల్యద కావ్య వ్యాఖ్యాన మిషతో అనేక విశేషములను వెల్లడి చేసినారు. ఈ వ్యాఖ్యానమందు రాయలవారి గూర్చి, శ్రీవైష్ణవ విభాగముల గూర్చి, భక్తి రూపముల గూర్చి, సైనిక గూర్చి, వర్ణనలు, రాజనీతి, ప్రజా జీవనాది విషయములను రాయలవారు గమనించిన విధానమును వివరించినారు. పై విషయములన్నీ ఈ కావ్యసారూప్యముతో గమనించవచ్చుననే భావనను కల్పించిన విద్వన్మిత్రులు శ్రీ వెంకటేశ్వర రావుగారు. ఈ గ్రంథము ద్వారా వీరి సాహిత్యగరిమ అర్థమగుచున్నది.

ఇటువంటి ఉత్తమ ప్రబంధమును వ్యాఖ్యానము చేసిన వ్యాఖ్యాతను, ప్రచురించుచున్న వారి కుమార్తెను, సహాయకులుగా పుస్తక ప్రచురణకు శ్రద్ధ వహించుచున్న శ్రీమతి సి. వేదవతి గార్లను మనస్ఫూర్తిగా అభినందించుచున్నాను.

(బి.ఎన్. శాస్త్రి)

# ప్రస్తావన

సి. వేదవతి

ఇది ఒక ఊహించని సన్నివేశం. ఈ గ్రంథానికి నేను ప్రస్తావన వ్రాయవలసి రావటం! అర్హతను మించిన అవసరం ఒకటి నా చేత ఈ పని చేయిస్తున్న మాట నిజం! అంతా అనుకున్నట్లు జరిగితే, పదిహేను సంవత్సరాల క్రితమే ఈ గ్రంథం వెలుగుచూచి ఉండేది. దీని ప్రస్తావన ఏదో ఈ గ్రంథకర్త శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారే వ్రాసుకుని ఉండేవారు.

అంతా అనుకున్నది అనుకున్నట్లు జరగడం - జరగకపోవడం అన్నది అన్నివేళలా మన చెప్పుచేతలలో ఉండని మాట కూడా వాస్తవం! పది సంవత్సరాలకు పైగా, 'ఆముక్త మాల్యద' కావ్యాన్ని అదే పనిగా తరచి తరచి శోధించిన మామయ్య, తీరా పుస్తక ప్రచురణకు పూనుకొంటున్న సమయంలో - భౌతిక జీవితం చాలించడం అటువంటి సంఘటన.

కొత్త వెంకటేశ్వరరావు గారు నాకు మేనమామ. పెద్దక్క భర్తగా మరీ దగ్గర బంధువు. ఆయనకు నేను మేనకోడలిని కావటం, ఆయన సాహిత్య కృషిని ప్రత్యక్షంగా చూచి ఉండటం, ప్రచురణ కోసం ఈ గ్రంథానికి శుద్ధ ప్రతిని నేను తయారు చేయవలసి రావటం - ఇవన్నీ, ఈ నా ప్రస్తావనను ఒక ఆత్మీయమైన భావ ప్రసారంగా మలుస్తున్న అంశాలు.

వెంకటేశ్వరరావుగారు ఒక విలక్షణమైన వ్యక్తిత్వంతో జీవితం కొనసాగించినవారు. తాను న్యాయ కోవిదులే అయినా, న్యాయస్థానాల్లో అంతా న్యాయమే జరిగే అవకాశం ఉండదన్న కారణంతో, న్యాయవాద వృత్తినే విడిచిపెట్టిన వారు. బహుగ్రంథ పఠనం, తాత్త్విక, ఆధ్యాత్మిక, విద్వద్వివేచనంతో తన శక్తినీ, సమయాన్నీ వినియోగించినవారు.

అవును. ఆయన గొప్ప చదువరి. అధ్యయన శీలి. ఆంధ్రాంగ్ల భాషల్లోని అనేక తత్త్వ శాస్త్రగ్రంథాలు చదివి జీర్ణించుకొన్న తత్త్వశాస్త్రాభిమాని. ఆయన స్వయంగా కవి, భావుకుడు గొప్ప సాహిత్యోపాసకుడు, ఆయన సాహిత్య ప్రియత్వానికి కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి శిష్యరికం తోడు కావటం ఒక విశేషం.

ఇదిట్లా ఉండగా 1974వ సంవత్సరంలో ఆయనగారి దృష్టి రాయలవారి అపురూప సృష్టి ఆముక్త మాల్యద మీదకు మళ్ళింది. అందుకు ఒక కారణం - ఆయన రెండవ కుమారుడు కె.ఎస్.ఆర్. మూర్తి అనబడే కొత్త శ్రీరామచంద్ర మూర్తి, తాను సేకరించుకొన్న వేలాది గ్రంథాల వ్యక్తిగత గ్రంథాలయం నుంచీ, 'ఆముక్తమాల్యద' ను తెచ్చి చదవమని ఆ కుమారుడు తండ్రిగారికి ఇచ్చి ఉండకపోతే, బహుశః ఈ గ్రంథం పుట్టి ఉండేది కాదేమో!

అది మొదలు - ఆముక్తమాల్యద కావ్యంతో వెంకటేశ్వరావుగారికి ఒక తాదాత్మ్యత ఏర్పడిపోవటానికి! ఆయన ఆ కావ్యాన్ని ఒక రసతన్మయతతో చదివి ఉంటారు. రాయుల వారి కావ్యకథా వైశిష్ట్యానికీ, వర్ణనా వైచిత్రికీ, అలంకార చమత్కృతికీ, ప్రౌఢ కవితా తత్త్వానికీ, అబ్బురపడుతూ చదివి ఉంటారు! ఆముక్తలోని యోగ, పరతత్త్వ ఆధ్యాత్మిక దర్శనానికీ, సంస్కారయుతమైన వైష్ణవ భక్తి సంప్రదాయానికీ, ఒక దివ్యమైన ఆత్మానుభూతితో పరవశిస్తూ చదివి ఉంటారు.

అధ్యయనంలో, ఆలోచనంలో - హృదయాన్నీ, మేధనూ మేళవించుకోగలిగిన కావ్యరసికత ఆయనను ఊరకే ఉండనీయలేదు! కావ్య శిల్పమూ, కావ్య గత లోకోత్తరమైన భావ సంస్కారమూ, భగవత్ప్రపత్తి విశేషమూ, ఆయన హృదయాన్ని గబగబలాడించి రచనోద్వేగం కలిగించి ఉంటాయి!

ఇంతటి మహాకావ్యాన్ని రచించిన ప్రభువు శ్రీ కృష్ణదేవరాయల సార్వభౌమ సాహితీమూర్తి కన్నులముందు నిలిచి ఉంటుంది. కవి పైనా, కవి సృష్టించిన అద్భుత కావ్య సృష్టిపైనా, అపారమైన అభిమానంతో, కావ్యంలో తాను దర్శించిన సొగసులన్నీ ఇట్లా కుప్పపోయటం ప్రారంభించినవాడు ఈ గ్రంథకర్త, అందుకు సాక్ష్యంగా నిలుస్తాయి. ఆయన చేతి వ్రాతలో ఒకచోట వ్రాసుకొన్న ఈ క్రింది పంక్తులు.

"వ్యాఖ్యానములేని సాహిత్య అకాడమీ వారి ప్రతిని జూచియే సామాన్య సాహితీ జ్ఞానము గల ఈ రచయితకు ఆముక్తమాల్యదయందు పరమ ప్రీతి, రసనిర్వృతి, అధ్యయన కుతూహలము కలిగినది. - కె.వి.ఆర్."

ఇట్లా వినయంగా చెప్పుకొన్నారు కానీ వెంకటేశ్వరరావుగారు ప్రాచీన సాహిత్యంలోని కవితా సంప్రదాయాలను బాగా గుర్తెరిగినవారు. పరిశీలనా దక్షతతోపాటు అలంకారికశాస్త్ర పరిజ్ఞానమూ, గీర్వాణాంధ్ర భాషా వైదుష్యమూ కలిగినవారు.వీటన్నిటికీ తోడు, తనివితీరని సాహితీ రసికత ఒకటి! ఈ నిలువనీయని హృదయ తీవ్రత ఆయన చేత కలం పట్టించింది.

ఆ పట్టిన కలాన్ని 1986 ఫిబ్రవరి మాసం వరకూ వదలలేదు. ఆముక్త కావ్య రసికుడు - వెంకటేశ్వరరావుగారు!అసలే ఆముక్త కావ్యం ఒక కొండ! దానిని అర్థంలో చూపించే ప్రయత్నం ప్రారంభించారు ఆయన! ఆ ప్రయత్నంలో ఆయనకు ఎంతకూ తృప్తితీరదు! ఎంత శోధించినా, ఎన్నిరకాలుగా విశ్లేషించినా, ఆ విశ్లేషణలో చెప్పినదే మళ్ళీ మళ్ళీ ఎన్నిసార్లు చెప్పవలసి వచ్చినా, ఆయనకు ఒక తనివి తీరని తృష్ణ! కావ్య రచనలోని విశేషాలను ఎత్తి చూపడంతోపాటు, కావ్యం లోతుల్లోకి వెళ్ళి, కావ్యరచనకూ, కవి వ్యక్తిత్వానికీ, ఉన్న సంబంధాన్ని ప్రమాణీకరించటంతోపాటు, కావ్య పరమార్థాన్ని కూడా నిరూపించే ప్రయత్నం చేశారాయన.

ఆ ప్రయత్నంలో భాగంగా శ్రీకాకుళాంధ్ర విష్ణువునూ, శ్రీ విల్లిపుత్తూరు మన్నారు స్వామినీ, శ్రీ రంగపుర రంగనాథస్వామినీ దర్శించి వచ్చారు. విజయనగర సామ్రాజ్యానికీ, విద్వత్ప్రభువు శ్రీకృష్ణదేవరాయల వారికీ సంబంధించిన సమస్త చరిత్ర గ్రంథాలనూ తెప్పించి అధ్యయనం చేశారు. అనారోగ్యాన్ని కూడా లెక్కచేయక, రాత్రింబవళ్ళు అదే పనిగా పరిశ్రమించారు.

విచిత్రం ఏమిటంటే ఇది ఒక పరిశోధక గ్రంథంగా తయారవుతున్నదన్న స్పృహకానీ, దీనిని గ్రంథరూపంలో ప్రచురించవలెనన్న ఆలోచన కానీ, ఈ గ్రంథకర్తకు చాలా కాలంవరకూ ఉండేదికాదు! పట్టరాని రసపారవశ్యంతో - తన ఆనందం కోసమే తాను ఆముక్త పరిశోధనలో నిమగ్నమయినానని చెపుతూ ఉండేవారాయన.

విద్వత్ప్రతిభా పోషణం ఎక్కడ ఉన్నా, విపరీతంగా అభిమానించే ఉదాత్త హృదయులు మాన్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, వెంకటేశ్వరరావుగారు చేస్తున్న ఆముక్త సమీక్షణ కృషిని గురించి విని, ఆయనను 1982వ సంవత్సరంలో, నెల్లూరుకు కవిత్రయ జయంత్యుత్సవ సభలకు ఉపన్యాసకులుగా ఆహ్వానించి సన్మానించారు. "కృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద" అన్న అంశంమీద ఆనాడు ఆయన చేసిన ప్రసంగం పలువురు పండితుల, విమర్శకుల ప్రశంసలను అందుకొన్నది.

ఆ ప్రోత్సాహమూ, సాహితీప్రియులైన బంధుమిత్రుల ప్రోద్బలమూ కలిసి వెంకటేశ్వరరావుగారికి తన సాహిత్య కృషిని ప్రకటించాలనే ఆలోచన వచ్చి ఆ దిశగా, మళ్ళీ మార్పులూ, చేర్పులూ, సవరింపులూ ప్రారంభించారు.

ఎంతకూ తృప్తిపడని విద్యాతృష్ణతో, తరగని కొంగ్రొత్త వెలుగుచూపే నవ భావావిష్కరణలతో - వెంకటేశ్వరరావుగారు తమ ఆముక్త సమీక్షను చివరికంటా కొనసాగించారు. ఆ తరువాత, ఆయన స్మృతి చిహ్నంగా ఈ గ్రంథాన్ని వెలువరించాలనే మా సంకల్పం- ఇప్పటికి కానీ ఆచరణ సాధ్యంకాలేదు. కారణాలు ఏమయితేనేమి అనుకోని జాప్యమే జరిగిపోయింది.

కార్యభారం మీద వేసుకొన్న ఆయన కుమారుడు K.S.R. మూర్తి అనారోగ్య కారణంగా - ఈ పుస్తక ప్రచురణకు శుద్ధ ప్రతిని తయారుచేసే బాధ్యతను నేను స్వీకరించవలసి వచ్చింది.

ఈ పనిని నేను భక్తితోనూ, భయంతోనూ ప్రారంభించాను. ఈ గ్రంథకర్త ఆన్నేళ్ళ క్రిందట వ్రాసుకొన్న కొంత శుద్ధ ప్రతి, కొంత చిత్తు ప్రతి - ఈ రెండింటినీ సమన్వయం చేసుకొంటూ, మళ్ళా శుద్ధంగా తిరగరాయటానికి నా శక్తి సామర్థ్యాలు సరిపోతాయా అన్న సందేహంతోనూ ఈ పనిని కొనసాగించాను.

ఇంత సందేహంతోనూ, ఈ పనికి నేను పూనుకోవటానికి కారణాలు రెండు. గొప్ప సాహితీపరుడైన మేనమామ చేసిన ఈ అనన్య కృషి తప్పక వెలుగు చూడాలనే కోరిక ఒకటి.సాహితీ లోకంలో - మామయ్య స్మృతి వైభవ పతాకగా ఈ గ్రంథాన్ని

ఆవిష్కరించాలని చాలాకాలంగా ఎదురుచూస్తున్న వెంకటేశ్వరరావుగారి సతీమణి - పరిణత జ్ఞాన సంపన్న - మా పెద్దక్క కోరిక తీరాలన్న ఆకాంక్ష మరొకటి.

వెంకటేశ్వరరావు గారు ఆముక్త పరిశీలనలో తలమునకలుగా ఉండిన సుదీర్ఘకాలంలో ఆమె నిర్వహించిన పాత్ర సామాన్యమైనది కాదు. రచనా దీక్షలో ఆయనకు అన్ని విధాలా సహకరించటమే కాక, రచనలో కొంత భాగానికి లేఖకురాలిగా కూడా వ్యవహరించిన సాహితీ సంస్కార సంపన్న - మా పెద్దక్క శ్రీమతి కొత్త రంగమాంబ.

ఇంతా చేసి, ఇప్పటికి మేము వెలువరించగలిగినది ఆముక్త కావ్యంలోని నాలుగాశ్వాసాల గురించిన సమీక్ష మాత్రమే! మిగిలిన సమీక్షా విభాగం- మరొక గ్రంథరూపంలో త్వరలో తీసుకురాగలమన్న విశ్వాసంతో ఈ ఆముక్త రసావిష్కృతిని మీ ముందు ఉంచుతున్నాము.

చివరగా, నాకుగా చెప్పుకోవలసినవి నాలుగు మాటలు

చాలాకాలంగా ప్రక్కకుపెట్టిన కొన్ని చిత్తు వ్రాతప్రతులలో నుంచి ఎత్తి వ్రాయడంలో కొన్ని ప్రమాదాలు దొర్లి ఉండవచ్చు. క్షంతవ్యను నేను మాత్రమే అని మనవి.

ఈ కావ్య సమీక్షపైనా, సమీక్షకునిపైనా గొప్ప సౌమనస్యం పెంచుకొన్నవారు ప్రముఖ విద్వత్కవులు శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు. ఈ పుస్తక ప్రచురణకు వారి సహృదయ సంప్రేరణ ఎంతో ఉంది. వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలి.

తాను స్వయంగా కర్నాటాంధ్ర భాషా కోవిదుడై, కర్నాటాంధ్ర విద్వత్సార్వభౌమునిపై అపారమైన అభిమానం పెంచుకొని, 'కృష్ణరాయము' అనే కావ్యమే వెలయించిన వాడు గుత్తి చంద్రశేఖరరెడ్డి. ఈ వ్రాత ప్రతిని నేను సిద్ధం చేస్తున్ననాళ్ళలో అడుగడుగునా ప్రోత్సహిస్తూ, నాకు మన స్థైర్యం ఇచ్చిన ఈ సోదరునికి నా ఆశీరక్షతలు.

చిత్తు ప్రతి నుండి ఎత్తి వ్రాసే దశలో, స్వంత పనులు కొన్ని మానుకొని నాకు తోడైన మరొక సహృదయ సోదరుడు- ఆర్షవిభూషణ వడ్డపల్లి సత్యంనాయుడుకు కృతజ్ఞతాపూర్వక శుభాకాంక్షలు.

ఇంతటితో ఈ కృతిని గురించిన ప్రస్తావన ముగిసినా, ఇంకా ఏదో చెప్పవలసినది ఉన్నదన్న భ్రాంతి - ఆరాటం నామదికి నెమ్మదినీయని విధంగా! అది మామయ్యకూ నాకూ మధ్య ఉండిన, వ్యక్తిగతమే అయినా చెప్పితీరవలసిన సాహిత్యానుబంధం!

కృష్ణవాఙ్మయంపైన ప్రీతితో నేను చేసే రచనల గురించి ఒకప్పుడు ఆయన ఈ పద్యం చెప్పారు.

**అమ్మా! వేదవతీ! త్వదీయ జనకుండధ్యాత్మ రామార్చనా**

**పమ్మోదాత్ముడు, వాంగిలాంధ్ర సమ విష్ణాతుండు, యుష్మన్మన**

**ప్పమ్మోహ ప్రియ కృష్ణ వాఙ్మయ రసాచార్యుండు, నా బోధయే**

**మమ్మా! వెన్నుని గూర్చి నీ రచితమై సాంపారు వ్యాసంబులన్!**

నేను 1988వ సంవత్సరంలో నా కవితా సంపుటి 'సరళి'ని మామయ్యకు అంకితమిస్తూ ఇలా వ్రాసుకున్నాను.

**ఆముక్తమన్న అంతులేని ఆత్మానురక్తి**

**ఆముక్తమన్న అంతటి రసవిర్భరాసక్తి**

**ఆముక్త మాల్యద జీవస్పందనగా**

**ఆలోచనం అంతరంగ మథనంగా,**

**జీవిత పర్యంతం అసిధారావ్రతంగా**

**సాగిన నీ జీవిత కావ్యానికి ముగింపులేదు.**

**మామయ్యా! నీవు సదా జీవించి ఉంటావు**

**నీ అనద్భుత కావ్య పరిశీలనంలో**

**నీ ఆముక్తమాల్యదా దర్శనంలో!**

ఇప్పుడిన్నేళ్ళు గడచిన తర్వాత ఈ కృతి సమర్పణ సమయంలోనూ

ఇదేనా ఆకాంక్ష! ఇదే నా ఆశంస!

హైదరాబాద్ - నీ వేదవతి

2-6-2001

# మా నాయనగారు

కొత్త శ్రీరామచంద్రమూర్తి

(K.S.R. Murty M.A.
Retd. Senior Tech. Assistant,
Salar Jung Museum)

మా నాయనగారు శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు బహుకాలం ఆముక్తమాల్యదా పరిశోధనం కొనసాగించి, గ్రంథ ప్రచురణ ప్రయత్నంచేస్తున్న సమయంలోనే ఐహిక జీవితం చాలించారు. వారి అనంతరం, వారు చేసిన అనన్య సాహిత్య కృషిని వెలుగులోకి తేవాలన్న మా సంకల్పం చాలాకాలం నాటిది. పరిస్థితులు అనుకూలించి ఇప్పటికి ఈ గ్రంథాన్ని ఈ రూపంలో ప్రచురించి, సహృదయ సాహితీ లోకానికి సమర్పించ గలుగుతున్నందుకు ఆనందిస్తున్నాను.

ఈ సమయంలో - ఈ గ్రంథకర్త - మా నాయనగారి జీవన రేఖలను స్థూలంగా తెలియచేసి, వారి వ్యక్తిత్వ విశేషాలను మీ ముందు ఉంచడం నా విధి అనుకొంటున్నాను.

ఆయన పుట్టింది గుంటూరు జిల్లా, తెనాలికి దగ్గరగా ఉన్న సంగం జాగర్లమూడి గ్రామం. జన్మదినం - ఫిబ్రవరి 12 - 1913వ సంవత్సరం. తండ్రిగారు గ్రామ మునసబు శ్రీ కొత్త సంగయ్యగారు - తల్లి - కొత్త కోటమ్మగారు. చిన్నతనం నుంచే చదువు సంధ్యలలో కుశాగ్రబుద్ధిగా పేరు తెచ్చుకొన్నవారు. శ్రీ కొత్త రఘురామయ్యగారు (మాజీ కేంద్రమంత్రి) వెంకటేశ్వరరావు గారికి పిన తండ్రి కుమారులు. చదువు, ఆటపాటలలో కలిసి పెరిగినవారు. వెంకటేశ్వరరావుగారి అన్నగారు- కొత్త జగ్గయ్యగారు 'కళానిధి, 'పన్నా' వంటి పద్య కావ్యాలు వెలయించిన కవి. ఇంట మంచి సాహిత్య సంస్కారం ఉండేది. నిత్యం రాత్రిపూట వారి పినతండ్రిగారు పురాణ ప్రవచనం సాగిస్తుండేవారు. ఆ వాతావరణంలో పెరగటం వలన మా నాయనగారికి సాహిత్యాభిలాష, గ్రంథపఠనాసక్తి చిన్ననాడే చిగురులు తొడిగింది.

గుంటూరు ఏ.సి. కాలేజిలో డిగ్రీ క్లాసు చదువుతున్నప్పుడే *Theosophical Society*లో చేరి అక్కడి గ్రంథాలయం నుంచి అనేక ఆంధ్రాంగ్ల గ్రంథాలు తెచ్చుకొని చదువుతూ ఉండేవారు. ఈ తర్వాత లక్నో యూనివర్సిటీలో చేరి M.A.L.L.B. పూర్తిచేసి పట్టా పుచ్చుకున్నారు. గుంటూరులో లాయర్‌గా వృత్తి ప్రారంభించారు కాని కొద్దికాలానికే దానిపైన విముఖత్వం ఏర్పడి, పుచ్చుకున్న కేసులు ముగించి ఆ వృత్తి మానివేశారు. నిరంతర పుస్తక పఠనం, స్వగ్రామంలో స్వంత వ్యవసాయంతో అనేక క్రొత్త ప్రయోగాలు చేయటంతో కాలం గడుస్తున్న రోజుల్లో, మా నాయనగారికి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్నేహితులయినారు.

శ్రీ ఉన్నవ గారి ద్వారా ఆయనకు మాస్టర్ C.V.V. ప్రారంభించిన భృక్తరహిత తారక రాజయోగంతో పరిచయం ఏర్పడి, ఆ యోగ సాధకులు, ప్రముఖ విద్వత్పండితులు - అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అంతేవాసిత్వమున్నూ లభించింది. చివరివరకూ వారు శ్రీ వేటూరి వారితోను, వారి కుటుంబ సభ్యులతోనూ అనుబంధం పెంచుకొని, ఆ యోగసాధన- అందులో ముఖ్యభాగమయిన 'ప్రేయరు' క్రమం తప్పకుండా చేస్తూ వచ్చారు.

విద్యార్థి దశనుండే వారికి గాంధీగారి ఉద్యమంపట్ల, సిద్ధాంతాలపట్ల - అభిమానం ఎక్కువగా ఉండేది. శ్రీ అరవిందులు, శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానందుల తాత్త్విక దర్శనాలను ఎంతో శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేస్తుండేవారు.

వ్యక్తిగా ఆయన మంచి నిష్ఠాపరుడు. క్రమశిక్షణకు, నియమపాలనకు, విలువను ఇచ్చేవారు, ఆలోచనలోనూ, కార్యాచరణలోనూ తప్పక ఒక క్రమపద్ధతి ఉండేది. ఈ ఆముక్త సమీక్షా రచనంలోనూ ఆ నిష్ఠ గరిష్ఠత ప్రతిఫలించడం అందుకే!

'ఆముక్త మాల్యద'ను చదువుతున్నప్పుడు ఆయనకెంతటి రస నిర్భరానుభవం కలిగిందో నాతో తరచుగా చర్చిస్తుండేవారు. ఆ తర్వాత కలిగిన రచనావేశంతో వారు కావ్యాన్ని తరచడం మొదలుపెట్టారు. ఆ సందర్భంలో వారికి కావలసిన ఆంధ్రాంగ్ల చారిత్రక, ఆధ్యాత్మిక గ్రంథాలను అనేకం సేకరించి ఇవ్వడం నా వంతు కర్తవ్యం

అయింది. అనేక సంవత్సరాలు వేళకు నిద్రాహారాలు కూడా మరచి, తన సాహిత్య సంశోధనను కొనసాగించారు.

శ్రీ వైష్ణవ వాతావరణ, సిద్ధాంతాలను ఆకళింపు చేసుకోవటం కోసం వారు శ్రీ విల్లిపుత్తూరు వెళ్ళిరావటం, కంచిలో శ్రీ అణ్ణంగరాచార్యుల వారివద్ద వేదాంత రహస్యాలు తెలుసుకొనే ప్రయత్నం చేయుటం - ఇవన్నీ నన్ను వెంటాడుతున్న జ్ఞాపకాలు.

ఇంత కృషినీ ఆయన తన ఆనందం కోసమే చేస్తున్నానని అనేవారు. పిల్లలందరూ, ముఖ్యంగా మా సోదరి డా. ఉషాలక్ష్మి- త్వరలో రచన పూర్తిచేసి ప్రచురిస్తే బాగుండునని నాయనగారికి చెపుతూ ఉండేవాళ్ళం. ఆయనకు కూడా ఆ ఉద్దేశం కలిగి, రచన పూర్తి కావస్తున్న సమయంలోనే ఆయన స్వర్గస్థులు కావడం - అనుకోని ఘటన.

ఆయన చేసిన ఈ బృహత్తర సాహిత్య కృషిని ఇప్పటికి ఈ గ్రంథ రూపంలో ప్రచురించడం - ఒక రకంగా వారి చివరి కోరికను నెరవేర్చడం, మరొకరకంగా మా బాధ్యతను నిర్వర్తించగలగడం అని నేను భావిస్తున్నాను.

సాహిత్యాభిమానులను, విమర్శకులను, పరిశోధకులను, ఈ గ్రంథం ఆలోచింపచేస్తుందనీ, పరిశోధన విషయంలో వారికి ఉపయుక్తమవుతుందనీ విశ్వసిస్తూ ఈ గ్రంథాన్ని సాహితీలోకానికి సవినయంగా సమర్పిస్తున్నాను.

- కె. యస్. ఆర్. మూర్తి

హైదరాబాదు

20-6-2001

# వినయాంజలి

**కొత్త రంగనాయకమ్మ**

తన జీవితాదర్శ సాధనగా, ఆముక్త సమీక్షా రచనను కొనసాగించినవారు శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు. వారి కృషిని గ్రంథరూపంలో వెలువరిస్తున్న సమయంలో- ఆయన సహధర్మిణిగా నావి నాలుగుమాటలు-

ఒక గ్రంథం రూపు దిద్దుకోవడానికి ఎన్నో హంగులు కావాలి. ఎందరి సహకారమో కావాలి. ఈ పుస్తక ప్రచురణ విషయంలో మాకు చేయూతనందించిన పెద్దలు, పిన్నలు-ఎందరెందరో!

ఈ కావ్య రచయిత చేసిన సాహిత్య సాధనను గుర్తించి సహృదయంతో తమ 'సంస్పందనను' అందించిన వారు మహాకవి, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత-రాజ్యసభ సభ్యులు- ఆచార్య సి. నారాయణరెడ్డిగారు-

మా గురుదేవులు శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి తనయులు, ప్రముఖ పండితులు, విద్వాంసులు-ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు-ఈగ్రంథానికి తొలిపలుకు అందించిన వారు-

పరిష్కార సంశోధనతో-ఆముక్తమాల్యద కావ్య సౌందర్యాన్ని ఆవిష్కరించిన పండితులు, సద్విమర్శకులు-సహృదయులు ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు గారు-గ్రంథాన్ని విమర్శనా దృష్టితో తరచిచూచి 'విష్ణుచిత్తీయం' పేరుతో ఈ గ్రంథానికి తిలకం దిద్దినవారు.

ఈ గ్రంథకర్తపైనా, ఆయన చేస్తున్న కృషిపైనా, ఎంతో సామనస్యం పెంచుకొన్న సాహితీమూర్తి, కృష్ణావాఙ్మయతత్త్వనిధి-గ్రంథకర్తతోడి తమ అనుబంధాన్ని మైత్రీ రమ్యంగా ఆవిష్కరించిన సత్కవి-శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులవారు-

ఈ గ్రంథ ప్రచురణ భారాన్ని దయతో స్వీకరించి, మాకు అడుగడుగునా సహాయ సహకారాలు అందించడమేకాక-గ్రంథానికి 'మహాకావ్య విమర్శ' పేరుతో

మున్నుడిని అందించిన సౌజన్య మూర్తులు, ప్రముఖ చరిత్ర పరిశోధకులు, విద్వాంసులు-శ్రీ బి.ఎన్. శాస్త్రిగారు-

ముద్రణకు ముందే ఈ రచనను ఓపికగా చదివి తగిన సూచనలు అందించిన విదుషీమణి ఆచార్య నాయని కృష్ణకుమారిగారు-

ఈ గ్రంథకర్తకు రచనా సమయంలో అవసరమైన అపురూప గ్రంథాలను ఎన్నింటినో సేకరించి ఇచ్చిన నాగార్జున విశ్వవిద్యాలయం లైబ్రేరియన్ (Rtd) శ్రీ సుంకర కోటేశ్వరరావు-

ఈ రచనను గ్రంథరూపంలో తేవడంకోసం శుద్ధప్రతిని తయారు చేయడమేగాక, గ్రంథప్రచురణ విషయంలోనూ శ్రద్ధవహించి తన శక్తినీ, సమయాన్నీ వినియోగించిన రచయిత్రి-సోదరి శ్రీమతి పి. వేదవతి-

ఈ గ్రంథ రచన కోసం తామూ ఎంతో పరిశ్రమించి, గ్రంథ సేకరణ, ఇతర సలహాల రూపంలో తండ్రిగారికి తోడ్పడిన శ్రీ K.S.R. మూర్తి-

ఈ పుస్తక ప్రచురణ నిర్వహణను పైనవేసుకొని, గ్రంథావతరణకు సంధాన కర్తలైన డాక్టర్ పి.వి. చలపతిరావు-డాక్టర్ ఉషాలక్ష్మి కుమారి-

ఈ గ్రంథాన్ని శ్రద్ధతో తీర్చిదిద్దిన

శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ వారికి-

శ్రీ సాయి ప్రాసెస్-ప్రింటింగ్ ప్రెస్ వారికి-

అందరకూ నా మనః పూర్వక కృతజ్ఞతలు, ఆశీరక్షతలు-

కొత్త రంగనాయకులు

హైదరాబాదు

26-6-2001

# విషయానుక్రమణిక



సాహిత్య సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణ దేవరాయలు
దేవేరులు: తిరుమలదేవి, చిన్నాదేవి

# ఆముక్తము - కృష్ణ దేవరాయలు

పర్వతములలో హిమాలయముల వలె ఆంధ్ర ప్రబంధములలో రాయల ఆముక్త మాల్యద అసదృశము. కథ, కవిత, అన్నిటిలో విశిష్టము.

ఆముక్త మొక వింత సృష్టి. ఒక దీర్ఘ సమన్వయ గ్రంథము. రచనా విధానమును బట్టి మహా ప్రబంధము. కథా వస్తువును బట్టి దివ్య ప్రబంధము. అందుచే, ఆంధ్ర ప్రబంధములలో దీనికొక ప్రత్యేక ఆకర్షణ శక్తి ఉన్నది.

గాథా సప్తశతి కర్తయగు హాలుని పిమ్మట ఆంధ్ర చక్రవర్తులలో రాయలు గాక మరొక మహా కవి కానరాడు. నన్నె చోడుడు రాజ మాత్రుడు, రఘునాథ నాయకుడు సామంతుడు. ఆముక్త కథా వస్తువు దివ్య చేతన స్పర్శచే దివ్యీకృతమగు మానవ చేతనను గూర్చినది. ఇతర ప్రబంధ కథల కత్యంత భిన్నమైనది. ఆముక్త కవితయు నట్టిదే. బాసాడు తెలుగు, ప్రౌఢ గీర్వాణము, అలంకార వైచిత్రి, ప్రకృతి పరిశీలన - అన్నిటిలో సార్వభౌముని మార్గము సార్వభౌమమే! అది ఒకరి ననుకరించినది కాదు. పరు లనుకరించ కలిగినదికాదు.

రాయలు అసాధారణ కవి మాత్రమే కాదు - సమరాంగణము లందును సార్వభౌమత వహించిన వాడు. ఆయన భువన విజయాస్థానము ఆంధ్ర, కన్నడ, మళయాళ పండితులు. విద్యా స్పర్ధచే పెనుగులాడు సాహిత్య సమరాంగణము. దీనికిని రాయలే సార్వభౌముడు. ఈ ద్వివిధ సార్వభౌమత్వమును గుర్తించి కాబోలు - నాటి వారాయనను సాహితీ సమరాంగణ సార్వభౌమ యని నోరార సంబోధించిరి. ఆయన భువన విజయాస్థాన సభ అనేక కావ్యోద్భవలకు జని స్థానము. అయినను ఆయనకు ఆముక్త రచనోద్భవము కవి పండిత గోష్ఠిలో జరగలేదు. కళింగ దండయాత్ర మధ్యమున, శ్రీకాకుళ తీర్థ యాత్రలో కలిగెను. ఆ కలుగుట స్థూల ప్రజ్ఞలో కాదు, స్వాప్నిక తైజస ప్రజ్ఞలో ఆ యుద్భవం కలిగెను. అది మానవీయము కాదు, దైవికము. అయినను, అది స్థూల జగత్తున దైవజ్ఞులచే ధ్రువీకరింపబడెను. కావ్యోద్భవకుడు రాయల సమకాలీనుడు కాదు. ఆయనకు పదునైదు శతాబ్దులకు పూర్వము తెలుగు

నాటి నేలిన ఆంధ్ర విష్ణువు. ఆయున చెప్పుమన్నది తన కాలపు కథ కాదు, రాయుల కాలపుది కాదు, ఇరువురకు నడిమి కాలపుది. (ఎనిమిదవ శతాబ్దము) అది కన్నడ కథ కాదు. సుదూరములో నున్న తమిళనాడులోని దక్షిణ ప్రాంతపుది. కథా నాయకుడు మానవుడు కాడు. రంగనాథ విష్ణువు. నాయకి భూదేవి. సత్యభామల యవతారము. అందలి శృంగారము శృంగారము కాదు, ఒక భక్తి విశేషము. ఇక ఆముక్త భాష రాయుల కన్నడ భాషది కాదు, రంగనాథ విష్ణుని తమిళ నాటిది కాదు. రాయుల కిది వరకు రచనాభ్యాసమున్న సంస్కృత భాష కూడా కాదు. అప్పుడప్పుడే ఆయన సామ్రాజ్యమున చేరుచున్న తెలుగుదేశమున బాసాడు తెలుగు. రాయులు కొలిచిన దేవ దేవుడిచ్చిన యానతి తెలుగు కృతిని నిర్మించుమని, అతడు దేవుడే కాదు - తోటి రాయులు. అందుచే ఒక రాయులొక రాయులకు విసరిన సవాలు కూడ! ఇక అంకితమో కావ్య ప్రేరేపకుడగు ఆంధ్ర విష్ణునకు కాదు, తెలుగు తమిళ కర్నాటకముల తల పాలములలో వెలసి ఆ మూడు దేశములకు ఆరాధ్యుడగు వేంకటపతి విష్ణునకు.

ఈ విధముగ ఆముక్తము - కావ్యకర్త, కావ్యోద్బోధ, ఉద్బోధకుడు, నాయకుడు, భర్త, కథ, మొదలగు అన్ని విషయములలోను అసాధారణ ఆకర్షణ కలది.

రాయులాముక్తమును సమగ్ర జీవితానుభవమున పరిణతాంతఃకరణుడైన పిమ్మట రచించెను. అప్పటి కాయన పరిపాలనానుభవమున రాజనీతి కుశలుడయ్యెను. యుద్ధ రంగమున తమిళాంధ్ర, ఓఢ్ర కర్ణాటక దిగ్విజయములను సాధించెను. సాహితీ రంగమున సంప్రదాయ బద్ధముగ అలంకార, వ్యంగ్య, రస ప్రధానములగు సంస్కృత కావ్యములను రచించెను. పారిజాత, మను, మహా ప్రబంధములకు కృతిభర్త యయ్యెను. సాహితీ సమరాంగణ చక్రవర్తి కవితా ప్రావీణ్య ఫణీశ, నిఖిల కవికులాభినవ్యమాన: కావ్య నాటకాలంకార మర్మజ్ఞేన - యని కీర్తింపబడెను. శ్రుతి పురాణోప సంహిత లేర్చి కూర్చెను. భువన విజయ సంసత్పండిత ప్రకాండుల శాస్త్ర తత్త్వ చర్చల రాపిడిచే ఆయన ఆధ్యాత్మిక ప్రజ్ఞ వెలుగొందెను.

ఇట్లు సంస్కృతాంధ్ర కన్నడ, మళయాళ, కవి పండిత సదస్సులకధ్యక్షుడై, తాను కొల్చు దేవ దేవుని ప్రశంస, ఆనతి, సవాళ్లనందుకొని, వివిధ వేదాగము విదులగు

తన విద్వజ్జనుల చేత ప్రబోధింపబడిన శ్రీ కృష్ణ దేవరాయలు పండిత కవుల రచనలు మించు ప్రౌఢితో గాక, తన కావ్యము నెట్లు నిర్మించును! ఈ విద్యా స్పర్థ చేతనే, ఈ రాజకవి తన బహు శాస్త్ర పాండితీ కవచమును ధరించి, జటిల సంస్కృత సమాస ఘటనాయుధమును చేతపట్టి ప్రబంధ రంగమున ప్రవేశించి, పుర ఋతు, వర్ణనాదికములగు సాము గరిడీలను ప్రదర్శించుచు, సర్వాతిశాయి యగు సాహిత్య వీర విహారము జేసెను.

రాయల పరిపాలన **1509-1530** వరకు సాగెననుట ప్రసిద్ధము. కాని, ఆయన జనన సంవత్సరము సరిగా తెలియదు. **1474** కావచ్చునని చరిత్ర కారుల ఊహ.

<u>బహుముఖ ప్రజ్ఞ:-</u>

ఏ కవి కావ్య రసాస్వాదనకయినను, అతని జీవిత విశేషములొక రుచిని కలిగించు ననుట ప్రసిద్ధము. ఇక ఆ కవి రాయల వంటి బహుముఖ ప్రజ్ఞాశాలి యగు సార్వభౌముడైనచో, చెప్ప బని లేదు. రాయలు భిన్న చరిత్ర, సంస్కృతులు గల కన్నడ, తమిళ, తెలుగు ప్రజలను సమైక్య పరచి, శాంతి సమృద్ధులతో పరిపాలించిన రాజ నీతిజ్ఞుడు. విజయనగర సామ్రాజ్యమునకు బలవద్విరోధులైన బహుమనీలను, గజపతులను, వందల మైళ్ల వెనుకకు కొట్టిన యుద్ధ తంత్రజ్ఞుడు. తన కిష్ట దైవమగు తిరుపతి వెంకటపతికే గాక, సామ్రాజ్యమంతట గల ఎన్నో శైవ, వైష్ణవ క్షేత్రములకు మహా దానము లర్పించిన పరమ భక్తుడు. సంస్కృతమున మదాలస చరిత్రాదులను, తెలుగున నాముక్తమును రచించిన మహా కవి. కన్నడ, తమిళ, సంస్కృత . కవి పండితులనేకులను పోషించిన వదాన్యుడు. వారి కృతుల నంకితము పొందిన రసజ్ఞుడు. సంగీత, వీణావాదన కుశలుడు. నాట్య, నాటక, కళాభిమాని. ఆలయ, నగర నిర్మాత. రాష్ట్ర వర్ధనమును హృదయమున కోరి, ఆనకట్టలను, చెరువులను, కాల్వలను నిర్మించిన ప్రభు వతంసుడు. ఈ సమస్తము జగత్ప్రసిద్ధము.

ఇవి తెలిసినంతగా మనకు రాయల వ్యక్తి జీవన విశేషములు తెలియవు. మనకివి (*Domingos Paes*) డామింగోస్ పేయస్ అను పోర్చుగీసు అశ్వ వ్యాపారి వ్రాతలో

లభించును. అతడు రాయలచే ఆదరింపబడి, ఆయనను సన్నిహితముగ దర్శించిన వాడు. అతని వ్రాతలను రాబర్టు సూయల్ మహాశయుడు - 'ఒక విస్మృత సామ్రాజ్యము' (*A Forgotten Empire*) అను తన ఆంగ్ల గ్రంథములో అనువదించెను. అందలి వివరములు కొన్ని -

<u>రూపము - వేషము:-</u> రాయలు మధ్యస్థమగు ఎత్తు గలవాడు. సన్నమనుట కన్న పుష్టిగా నున్నదన దగిన మంచి విగ్రహము. తెల్లని చాయ, ముఖము మీద స్ఫోటకపు గుర్తులు, శరీరముపైన ఒక విధమగు తెల్లని వస్త్రములు వాని మీద బంగారు జరీ గులాబీల నగీషీ మెడలో అమూల్య వజ్ర పతకము. తల మీద వెండి జరీతో చేయబడిన గెలీషియా దేశపు శిరస్త్రాణము వంటి టోపి - ధరించును.

**స్వభావము:-** స్వభావతః రాయలుత్సాహవంతుడు. మిక్కిలి ఉల్లాస భరితుడు. విదేశీయులను గౌరవించి, దయతో రావించి, వారి హోదా ఎట్టిదయినను, వారి యోగ క్షేమములన్నిటిని విచారించు వాడు. గొప్ప పాలకుడు. బహు న్యాయ పురుషుడు. కాని, అప్పుడప్పుడు ఆకస్మిక కోపోద్రేకములకు లోబడు వాడు. పై విషయములను మనము పారిజాతము, ఆముక్త, రాయ వాచకాదులందు, చెదురు మదురుగా నున్న యంశములతో నన్వయించి చూచినచో, రాయల త్యాగ భోగములు ప్రతిభా పాండిత్యములు మొదలగు మరికొన్ని విశేషములు తెలియును.

<u>దినచర్య:-</u> రాయలు తెల్లవారు ఝాముననే లేచి 15 ఔన్సుల నూనె త్రాగును. కొంత శరీరమునకు పూసుకొనును. చిన్న తెల్లటి వస్త్రమును దాల్చును. బరువుల నెత్తును. త్రాగిన నూనె చెమటగా వెళ్ళునట్లు కత్తి సాము చేయును. తన మల్లులతో నొకనితో పోరి, విశాలమగు మైదానములో ఒక వైపు నుండి మరొక వైపునకు అతి వేగముతో గుర్రపు స్వారీ చేయును. ఈ సమస్తమును పెద్దన "వ్యాయామ స్థిత సంధి బంధ 'అనల్పత్తురగ బహువిధా నీహా కళా రేవంత' అను సంబోధనలలో సూచించెను. వ్యాయామానంతరము రాయుల నొక రాజపురోహితుడు స్నానము చేయించును. తరువాత రాయలు రాజప్రాసాదములోని ఆలయములో పూజ కావించును. పిమ్మట కొలువు కూటమునకు పోయి, రాజ్యాధికారులతోను, పురపాలకులతోను రాజ

కార్యములను నిర్వహించును. అనంతరము ద్వారము వెలుపల కాచుకొనియున్న సామంత దండ నాయకులు లోనికి వచ్చుట కనుజ్ఞ యిచ్చును. వారు వెంటనే రెండు చేతులు పైకి సాధ్యమైనంత ఎత్తుకు ఎత్తి రాయలకు నమస్కరించుచు, లోనికి ప్రవేశించి, ఆయనకు దూరముగా గోడల వెంబడి స్థానములకు చేరుదురు. ఒకరితో నొకరు మాటాడు కొనరు. తాంబూలమును నమలరు. చేతులను అంగి ముంజేతులలో ముడిచి, చూపులను నేలకు వాల్చి యుందురు. రాయలు వారితో నెవరితోనయిన మాటాడదలచినచో, ఆ పని ఒక మధ్యవర్తి ద్వారా జరుగును. అట్లు ప్రశ్నింపబడిన వాడు కండ్లెత్తి, మధ్యవర్తికి జవాబు చెప్పి, యథా పూర్వస్థితి నవలంబించును. రాయలు సెలవిచ్చు వరకు వారట్లే యుండి, ఆయన ఆజ్ఞ కాగానే తలపైకి చేతులెత్తి నమస్కరించుచు బయటికి పోవుదురు. ఇది వారి నిత్య కృత్యము.

ఇట్లే పేయస్ రాయల కొలువు కూటములను, భువన విజయ మందిరములను అచట రాయల సమక్షమున జరుగు దసరా ఉత్సవములను, రాజ ప్రాసాదమును, అందలి అంతర్భాగములను, రాణీ వాసమును, వారిని రాయలు కలియు పద్ధతిని, వారి పరిచారికలను, పల్లకీలను, బోయీలను మరి ఎన్నో ఆసక్తికర విషయములను కన్నులకు కట్టినట్లు వర్ణించును. ఇట్లు - కృష్ణరాయల వ్యక్తిత్వ విశేషములన్నిట ఆయన సార్వభౌమతయే ప్రతిఫలించును.



# ఆముక్తము - శ్రీ వైష్ణవ విభాగములు

శ్రీ వైష్ణవోజ్జీవనమునకై రాయలాముక్త మాల్యదను రచించెను.

తమిళనాడున క్రీ.శ. ఆరు - పన్నెండు శతాబ్దుల మధ్య తమిళనాడులో పరిణతి చెందిన వైష్ణవమునకు శ్రీ వైష్ణవమని పేరు. దీనిలో రెండు విభాగములు కలవు. ఒకటి హృదయ సంబంధి, రెండవది మేధోనిష్ఠము. మొదటిది ఆరు, తొమ్మిది శతాబ్దుల మధ్య తమిళనాట పన్నిద్దరాళ్వారులచే ప్రవర్తింపబడినది. రెండవది పది పన్నెండు శతాబ్దుల మధ్య నాటి యామున, రామానుజాది ఆచార్యులచే ప్రతిష్ఠించబడినది. మొదటి దానికాళ్వారుల హృదయానుభూతి ప్రమాణము, తదుద్గత తమిళ దివ్య ప్రబంధములు ప్రాణము. రెండవ దానికి ఆచార్యుల తత్త్వ చింతన ప్రమాణము. ఉపనిషద్, బ్రహ్మ సూత్ర, యోగ పాంచరాత్రాది సంస్కృత గ్రంధములు, మేధస్సు. మొదటిది దేశ భాషలో గాన రూపమున ప్రజలలో భక్త్యావేశమును వెల్లివిరియించెను. రెండవది సంస్కృత రచనలచే పండితులలో తత్త్వము భాసింప చేసెను. ఒకటి హృదయరంజనమునకు, పరమేశ్వర ముఖోల్లాసమునకు, రెండవది వాది భంజనమునకు, రాజ రంజనమునకు నిర్మింపబడెను. హృదయ సంబంధియగు ప్రపన్న ధర్మము దక్షిణమున ప్రజోద్యమముగా జనించి ఉత్తరమునకు వ్యాపించెను. మేధా సంబంధమగునది ఉత్తరము పండితులలో విష్ణు తత్త్వమును నిరూపించి దక్షిణమున ప్రభావిత మొనర్చెను. రాయలీ రెండింట ప్రవీణుడు. ఆయన యౌవనోదయ పర్యంతము దక్షిణార్కాటు జిల్లాలోని దేవకీ పురమునను తిరుపతి సమీపమున చంద్రగిరిలోను తమ తండ్రి తుళువ నరసా నాయకునితో ఉండెను. (తమిళ సరిహద్దులగు తొండ మండలమునకు చంద్ర గిరి యందును) ఇవి రెండును ఆంధ్ర తమిళముల సరిహద్దు లోని ఉభయ సంస్కృతుల ప్రభావముగలవి. అందుచే రాయలు తమిళ ఆళ్వారు (ఆచార్యుల) సంప్రదాయ మెరుగ గల్గెను. రాజ్యాధిపతియైన పిమ్మట ఆయన గురువు తాతాచార్యులు. రాయలాయన కడ విశిష్టాద్వైత

ప్రస్థానములను నేర్పియుండును. రాయలది సమగ్ర దృష్టి అందుచే ఆయన శ్రీ వైష్ణవ మందలి రెండు విభాగములను ఆముక్తమున ప్రదర్శింపనిదే తృప్తి నొందలేదు. ప్రబంధారంభమున తాను విన్నవింప బూనినది ఆముక్త మాల్యదా కథ అనియే చెప్పికొనెను. ఆయనకు స్వప్నమున సాక్షాత్కరించిన ఆంధ్ర జలజాక్షుడు చెప్పుమన్నది ఆ కథనే. అది (ఒక చిన్నది (రంగనాథ) విష్ణువుల పెండిలి అయిన కథ) కథా నాయిక భక్తిని మాత్రమే చిత్రించును. దానిలో శాంత దాస్యాది ఇతర భక్తి సాధనలకు తావు లేదు. విశిష్టాద్వైత దర్శన ప్రదర్శనమునకు అవకాశము లేదు. అందుచే రాయలాముక్తమున మరి నాలుగు కథలను కూర్పనిదే తృప్తి నందలేదు. అందు గోదాకన్య కథ భగవత్ప్రేరక కథ. ఆమెది మధుర భక్తి. మాల దాసరి కథ పరమప్రపన్నుని వృత్తాంతము. ఆయనది శరణాగతి ధర్మము. ఇవి రెండును హృదయ సంబంధములే. వీరిద్దరును గాన భక్తిచే తరించిన వారే. విష్ణుచిత్త, కేశిధ్వజయామున చరిత్రలు విష్ణు తత్త్వమున నిరూపించును. ఆ తత్త్వము వేద వేద్యము. యోగ దర్శితము. రాయలు వీనినన్నిటిని గుది కూర్చుటచే, శ్రీవైష్ణవ మధుర, సంప్రదాయముల రెండింటిని, సమగ్రముగ జూప గలిగెను. ఇది ఆయన సమగ్ర దృష్టికొక నిదర్శనము.

రాయల సమగ్ర దృష్టికి మరొక నిదర్శనము కనిపించును. చారిత్రకముగ విష్ణు చిత్తుడు. గోదాకన్య -8వ శతాబ్దము వారు. పన్నిద్దరాళ్వారులలోని వారు. యామునుడు 10, 11. శతాబ్దముల వాడు. శ్రీ వైష్ణవ ఆచార్యులలో రెండవ వాడు. ఇక కేశిధ్వజుడు పౌరాణిక వ్యక్తి. పురాణములలో మిక్కిలి ప్రాచీనమని విద్వాంసులు చెప్పు విష్ణు పురాణములోని పాత్ర. మాల దాసరి కూడా పౌరాణిక వ్యక్తియే. ఈయన కథ వరాహ పురాణములోనిది. వివిధ యుగము లందలి సాధకులను, వివిధ రూపములగు సాధనలను, రాయలొక చోట కూర్చి వానిని రసవంతముగా మలచి ప్రబంధముగ నిబంధించెను. ఇది ఆయన సమగ్ర దృష్టికి కావ్య నిర్మాణ కౌశలమునకు నిదర్శనము. ఈ ప్రక్రియ యందీయన సిద్ధహస్తుడు. ఈ మాట ఆంధ్ర జలజాక్షుడే చెప్పెను.

శ్రీ వైష్ణవ సంప్రదాయమిట్లు ఆళ్వారులు, ఆచార్యుల సంప్రదాయముగా, ప్రజా గానముగా, పండిత ప్రవచనముగా రెండు ముఖముల ప్రవర్తించినను, అంతర్యమున

నొక్కటే. అందు వలననే దీనికి ఉభయ వేదాంతమని ప్రఖ్యాతి. ఆళ్వారుల నాలాయిర మాచార్యుల భాష్యముల నుద్దీప్తమొనర్చును.

ఆచార్యుల భాష్యము లాళ్వారుల భక్తిని వ్యవస్థీకరించును. ఒకటి శ్రీ వైష్ణవమును జన సామాన్యమున వెలయించి వారికి భగవదనుభవానందమును పంచును. రెండవది పండిత ప్రతివాదులను భంజించి తత్త్వమును స్థాపించును. ఒకటి శ్రీ వైష్ణవమునకు హృదయము. రెండవది మేధ. ఒకటి శరీరము - రెండవది కవచము.

## శ్రీ వైష్ణవ విభాగముల చరిత్ర

శ్రీ వైష్ణవము రెండు విభాగములుగ నేర్పడుటకు చాల కారణములున్నవి. వీని జనన కాల పరిస్థితులు వేరు. ఇవి యెదుర్కొన్న సమస్యలు వేరు. కనుగొన్న పరిష్కారములు వేరు. రాను రానివి ద్రావిడ సంస్కృతాచార్యుల ఆధ్వర్యమున తెంగల, (దక్షిణ) వడహాల (ఉత్తర) కూటములుగ నేర్పడెను.

ఆళ్వారుల కాలమునకు ముందు ప్రజా బాహుళ్యము జైన, బౌద్ధముల నాశ్రయించి యుండెను. ఆ మతములు పర దేశీయులైన కళభ్రుల ప్రభుత్వము నాశ్రయించి యుండెను. ప్రజలు కళభ్రులపైనను, మతములపైనను విప్లవము లేపిరి. రాజకీయ రంగమున కళభ్రుల పతనముతో (క్రీ.శ. 550) పాటు మత రంగమున ప్రజల నందరను వేద - పురాణ మతమునకు త్రిప్పవలసి ఉండెను. ప్రజల హృదయము నాకర్షించుటకు వారు మాతృభాష, సంగీతము, భక్త్యావేశము - పని చేసినట్లు మరేవియు పని చేయవు. ఆళ్వారులు దీనిని గమనించి భక్త్యావేశ పూరితములగు తమిళ గేయములను (పాశురములను) రచించి ప్రజలను ప్రబోధించిరి. వారి గేయములు 10వ శతాబ్దమున రంగనాథ మునిచే సేకరింపబడి నాలాయిర (నాలుగు వేల) మనుపేర నేటికిని నిలిచియున్నవి. వీనిని దివ్య ప్రబంధములనియు అందురు.

ఆచార్యుల కాలమున సమస్య ప్రజా బాహుళ్య పరివర్తన గాదు. జైన, బౌద్ధ, అద్వైత పూర్వమీమాంస దర్శనములు పండితులలో స్థిరపడి ఉండి సభా వాదములలో

నజేయముగా నుండెను. అందుచే వానికి అగ్రవర్ణములందును, రాజ సభల యందును కొంత ఆదరము కలుగు చుండెను. వారి నెదురు కొనుట ఆచార్యుల సమస్య. ఇందుకై ఆచార్యులు తమ ప్రతిపర్థులుపయోగించిన వారి ఆయుధములనే ఉపయోగించ వలసి యుండెను. అందుచే వారు, ఉపనిషద్, బ్రహ్మ సూత్ర, యోగ సూత్రములను పాంచరాత్రాది ఆగమములను, ప్రమాణముగ గ్రహించి, ఒక నూతన దర్శనమును భక్తి పూరితతర్క కౌశలముతో నిర్మించవలెను. ఈ పని నాథముని కొర్తిగను, యామునుడు విశేషముగను, రామానుజులు సంపూర్ణముగను నెరవేర్చిరి. నాథముని రచించిన న్యాయతత్త్వము, యోగ దీపికయు, యామునుడు రచించిన సిద్ధిత్రయము, గీతార్థ సంగ్రహము అను స్వతంత్ర గ్రంథములు, రామానుజ దర్శనమున ప్రాతిపదికలని తలపబడుచున్నవి. ఈ మార్గము ననుసరించి శ్రీరామానుజులు బ్రహ్మ సూత్రమునకు శ్రీ భాష్యమను మహనీయ వ్యాఖ్యను రచించిరి. దీని వలననే శ్రీ వైష్ణవము నిలువ గలిగి తరువాతి కాలమున మధ్వ, నింబార్క, వల్లభ, రామానందాదుల నుత్తేజపరిచెను.

దీనిని 13-14 శతాబ్దము లందలి కవి తార్కిక సింహ బిరుదముచే ప్రసిద్ధులైన వేదాంత దేశికులు (1268-1369) అనేక రచనలచే బలపరచిరి. ద్రావిడ ప్రబంధములను సంస్కృతాచార్యులు అత్యంత అభినివేశముతో అధ్యయనము చేసియే తమ రచనలను సాగించిరి. ప్రబంధాధ్యయనము వలన తమకు ఉపనిషదాదులలోని దుర్గ్రాహ్యమగు విషయములు విశదమయ్యెనని చెప్పికొనిరి. కాని, ఈ సంస్కృత ద్రావిడ భేదములే తుదకు వడహలు, తెంగల విభాగములకు త్రోవ తీసినది.

ఆముక్త రసాస్వాదనకు శ్రీ వైష్ణవ విభాగ చరిత్రలోని మరికొన్ని వివరములు తోడ్పడును. ఇది తమిళనాట రాజకీయ, సాంఘిక, మత చరిత్రలతో ముడిపడియున్నది. అందుచే వైష్ణవ చరిత్రతో పాటు తమిళుల ప్రాచీన చరిత్రను కొంత గమనించ వలసి యున్నది.

## ప్రాచీన తమిళులు – (క్రీ॥పూ॥ 500–క్రీ॥శ॥ 300 వరకు) సంగమ్ (శంగమ్) యుగము – అప్పటి సాహిత్యము

ప్రాచీన తమిళుల చరిత్ర తెలిసికొనుట కప్పటి సాహిత్యమే ముఖ్య సాధనము. దీనినే సం(శం)గమ్ సాహిత్య మందురు. దీనిలో కొంత భాగమిప్పటికిని లభ్య మగుచున్నది. కాని, దీని కాల నిర్ణయమున భేదాభిప్రాయములున్నవి. కొందరు తమిళ దేశాభిమానులిది క్రీస్తుకు పూర్వమనేక శతాబ్దుల నాటిదందురు. చరిత్రకారులిది క్రీస్తుకు పిమ్మట నారంభమై మూడు వందలేళ్లు వర్తిల్లెనందురు. ఇది దక్కనులోని శాతవాహన పాలన యుత్తరార్ధమునకును, రోమన్ చక్రవర్తి ఆగస్టస్ శకారంభమునకును, సమకాలీనమని వారి అభిప్రాయము. మరికొందరు మధ్యస్థులిది క్రీస్తు పూర్వం 500 నుండి క్రీస్తు పిమ్మట 300 వరకు వ్యాపించెనందురు.

ప్రాచీన తమిళ ప్రభువుల ఆధిపత్యమున నేర్పడిన కవి సంఘములు 'సంగమ్' అని పేర్కొనబడినవి. ఈ సంగమున నెగ్గిన రచనలకు ప్రమాణ్యము లభించెడిది.

చరిత్ర కందని కాలమున తమిళనాట, రెండు కవిసంగమము లొకదాని పిమ్మట ఒకటి పుట్టి గతించెనని ఒక సంప్రదాయము కలదు. మొదటి దానికి శివుడు, రెండవ దానికి అగస్త్యుడు అధ్యక్షులు . ఆ సంగమ్ సమావేశ స్థలములు దక్షిణ మధుర, (ఇప్పటి మధురై కాదు.) కాపాటపురము అందురు. అవి ఇప్పుడు సముద్రమున కలసిపోయెనందురు. ఆ రెండు సంగముల వారి రచన లేవియు ఇప్పుడు లభింపవు. క్రీ॥శ॥ మొదటి మూడు వందల ఏండ్లలో, (150 ఏండ్లని కొందరు) రచింపబడిన సంగ సాహిత్యము మాత్రమే కొంత ఇప్పుడు సంకలన రూపమున (Anthology)లభ్యమగుచున్నది.

**సంగమ్ రాజకీయములు:-**

మూడవ సంగమ్ కాలమున తమిళనాడు చేర, చోళ, పాండ్య మండలములుగ నుండెను. వీనిని దేశీయులగు "ముడి అరశరే"=మూర్ధాభిషిక్తులును, 'ఆమె', 'వేళ' అను సామంత నాయకులును పాలించిరి. వారు విశేషముగ తమిళ కవి సంఘములను

పోషించిరి. ఆ కవులొక ప్రభువు నుండి మరియొకరి కడకు పోవుచు వారిని కీర్తించు చుండిరి.

<u>సంగమ్ ప్రజా జీవనము - ప్రేమ-శౌర్యములు -</u>

సంగమ్ ప్రజా జీవనము అప్పటి సాహిత్యమున చక్కగా ప్రతిబింబించును. సంగమ్ కవులు ప్రజల జీవనమును (అహం) (పురమ్) అను రెండు కవితా విభాగములలో వర్ణించిరి. "అహం" విభాగ మంతయు ప్రజల అంన్యము (ప్రేమను) గృహస్థ జీవనమును వర్ణించును. 'పురమ్' విభాగము ప్రజల రాజ్యాంగ, వ్యవహారిక, శౌర్యాది బాహ్య జీవనమును చిత్రించును.

"అహం" 'పురమ్' విభజన ఇతర సాహిత్యము లందు లేవందురు. వీనిలో నొక విశిష్టత యున్నది. 'పురమ్' లోనే యుద్ధములు మఱక్కళ్ల వెళ్ళి - అను పేర ఒక యాగ విశేషముగ వర్ణింపబడెను. తరువాతి కాలమున నిది 'పరణి' యను ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా రూపొందెను.

'అహమ్'లో ప్రేమ వర్ణన మరింత విశిష్టమైనది. అది అవివాహిత, వివాహిత, వియోగ దశలన్నిటిని సూక్ష్మ దశాంతరములతో ప్రదర్శించును. ఆ దశల కనుకూల రంగములుగ పర్వత, అరణ్య, మైదాన, మాగాణ, మరుభూములు ప్రత్యేకముగ సంకేతింపబడెను. ఆ భూములకు గురుతుగా ప్రత్యేక పుష్పములు పేర్కొనబడెను.

<u>'సంగమ్' నృత్య గానములు :-</u>

అహం అంచు (ప్రేమ) కవిత్వములతో పాటు తమిళ ప్రజలకు నృత్య, గాన ఉత్సవములందధిక ప్రీతి యున్నట్లనిపించును. ఇది 'సంగమ్' సాహిత్యమున నెక్కువగా కనుపించును. సంగం కాలమునకు కొంచెమీవలి 'శిలప్పదికారము'ను కావ్యమున నాగరిక, గ్రామీణ, ఆటవిక ప్రజల నృత్య గానములు, వాద్య విశేషములు, అతి సూక్ష్మ వివరములతో వర్ణింపబడెను. 'సంగం' సాహిత్యమున గాయక బృందము ఒక యాస్థానము నుండి మరొక దానికి' తిరుగులాడు చుండి వారి ఆట పాటల

కనుగుణముగా స్త్రీలు నృత్యము చేయుచుండిరి. ఆదిమ నివాసులగు 'పాణర్', 'విఱలియర్' గుంపులు 'యాల' (Lute) పిల్లన గ్రోవి మొదలగు పురాతన వాద్యములలో జానపద గీతములను పాడుచు, ఆడుచు కదలిపోవు చుండిరి. ఒకానొకప్పుడు రాత్రు లందు కాగడాల వెలుతురున హస్త విన్యాసములతో భరత నాట్యమువంటి నృత్యమును చేయు చుండిరి.

<u>'సంగమ్' మత జీవనము:-</u>

'సంగమ్' ప్రజలు విశేషముగా లౌకిక జీవనాసక్తులుగ నుండిరి. మత జీవనమును గూర్చిన అభినివేశము తక్కువగా నుండెను. ఉన్న మతము అచ్చటచట సూచింపబడెను. అది స్థూలముగా రెండు రకములు.

మొదటిది దేశీయము. అది 'నాడుకల్' అను వీర శిలారాధన, రెండవది విదేశీయము. దీనిలో ఒకటి వేద పురాణములను, రెండు జైన, మూడు బుద్ధ మతములను అనుసరించిన మూడు మతములు కనిపించును. రాజులు యజ్ఞములు చేయుచుండిరి. ప్రజలు శివ బలరామ, విష్ణు, కృష్ణ అర్ధ నారీశ్వర, తులసి ఆరాధనము చేయు చుండిరి. ఇంద్రుని గూర్చి 'ఇంద్రవేల' యను వర్షా ప్రార్థనోత్సవము విశేషముగా నుండెను. మురుగన్ పూనకములలో చిందులాట అచటచట కనిపించును. బౌద్ధ జైనములకు అన్ని వర్గముల ప్రజలు గుహలను నిర్మించి ఇచ్చి నట్లు గుహలలోని ప్రాచీన శాసనముల వలన తెలియ వచ్చుచున్నది. మొత్తము మీద మతమున సహ జీవనము కనిపించును. కాని కొన్ని మతముల వారు చేతులెత్తి, పతాకలాడించుచు, వాద ప్రతివాదములు చేసిరని సంగ సాహిత్యమున కొలదిగ కనిపించును. అది బహుశః తొలు దొలుత వచ్చిన వైదిక, పౌరాణిక మతములకును, తరువాత వచ్చిన, జైన బౌద్ధములకును కలిగిన వివాదములను గూర్చినవై యుండవచ్చును. ఈ వివాదము 'సంగం' కాలము పిమ్మట కలభ్ర యుగమున (250-క్రీ॥శ॥ 550క్రీ॥శ) కలభ్ర పతనానంతరము భక్తి యుగమునను విపరీతముగ పరిణమించుట చూతుము.

మొత్తము మీద ప్రజల సాంఘిక, రాజకీయ, మత జీవనములు స్వేచ్ఛా యుతములుగ నున్నట్లు తోచును. ప్రజలు లౌకిక జీవన ప్రియులుగ నుండి

ఆనందానురాగములనే ముఖ్యముగ నెంచినట్లగుపడును. జీవితము దుఃఖమయమని గాని, అందుండి విముక్తి పొందుటే పరమ శ్రేయస్సని గాని, యెంచినట్లిక్కడను కానరాదు. 'సంగం' యుగమునకు తరువాత సమీప కాలమున వెలువడిన 'కురల్' అను జగత్ప్రసిద్ధమగు నీతి కావ్యమున గూడ మోక్ష ప్రశంస లేదు. ధర్మ, అర్థ, కామములు మాత్రమే పురుషార్థములుగ చెప్పబడినవి.

## కలభ్ర యుగము - క్రీ॥శ॥ 250-550

## పారతంత్ర్యము - నిరాశానిస్పృహలు

## విదేశీయ పాలన. జైన బౌద్ధముల ప్రాబల్యము

## నైరాశ్య వ్యాప్తి - 'అన్బు' 'అహం' కవితల అదృశ్యము

ప్రేమ సంతోషములతో స్వేచ్ఛ వర్ధిల్లు తమిళనాడున క్రీ॥శ॥ 250 ప్రాంతమున ఆకస్మికముగ ఒక విషాద మేఘమావరించెను. అది మూడు వందలేండ్లు విజృంభించి తమిళ పూర్వ సంస్కృతిని మరుగు పరచెను.

కాళప్పాళర్ లేక కలభ్రులను విదేశీయులుత్తరమున ఆంధ్ర కర్ణాట సరిహద్దుల నుండి వచ్చి తమిళ దేశము నాక్రమించిరి. వారి పిమ్మటి సాహిత్యము వారిని నాగరికతా విరోధులని, పాపిష్టి పాలకులని, అజ్ఞాత జన్ములని నిరసించెను. చరిత్రకారులు వారిని జైన, బౌద్ధులందురు. వారు జైన బౌద్ధముల నత్యంతముగ నభిమానించి, వైదిక పౌరాణిక మతముల నణగ ద్రొక్కిరి. వారిలో అచ్యుత విక్కంతుని కాలమున చోళ దేశమున బౌద్ధా రామములు మూతపడెను. బ్రహ్మ దేయములు రద్దు పడెను. శేక్కిలార్ వ్రాసిన 'పెరియ పురాణము' అను శైవ భక్తుల చరిత్రలో వైదిక పౌరాణిక మతములు జైన బౌద్ధములచే నెట్లాపద పాలాయెనో పెక్కుమారులు కనిపించును.

### సాహిత్యమున కూర్పు - నైరాశ్య ప్రబోధము:-

కళభ్రయుగ సాహిత్యము సంగం సాహిత్యము రేయి పవలు వంటివి. కళభ్ర యుగ కవులందరు జైన, బౌద్ధులు, వారి మతములు నివృత్తి పరములు, అందుచే

ప్రవృత్తి పరమగు సంగం కవితలోని, జీవనప్రియత్వము వీరి రచనలలో నదృశ్యమయ్యెను. 'అన్బు' (ప్రేమ) 'అహం'లకు తావే లేదు. నీతి, వైరాగ్యములే పదింబది యుపన్య సింపబడెను. 'శిలప్పదికారమ్', 'మణిమేకలై' యను ప్రసిద్ధ కావ్యములు జగత్ప్రసిద్ధి గాంచిన 'తిరుక్కురల్' యను ప్రసిద్ధ కావ్యములు జగత్ప్రసిద్ధి గాంచిన 'తిరుక్కురల్' అను నీతి శాస్త్ర గ్రంథము అప్పటివే (క్రీ.శ. 450-550). ఇవి యన్నియు వైరాశ్య, వైరాగ్యములనే ప్రతిపాదించును.

శిలప్పదికార కథ శృంగార విలాస జీవనముతో నారంభించును. అసూయ విభ్రాంతులతో విషాదాంతమగును. శృంగార జీవితము నకలుగ విపరీత పరిణామముల వలన ఆ కావ్యములోని ముఖ్య పాత్రలందు నశించుటే గాక, ఆ జీవితమునకాశ్రయమైన పాండ్య రాజధాని మధురై అగ్ని బీభత్సముచే బూడిద పాలగును.

మణిమేఖలై మొదటి నుండి చివర వరకు జీవిత మందు వైరాగ్యమునే ప్రకటించును. అందలి నాయిక సౌందర్యవతి. నవయువ్వని అగు వేశ్యా కుమారి అయినను జైన, బౌద్ధ సన్యాసినిగమారి, జీవన దుఃఖమును జైన, బౌద్ధ వైరాగ్య పాశస్త్యము నుగ్గడించి పర మతములను ఖండించును. మణిమేకలై ననుసరించి కళభ్ర యుగమున జీవ చింతామణి మొదలగు అనేక వైరాశ్య కావ్యములు వెలువడెను. తమిళమున ప్రథమముగ నిరాశ కావ్య వస్తువాయెను. తమిళుల కత్యంత ప్రియమగు సంగీతము నిషేధింపబడెను. రాజకీయమగు స్వేచ్ఛతోను, సాంస్కృతికమగు సంగీత నాట్యముల తోను హృదయ సంబంధమగు వీర, ప్రేమ కవితలతోను ప్రవృత్తి జీవనము నభిమానించు తమిళులకీ అస్వతంత్రతా బద్ధమగు వైరాగ్య వైరాశ్యనిర్వృతి వాతావరణము భరింపరానిదాయెను.

## తిరిగి స్వతంత్రము. క్రీ॥శ॥ 550 నుండి దేశభక్తి- దైవభక్తి రాజకీయ - మత విప్లవములు

### కళభ్రపతనము - భక్తి ఉద్యమము

క్రీ॥శ॥ 250 నుండి 550 వరకు మూడు వందలేండ్లు తమిళులు రాజకీయ జీవనము విదేశీయ జైన కళభ్ర పాలనతోను, మత జీవనము జైన బౌద్ధ

వైరాగ్యములతోను క్రుగ్గెను. ఉండి ఉండి, తమిళుల క్రోధ మొక్కసారిగ ఉప్పొంగి, రాజకీయ, మత, విప్లవములుగ చెలరేగి వారు కళభ్రుల నంతమొందించిరి. జైన, బౌద్ధముల నెదిరించిరి. భక్తి ఉద్యమము వెలయించిరి.

క్రీ॥శ॥ 550 ప్రాంతమున బాదామి చాళుక్యులును, కాంచి పల్లవులును, మధుర పాండ్యులును, తమ ప్రాంతమందలి జైన కళభ్ర ప్రభుత్వమును కూలద్రోసిరి. ఇదే సమయమున జైన బౌద్ధముల నెదుర్కొను ప్రజలలో భక్తి ఉద్యమము చెలరేగెను. ఈ భక్తి ప్రవాహమున రెండు వాహికలున్నవి. ఒకటి శైవ భక్తి, రెండవది వైష్ణవ భక్తి. శైవ భక్తికి నాయనమారులు నాయకులు. వైష్ణవ వాహినికి ఆళ్వారులు నాయకులు. ఇచట ఒక ముఖ్య విషయమును గుర్తించదగును. వైదిక పౌరాణిక మత పునరుజ్జీవనకు యజ్ఞయాగాది క్రతు ప్రచారము జరుగలేదు. అవి జన సామాన్యము నందరను ఆకర్షించ లేవు.సర్వజనాకర్షణకు భక్తి సులభ మార్గము. భక్తి తప్ప మరొక త్రోవ లేదు.

భక్తి ఉద్యమము రాజకీయోద్యమములవలె కొన్ని సంవత్సరములలోనో, ఏ కొద్ది యుద్ధములతోనో అంతము కాలేదు. ఇది ఆరవ శతాబ్ది నుండి తొమ్మిదవ శతాబ్ది వరకు ముమ్మరముగ సాగెను. ఆ పిమ్మట 12వ శతాబ్దము వరకు దర్శన నిర్మాణము ప్రధానముగ నుండెను. మరియు, దీనిలో గమనించదగిన విషయ మొకటున్నది. బౌద్ధ జైనముల నెదిరించుట శైవ వైష్ణవములకు సామాన్య ప్రయోజనమే అయినను, వారిలో వారికి వివాదములు తప్పలేదు. ప్రజలను, రాజులను, ఆకట్టుకొనుటకు ప్రారంభ దశలో కాలూను కొనుటకు ఇది అవసరమాయెను. ఈ వివాదములు అనంతర కాల మున ప్రాముఖ్యము వహించి, ఆయా రాజుల ప్రాబల్యము పరస్పర హింసకు పాల్పడుట మాత్రము.

భక్తి ఉద్యమములలో ప్రజా బాహుళ్యమతి శీఘ్రముగ చేరి పోయెను. దీనికి ప్రజల మనస్తత్వము, పూర్వ సంస్కృతి ముఖ్య కారణములు. 'సంగమ్' (క్రీ.పూ. 500 -క్రీ.శ. 300) కాలముననే తమిళ జాతి విలక్షణత రూపొందెను. కవితా, సంగీత, నృత్య, ప్రేమ, అనురాగ జీవనమునకు వారంకితులైరి. జైన బౌద్ధముల నీతి వైరాగ్య

ములు వారికి తృప్తి కలిగించ లేదు. ఆ కొరతను భక్తి తీర్చెను. జైన బౌద్ధముల స్వరూపములను భక్తి సందేశమును పరిశీలించినచో నిది తెలియును. సంగ్రహముగ జెప్పవలెనన్న జైన బౌద్ధముల ప్రాతిపదిక నైరాశ్యము, దుఃఖము, భక్తి సందేశము ఆశాపూరితము, ఆనంద వర్ధకము. నైరాశ్య దుఃఖములు తమిళుల పూర్వ సంస్కృతికి వ్యతిరేకము, భక్తి సందేశము వారి కనుకూలము.

## జైన బౌద్ధముల నిరాశా సందేశము

**బౌద్ధము :-**

జీవిత మంతయు దుఃఖమయమను గుర్తింపుతో బౌద్ధ మారంభమగును.

దుఃఖము రెండు విధములు. ఒకటి భౌతికము, రెండవది మానసికము.

అసలు జన్మించుటే ఒక దుఃఖము, అది దుఃఖమునకు నాంది. జన్మించిన వానికి వ్యాధి, జరా, మరణములు తప్పవు. ఇవన్నియు దుఃఖములే గదా! మరణించిన వానికి పునర్జన్మ తప్పదు. పునర్జన్మలో తిరిగి వెనుకటి దుఃఖ గాథయే! ఇది భౌతిక దుఃఖము.

ఇది గాక మానసిక దుఃఖ మొకటి ఉన్నది. మానవునకు ప్రియ వియోగ అప్రియ ప్రాప్తి రూపకమగు దుఃఖ మనివార్యముగ కలుగును.

ఇంతయేల! సుఖముగ కన్పించునవన్నియు దుఃఖాంతములే! జీవితమున దుఃఖము తప్ప మరివేరు లేదు.

ఈ దుఃఖమును నివర్తించుటెట్లు? జన్మ, పునర్జన్మలున్నంత వరకు దుఃఖమున కంతము లేదు. మరి యేమి చేయవలెను. జన్మ లేకుండ చేసి కొనవలెను. కొండ నాలుకకు మందు వేయగా ఉన్న నాలుక యూడినది! దీనితో దుఃఖితునకిహమందాశ నశించినది.

జన్మలేకుండుటకు వాడేమి చేయవలెను? జన్మ కారణము తెలిసికొనవలెను. కారణము తెలిసినచో కారణ నివృత్తి చేయవచ్చును. అపుడు జన్మ యుండదు.

జన్మ కారణమేమి? జన్మ కారణము తృష్ణ. తృష్ణ మూడు విధములు. మొదటిది భవతృష్ణ. జన్మించవలెనను కోరిక. రెండవది కామతృష్ణ. ప్రియమగు వానినను భవించవలెనను కోరిక. చివరిది - విభవతృష్ణ ఐశ్వర్య ప్రాభవములతో వర్ధిల్లవలెనను కోరిక.

తృష్ణవే ఒక పదార్థమును పొందవలెను, వద్దు అను ఇచ్ఛ యేర్పడును. తృష్ణయే తన ఆహారములకు కారణము. ఆహారముల వలన పంచస్కంధము లేర్పడును. ఇవియును వేదనస్పర్శ పన్నెండు ఆయతనములును, పదునెనిమిది ధాతువులును కలసి సంఘాతమై లోకమునగల వస్తువులగును. వీనిని పొందవలెనను తృష్ణ యేలేనిచో వీని సంఘాతవుండదు. జన్మ యుండదు. జన్మలేనిచో జరా, రుజా, మరణ, పునర్జన్మ, దుఃఖ వలయముండదు.

జన్మకారణము తృష్ణయని తెలిసినది. తృష్ణను నివారించుటెట్లు? తృష్ణను నివారించుటకు ఆర్య అష్టాంగిక మార్గమునవలంబించవలెను. అందు ఎనిమిది సమ్యక్ (మంచి) మార్గములున్నవి. అవియన్నియు జన్మ దుఃఖము, దానిని నివారించవలెనను ప్రాతిపదికపై నిర్మింపబడినవి. ఉదాహరణ కొక మంచి మార్గమును చూతము. ఒకడొక స్త్రీ యొక్క తెల్లని పలువరుసను జూచెను. చూడగనే అది అందముగ నున్నదని అతని మనస్సులో స్ఫురించెను. వెంటనే అతడా భావముకు ప్రతిగ మరియొక భావము నూహించుకొనవలెను. ఆ పలువరుస నిజమునకు నున్నపు మట్టితో నేర్పడిన క్షుద్ర అస్థి సమూహము. అనతి కాలములోనే అది రంగు మారి వికృతమగును. కాలము గడచిన కొలది అరిగిపోయిశైథిల్యమును పొందును. చివరకది శ్మశానమున తక్కిన యస్థి మాంసకేశాదులతో నగ్ని పాలగును. లేదా మట్టి పాలగును.

శరీరమే కాదు మనస్సు కూడా సర్వదా మలినమగుచునే యుండును. ప్రతిక్షణము నశించుచునే యుండును. ఇది యెప్పుడు జ్ఞప్తి యుందుంచుకొనవలెను.

ఇదే రీతిని ఇంద్రియములకును, మనస్సునకును ప్రియమగు సమస్త విషయములను గూర్చియు భావించవలెను. లేనిచో ఇంద్రియముల ద్వారా విషయ సంపర్కమేర్పడి, విషయానుభూతిని గూర్చి తృష్ణ యేర్పడును. తృష్ణ వలన యెట్టి దుష్పరిణామములు కలుగునో తెలిసినదే గదా!

ప్రతి వస్తువు అనిత్యము, దుఃఖము, అనాత్మము అని మననము చేయవలెను. ఈ మూడు మాటలలోనే బౌద్ధ దర్శనమిమిడి యున్నది. వీనిని సర్వదా జ్ఞప్తియందుంచుకొని ఆర్య అష్టాంగిక మార్గమవలంబించినచో తృష్ణ నశించి సమాధి కలుగును. కోరికలన్నియు ఆరిపోవును. ఆరిపోవుటే నిర్వాణము. దీనిచే దుఃఖ నివృత్తి, జన్మ రాహిత్యము సిద్ధించును. ఈ యారిపోవుటలో మానవునకీజన్మ యందే గాక మరే జన్మయందును నిరాశ తప్ప వేరేమియు మిగలదు.

పోనీ! జన్మ నివృత్తియైన పిమ్మట శాశ్వత సత్త గల ఆత్మయుండును గదా! దానికైన సుఖము కలుగకుండునా? కలుగదు. శాశ్వత సత్త లేదు. అందుచే ఆత్మ లేదు. శరీరము పోయినను ఏదో ఆత్మ యుండునని, అది నిత్యమని, అనంతమని విశ్వసించు సత్కామ దృష్టి బంధ హేతువు. శాశ్వతత లేకున్న సత్కామ దృష్టియెట్లు కలిగెను? అది కూడా సంసార తృష్ణ వలననే కలిగెను. ఆత్మయున్నదనుకొనుట చాల యధర్మము. అంతకన్న పరమ మూర్ఖత మరియొకటి లేదు. సర్వము అనిత్యము, దుఃఖము, అనాత్మము.

బౌద్ధ ధర్మమవలంబించిన మానవులకు ఫలితార్థమున ఇహ పర సుఖములు రెండును ఊడును. అతడు రెంటికి చెడిన రేవడగును.

పోనీ! ఆర్య అష్టాంగిక మార్గమందరకు అచరణ సాధ్యమా? కాదు. కోటికొకరికైన సాధ్యము కాదేమో! మరి వారేమి చేయవలెను? బుద్ధిమంతులై సర్వం దుఃఖమ్, సర్వం క్షణికం, సర్వం అనాత్మమ్ అని స్మరించుచు, పంచశీలములనభ్యసించవలెను. అపుడు వారికి నిర్వాణమబ్బదుగాని స్వర్గము కలుగును. ఏమేమీ! స్వర్గ సుఖమా! సుఖమంతయు దుఃఖముగా పరిణమించును గదా! స్వర్గానంతరము భూమిపైగాని మరొక చోటగాని తిరిగి జన్మ తప్పదు గదా! మరల ఫలితార్థమున బౌద్ధ సంసారికెటు చూచినను నిరాశ మాత్రమే మిగులును.

ఈ నిరాశోపహతుడు తనకుపకరించుటకొక ఈశ్వరునైన భావించరాదు. లేనిదాని నున్నదనుట మూర్ఖ విశ్వాసము.

బౌద్ధము మానవుల ఆశల మొదలార్పుటతో నంతము గాదు. వారి మనస్సులో యొక సందేహమును మిగుల్చును. ఆత్మ లేదు. మరి కర్మ ఫలములచే దుఃఖించున దెవరు? వాని బలముచే పునర్జన్మలలో సంసరించున దెవరు? అతడు స్కంధ సంఘాతముచే కలిగిన ఎరుకయే (ప్రజ్ఞప్తి మాత్ర జీవుడు) స్కంధ వ్యతిరిక్తుడగు సత్ పదార్థ జీవుడు లేడు. స్కంధములు కలసినపుడు నేను అను భావముండును స్కంధము విడిపోయినపుడదియును పోవును. వ్యవహారమునను్నాడు. పరమార్థమునలేడు అద్వైతులకు గూడ ఇట్టి గోడచాటువాడు అధఃపాతగాడునగు జీవుడున్నాడు - లేడు.

<u>జైనము</u>

ఇక కళభ్రు యుగమున విస్తరిల్లిన జైనము తమిళ ప్రవృత్తికేమయిన ఉపక రించెనేమో చూతము.

జైనము కూడా జీవితము దుఃఖమయమనియే యారంభించెను. దుఃఖ నివృత్తికి జన్మ నివృత్తియే మార్గమనును. కాని ఈ దుఃఖ మనుభవించు జీవులు కలరనును. జీవులున్నారు గాని ఈశ్వరుడు లేడు. జీవుడున్నాడనుటలో నిది బౌద్ధముతో భేదించును. ఈశ్వరుడు లేడనుటలో నేకీభవించును.

జీవుల సంఖ్యాకులు. వానిలో ఉత్తమ మధ్యమాది వర్గము కలవు. అవి ధరించు శరీరపరిమాణమును బట్టి వాని జ్ఞానేంద్రియ సంఖ్యను బట్టిజీవి ఉత్తమ, మధ్యమ త్వములుండును. ఉదాహరణకు ఏనుగుకు ఏనుగంత, చీమకు చీమంత జీవుడుండును. మరియు వృక్ష జాతి స్పర్శేంద్రియ మొక్కటే. చీమలో స్పర్శ, రస, గంధములు మూడు మానవునిలో స్పర్శ, రస, గంధ, దృష్టి, శబ్ద, మనస్సు ఇంద్రియములు కలవు. ఈ సిద్ధాంతము జైనులకు ప్రత్యేకము. ఇతర దర్శనములందు జీవి అణువు లేదా సర్వవ్యాపి. అతని పరిమాణము మారదు. కర్మను గూర్చి కూడా జైనులకొక ప్రత్యేక సిద్ధాంతము కలదు.

జీవుని గూర్చియు దుఃఖమును గూర్చియు జైనుల భావన చిత్రముగ నుండును. ఆ భావనతో పాటు ప్రపంచమును గూర్చిన వారి భావము కూడా విశిష్టముగనే యుండును.

ప్రపంచమున జీవ, అజీవ పదార్థములు రెండున్నవి. వాని లక్షణములు భిన్నములు.

జీవి ఆత్మ స్వభావత: ప్రతి జీవియు అనంత జ్ఞానదర్శన, సుఖ, సామర్థ్యములను గుణ చతుష్టయ సంపద కలిగి యుండును. జీవి స్వయముగ నున్నపుడు అజీవము సంబంధము లేక కేవలుడుగ నుండును. జీవుల సంఖ్యాకులు, ప్రపంచమంతయు ఈ జీవుల గుంపులతో (నిగోధములతో) పిక్కటిల్లుచున్నవి. ఈ నిగోధముల సంఖ్యాకములు.

అజీవ పదార్థమనగా భౌతిక పదార్థము. దీనికి స్పర్శ రస, గంధ, వర్ణములు మాత్రముండును. దీనినే జైనులు 'పుద్గల'మందురు. ఈ పుద్గలము రెండు విధములు. ఒకటి అణుపుద్గలము, ఇది అత్యంత సూక్ష్మము, నిరవయువము, అవిభాజ్యము. అవి భాజ్యమే గాని పరస్పర సంయోగముచే సంఘాతముగ నేర్పడగలదు, శరీరాదులన్నియు ఇట్టి సంఘాతములే

జీవ(ఆత్మ) పదార్థమగు జీవికిని, భౌతిక పుద్గల పదార్థమగు శరీరమునకు సంబంధమెట్లేర్పడెను? కర్మవలన, కర్మయనగాక్రియగాని, ఆచరణగాని కాదు. అదియు పుద్గల పదార్థమే, జీవి కర్మలకు కర్త, భోక్త. జీవి మనోవాక్కాయ చర్యలచే రాగము కలిగి పుద్గలము నాకర్షించును. అది జీవిలోనికి ప్రవహించి (ఆస్రవము) అతనిపై పేరుకొని, శరీరమై అతని నావరించును. శరీరావరణచే అనంత జ్ఞానాదులు సంకుచితములగును. ఉదాహరణకు శరీరగత నయనేంద్రియము జీవి అనంత దృష్టిపై ఒక పొరగ క్రమ్ముకొని అనంత దృష్టిని సంకుచిత పరచును.

శరీరావరణచే జీవి అనంత జ్ఞానాదులు కప్పవడి క్రోధ, గర్వ, వంచన, లోభాది వాసనలు కలుగును. జీవులు వీనిలో మునిగి, విషయాసక్తులగుదురు. దీనిచే వారు అజీవ పదార్థముతో బద్ధులయి కర్మపుద్గలముచే శరీరమును పొంది, జన్మ పునర్జన్మ వలయమున సంసరించుదురు. ఇదియే వారి దుఃఖమునకు కారణము. జీవులను ఆ జీవ పదార్థము నందిరుకుకొనజేయును. కర్మ, స్రావము - దానిచే కలుగు జన్మ పునర్జన్మలన్నియు జీవికి కేవలానందమునకు బదులు దుఃఖమునే ఇచ్చును. ఈ పుద్గలా

వరణమును భేదించినచో అతనికి తన సహజ కేవల అనంత గుణ చతుష్టయము పున: ప్రాప్తమగును. ఇదియే జైనుల మోక్షము.

పుద్గలావరణము నెట్లు భేదించవలెను? బౌద్ధులిచట తృష్ణను నివర్తించుట మార్గముగా జెప్పిరి. జైన భాష మరియొక విధముగ నుండును. వారు జీవిలోనికి కర్మ పుద్గలము ప్రవించకున్న జన్మ లాగిపోవునందురు. శరీరధారియగు జీవి యేదో యొక చర్య చేయకుండదు గద, దాని వలన జీవిలోనికి కర్మ-పుద్గలము ప్రవించకుండనుండదు గద! దానినాపుటెట్లు?

దీనికి జైనులు రెండు పరిష్కార మార్గములు చెప్పిరి. సంవరముచే నూతన పుద్గల స్రావము నాపవచ్చును. నిర్జరముచే పూర్వ జన్మ సంచిత పుద్గలమును క్షయింపజేయవచ్చును.

మనో, వాక్కాయముల గుప్తిని (సంయమము-రక్షణ) అత్యంత అహింస, ప్రపంచ త్యాగము మొదలగు అయిదు సాధనలను (వీనిని సమితి యందురు) అభ్యసించుటచే నూతన పుద్గల స్రావ మరికట్టబడును. దీనిని సంవరమందురు.

నిర్జరమనగా అనశనవ్రతములచేతను, ఎండ, గాలి, శీతల తాకును వగ్న శరీరముతో నోర్చి సంచిత పుద్గలమును క్షయింజేయుట మరియు ఒడలి నుండి వెంట్రుకలు పీకికొనుట వంటి మరికొన్ని కఠిన వ్రతములు కూడా నిర్జరము నందుండును. వెంట్రుకలనే గాక ప్రాణము నూడబెరుకు ఆమరణాంత నిరశన దీక్షయునిందులోనిదే.

గత పుద్గలుడగు జీవి తిరిగి కేవలుడగును. వానికి మరొకనితో పొత్తు లేదు. జీవితమున గూడ అతడే కాకియే. జనన మరణ దుఃఖముల నుండి రక్షించుటకతని కెవ్వరును లేరు. ఎవరిని శరణు వేడినను లాభము లేదు. ఈశ్వరుడు లేడని వీరు మొదటనే నిశ్చయించిరి గద!

బౌద్ధుల వలే జైనులు గూడ మోక్ష సాధకులకొక సమ్యక్ మార్గము చూపిరి. దీనిని వారు త్రిరత్నములందురు. వీనిని నియతులు మాత్రమే పాలించగలరు. అందుచే

బౌద్ధులవలెనే - జైనులు గృహస్థులకు అహింసా అపరిగ్రహాది విధుల జ్ఞాన, సమ్యక్ దర్శన, సమ్యక్ చరిత్రలు వీని నియతులు మాత్రమే పాలించగలరు. అందుచే బౌద్ధుల వలెనే జైనులు గృహస్థులకు అహింసా అపరిగ్రహాది విధులు నుపదేశించిరి. వానినభ్యసించుచు భోగము అనిత్యత, అశుచిత్వమును గుర్తించి వారు మానసికైకాగ్రతను వృద్ధి చేసికొనవలెను. కాని వారికీ జన్మమున మోక్షము లభించదు. వారికే గాదు ప్రపంచమునను అసంఖ్యాక జీవనిగోధములకు (గుంపులకు) ఇంత లంతలలో మోక్షము లేదు. అనాది నుండి నేటి వరకు రెండు నిగోధములు మాత్రమే ముక్తములైనవి. జీవులందరు ముక్తులై సంసారము శూన్యమగునను ప్రమాదము లేదు. బౌద్ధ దర్శనము వలెనే, జైనము కూడా మానవునొక దుఃఖ చక్రమునకంట గట్టెను. దాని నుండి వాడొక మాత్రమున విడివడ లేడు. ఒకడు విడిపింపను లేడు. ఇక మానవుని కేమి యాశ మిగులును? జీవితమా నిస్సారమాయె, మోక్ష మార్గమా శక్తికి మించె-ఇక ఒక్కటి విశేషముగ లభించెను. బౌద్ధ, జైన భిక్షువులను పోషించుచు, వారికి గుహ, చైత్య, ఆ రామాది సౌకర్యముల గూర్పు భారము వారినెత్తిపై కొత్తగా కుదురు కొనెను.

ఇది యటుండ, జైనుల అత్యంత అహింస వెర్రితలలు వేసెను. ప్రతి వృత్తిలోను జీవ హింస యున్నది. వ్యవసాయమున మరింత, దానిచే ఎన్నో పురుగులు నశించును. నూటికి తొంబది పాళ్ళుగ నున్న వ్యవసాయికులకిది నచ్చునా? రాగాపోగా వర్తకమొక్కటే అహింస కనుకూలమగును. కనుకనే, జైన, బౌద్ధులనానాడు పోషించిన వారు కొత్తగా భాగ్యశాలులైనవణిక్కులు. అది కొత్తగా పరిశ్రమలు, వాణిజ్యము పెరిగిన కాలము వాణిజ్యమునకు దేశమున శాంతి కావలెను. అహింసా ప్రబోధముచే అది సిద్ధించును. నేటికిని జైనులలో ముఖ్యులు వ్యాపారస్తులగుట గమనీయము.

## తమిళ సంస్కృతి – జైన బౌద్ధములు

జైన బౌద్ధములు తమిళనాడున ప్రవేశించక పూర్వమే (క్రీఃపూః 300) తమిళ సంస్కృతికొక విశిష్ట రూపమేర్పడెను. అది ప్రవృత్తి పరము. చీకు చింతలకు దాని యందు స్థానము లేదు. జీవితానందము నది నిషేధించలేదు. లోకము దానికి దుఃఖమయము కాదు. సంగీత, సాహిత్య, నాట్య, ప్రేమార్చనలు దాని వరవరమున

జీవించెను. తమిళులు తమ ఐహిక జీవనమందలి కష్టము నాదుకొని రక్షించు దైవ మందధిక విశ్వాసము గలవారు. అది నేటికిని వారి పల్లె పట్టణములందెచట జూచినను కొట్టవచ్చినట్లు కనుపించును. మనకు వీధి వీధినీ, మలుపు మలుపున ఆలయ ము లెదురగును. వీనిలో తమిళనాటనే అనాదిగ వెలసిన శక్తులను మురుగన్‌కు, కొన్ని సంస్కృత సంస్కృతి నుండి దగిన శివ కేశవాది అనేక దైవములకు కొన్ని కొన్ని అతి చిన్నవి, కొన్ని మధ్య తరగతివి, కొన్ని పెద్దవి అన్నీ ఎన్నో ఆలయములే. వాని ముందు పూజా సమయములలో గాక ఏ వేళ జూచినను త్రోవన వచ్చి పోవువారు కనవత్తురు. వారొక క్షణము నిలిచి, రెండు చెంపలు వాయించుకొని, రెండు చెవులు పట్టుకొని తలలు వంచి, గుంజీలు తీసి సాష్టాంగ పడుదురు. కాసిని పూలో కాసిని నైవెల్ అర్పించక మానరు.ముంగిలిలోని విభూతినో, కుంకుమనో నొసట ధరించుట మరువరు. ఆ దేవత పేరేమియని మనమడిగినచో, ఒకప్పుడు వారు సమాధాన మీయలేకపోవుటయు కలదు. ఈ భక్తులు పామరులగు పాటక జనమే కాదు, ఆఫీసులలోనుద్యోగస్థులు నుందురు. చిన్న పెద్దలు ఉందురు.

ఇట్టి తమిళులలో జైన బౌద్ధుల సర్వ దుఃఖవాద నిరాశా సందేశము, క్లేశ కర సాధనలు ఎట్లిమడగలవు? బౌద్ధుల అష్టాంగిక, పంచశీలము నందును. జైనుల, సంవర, నిర్జర, త్రిరత్న నిరశన దీక్షలందును తమిళుల సంగీతము, నాట్యము, ప్రేమ, కవిత, శైవ భక్తి, ఎట్లిముడును?

తమిళ ప్రాణములకీ జైన బౌద్ధములు రుచించకున్నను వానికి కళభ్ర ప్రభుత్వపు టండదండలుండుటచే మూడు వందలేండ్లపైకి పొక్కకుండ అజ్ఞాత జీవనము నెరపవలసి వచ్చెను. మంచి రోజులకై వారెదురు చూచుచుండిరి. కళభ్ర పతనానంతర మొక్కసారిగ పెల్లుబికిన భక్తి యుద్యమము వారు కోరిన క్రొత్త సువార్త నందించెను.

<u>భక్తి - సువార్త</u>

ఈ కొత్త సువార్తకు ప్రచారకులు ఆళ్వారులు. నాయన్మారులు. వీరు తమిళ సంస్కృతికిని విశ్వాసమునకును అనుకూలమగు భక్తి సందేశమును తెచ్చిరి. వీరి ప్రచార పద్ధతులు కూడ ప్రజల యభిరుచికి సన్నిహితముగ నుండెను.

వీరి ప్రచారమునకు దేవాలయములు శాశ్వత కేంద్రములు ప్రజా బోధమునకు సంగీత, సాహిత్యములు సాధనములు. ఆత్మోజ్జీవనమునకు భక్తి సందేశముపకరణము, ఇవి సంగం కాలము నుండి తమిళులకు సుపరిచయమైనవే.

దేవాలయములు :-

దేవాలయములను కేంద్రములుగ జేసికొనుటలో రెండు విశేషములున్నవి.

(1)మొదటి విశేషము :- ప్రజలందరొక చోట కూడుటకిది శాశ్వతముగ నుపయోగించును. వాని యందు సంవత్సరము పొడవున జరుగు నిత్యారాధనలందును. పర్వ దినములందు జరుగు విశేష ఉత్సవములందును ప్రజలిందుకూడి తమ విశ్వాసములను దృఢ పరచుకొందురు. ఇచట జరుగుపురాణకాలక్షేపాదులలో వారి స్మృతి దృఢమగును. ఆలయ పరిపాలన, సేవలయందు పాల్గొనుటచే వారి నిత్య జీవనమున దేవాలయమొక భాగమయ్యెను. ఇది యొక విశేషము.

(2) రెండవ విశేషము:- ఆలయ మందలి విగ్రహములు. ఆళ్వారు మతమున నివి కేవలము శిలలుగావు. ధ్యానమునిలుపు ప్రతీకగాదు ప్రజలెల్లకాలము సులువుగ దర్శించి, అర్చించుటకు భగవంతుడు దాల్చిన సజీవ అర్చావతారములు. భగవంతుడొక అతీత పర తత్త్వమేకాదు, దుర్లభ వ్యూహమే కాదు, రహస్య అంతర్యామియే కాదు. తాత్కాలిక విభవావతారమే కాదు, యజ్ఞయాగాది క్రతువులందు వలి కొందరికే ఆరాధ్యుడు కాదు, అందరకందుబాటులో నుండి అందరు సులభముగ సేవించవదగు అర్చావతారము కూడ. అర్చావతారములుండునది ఆలయములు కావు. సన్నిధులు, భగవంతుని సన్నిధులు, నరసింహ, వామన, రామ కృష్ణు లెక్కడికిని పోలేదు. ఇది గో మనయూరనే, మన యెదుటనే, ఈ కోవెలలోనే వెలసియున్నారు. వీరి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ఆర్తత్రాణ పరాయణత నేటికిని సాగుచునే యున్నది. వానిని తలచి, స్తుతించిన పరవశులమై, నిర్భయులమై ఆనందమనుభవింతము, ఆశతో జీవింతము, అనురాగముతో వర్ధిల్లుదము. ఇది ఆళ్వారులు తెచ్చిన సందేశము, ఆ భక్త శిఖామణులందించిన సువార్త. ఈ సువార్తకు తర తరముల వరకు దేవాలయములు సుస్థిర స్థావరములు. అందు అర్చావతార మా సువార్తకు సంరక్షకుడు.

## (2) (భక్తి) సంగీత, సాహిత్యములు

### మతము-గానము-ప్రేమ

తమ ప్రచారమునకు గానమెంతయో తోడ్పడును. అది ఆ పాతమధురముగ నుండుటచే విన్నవారి నిట్టె యాకట్టును. ఇది బహు పురాతన కాలము నుండి మానవుడు గుర్తించిన సత్యమే! ఛందో బద్ధమగు ఋగ్వేద మంతయు పాటలే! దానితో తృప్తి పడక పూర్వులు దానిని గానము చేయు ప్రత్యేక పద్ధతినొక దానిని కల్పించి సామ వేదముగ రూపొందించిరి. వాల్మీకి తన రామాయణమును కుశలవులచేత రామ యజ్ఞమున పాడించెను. ప్రాచీన ఈజిప్టు దేవాలయములలో గానము, వాద్యములు, తాళములు ప్రచారమున నుండెను. యూదులు, గూడ పాటల పద్ధతిని (*Psalms*) విస్తారముగ నవలంబించు పాత బైబిలులోని చాలా భాగమీ పాటలే. యూదుల ప్రవక్తయగు డేవిడ్ (King Solomon) గొప్ప భగవద్ గాయకుడు. క్రొత్త బైబిలు అనుయాయులు గూడ గాన పద్ధతిని విశేషముగ. అనుసరింతురు. ఖురాన్ షరీఫ్ ఆకర్షణ దాని విశిష్ట గేయ ధ్వనిలో నున్నదందురు.

సంగీతము, కవిత, భక్తి, హృదయ సంబంధులు. తమిళులకు, సంగ కాలము నుండి సంగీత, కవిత్వ, ప్రేమార్చనలపై ప్రీతి యధికము. ఎందరు కళభ్రులు, జైనులు, బౌద్ధులు, కాదన్నను తమిళులకు 'అహమ్' అన్ను వలపు పాటలపై తీపి పోలేదు. ఆళ్వారులు, నాయన్మారులు తమిళుల అన్నును భగవత్ప్రేమగామార్చి-భక్తి తన్మయతకు సంగీత సాహిత్యములను జోడించిరి. వారి గేయములు రాగ తాళయుక్తములు. వారు తమిళమున మహాకవులు, వారి శైలి ప్రసన్న మధురము. అందుచే వారిపాటలు తమిళ హృదయమున సులువుగ ప్రవేశించెను. వారి జిహ్వల పై నర్తించెను. నేటికిని వారి నోట నలుగుచునే యున్నవి.

ఆళ్వారుల వైష్ణవ భక్తి గేయములను పాశురములని, దివ్య ప్రబంధములని యందురు. ఇవి క్రీ॥శ॥ 6-9 శతాబ్దములలో రచింపబడెను. 10వ శతాబ్దమునకు వీని ప్రాచుర్యము తగ్గుచుండెను. ఇది గమనించి రంగనాథముని (823-924) సంప్రదాయ

మును రక్షించుటకై వానిని సేకరించి వానికి క్రొత్తగ రాగ తాళములను నిర్ణయించి శ్రీరంగాది దేవాలయములందు సంస్కృత వేదముతో పాటు నిత్యార్చన యందధ్యయనము చేయుటకు నియమించెను. ఆయన సంకలనమున షుమారు నాలుగు వేల పాశురములుండుటచే అవి నాలాయిరమని (నాలుగు వేలు) ప్రసిద్ధి పొందెను.

నాయన్మారుల శైవ భక్తి గేయములు గూడ 10వ శతాబ్దముననే కంబి ఆండార్ నంబి సంకలన పరచెను. శైవ వైష్ణవ భక్తి యుద్యమములిట్లు పోటా పోటీగ నడచుచుండెను.

<u>భక్తి - ఆవేశము</u>

కేవలము కవితా, సంగీతములే గాక, ఈ గేయములలోని తన్మయత, ఆవేశము ప్రజలను మరింత కూడగట్టెను. ఈ ఆవేశము ఆత్మోత్తేజము కలిగించెను. దుఃఖ నిరాసనము చేసెను. ఆశాజ్యోతిని వెలిగించెను. భగవదానందమును పంచెను. జైన బౌద్ధముల దుఃఖ నిర్వాణముల పొడి వాక్కులతో శుష్కించిన ప్రజల భావములందిని రస రాగ రసోదయమును కలిగించెను.

మరియు భక్తి యుద్యమము సనాతనులగు అగ్ర వర్ణముల వారిచే నారంభింప బడలేదు. ఉదాహరణకు పన్నిద్దరాళ్వారులలో మొదటి మూవురు ఏదో ఒక కులమున బుట్టిన వారు. తిరుమళిశై తల్లి వేశ్య. తిరుమంగైదిలళ్వార్ (దొంగల)కులము, తిరుపాలన్ హరిజనుడు, నమ్మాళ్వార్ వెళ్ళాళరుడు (కర్షక) ఆండాళ్ అయోనిజ బాలిక, పెరియాళ్వారు తొణ్డర్ అడిప్-పొడి (విప్ర నారాయణుడు) మధుర కవి బ్రాహ్మణులు, కుల శేఖరుడు క్షత్రియుడు. ఇట్లే నాయనమారులందు గూడ బ్రాహ్మణేతరులే ఎక్కువ మంది కనిపింతురు. దీనికొక కారణములేకపోలేదు. ఎంత చెడినను బ్రాహ్మణులు సంస్కృతము, వేదము, మడి ఆచారములను త్వరగా వదలరు. ఆళ్వారు, నాయనమారులవలె దేశ దిమ్మరులై పామర జనముతో తిరుగలేరు. అదియు గాక భక్తి ఉద్యమము అప్పటికి కాలు నిలదొక్కుకొన లేదు. అది చిరస్థాయికి చేరుకున్న పిదప అగ్రవర్ణముల వారందు చేరిరి. దానిని సంస్కృత ఉపనిషదులతో అన్వయించిరి. భక్తి-వర్ణ

విభేదము నుల్లంఘించును. లేదా అంతగా పాటించదు. అందుచే నిది భగవద్గీత కాలము నుండి సనాతనుల ఆమోదముద్ర పడలేదు. కర్నాటకమందలి బసవన వీర శైవమున ఏమాత్రము కుల విభేదము పాటింపబడ లేదు. వేదములకు స్థానమే లేదు. ఇంత శైవ భక్తి బ్రాహ్మణ పండితుల నాకర్షించినను భక్తిపై మక్కువ, బ్రాహ్మణముపై వలపు, వారికి పోలేదు. అందుచేతనే ఆరాధ్య బ్రాహ్మణులను పేర వారొక క్రొత్త శాఖగేర్పడిరి.

## ప్రచారకుల పూర్వరంగము సార్వజనీన ప్రచారము

## సమస్త వర్గములు - సమస్త ప్రాంతములు - దేశ భాష

మరియు ఆళ్వారులు, నాయనమారులు, బ్రాహ్మణ హరిజనాది సర్వ వర్గములనుండి వచ్చిరి. వీరిలో స్త్రీలుండిరి. వీరు పూర్వము, చేర, చోళ, పాండ్యమండలములతో నేర్పడిన సమస్త తమిళ ప్రాంతముల నుండి వచ్చిరి. అది నేటి కంజీవరము నుండి మధురైకి, అట నుండి కేరళ వరకు విస్తరించి యుండెను.

మరియు ఆళ్వారులు, నాయన్మారులు వాడినది దేశి భాష, దేవ భాష కాదు. ఈ సూత్రములను వారు జైన బౌద్ధముల నుండి గ్రహించి యుందురు. అన్ని వర్గముల వారు, అన్ని ప్రాంతముల వారు, అందరకు తెలియు భాషలో అందరకు సహజమగు ఆవేశముతో ప్రచారము చేసినందున వీరి భక్తి సందేశమును ప్రజలు నిశ్శంకముగ స్వీకరించిరి.

**ఉద్యమ పురోగతి :-**

వీరి ప్రచారమున మరికొన్ని విశేషములు కలవు. ఆళ్వారులు, నాయన్మారులు ఒకే చోట స్థావరముగ నిలువక, తమిళ దేశమంత కలియ దిరిగిరి. ఉన్న దైవసన్నిధుల నన్నిటిని దర్శించిరి. మార్గమధ్యముననను, దైవ సన్నిధులందును, వారు తన్మయులై సద్యోరచిత గీతములను శ్రావ్యముగ పాడిరి. వారి వెంట ప్రజలు తండోపతండములుగ తీర్థ యాత్రకు బయలుదేరిరి. ఆడుచు పాడుచునే మూతపడినదేవళములను తెరపించిరి. ఆట పాటలతోనే జైన బౌద్ధములకుద్వాసన చెప్పిరి.

ఉద్యమ ప్రభావము :-

ప్రజలలో ధన వంతులు పాటుపడి, దేవళముల నుద్ధరించిరి. క్రొత్త వానిని గట్టించిరి. ఈ నిర్మాణముల వలన శిల్పులకు, కార్మికులకు, జీవనాధారములు దొరికెను. ప్రభువులు, సంపన్నులు, ఆలయములకు పంట భూములను దానము చేసిరి. వీని వలన పూజారులకు, స్వస్తి వాచకులకు, గాయకులకు, వాద్యకారులకు, నాట్యకారులకు శాశ్వత జీవికలు లభించెను. 6-9 శతాబ్దులలోని భక్తి ఉద్యమ ప్రభావము తమిళ జాతిపై చెరగని ముద్ర వేసెను. బృహదీశ్వరాలయము వంటి మహా నిర్మాణములకు, నటరాజ వంటి లోకోత్తర కాంస్య శిల్పములకు త్రోవదీసెను. తమిళ నాట నేడు ప్రతికుగ్రామములలోను మహా నగరములలోను ఎచట జూచిన నెదురగు ఆలయములా యుద్యమ ఫలితములే! నేటి తమిళ ప్రభుత్వ లాంఛనము దేవాలయ గోపురమగుట గమనార్హము. ఈ వాస్తు శిల్పచిత్ర లేఖన కళలు సముద్రములను దాటి థాయిలాండులోని అంకోర్ వాట్ వంటి లోకోత్తర నిర్మాణములను సృష్టించెను.

ఉద్యమ వ్యాప్తి - రెండు ముఖ్య కారణములు

సంగ్రహముగ చెప్పవలెనన్న భక్తి వ్యాప్తికి రెండు ముఖ్య కారణములు గను పించును.

**మొదటిది:-** సంగం యుగము నుండి తమిళ సంస్కృతికి లక్షణమగు పాట, ఆట, అన్బు (ప్రేమ), తిరిగి వారికి భక్తి ఉద్యమ రూపమున సాక్షాత్కరించెను.

**రెండవది:-** కళభ్రుల నిరంకుశ పాలనలో నలిగిన ప్రజలకు యుగయుగము లందు దుష్ట శిక్షణ, సాధురక్షణచేయు ప్రేమ మయుడగు భగవంతుడున్నాడను అభయ మును భక్తి సందేశమిచ్చెను. కళభ్రుల పతనము వారి కళ్ల యెదుట జరిగినదే కదా!

శ్రీవైష్ణవ ప్రథమ రూపము

శ్రీవైష్ణవమున ఆళ్వారు, ఆచార్య సంప్రదాయములు రెండు విభాగములున్న వనియు అవి ఆయా కాల పరిస్థితులను బట్టి యేర్పడినవనియు అనుకొంటిమి.

దాని ప్రథమ స్వరూపము ఆళ్వారుల సంప్రదాయము తమిళ భాష నాశ్రయించి నది. దాని ముఖ్య ప్రవర్తకులు బ్రాహ్మణేతరులు, వారు ప్రవచించినది వేదోపనిషత్తులను కాదు. భాగవతుల పాంచరాత్రాదులలోని భక్తిని. వారుదహరించినది వేద సూక్త ములనుగాదు. పౌరాణిక గాథలను. వారి దేవతలు సూర్యేంద్రాదుల వంటి ఆకాశ, అంతరిక్ష, భూతలములందలి అశరీర మహిమలు కావు. రామకృష్ణాది అవతారములు! తమిళ శ్రీ వైష్ణవము ప్రథమ దశలో మరియొక రూపము దాల్చక, యీ రూపమునే దాల్చుటకు అది యెదురు కొన్న సమస్యలే ముఖ్య కారణము.

ఆళ్వారుల కాలమునకు జైన బౌద్ధ పక్షపాతులైన విదేశీయ ప్రభుత్వము పతనమైనది. ప్రజా బాహుళ్యమును జైన బౌద్ధముల నుండి వెను వెంటనే వేద-పురాణ మతమునకు రాబట్టుకొనుటయే అప్పటి తీవ్ర సమస్య. ఆ పనికి విద్వత్ చర్యలుపయోగించవు. తత్త్వ చింతన, దర్శన నిర్మాణము, దీర్ఘ కాలమున గాని రూపొందవు. మరియు ప్రజలకవి సుబోధములు కావు. వారి హృదయముల నాకర్షించుటకొక ఆశ, ఆవేశము, పాట కావలెను. అందుచే ఆళ్వారుల సందేశము, పాశురగాన రూపము ధరించెను. ఈ సందేశమగ్ర వర్ణముల వారి నుండి వచ్చినచో, దాని ప్రభావము పరిమితముగ నుండెడిది కాని సమస్త వర్ణస్థులు, సమస్త ప్రాంతీయులునగు ఆళ్వారులచే నిది ప్రవర్తితమగుటచే ప్రజా బాహుళ్యమున కిది త్వరగా అందెను. అందుచే శ్రీ వైష్ణవ ప్రథమ స్వరూపము హృదయ సంబంధి ఆయెను.

ఆళ్వారులు తమ భగవంతుని తమిళ ప్రజానీక మధ్యమునకు తమిళ గేహ సీమలకు తెచ్చి చూపవలెను. అతని నత్యంతసులభునిగ జూపవలెను. అతడొక శాస్త కాడు. సులభుడగు ప్రేమ మూర్తి. ఆళ్వారులు ఆ సౌలభ్యమూర్తిననేక విధముల రూపొందించిరి. అందు పెరియాళ్వార్, ఆండాళ్‌ల సృష్టిని చూతము. ఈ వ్యాసము ఆముక్త మాల్యదా ప్రసక్తితోనారంభమయినది. దానిలోని యాళ్వారులీ యిద్దరే! అందుచే వారి దృష్టాంతమును మాత్రమే గమనింతము. ఈ గమనికలో వారి పాత్ర చిత్రణ ఆముక్తమున లేని విశేషాంశములను మన దృష్టికి తెచ్చును.

## ఆళ్వారుల భగవంతుడు అతి సులభుడు

వేద దేవతలు అంచగొండులు. ఉపనిషత్తుల బ్రహ్మమునకు మానవత లేదు. ఆళ్వారుల తిరుమాల్ తమిళుల ఇంటి పసిబిడ్డ, వారి ప్రియనాయకుడు, భగవంతునిట్లు మచ్చిక చేసి తమిళుల కందించినది ఆళ్వారులే!

భగవంతుని బిడ్డగా భావించిన వారిలో ముఖ్యుడు పెరియాళ్వారు. తానొక యశోదగా, కృష్ణుడొక పసికందుగా, శిశువుగా, బాలునిగా భావించిన మహాత్ముడీతడు. ఇతని వంశము వారేడు తరముల నుండి అనన్యాపేక్షతో విల్లిబుత్తూరి దేవాలయము లోని విష్ణువును వటపత్రశాయి యగు శిశువుగా ఆరాధించిరి. పాండ్య రాజ సభలో వైష్ణవమును గెలిపించినపుడు తనకు కనిపించిన విష్ణునొక బాలుని దీవించినట్లు దీవించెను. తులసి వనమున దొరకిన అజ్ఞాత జన్మయగు శిశువు నందు పితృ వాత్సల్యము నెరపి ఆండాళ్‌గా పెంచినదీ మహనీయుడే.

కులశేఖరాళ్వారు కూడా రామునట్లే భావించి, రామ వియోగార్తుడగు దశరథ భావము ననుభవించెను.

కృష్ణుని నాయకునిగా తాము నాయికలుగా భావించినవారిలో ఆండాళ్ కన్య. తిరుమంగై, నమ్మాళ్వారులు ముఖ్యులు. తిరుమంగై నమ్మాళ్వారులు నాయికా భావము తెచ్చి పెట్టుకున్నది. ఆండాళ్ కన్యకు సహజము. తిరుమంగై విదగ్ధ్యాని. నమ్మాళ్వారు రసాంభోనిధి. ఆండాళ్ కన్య పదునారేండ్లయిన చెల్లని ముగ్ధ బాలిక. అయినను నాయికా భావనలో ఆమె రచనలే రసవంతమని సంప్రదాయజ్ఞుల అభిప్రాయము.

ఆముక్తమున ప్రసక్తులయిన యీ తండ్రి బిడ్డలు తమ తమిళ రచనలలో భగవంతునెట్లు సులభుని చేసిరో చూతము. దీనిచే ఆముక్తమున లేని విషయములు కొన్ని తెలియును, వారి పాత్రలకొక సమగ్రత సమకూరును.

## విష్ణుచిత్తుడు - పెరియాళ్వారు

ఈయన అసలు పేరేమో తెలియదు. వైష్ణవ సంప్రదాయమున నీయన కెనిమిది పేర్లు కలవు. ఇవియన్నియు పెట్టుడు పేర్లుగా తోచును. పై రెండును అందలివే! వీని భావన, భాష - శ్రీవైష్ణవమున సంస్కృత, ద్రవిడ సంప్రదాయములను ప్రతిబింబించు చున్నవి. విష్ణు చిత్తుడనగా, చిత్తమున విష్ణువు కలవాడని, పెరియాళ్వారనగా, (భగవంతునాశీర్వదించుటచే) పెద్ద యాళ్వారని భావార్థము.

<u>విష్ణుచిత్తుడు:-</u> ఈయనెడ తెగని యోగమనుగొలుసుతో మధువైరి (విష్ణువు) యను ఏనుగును కట్టివేసినవాడగుటచే విష్ణు చిత్తుడను అన్వర్థాభిధానము కలిగినవాడని ఆముక్తమున నున్నది. "అశ్రాంత యోగాందూబద్ధమధు ద్విషద్విరదుడన్వర్థాభిధానుండు... విష్ణున్ విష్ణు చిత్తుండనన్"

మదపుటేనుగులను గొలుసులచే గట్టించు రాయల రాజసమునకీ యుపమానము తగి యుండును. కాని, పరమ వాత్సల్యయోగియగు విష్ణు చిత్తునకు భగవంతుడు సులభుడు. ఆ యనుభవము స్వయముగ నెట్లు చెప్పికొనెనో చూతము.

"ఓ చక్రపాణి" మహోదారుడా! అనంతగరుడు లందరి ప్రేమనల్పముగ జేసి క్షీరార్ణవ, సూర్య మండల, శ్రీ వైకుంఠములను విడచి, నిరాధారునివలె, నన్నే నీకు దగిన తావుగ నెంచుకొంటివే! నా హృదయమున నిలిచి నన్నుజ్జీవింప జేసితివే! ఏమి నీసౌలభ్యము ఏమినీవాత్సల్యము! నీ మహోపకారమును తలచుటచే నా మనసు కరగి, కన్నీరుగారి, నా శ్రమ యంతయు తొలగినది. (పెరియాళ్వారు తిరుమొళి 5-2-910).

ఇంత కన్న విలక్షణమగు భగవద్వాత్సల్యమును గూడ ఆయన చెప్పికొనెను. అది విష్ణుని చిత్తమున తానున్నాడనుట.

<u>పెరియాళ్వారు:-</u> విష్ణుచిత్తుడను పేరు ఆముక్తమాల్యాదుల ద్వారా తెలుగు వారికి సుపరిచితము. కాని తమిళమున పెరియాళ్వారను పేరే ఆయనకు ప్రసిద్ధము. పెరియాళ్వారను పేరు వలన మన కాయన వాత్సల్య భక్తి చక్కగ స్ఫురించును.

భగవంతునొక బిడ్డగాయెంచుట వాత్సల్యభక్తికి లక్షణము. పెరియాళ్వారు పండితుడు కాదు. అయినను భగవత్ప్రేరణచే పాండ్య రాజాస్థానమున విద్వాంసులను ఓడించి, వైష్ణవమును గెలిపించెను. రాజాయనను ఏనుగుపై నూరేగింపించెను. అప్పుడాయనకు విష్ణువాకసమున కనుపించెను. మరియొక భక్తుడైనచో కనుపించినదేవుని స్తుతించును. ఈయన దీవించెను. ఈయనకు విష్ణువు భువనమోహన దివ్య సుందరమూర్తిగా భాసించెను. వెంటనే ఆ పరమ భక్తునకొక చిత్రమగు భయము కలిగెను. ఆ భయ మాయన ప్రేమ వలన కలిగెను. ఇది కలి, భూలోకము. ఇందా మూర్తికేదయిన దృష్టి దోషమో మరియొక అపద్యమో జరుగవచ్చును. ఈ శంకతో ఆయన విష్ణుని కోమల పాదములకు పలుకోటి వేలేండ్లు రక్షలు గావలెనని మంగళాశాశనము చేసెను. దేవునే దీవించిన పెద్ద గనుక ఈయనను పెరియ (పెద్ద) ఆళ్వారనిరి.

ఈ దీవెన నేటికిని 'పల్లాండు' అను పేర ప్రవర్తితమగు చున్నది. ఇది పన్నెండు పాశురములతో కూడిన లఘు కృతి. అయినను ద్రావిడ దివ్య ప్రబంధములన్నిటిలోను అగ్రస్థాన మలంకరించు చున్నది. సంస్కృత వేదోపక్రమమున ఓంకార అనుసంధానము వలె ఇది వైష్ణవ ఆలయములందు, గృహములందు, ద్రవిడ దివ్య ప్రబంధోపక్రమమున నేటికిని అవశ్యము సంకీర్తితమగు చున్నది. దీని యారంభముదా రమధుర ధ్వనులతో శ్రోతల నాకర్షించును.

*పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయి రత్తాణ్డు*
*పలకోడి నూఱాయిరమ్.........*
*పలు యేండ్లు పలుయేండ్లు*
*పలువేలవేలేండ్లు పలుకోటివేలేండ్లు*
*నీ చెంగావి పాదముల చెంగావికగుగాక*
*శుభరక్ష ఓమణి (వీం) వఝదా (చాణూరాది)*
*మల్లులను జయించిన భుజ పరాక్రమ శాలీ.*
*నీ పాదములకు శుభమగు గాక.*

ఈ మనోహర మంగళాశాసనముచే నేటికిని భక్తులకు భగవంతు నాశీర్వదించు భాగ్యము కలిగినది.

ఈయన అనపత్యుడు, ఇది యొక కొరత, భగవంతునే బిడ్డగా భావించి, ఆనందించినగాని, ఆయనకా కొరత తీరదు. లేక, బిడ్డనే యొక భగవంతునిగా తలచిన గాని తీరదో! ఆ బిడ్డ తనకు నిత్య దర్శనమీయవలెను. దీని కొరకాయన ఒక చిత్రమగు సాధన నవలంబించెను. తన స్వగ్రామమగు శ్రీ విల్లిబుత్తూరు కోవెల స్వామినే ఒక బిడ్డగా నెంచెను. లోకములన్నియు ప్రళయ జలధిలో మునిగినను, ఆ బిడ్డ ఒక చిన్న మఱ్ఱి యాకుపై తేలి కరార విందములచే, పదార విందములనందుకొని వానిని ముఖార విందము ననుసరించి ఆడుకొను చుండును. నిజమునకా యూరి స్వామి వటపత్రశాయిగాడు. పసిబిడ్డయు కాదు, ఆడుకొనుచు నుండడు. క్షీరాబ్ధియందు శేష శయ్యపై శాంత యోగ సమాధి నుండువాడు. ఆ విగ్రహమిప్పటికి నట్లే యున్నది.

పాండ్య రాజ సభావాదమయిన పిమ్మట విష్ణు చిత్తునకు పెద్ద తనము దగ్గరించు నాటికొక స్త్రీ శిశువు తులసి వనమున దొరకెను. ఆయనలోని వాత్సల్య భావము పొంగి భగవంతుడే ఆ బిడ్డను తనకిచ్చెనని తలచి, ఆమెను గోముగ పెంచెను. ఆ వనమందలి పుష్పములనే మాలికగా గట్టి వటపత్ర శాయికర్పించుట ఆయన నిత్యకైంకర్య విధానము. అందు చేతనేమో ఆ బిడ్డను 'కోతై' (మాల) యని పిలచు కొనెను. పిదప కొన్నాళ్లకా బాలిక ధరించిన పూమాల భగవంతున కిష్టమని విష్ణు చిత్తుని స్వప్నమున భగవన్ముఖమునవిని 'ఆండాళ్! ఆండాళ్' (నన్ను, మమ్ము ఏలినదానా! అనుచు మేల్కొనెను. అందుచే 'కోతై' 'ఆండాల్ 'అను రెండు పేరులామెకు ప్రసిద్ధ నామములు. 'కోతై'ను తరువాత వారు 'గోదా' అని సంస్కృతీకరించిరి. 'గోదా' అనగా సాంప్రదాయికులు అనేక అర్థములు చెప్పుదురు. కిరణముల నిచ్చునదనియు ఒక అర్థమున్నది.

భగవంతునాశీర్వదించుట, భగవంతుని వటపత్రశాయిగా కొలుచుట, యాదృచ్ఛికముగ దొరికిన అజ్ఞాత జన్మయగు శిశువును భగవద్దత్తముగా నెంచుట- వీని వలన పెరియాళ్వారు వాత్సల్య భక్తి ద్యోతకమగుచున్నది.

తమిళులకు భగవంతుని అత్యంతసులభుని జేయు ప్రయత్నము పన్నిద్దరాళ్వారులందరు చేసినదే కాని ఈ ప్రక్రియలో పెరియాళ్వారుదే అగ్రస్థానము. ఆయన రచించిన 473పాశురములలో రెండు వందలయిరువదింట ఆయన భగవంతునొక సుగుగా, శిశువుగా, బాలునిగా యనుభవించెను. తాను యశోద, అతడు కృష్ణకిశోరుడు. ఈ భావమును ఆయన అత్యంత స్వాభావికముగ, మనోహరముగ పోషించెను. ఇది అముక్తమున కనరాదు.

ఈ వాత్సల్య భావనచేత తమిళ ప్రజానీకమునకును విశేషించి, తమిళ తాయిలకు తమ కన్న బిడ్డల యందే కుట్టికణ్ణన్‌ను నిత్యము చూచు భాగ్యమబ్బెను. బిడ్డపై గలుగు యనురాగము అచ్యుతేని వంటిది. ఇది తమిళుల హృదయములలో నిర్మల వాత్సల్య భక్తిని కుదురు కొనజేసెను.

భగవంతుడొక జగదతీత తత్త్వమే కాదు, వైకుంఠధాముడగు విష్ణువే కాదు. విగ్రహ సమాధిలో మారుపలకని అర్చామూర్తియే గాదు, తల్లుల యొడిలోని సుందర బాలుడు కూడ. ఆయన రాముని వలె రాజుల ఇండ్లనే కాదు, అమాయకులగు గోపగృహము లందును సంచరించును. వారి నానందింపజేసి తానానందించును. గోపమాతల వలె మనకు గూడ బాలకృష్ణానుభవానందము కలుగును.

<u>పెరియాళ్వారుల యశోద</u>

<u>బాలకృష్ణుడు - బాలకృష్ణానుభవము</u>

పెరియాళ్వారుల బాలకృష్ణానుభవమును తెలుపు పాశురములలో వ్రేపల్లెలోని యశోద కొక నిసుగు కలుగును. అతడు తమిళ కణ్ణన్, అతడే తిరుక్కోట్టియూర్ కేశవుడు. (సౌమ్యనారాయణ స్వామి)

అతడు పుట్టిన వార్త విని గొల్లల త్యానందముతో మునెను. గంధపు పొడిని ఒకరిపై నొకరు చల్లుకొనిరి. గలిబిలిగా నటునిటు పరుగులాడిరి. బురదలో జారిపడిరి. ఎక్కడ? యొక్కడ? ఎట్లున్నాడని యడిగిరి. పెద్ద గొంతుతో పాడిరి. తప్పెట్లు, తాళములు

మోయించిరి. తందనాల చిందులు త్రొక్కిరి. గొల్లపల్లె నంతటిని కోలాహలముతో నింపిరి, నందునింటిలోనికి పోయిరి. బయటికి వచ్చిరి. మంచి నక్షత్రము (శ్రవణ)న పుట్టినాడు - జగమేలును అని చెప్పుకొనిరి. పాలు, పెరుగు, నేయి వీధులలో గ్రుమ్మరించిరి. దానము చేసిరి. కావడి, కత్తి, కజ్జలు తాటాకు చాపలు, ఇంకేమేమో తీసికొని గుంపులు, గుంపులుగా తెల్లని పళ్ళికిలించి, ఒడలికి నేయి పూసుకొని ఒకరినొకరు కౌగలించుకొనుచు ఘృతనృత్యము (ఒడలికి నేయిరాసుకొని) చేసిరి.

ఆ బిడ్డకు స్నానమయినది. బిడ్డ మొగమున యశోదకు, తోటి గోపికలకు, సప్తభువనములే గోచరించెను. ఇతడు సామాన్యుడు కాడు, నిజముగా భగవంతు డమ్మా యని వారనుకొనిరి.

తల్లి శిశువును తొట్టిలో నుంచెను. దాని నతడు చినుగ దన్నెను. సఖులందరను పిలిచి "కానేరే ఊర్వందుకాణేరే" "చూడండె ఎట్లున్నాడో వచ్చి చూడండే" యని మరి మరి ప్రత్యంగమును చూపును. తొట్టి నూపుచు "తాలేలో తామరైక్కణ్ణనే తాలేలో ' జో, జో, తామరకన్నుల కణ్ణా జో, జో యని జోలపాడును.

పెరియాళ్వారు యశోద పాటలలో ఎన్నెన్నో తమిళ నాటి తాయిల మనోహరాను భవములున్నవి. అందొకటి తెలుగు తల్లులు, పిల్లలు పాడుకొను చందమామ పాటను జ్ఞప్తికి తెచ్చును. యశోదా కిశోరుడు నుదుట అలకాభరణముతో, కాలి గజ్జెలు ఘల్లు ఘల్లుమనుచు మట్టిలో పొరాడును. తల్లి అతనిని చంద్రునకు చూపి, కన్నులున్న చూడుమనును. శిశువును చంద్రుని దగ్గరకు తెచ్చుటకు తల్లి చంకకెక్కించుకొనును. అతడు చిన్ని చేతులతో మరిమరి జాబిల్లిని చూపును. పిలుచును. ఆ జాబిల్లి రాదు. బాలుని కన్నులపై నిదుర తూగాడును. కాని మాటిమాటికి రెప్పలు విప్పి బుల్లిబుల్లి పలుకులతో జాబిల్లినే పిలుచును. ఆ జాబిల్లి ఇంకను దూరమే పోవును. ఇదంతయు తల్లి జాబిలికి చెప్పి: 'ఓయి జాబిలీ, వీని కోరిక తీరనిదే నిదురపోడు. పాలరగవు- రావాయని బతిమాలును. రాకున్ననిదిగో ఎగిరి పట్టుకొనును - యని బెదరించును. బిడ్డను కొంచెము పైకెత్తును. అతడు జాబిల్లిని పట్టుకొని నట్లే తలచి నిదురపోవును. ఏమి తల్లులు? బిడ్డలకు చందమామ నందించు పరమ వాత్సల్య నిధులు!

ఆళ్వారు-యశోదా శిశువు కొంచె మెదిగెను. వానిచే శోక్తిరై నృత్యము చేయించును. "ఆడుకవాడుకమే" ఆడవోయ్! ఆడ వోయ్" యని బతిమాలును.

'శప్పాణి, శప్పాణి' యనుచు చప్పటులనేర్పును. మరియొక మధుర తర దృశ్యమున యశోదానందు లిద్దరు శిశువుతో వినోదింతురు. బిడ్డను తన యొడికెక్కి చప్పటులు చిందులు చూపమని తల్లి కోరును. తన యొడి దిగి తండ్రి యొడికెక్కి ఆ గొప్ప విద్దెను మరల చూపుమనును. తిరిగి తన యొడినే చేరి చప్పటులు చరచ మనును. చిందులు త్రొక్కుమనును. మరియొకచో బిడ్డ తప్పటడుగులు నేర్పును. తల్లి కొంచెము దూరములో నుండి 'అచ్చో వచ్చో' రా, రా! వచ్చి నన్ను కౌగలించుకో! అనును. బిడ్డకాయాట పాతబడును. అందుచే ఉత్సాహము తగ్గును. తల్లి ఆ యాటనే కొంచెము మార్చి 'పుఱమ్ పుల్కువాన్' వెనక నుండి వచ్చి కౌగిలించు కొమ్మనును. వీపునెక్కి కౌగిలించుమనును. అతడుచ్చటోయుచున్నను సరే.

బిడ్డకొంచె మెదుగును. అమ్మకు బూచిని చూపి భయపెట్టును. అమ్మ

**అచ్చ్తాతన్ అప్పూచ్చికాట్టుకిన్హాన్**
**అమ్మనే అప్పూచ్చికాట్టుకిన్హాన్!**

అచ్యుతుడు బూచిని చూపుచున్నాడే: అమ్మకే బూచిన చూపుచున్నాడే యని భయము నటించును.

బాలుడు ఆటల మరుగును. అలసిపోవును. రేయి పాలు కుడువకనే నిదురించును. మరల తెల్లవారగనే ఆటలకెగబడును. రొమ్ముకుడిచి యాడు కొనవచ్చునని తల్లి బుజ్జగించును. ఆటకు ఆలస్యము కాదు. చిటికెలో రా! చిటికెలో త్రాగిపో అనును. బిడ్డ స్నానము కందదు. "నారణా? నీరాడవారాయ్" నార (రాయ)ణా! నీరాడరావోయి! అని తల్లి పిలుచును. అతడందునా? తల్లి ఎన్నో యుక్తులతో వానిని రాబట్టును. ఈ రోజు నీ తిరువోణమ్ (పుట్టిన రోజు పండుగ). గొల్ల బాలికలు నీ మురికి చూచి నవ్వుదురు అని రోసము తెప్పించును. ఇదిగో పండ్లు అని లంచము చూపును. నీలమణీ! రావయ్యా స్నానానికి అని జాలిగా బతిమాలును.

ఇక తలదువ్వవలె! తాను దువ్వినరాడు, కాకి చేత దువ్వించినచో! "ఓకాకాయ్ ఈ ఉద్ధారకుడు, ఈ కణ్ణడు, ఈ పిల్లడు, వీని దగ్గరకు రా! వీని జుత్తు దువ్వవో! అని యశోదమ్మ కాకిచేత బిడ్డ తల దువ్వించును. కాకికి కాలు నిలుచునా? కాకిలేనిది కణ్ణడు నిలుచునా? "ఓ కాకీ అరవకు! కదలకు, దంతపు దువ్వెనతో నీతని జుత్తు దువ్వమని" తల్లి దానినాపును. తల దువ్వెనే గాని శిగలో పువ్వులు మూడువ లేదు!

ఇంతలో ఆలను తోలుకొని పిల్లలు పోవుచుందురు. పిల్లడు తాను కూడా పోదు నని మారాము పెట్టును. తల్లి యోచించి ఇట్లనును "ఆవులుగాయుకోలయేది? అది కాకాయ్ వద్దనే ఉండె, అది తన ఇంటికిపోయె, అయినదేమాయె! దానిని మరల పిలు చును. అది వచ్చులోపల ఈ పూలు పెట్టించుకో! ఇదిగో దానిని పిలుచు చున్నాను'

"ఓకాకాయ్ ఈ పిల్లనికొక కోలతే, ఈ (కదలివంటి) నల్ల పిల్లని కొకకోలతే! రంగుల రంగుల కోలతే, లక్కపూతల కోలతే!"

ఇట్లు కాకిచే పిల్లడి తల దువ్వించి, కాకిచే కోల ఇప్పించి, నేర్పుతో తలపై వన్నె వన్నెల పూలు ముడిచి తల్లి కళ్లార చూచుకొనును. ఏమి పూలో! ఎన్ని పూలో! సెంపెంగలు, మల్లెలు, దవనము, కలువలు, పున్నాగలు, మాలతులు, ఓః - మనకు తెలియనివి ఎన్నో-ఎన్నెన్నో!

సింగారించిన సింగడింటిలో నుండునా! అందరికి తన సొగసు చూపించుకొన వద్దా! అతడెచ్చటెచటో తిరుగులాడు చుండును. మాపటి సంజ రానెవచ్చె! అల్లంత దూరమున పిల్లడు కనుపించును, "ఓయి కన్నా! అసుర సందెలో తిరుగరాదు. నాలుగు వీధులు కలయు చోటున నిలవవద్దు. ఆ పిల్లల కండ్లలో ఇసుక చల్లకు, వారిని తన్నకు! ఔనౌను! నీవు తప్పలేదు! వారే తమ యల్లరి నీ మీద చెప్పుచున్నారు! కంసుడు పూతనను పంపెనను చున్నారు. ఔనౌను నీకు భయము లేదు. నాకే భయము! రా! లోనికి వచ్చి దృష్టి తీయించుకో!" అని తల్లి ఆరాటపడును.

రోజులు గడచుచున్నవి. పిల్లని యాగడములు పెరిగినవి. మా ఇసుక గూళ్ళ పడదన్నె-మాలక్క, చేటలు నాజేసె-మాపై బురద చల్లె, మా గాజులాడ బీకె, మా కన్న

ముందే నీ వద్దకు వచ్చు వీనితో బ్రతుక లేము - అని బాలికలు మొరపెట్టిరి. ఇంకెందరో, కృష్ణుని యాగడములనెన్నో చెప్పి యశోదను "తీపి మాటల దానా!" (మంజాల వాటీ) యని చెప్పి పాడుతురు. ఈ గోల పడలేక తల్లి వానిని దూడల వెంట అడవికి పంపును. త్వరపడి పంపును. తీరికగా వగచును. అయ్యో ఎంత పాపమే! అల్లరైన చేయునీయక పోయితినే! అడవుల కంపితినే! అని యడలును. అడవుల యాపదలను తలచును. అచటి జల్లుమను ధ్వనులామెకు వినుపించును. అందరి కరకు బోయలు కనుపింతురు. రాలబాట నామె తలచును. గొడుగైన, పావలనైన ఈయని రాతి గుండె దానినే- అని తనకు తాను తిట్టుకొనును. ఇంతలో కన్నడు తిరిగి రానే వచ్చును. దూరము నుండే తల్లి ఆ మోహన కుమారుని జూచును. దృష్టి భయమును మరచి, సఖురాండ్రను పిలిచి, ఆ అందము చూపును. 'వన్నుకాణీరో' వచ్చి చూడండే! నా మాట నిజము, కొడుకును కన్న దానను నేనే! తక్కిన వారు గొల్లరాండ్రే! (ఈ తల్లికి ఈ బిడ్డను తాను కనలేదను మాట స్ఫురణలో లేనేలేదు!).

ఆ వచ్చెడి కృష్ణ మోహనుని తలపై నెమలి పింఛము గుత్తులుగా నుండెను. అవి యొక గొడుగు వలె కనుపించెను. (అతని కుడి చెవివాక తీరు, ఎడమ చెవివాక తీరుగను వగలుండెను). అతని పిల్లన గ్రోవి సమ్మోహనముగ వినిపించెను. అతని చుట్టు గోప బాలులుండిరి. వారతని కత్తి, విల్లు, వేడుక కోల మోయు చుండిరి. అతడొకని భుజముపై చేయి వైచి, రెండవ చేత శంఖము పట్టుకొని దవ్వులనున్న గోవులను బిలుచు చుండెను.

అడవి నుండి క్షేమముగా తిరిగి వచ్చిన కుమారుని చూచి తల్లి చేసిన భావన లిన్నిన్ని గావు. పలికిన మాటలిన్నిన్ని గావు! ఈ గోపాల కృష్ణుని సమ్మోహన రూపమెన్నెన్ని శతాబ్దుల నుండియో, ఎందరెందరి ఆర్ద్రహృదయములలోనో మసలుచున్నది. ఆకర్షించు చున్నది. పెరియాళ్వారు యశోదా భావనచే, తమిళతాయిలకు కణ్ణన్ సుపరిచితుడా యెను. ఆయన బాలకృష్ణ రచనలననుసరించి, తమిళ సాహిత్యమున "పిళ్లై-తమిళ్" అను ప్రక్రియ యొకటి ఆరంభమై నేటికిని సాగుచున్నది.



# ఆముక్తము - భక్తి రూపములు

ఆముక్త మందలి పాత్రలలో విష్ణు చిత్తుడు ముఖ్యుడు. అందలి ఏడి ఆశ్వాసములందును ఆయన ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ప్రసక్తుడగును. అందలి అయిదు కథలు కూడ ఈయన కథ నాధారముగ తీసికొని చెప్పబడినవే. ఆముక్త మాల్యద మధుర భక్తి, ప్రపన్న ధర్మము తప్ప ఆముక్త మందలి వర్ణితములైన సాధనలన్నియు ఈయన యనుష్ఠానములోని భాగములే. కవి ఈయనను, ప్రవేశ పెట్టుచునే ఈయన చర్యకును, అనంతర కథలకును బీజావాపన చేయును. ఈయన సాధన మానవుని బహిరంతర నిర్మాణము నాధారము చేసికొని కొన సాగును. నిర్మాణములలో దేనిని నిర్లక్ష్య పరచక అన్నిటిలోను, భగవచ్చైతన్యమయ మగు సమగ్ర క్రియను, సాగించును. మానవుని స్థూల శరీరము అస్థి, కండరములతో నిర్మింపబడినది. ఉపనిషద్ భాషలో ఇది అన్నమయ శరీరము - అది క్రియా శీలము. క్రియ నీయన భగవత్, భాగవత కైంకర్య శీలముగ రూపాంతరీకరణ మొనర్చెను. (Tranformation). ఈ చర్యలో మొదటిది విలుబుత్తూరు మన్ననారు విష్ణునకు మాలా కైంకర్య మాలికాకరణ కైంకర్యము. దీనికై ఆయన ఒక తులసి వనమును నిర్మించి, కఠకైన పని ముట్లతో చేతులు పందు లేకుండా కాయలు కాచునట్లు భూమిని త్రవ్వి శ్రమించును. మిగిలిన కాలమును ఆలయ సమ్మార్జనములతోనో, తీర్థజల సేకరణ తోనో, స్వామి పల్లకిని, ధ్వజమును, వీవనను, మోయుటతోనో, దీపమాలికను వెలిగించుటతోనో గడపి తన కాయిక చర్య నాయన భగవత్ చైతన్యయుతముగ కైంకర్యముగ మార్చును. భగవత్ కైంకర్యముతో పాటీయన భాగవత సేవను చేపట్టి, అన్ని ఋతువులలో ప్రతి దినము నడిరేయి వరకు వారేమి కోరిన దానిని ఆలయుక తెచ్చి సంతృప్తి పరచుటలో నిమగ్నుడై యుండువాడు.

మానవ నిర్మాణములోని రెండవ పొర బ్రహ్మరంధ్రి నుండి వెలువడు నాడి, అస్థి, కండర, పంజరమంతటను వ్యాపించిన నాడీ మండలము. ఇది వేదన (Feelings) భావోద్వేగముల (Emotions) ప్రసరణకు వాహిక. ఇది ఉపనిషద్ వ్యవహారమున

ప్రాణమయ శరీరమున కాధారము. ఈ ఉద్వేగము నాయనారులు భగవత్ భక్తి భావముగ మార్చుదురు.

భక్తి భావోద్వేగము వలన ఆయన వడవడ వడకును. సాష్టాంగ మెరగును. సమ్మదాశ్రులను కార్చును. పులకలతో ముమ్మరించును. వినయవినమిత గాత్రుడ గును. స్వామికి మారాడ నలకును. ఈ క్రియా ఫలము భగవత్ సామీప్య సిద్ధి.

మానవ శరీర నిర్మాణమున అస్థి, నాడీ మండలముల కన్న లోపలి పొరలో నుండునది మెదడు. ఇది వానిని శాసించి క్రియా చర్యలను సుసంఘటితములుగా చేయును. వారికి లేని చింతనా శక్తికిది స్థానము. ఇది ఇంద్రియ స్పర్శిత విషయము. ఇది మనోమయ కోశమునకు సమాంతరము (Parellel). విష్ణుచిత్తుడు మొదట హేతువాద, కాపాల, మీమాంస, వ్యాకరణ జ్ఞాన సముపార్జన యందు కోర్కి కలవాడే గాని, పరమేశ్వర ప్రసాద రూపమగు ఆచార్య కృపచే ఈశ్వరునకును, తనకును, అనార్యమగు స్వామి భృత్య సంబంధము కలదని, ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు- అను తత్త్రయము నెరిగి, పరమ పదమునకైన భగవత్ పరిచర్యయే, పరమ పురుషార్థమని, గుర్తించి, శాస్త్ర జ్ఞాన ప్రయోజనము రాజ రంజన వాదిభంజన మాత్రమని, అది పునర్భవ హేతువని తర్కించి తెలిసికొని, వెంటనే విసర్జించెను. వేద, వేదాంత వాక్కులను గూడ ఈయన గురు ముఖమున పఠించలేదు. అయినను అవి పఠింపగా కలుగు విశిష్టాద్వైత సుసంవిత్తును ఆయన చక్కగా బోధ పరచుకొనెను. ఈ బోధ ఆయనను మనోమయ కోశమునకన్న ఉత్తమ మగు విజ్ఞానమయ కోశమున కలిగెను. ఈ కోశము మనస్సు ఇంద్రియముల మధ్య వర్తిత్వము లేకుండ అపరోక్షానుభూతి నిచ్చునదే. జీవికి స్థానము, పై నుండు పరమునకు దిగువ నుండు అపరమునకు సంధి స్థానము. ఈ అపరోక్షానుభూతి నీయునకు మనో వ్యాపారములను నిరోధించి ప్రజ్ఞను అంతర్ముఖము చేయుట యోగనిష్ఠ వల్లనే కలిగెను. విష్ణు చిత్తుడీ విభాగనిష్ఠ నవలంబించి విజ్ఞానమయ కోశ ప్రభావమున వేద వేద్య విశిష్టాద్వైత జ్ఞానము నెరుగుటయే గాక యెడ తెగని యోగపు సంకెలలతో విష్ణువను యేనుగును తన చిత్తమున బంధింప గలిగి సార్థక నాముడయ్యెను.

విష్ణు రూపమును ధారణ ధ్యాన విషయముగ జేయు ఫలము సారూప్య సిద్ధి. జ్ఞాన బోధ వలన కలుగునది సాయుజ్యము. సాయుజ్య స్థితిలో కూడ జీవికి వ్యక్తిత్వ నాశనము లేదు. ఇది విశిష్టాద్వైత సిద్ధాంతమందలి ప్రత్యేకత.

ఈ దాస, జ్ఞాన, యోగ నిష్ఠలతో పాటు విష్ణుచిత్తుడు జపనిష్ఠ ననుసరించెను. ఆయన ముఖము ద్వయ మంత్ర సదనము. (ద్వయ సద్మపద్మవదనుడు) ఈ మంత్రము వైష్ణవు లందరు సర్వ కాలము లందు జపించ దగినది. మన్నారు వక్షమున తులసి మాల్యమును చేర్చునపు డాయన మూల మంత్రమును జపించును. ఈయన ప్రధాన సాధన దాస్య భక్తి. దాని వలన వైష్ణవుడు అహంకారము నణచి జపించును. జప, యోగ, జ్ఞాన, సాధనలు అహంకారము నణచు నిష్ఠల నవలంబించినను, దాస్య భక్తితో లొంగి నడచును. 'దాసోహం' అను ఎరుకను పొందును. ఇది వైష్ణవుని సాధన లన్నిటికి మూల సూత్రము.

జప, యోగ, జ్ఞానముల ననుష్ఠించినను, ఈయన ప్రధాన సాధన దాస్యభక్తి. విష్ణుచిత్తుని చర్య మొదటి నుండియు భగవత్ప్రేరణచే అనూహ్యమగు మలుపును తిరుగును. ఆయన మొదట శాస్త్ర జ్ఞానేచ్ఛ గలవాడయినను పరమేశ్వర ప్రసాద రూపమున గురూప దేశమున వానిని విడనెను. పిమ్మట కొన్నాళ్లకు మన్నారు స్వామి ఆదేశము వలన శాస్త్ర జ్ఞానము నాధారముగ గొని, వాది భంజన, రాజ రంజనములు చేసెను. అతడు గురూపదేశమున పరమ శాంత దాంతిపరుడై విరాగియగు యోగి యయ్యెను. కాని ఆముక్త మాల్య శిశు లాభమున పరమానురక్తుడగు తండ్రి యయ్యెను.

## కేశిధ్వజుని వైష్ణవ యోగము

ఈ కథ విష్ణు పురాణములోనిది. కేశి ధ్వజుడను రాజు అడవులలో నుండు దాయాది అగు ఖాండిక్యుని వద్దకు నిరస్త్రుడుగ పోయి, తాను చేయుచున్న యజ్ఞ ధేనువు పులి వాత పడుటకు ప్రాయశ్చిత్త మతనిచే తెలిసికొని, అతడు గురు దక్షిణగా అడిగిన సకల భవ క్లేశనాశనమగు వైష్ణవ అష్టాంగ యోగమును బోధించును. కవి దీనిని పాండ్యరాజు సభా వాదమున, విష్ణుచిత్తుని ముఖమున చెప్పించును. ఈ కథ ఔత్తరాహ, పౌరాణిక, భాగవత సంప్రదాయములోనిది. కేశిధ్వజుడు అరాతి ఘనన,

రాజ్యపాలనములను చేయుచు, బ్రహ్మనిష్ఠ నుండి చ్యుతుడు గాకుండ, యజ్ఞ యాగాదుల నొనర్చుచు, పూర్వ కర్మను భోగముచే క్షీణింప చేయుచు, పునర్భవాది సకల క్లేశ నాశనముగ చేయు అష్టాంగిక వైష్ణవ యోగము నవలంబించును.

ఈ యోగమున సాధకుడు శ్రీ విష్ణుని శుద్ధ స్థూల రూపమును, సర్వాంగ బద్ధముగ చింతించి, తన్మయుడై, పాంచ భౌతిక శరీర బంధము నుండి విముక్తుడగును. అపుడతనికి అప్రాకృతమగు విష్ణుసామ్య ముక్త రూపములు కలుగును. ఆ పిమ్మట భేద జ్ఞానమును నశించును. ఆ పిదప అతనికి విష్ణు కళ్యాణ గుణములు చేరువగును. తుదకతడు హరికిని తనకును లేని భేదమెవ్వడు కల్పింపగలడు - అనుస్థితిని చేరును.

ఈ వైష్ణవ యోగి యమ నియమముల వలన మనో నైర్మల్య సాత్త్వికతలను సంపాదించును. భద్రాసనము వలన శరీరమును కుదురుగ నుంచును. ప్రాణాయామము వలన మనో వ్యాపారములకు మూలమగు ప్రాణ సంచారమును వశ పరచుకొనును. ఇంద్రియములను విషయముల నుండి వెనుకకు మరల్చి మనస్సును స్వాధీన పరచును. ఇంత వరకు ఈ యోగము పతంజలి యోగమును బోలును. కాని, ధారణ, ధ్యాన దశలో విష్ణుని శుద్ధ స్థూల రూపమును చింతించుట దీని ప్రత్యేకత. ఇది పాతంజలమున లేదు. కాని లక్ష్యము ఏ రూపము లేని, నిష్ప్రపంచ నిర్వికల్ప సమాధి. అసలీయోగ ప్రక్రియ యే మతమునకు చెందినది కాదు. మానవుని అతీంద్రియ చైతన్యమునకు సంబంధించిన సాధన మత చరిత్రలకు పూర్వపుది. దీనిని గూర్చిన మొదటి సాక్ష్యము క్రీ॥పూ॥ 2500 నాటి మొహంజోదారో, హరప్పాలలో దొరికిన ముద్రలపైన, జంతువుల మధ్య యోగాసనమునున్న ఒక పురుషుని విగ్రహము కనిపించును. దీని ప్రధాన లక్షణము యజ్ఞ విధానము నెరిగిన ఖాండిక్యునకే యోగ విధానము తెలియకుండుట. యోగియగు కేశిధ్వజునకు ఆయన ఆశ్రితులకు క్రతువున కలుగు అంతరాయమునకు ప్రాయశ్చిత్తము తెలియకుండుట ఈ రెండు సంప్రదాయములు భిన్న మూలమును సూచించును. ఖాండిక్యుడు జీవిత పూర్వ భాగమంతయు యజ్ఞ యాగాదులొనర్చుటతో గడిపి, పునర్భవరాహిత్యమును, సకల భవక్లేశ నాశనమును కోరి, యోగము నాశ్రయించుట, యజ్ఞ యోగముల భిన్న స్థితులను తెలుపును. బహిర్ముఖములగు ఇంద్రియ చిత్తవృత్తులను నిరోధించి, అంతర్ముఖము

చేసి, అతీంద్రియ, అతి మానసిక ప్రజ్ఞను బడయుట. తంత్ర, అగ్ని, హోమ, ఆవాహన, పశు విశసనాదులతో కూడి బహిర్ముఖమగు యజ్ఞ (క్రతు) కర్మకాండకు అంతర్ముఖమగు యోగము సరిగ వ్యతిరేకము. కొన్నాళ్ళ రెండు సంప్రదాయముల మధ్య తీవ్ర ఘర్షణ వివాదమున్నట్లు దక్షాధ్వర కథ వలన తెలియును. మహాయోగియగు శివుడు ధ్వరమున పూజ్యుడు కాకుండుట వలన ధ్వంస మొనర్చెనని ఈ వర్ణన తెలుపును.

దీనిని గూర్చిన ప్రసక్తి బుద్ధుని సాధనను వర్ణించు బౌద్ధ గ్రంథములలో ప్రథమముగ కనిపించును. కాని, దీనికి శాస్త్ర రూపమునిచ్చి సువ్యవస్థితము చేసిన ప్రథముడు పతంజలి. (క్రీ॥పూ॥ 2వ శతాబ్ది) ఈ బౌద్ధ పాతంజల యోగములు నిరీశ్వరములు ఒక దాని సిద్ధి విరాగము, రెండవ దానిది నిర్వికల్ప సమాధి. కాని యోగమును సర్వమతముల వారు తమ సాధనలో ఒక క్రియగా అవలంబించిరి. దాని వలన సాధకుని చైతన్యము సమగ్రమై, విస్తరించి గమ్యమును శీఘ్రముగ చేరవచ్చునని వీరి భావము. ఆస్తికులైన శైవ, వైష్ణవ, శాక్త సంప్రదాయకులే గాక, నాస్తికులగు జైన బౌద్ధ సాంఖ్య, సంప్రదాయముల వారు-పరమార్థ దృష్టిలో జీవేశ్వరులు లేరను అద్వైత వేదాంతులు కూడా దీని నవలంబించిరి. వైష్ణ వాళ్వారులలో కొందరు యోగులు అను సంప్రదాయకము కలదు. కాని, దాని స్వరూపము నెరిగించు రచనలు లేవు. ఇవి వారితోనే గతించెనేమో! ఆళ్వారుల దివ్య ప్రబంధము ఉద్ధరించి, సంకలన పరచిన రంగనాథముని (పదవ శతాబ్దము) యోగి యోగమును గూర్చిన ఒక గ్రంథమును రచించెనందురు. ఇది ఇంత వరకు లభింప లేదు. వైష్ణవులగు ద్రవిడ ఆళ్వారుల పూజా రూపమగు హార్దయ భక్తికి అంతర్ముఖమగు యోగ విద్యను హిత పరచుటకు రాయలీ యూర్య, భాగవత సంప్రదాయములోని కేశిధ్వజుని కథను తెచ్చి, అందలి యోగమును విష్ణుచిత్తునిచే పాండ్యరాజు సభా వాదము వలన వినిపింపజేసెను. విష్ణుచిత్తుడా రాజును వైష్ణవుని చేయుటకు తానను సరించు ఆలయ పూజ, భాగవత సత్కారములనుకూలించవని యితరి రాకోచితమగు యోగము నుపదేశించెను. ఆ యుపదేశము రాజ పాలన, అరాతి హనన శీలియగు ఒక ప్రభువు కేశిధ్వజుడు తన దాయాది యగు ఖాండిక్యునకు సరివాడగు మరియొక ప్రభువునకుపదేశించిన దగుటచే వారి వలెనే రాజగు పాండ్య మత్స్యధ్వజునకు సమ్మతమగును.

వైష్ణవమున అధికార భేదము ననుసరించియున్న సాధనము ప్రదర్శించుటకై రాయలీ కథను బహు పురాణేతిహాసముల కథాసార సంగ్రహమును విష్ణు పురాణము నుండి తెచ్చి ఆముక్తమున కూర్చెను.

<u>యామునాచార్యుని జ్ఞాన భక్తి :-</u>

యమునాచార్యుడు కూడ విష్ణు చిత్తుని వలె దైవ ప్రేరితుడై, రాజ సభా వాదమున విశిష్టాద్వైత దర్శనమును ప్రతిష్ఠించి, రాజును వైష్ణవునొనర్చిన వాడే. విష్ణుచిత్తుడీ కార్యమును గృహస్థాశ్రమమున భగవత్ భాగవత కైంకర్యపరుడై యున్న పరువున నెరవేర్చెను. యామునుడా పనిని ఆచార్య కులమున వేద శాస్త్ర ముఖ్య విద్యలభ్యసించు చిరు ప్రాయముననే నిర్వహించెను. మరి రాయలకీ విషయమును విదర్శించు రెండు కథలేల చేర్చెను? దీనికి కొన్ని ముఖ్య కారణములున్నట్లు తోచును. మొదటిది శ్రీ వైష్ణవమున గల ఆళ్వారుల భక్తిని, ఆచార్య తత్త్వ చింతనను ప్రదర్శించిన విషయ సమగ్రతను సాధించుట కై యుండును. రెండవది శ్రీ వైష్ణవమున జ్ఞానము భగవత్ కృపచే భక్తిగా పరిణమించనిచో నిష్ఫలమై పదచ్యుతిని పొందు అవకాశమున్నదని చెప్పుటకై యుండును. మూడవది యామునుడు రాజైన పిమ్మట అతని చైత్రయాత్రకు ప్రతి బంధకమైన వర్ష ఋతువును, అనుకూలమైన శరదృతువును ఏకధాటిగ వర్ణించుటకును, యామునుడు సన్యాసాశ్రమము స్వీకరింపబోవుచు కుమారునకు రాజ్యమప్పగించు సందర్భమున అతనిచే ఉపన్యసించుటకును, శైవ పక్షపాతి యగు ప్రభువు వలన నితర మతస్థులు పొందు ఉపద్రవములు ప్రదర్శించుటకు, అయి యుండును. వీనితో మొదటి రెండు కారణములు ప్రస్తుతాంశమగు భక్తి సాధనల వైవిధ్యమునకు సంబంధించి నవగుటచే కొంత విస్తరించుట ఉచితము.

**(1) ఆళ్వారులు -ఆచార్యులు**

విష్ణు చిత్తుడు హృదయ భక్తి ప్రధానముగా గలిగి, భగవత్ ప్రేమానందపు లోతుల ననుభవించి, భగవత్కృపచే తాము తరించి, ఇతరులను తరింప చేయుటకు యత్నించిన ఆళ్వారుల సంప్రదాయములోనివాడు. వారి వలెనే అతడు కూడా వేద

శాస్త్రములను గురు ముఖమున పఠించిన వాడు కాడు. రాజ సభావాద మతనికి దైవా దేశమున అనుల్లంఘ్య విధియై యాదృచ్ఛికముగా సంభవించెను. కనుకనే ఈయన ఇతివృత్తము పన్నిద్దరాళ్వారులను గూర్చిన దివ్య సూరి చరిత్రమున చేర్పబడెను. ఆళ్వారులకు శాస్త్ర జన్య జ్ఞానము కన్న స్వీయానుభవము, భక్తి, పరమేశ్వర కృప ప్రధానము. ఈ యనుభవమును వారు నిత్యానుష్ఠానములోని కనువదించుటచే స్థిరపడి మార్గచ్యుతి కవకాశము లేకుండ తరింప గలిగిరి. వారు తరించగానే వైష్ణవ సేవా ధర్మము ననుసరించి, కుల వయో లింగ భేదములతో నిమిత్తము లేక సర్వజనులను తరింప చేయుటకు సందేశమును సులభ తమిళ గేయ రూపమున ప్రచురించి, భక్తిని శ్రీఘ్రముగా ప్రజా హృదయమున నాటుకొనలేని వారిని, జైన బౌద్ధముల నుండి మళ్లించిరి. ఇది శ్రీ వైష్ణవ ప్రథమ దశ, ఆళ్వారుల సంప్రదాయ మనదగినది.

రాను రానీ వైష్ణవ భక్తిని ప్రత్యర్థులైన జైన, అద్వైత, శైవ పండితుల ఖండముల నుండి రక్షించి, రాచరికపు ప్రాపును సంపాదించుట అవసరమయ్యెను. ఇందుకై వేద శాస్త్ర తర్క ప్రమాణములతో భక్తికి సంప్రదాయమును కుదిర్చి, సువ్యవస్థిత మగు దర్శనమును నిర్మించుట యవసరమయ్యెను. ఆ పని నారంభించిన వారిలో ప్రథముడు రంగనాథ ముని. దానిని మరికొంత సాధించిన వాడు యామునుడు. దానిని సర్వ సమంజసముగ సంపూర్ణ మొనర్చినవాడు శ్రీరామానుజుడు. పిమ్మట రామానుజ దర్శనమునకు కలిగిన యాక్షేపణల నెదుర్కొన్న వారిలో మణవాళమాముని, వేదాంత దేశికులు ముఖ్యులు. వీరిని ఆచార్యులందురు. వీరి చరిత్రము గురు పరంపరా ప్రభావమను తమిళ గ్రంథమున చెప్పబడినది. ఆళ్వారుల హృదయావేశము, ఆచార్యుల తత్త్వ చింతన - శ్రీవైష్ణవమున కొకటి హృదయము - రెండవది కవచము. ఈ రెండింటిని జతపరచనిదే శ్రీ వైష్ణవపు సంపూర్ణ స్వరూప మేర్పడదు. అందుచే సమగ్ర వర్ణన యందభిలాష గల రాయలు విష్ణుచిత్త ఆళ్వారులతో పాటు యామునాచార్యుని చరిత్రను చెప్పెను. నిజమునకు యామునుడు విష్ణుచిత్తునకు రెండు శతాబ్దులు పిమ్మటి వాడు. అట్లే ఆరవ యాశ్వాసమున కీర్తించిన రామానుజులు, మణవాళమాముని, వేదాంత దేశికులు, శఠగోపయతియు తర్వాతి కాలపు వారే. అయినను రాయలీ

యామునుని కథను, రామానుజాదుల ప్రశంసను, త్రికాల వేదులగు మన్ననారు స్వామి చేతను, బ్రహ్మర్షుల చేతను చెరి యొకటి చెప్పించెను. కథా శిల్పమున గాకున్నను, భక్తి విషయమున సాకల్యతను సాధించెను.

<u>జ్ఞానము- భక్తి- కృప :-</u>

యామునుని కథ చెప్పుటకు రెండవ కారణము రాయలు శ్రీవైష్ణవమున జ్ఞాన భక్తి ముక్తులకు గల పరస్పర సంబంధమును, వాని పౌర్వా పర్యములను ప్రదర్శించుటకై యుండుట, జ్ఞానము వలన శ్రీ వైష్ణవులు పరమ పురుషుని స్వరూప రూప గుణ విభూతులను అతనికి గల సంబంధము తెలిసి అతని యందనురక్తుడై తన చైతన్యము నతని వైపు మళ్లించి, అతని కృపచే ముక్తుడగును. శ్రీవైష్ణవుని జ్ఞానము భక్తిలో పర్యవసించి, భగవత్కృపచే పరిపక్వమై, ముక్తిదాయకమగును. విష్ణుచిత్తుని జ్ఞానమిట్టిదే! ఆయన ఆచార్య కృపచే జగజ్జీవేశ్వరుల తత్త్వమును తనకును పరమేశ్వరునకును అనాద్యముగా కల భృత్య-స్వామి (శేష-శేషి) సంబంధమును, పరమ పదమున గూడ భగవత్ పరిచర్యయే తన పురుషార్థమగుటను తెలిసి, ఆచార్య కృప పరమేశ్వర లబ్ధమని విశ్వసించి, ఆ తెలివిని, విశ్వాసమును, భగవత్ భాగవత సేవా రూపమున క్రియా శీలమొనర్చెను. ఈ సేవారతి అతనిని మార్గచ్యుతుని కాకుండ రక్షించెను.

ఇక యామునుని జ్ఞానము - ఆచార్య కులమున నతడు పటువుగా పఠించిన వేద శాస్త్ర, విద్యల వలన కలిగి పాండ్యరాజ సభలో పరతత్త్వ నిర్ణయ వాదమున, విష్ణు తత్త్వమే పరతత్త్వమని విశిష్టాద్వైతమే మతమని ప్రతిష్ఠించుటకు ఉపయోగించెను. ఈయన జ్ఞానము అనుష్ఠితము కాలేదు. ప్రేమదశకు చేరను లేదు. అట్లు చేరుటకు కొంత భగవదనుభూతి కలుగ వలెను. అది యామునునకు ప్రత్యక్షముగ లభించలేదు. విష్ణుచిత్తుడు తనను రాజ సభా వాదమునకు పొమ్మను స్వామి అనతిని వినగలిగెను. తన అశక్తతను అతనికి విన్నవింప గలిగెను. "నీ ఇచ్చయే మిన్నక పోవోయి" - అను స్వామికి మారు పలుక నలకెను. సభలో హరి అతని చేతోగతి నలసెను. ఈయను భవములు భగవంతునొక తత్త్వముగ భావించుట వలనగాక భక్త వరదుడగు పరమ

పురుషునిగా సేవించుట వలన కలిగిన ప్రత్యక్షానుభూతి. యామునుడు పాండ్య సభావాదమున జయము చేయవలెనను తలపు కూడా భగవత్ప్రేరణ చేతనే సంభవించెను. కాని, అది అర్చావతారమున ప్రత్యక్షముగ తన వాక్కుచే శాసించుట వలన గాక, అంతర్యామిగా నుండి, అతని కా తలపు పుట్టించుటచే కలిగెను. యామున విష్ణుచిత్తుల సాధనలోని భేదమును మరొక విషయము వలన స్పష్టపడుచున్నది. విష్ణుచిత్తుడు వాద శుల్కముగా తనకు పాండ్యరాజు యిచ్చిన ధన మశేషముగ భాగవతులకు, స్వామి ఆలయ సేవకు వెచ్చించి రిక్తుడయ్యెను. మరియు, శ్రీశ దత్తశ్రీలు గృహమున ద్రవ్య, తండులములుగా నున్నను పూర్వపు మాలా నిర్మాణ దాస్యమును, ఉత్సుకతతో జరుపుచు పూర్వముకన్న శత గుణముగ, భాగవత పూజా ప్రవణుడై యుండెను. ఇక యామునుడు వాదమున గెలిచినందులకు మెచ్చి పాండ్య రాజిచ్చిన సహోదరిని పరిణయమాడి అతడు ధార పోసిన యర్ధరాజ్యమును స్వీకరించి, యువరాజై దిక్షేత్రయాత్రలు చేసి, యజ్ఞములు చేయుచు, నానాదేశ విప్రులను తనుపుచు, సంపన్నతలో అనిశము బహుభాగ్యోన్నతుడై ఆదమరచి, నిశ్శంకుడై యుండెను. ఈయన వేద శాస్త్రజనితమగు జ్ఞానము భక్తిగా పరిణమించక, భగవత్కృపకై తపించకపోవుటచే, విషయాతురతతో మరుగుపడెను. తుదకాతడు తన పెద్దలు కూర్చిన నిధిని చూపింతునను నాథముని ప్రశిష్యుని వెంట శ్రీరంగాలయమును ప్రవేశించి, "నీపెద్దలు కూర్చిన నిక్షేపమిదిగో తీసికొనుమని" అతడు చూపిన శ్రీరంగపతి శ్రీపదయుగ్మ దర్శనముచే హఠాత్తుగా భ్రమ తొలగి, తన ప్రమాదమునకు నిర్వేదమును పొంది, శ్రీరామ మిశ్రుని వలన దివ్య మంత్రముపదేశింపబడి, పంచ సంస్కారములను పొంది, అంతట నిలువక తురీయా శ్రమము చేరెను.

యామునుని జ్ఞానము స్వయముగా అతనిని మాయావరణము నుండి రక్షింపజాలక పోయెను. రంగనాథుని కృపచే ఆ పొర తొలగి, అతని జ్ఞానము భక్తిగా పర్యవసించెను. అప్పటి నుండి అతడు రంగనాథాలయముననే యుండి, ఆళ్వారుల దివ్య ప్రబంధ రహస్యముల ననుభూతికి తెచ్చుకొని మహాభక్తుడై, స్తోత్ర రత్నమను ప్రశస్తస్తోత్రమును ప్రస్థాన త్రయముతో అనుసంధించి, శ్రీవైష్ణవ ద్వితీయాచార్యుడై రామానుజుల ఉభయ వేదాంత నిర్వాహణమునకు మార్గ దర్శకుడయ్యెను.

ఈయన జీవిత చర్య కూడ దైవ ప్రేరితమై, అసాధ్యమగు మలుపులు తిరిగెను. వటు ప్రాయమున రాజ సభావాదమున పాల్గొనుట, ప్రౌఢ వయస్సున రాజ్యత్యాగము చేయుట ఇందుకు ఉదాహరణలు.

**ఆముక్తమాల్యద - మధుర భక్తి :-**

రాయలు దాస్య, యోగ, తత్త్వ సాధనలను చిత్రించిన పిమ్మట, వీనికి కిరీట స్థానముగ ఆముక్తమున మధుర భక్తిని వెలయించెను.

ఆమె ఒక చిన్నారి బాలిక. విష్ణుచిత్తాదుల వలె, పూజాయోగ, తత్త్వములందామెకు ప్రవేశము లేదు. ఆమె భగవంతునొక ప్రేమ స్వరూపునిగ భావించును. ఆయనను మధుర రస ప్రధానమగు వధూ భావముతో అనురోధించును. సాధనను పరమ ప్రేమ యని పరమానురక్తియని, మధుర భక్తియని పలు విధములుగ సూచింపవచ్చును. పేరేదైనను, ఆ సాధన వలన ఆమె యాశించునది విష్ణు ఐక్య రసానుభూతి. ఆమె యాకాంక్షించునది విష్ణు చిత్తాదుల విష్ణు సాన్నిధ్య సారూప్య సాయుజ్య ముక్త రూపములకు అతీతమగు మధుర రసానుభూతి. ఇదియే గోపాల కృష్ణుని మోహన వేణు రవమాలించిన బృందావన గోపికలు పొందిన రసానుభూతి. ఇదియే 'రసోవైసః" యని ప్రకటించినది. ఉపనిషదంతర్ద్రష్టల యనుభవము ఇదియే, "యస్యత్ర పూర్ణ మధుర పదాని" (ఋగ్వేద విష్ణుసూక్తం). విష్ణుని మధుపూర్ణ త్రిపాద విన్యాసమును సంకీర్తించిన వేద ఋషుల యనుభూతి. ఇదియే ఇటీవల కాలపు వారు తమ తమ జీవ ధర్మముల ననుసరించి అనుభవించిన మధుర రసము. ఇదియే నింబార్కుని రాధాకృష్ణ పరతత్త్వ ప్రేమానుభూతి. ఇదియే వల్లభునకు పుష్టి మార్గము నవలంబించిన వైకుంఠాతీతమగు రాసలీలామృతము, ఇదియే చైతన్యుడు - శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య సాధనల నతిశయించిన చతుర్విధ పురుషార్థములను (సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్యములు) బ్రహ్మ పరబ్రహ్మ భావనలను మించి మాధుర్యోపాసనచే అచింత్య భేదాభేద భావమున సిద్ధిని పొంది, శ్రీకృష్ణ భగవానుని రస, స్వరూప శక్తియందు పాల్గొని, అతని యానంద సౌందర్య ప్రేమలలో నోలలాడినది.

ఆముక్త మాల్యదా ప్రబంధావతరణమున కామె దివ్య ప్రేమయే కారణమగుటచే కవి అందలి దశాంతరములను కొంత వివరముగ చిత్రించినట్లగపడును. పూర్వ జన్మమందామె భూదేవి, విష్ణుచిత్తునకు ముకుంద ప్రసాదమున తులసీ వనమున శిశుప్రాయమున లభించి, ఆయన ధర్మగేహినిచే గోముగ పెంచబడెను. అంతకు ముందే ఆమె వయస్యలు నాగకన్య లిరుగుపొరుగు భాగవతుల గృహముల జనించిరి. ఇంతలో ఆమె బాల్యము జారి ప్రేమాయణమునకనుకూలమగు నవ యౌవన సీమలో కాలిడెను. ఆ సంధి సమయమందామె వయస్యలు లక్ష్మీనారాయణుల బొమ్మల పెండ్లి పాడెడు నారాయణుని కళ్యాణ గుణముల నద్భుత మొప్పగ వినగ వినగ-ప్రాగ్జన్మ సంస్కారము వలన అతనినే వరునిగ పొందవలెనను ఒక అలౌకిక బుద్ధి జనించెను. అప్పటి నుండి ఆమె జీవితమొక ప్రేమ తపస్సుగా మారెను. అందు మొదటి దశలో ఆమె నారాయణుని అవతారలీలను పదే పదే లోలోన స్మరించుచు వర్తిల్లెను. ఆ స్మరణ తానా నారాయణునకు తగునా? యను సందేహముగ మారెను. సందేహమొక చిన్నారి చేష్టకు త్రోవ తీసెను. తండ్రి మన్ననారు స్వామి అలంకరణకై కట్టి బుట్టలో నుంచిన కమ్మ చెంగలువ పూలతోమాలి ఆమె నాకర్షించెను. వానినామె, తనముంగురులు దువ్వి, ఎడమ వొకింత యొరుగునట్లు క్రొత్త రీతిగా చుట్టిన ధమ్మిల్ల వలయమున ఎడుగున నెవ్వరెరుగకుండునట్లు ప్రేమతో కొంత సేపు కీలించి, బావి నీటిలో నీడ చూచుకొని మురిసి, వానిని మరల తండ్రి పెట్టిన చోటున నుంచ సాగెను. ఎన్నాళ్లీ వట్టియాసలతో మురియ గలదు! మాలలను పెట్టుకొనుననే గాని, వాని వలన నామెకు వసూయ కలుగ నారంభించెను. కాని, ఎవరితో ఏమని చెప్పుకోగలదు? తన మనోహరుని గుణములు పాడిన వారి నామె "నీపాడిన హరి చందములే పాడిగ (న్యాయముగ) తలపవచ్చును". ఇతడు తనను ప్రేమించిన సతులను కాపాడినాడు. రాముడై సీతను,.శూర్పణఖను, కృష్ణుడై గోపికలను ఏమి సుఖపెట్టెను?" అని యుపాలంభించెను ఈ యుపాలంభన మరింత నిస్పృహకు కారణమై రాత్రిళ్లు నిద్రపట్టక పడకలో పొరలాడుచు, తన వంటి ఆడు పుట్టువునే నిందించుకొన చేసెను. ఈ యూపాలంభన ఊరట కల్పించక, పునః పునః స్మరణ కారకమై తాపమున చీకాకు పరచుటచే, ఆమె నానాటికి చిక్కిపోసాగెను.

ఇదంతయు, ఆమె చెలులకామె అంతరంగ మందలి దివ్యానురాగమును తేట పరచెను. వారామె ఇంగితము నామెచే బహిర్గతముగా చెప్పించి, ఆమె చింతను మాన్పకపోయినచో ప్రమాదమగునని ఆమె గుట్టును గేలిచేయ సాగిరి. వారి గేలి మాటల కామె నవ్వు నాపుకొని, లేనికోపము జూపి, కాదుపొమ్మని తేల పలికెను.

వారిని తేల పలికెనే కాని లోన భారమెట్లు తెలిపోగలదు. ఒక నిందా వ్యాజము నైన, తన మనోవేదనను వెళ్లబోయు అవకాశము లేదు. దాని నడచిన కొలది అది పుటపాకాగ్నివలె ఆమెను మరింత అలయించెను. అయినను దాని నామె సహించి, అయినను ఉండలేక ఒక్కొక మాటు రాత్రి వేళయందొంటి పాటున, వేణుగోపాలుని మోహన రూపమును స్మరించుచు, రాధను నిందించుచును. ఈ మాటలను పొంచి విన్నయామె స్నేహితురాండ్రు ఆమె ఎదుటబడి నిగ్గదీసి యడిగి, తుదకామె పూర్వ జన్మమున సత్యభామయని వెల్లడించిరి. దీనితో ఆమె ప్రేమ తపస్సు మరియొక ఘట్టమారంభించెను. వారి మాటలు వినుచునే ఆమెకు పూర్వ జన్మ మందలి క్రీడా ప్రపంచము అనుభూతమయ్యెను. దానితో ఆమె శ్లథాంగియై, సోలి, తెలిసి కనువెరచి, ఈ జన్మమున నాతనిని పొంద సాధ్యము కాదు గాన ప్రియాలాభ దశలో తండ్రి తన నితరుల కియ్యక ముందే, యోగ శక్తిచే తనువును పోగొట్టెదనని నిశ్చయించెను. సఖులామె వేగపాటును వారించి, ఆ యదువంశ సుధానిధి శ్రీరంగనాథుడై వెలసెనని, అతడు విభుడగుటకు తమ యూరి హరిని భజింపుమని, ఆమె అలుపు తీర్చిరి. చెలి కత్తెల ఆశా సందేశము వలన ఆమె గుండె కోత మరింత నిశితమయ్యెను. సఖురాండ్ర సమాశ్వాసమామెను కొత్త వలవంతకు పాల్పరచెను. ఇంతలో ఆశ, ఇంతలో నిరాశల రాపిళ్లలో ఆమె గుండెకోత మరింత బాధాకరమయ్యెను. ఆమె చేతన, వేళవేళకు వెలులిడు తెలివి వెలుగులతో, అంతలో మాగు చింతల చీకట్లతో అవ్యవస్థితమై, ఉదయ, మధ్యాహ్న, సాయంకాల జాగ్రదవస్థలలోను, రేయి స్వప్నావస్థలోను, ఏ పొద్దు కనుగొందక, సకల కాలముల నూరట లేని ఆరాటముల సందడించెను.

స్వప్రయత్నమున కట్టుబడని ఈ తొందుదుకుల నాపుటకామె దృష్టి ఆ యూరి మన్ననారు నారాధింపుమని చెప్పిన సఖుల సూచన నాశ్రయించెను.

అది మార్గళి. నిండు చలికాలము. ఆ నెల నాళ్లామె ఒక్కొక్క దినవ్రతమును కల్పించుకొని, ప్రత్యూషముననే మౌన నియతితో మేల్కొని, ఇంటి వెనుక దిగుడు బావిలో స్నానమాడుచు, రోజున కొకటిగా తాను రచించిన పూజా గీతము ననుసంధించుచు, నొసట గుమ్మడి గింజవలె తెల్లని మట్టి తిలకమును ధరించి, చెలులతో కూడి, అరటి పండ్లను తీసికొని గుడికిపోయి, మ్రొక్కి, వేదికపై రంగురంగుల ముగ్గులు పెట్టి, కపిల గోనేతితో దీపకళికను తీర్చి, ద్వయ మంత్ర పూర్వకముగ స్వామి వక్షమున గలుప దండల చేర్చి అగరు ధూపము లిడి, హృద్యమగు చక్కెర, నేయి, అరటి పండ్లను నైవేద్యమిచ్చి, అఖండ స్థిరభక్తితో తాంబూలము సమర్పించి, గర్భ గృహ ప్రదక్షిణము చేసి, వినీతయై, శఠ కోపము ధరించి, చరణ తీర్థము కొని, స్వామి ప్రసాద లబ్ధమగు మాల్యము దాల్చి, తిరిగి ఇల్లు చేరెడిది.

ఇల్లు చేరుటే గాని అచటామెకు శాంతి కలుగుటకు బదులు గుడిలో కలిగిన స్థైర్యము చెదిరిపోయెడిది. చెదరిన ధైర్యము కూడ గట్టుట కామె శ్రీకృష్ణుని గుణములను స్వరచిత తమిళ గీతములతో (నాచ్చియార్ తిరుమొళి) పాడుకొనెడిది.

ఇట్లామెకు చలికాల మంతయు అనురాగతాపముతో గడచెను. ఇంతలో సర్వప్రాణి చైతన్యముల నవరాగోదయము చేయు వసంతము వచ్చెను. మోడులు చిగిర్చెను. చిగురులు పూచెను. పువ్వులు కాయలయ్యెను. కాయలు పండ్లయ్యెను. కాని ఆముక్త మాల్యద ఆశాలత వాడియే యుండెను. శ్రీపతిపైన గీతములు ప్రేమ విపంచికపై పాడుటయే కాని, అవి యామెకు మనో రంజకములుగా లేవు. గళము గద్గదమగుట కాశ్చర్యపడి మ్రాన్పడుటతో నవి యంతమగుచుండెను. తొలి దశలో స్వామికిచ్చిన మాల్యములను ధరించి, సింగారించుకొను సరదా పోయి, సొమ్ములన్న చీరలన్న చికాకు ఏర్పడెను. పూర్వము వికాసము కొరకు వానినిమార్చెను. ఆమె ఇపుడు

చికాకు తొలగుటకు మార్చి మార్చి, ఈ మార్పిడో వ్రత నిష్ఠ కొరకన్నట్లు నటింప వలసి వచ్చెడిది. ఎంత తెలివితో సంచరించినను ఆమె వలవంత దాగక తండ్రి కంటబడెను. ఆయన ప్రేమ తపస్సు నెరుగడు. తనకు బిడ్డలు లేరు. ఉన్న ఈ బిడ్డ ఇట్లుండుట కాయనకు నెవ్వగ కలిగెను. ఆవగ పెరిగి పెరిగి, రోజా రోజునకు పెరుగు తనయ తను గ్లాని వలన అత్యంత దుఃఖమయ్యెను. ఈ వింత తపమునకు కారణమెరుగక అతడామెను వారింప జూచెను. వారించిన కొలది ఆమె వలవంత, తన దుఃఖము పెరిగెను. ఇక భరించలేక అతడు తాను కొలుచుచున్న మన్ననారు గుడికి పోయి, నమస్కారానంతరము, పునర్నమస్కృతిని జేసి, "స్వామి! మీదాసి యగు నా పుత్రిక ఏమి గురించియో విచిత్రమగు వ్రత చర్య చేసి శరీర శోషము చేయు చున్నది. వలదన్న వినదు. అపుత్రకుడనగు నాకు పుత్రియైనను, పుత్రకుడైనను తానే. నేనేమి చేయుదును. మరి ఆ తపశ్చర్య మా తపశ్చర్య వంటిది కాదు. ఇది ఏమి తపమో! ఉన్మాదము కాబోలు! ఎంత భవదీయ భక్తి కలిగినను, మాబోంట్లకు ప్రకృతి సంబంధము విడువదు. అంతర్యామియగు నీ వెరుగనిది లేదు. దీని తెరుగు ఎరిగింపవే" యని విన్నవించెను.

అప్పుడా స్వామి "ఈమె భూదేవి. వరాహ విష్ణువు వలన మాల దాసరి గాన పూజా మహాత్మ్యమున భ్రష్ట బ్రహ్మ రాక్షసునికి పూర్వ రూపము కలిగించిన కథను విని, విష్ణు పూజోపచారములలో గానము విశేష ఫలప్రదమని, ఆమెయు వైష్ణవి గావున, ఆ గాన పూజ నాచరించు కుతూహలమున నీకు కూతురుగా లభించినది. అందుచే భగవద్వియోగ మిషచే, రాత్రింబగళ్లు విష్ణుగాథా సమేతమగు గీత రసమున ప్రొద్దు పుచ్చుచున్నది. ఇంత కంటె వరము లేదు. రంగనాథుని సేవించుట కామెను శ్రీ రంగమునకు తోడుకొని పోయిరమ్ము. అంతయు మేలగును" అని సెలవిచ్చెను.

విష్ణు చిత్తుడిది విని "ప్రసాదము" అని మరల ప్రణామము చేసి, పసి పల్లకిలో కుమార్తె నుంచి, అనేక పరిచారికలును భాగవత పరిషత్తులు కొలువగా, ప్రయాణ పర్యాయములతో పరమానురాగమున శ్రీరంగమునకు పోయెను.

అచట గర్భాలయమున ప్రవేశించి ఆముక్త మాల్యద రంగనాథుని పద పంకజములకు కుసుమాంజలు లర్పించు చుండగా, ఆమెలో పొంగిన, నిర్భర ప్రేమావేశమునకు చింతలచే చితికిన ఆమె శరీర పంజరము తాళలేకపోయెను. ఆమె యాత్మ దానిని ఛేదించుకొని రంగనాథుని కృపకు పాత్రమై, శుద్ధాంత సీమను జేరి, ఆయనలో రసైక్యమును చెందెను.

ఆముక్త మాల్యద దివ్య ప్రేమ గాథ ఇంతటితో ముగిసినది. కాని దానిని మంగళాంతము జేయుటకు కవి మరికొంత పెంచి, విష్ణు చిత్తుడు తనకుమార్తెను తన యనుమతి లేనిదే అన్యాయముగా రంగనాథుడు లోనైచి కొనెనని అదవెట్టుట, భాగవత క్షోభమునకు ఆ భువన భర్త భయపడి, ఆమెను తండ్రి విడిది ఇంటికి చేర్చుట, తరువాత బ్రహ్మేంద్రాదుల ద్వారమున పెళ్లి రాయబారమంపుట, విష్ణు చిత్తుడందుకంగీకరించుట, రంగనాథుడు దివ్య మార్గమున విష్ణుచిత్తునింటికి తరలిపోవుట, అచట సశాస్త్రీయముగ ఆముక్త మాల్యదా రంగనాథులకు పరిణయమగుట, వారు రససామ్రాజ్య మేలుటతో ముగించెను.



# ఆముక్తము-ద్వివిధ శైలి

ఆముక్తమున నించుమించు సగము భాగము నాక్రమించిన కథా కథనమున సమస్త ప్రజలకు సుబోధకమగు బాసాడు తెలుగు వినిపించును. సగమునకు కొంచెమెక్కువ భాగమున పండితులకే దుర్బోధమగు జటిల సంస్కృతము, బహు శాస్త్ర పాండితి, విజృంభించును.

రాయలు బాసాడు తెలుగు నవలంబించుటకు రెండు కారణములు కనుపించును. మొదటిది శ్రీ వైష్ణవాభినివేశము - రెండవది ఆంధ్ర విష్ణుని ఆనతి.

వైష్ణవ మాయున ఆత్మకు వ్యక్తిగతముగు ఉజ్జీవన హేతువగుటయే గాక, మహా సామ్రాజ్య నిర్మాణమున కర్ణాటాంధ్ర ద్రావిడులలో సార్వజనీనమగు భావ సమైక్యమును సాధించుటకు ఉపకరణముగ భావించెను. ప్రజా సామాన్యమున వైష్ణవ మత ప్రచారమునకు ఉదాత్తములగు పూర్వగాథలుపయోగించినంతగా శా[illegible] చర్చలుపయోగించవు. అందుచే రాయలు సంభాషణాదులలో ప్రజల నుడికారమును మిక్కిలి మెలకువతో పాటించెను. ఈ మెలకువలకు

*తెలుగదేలయన్న దేశంబు తెలుగేను*

*దెలుగు వల్లభుండ! తెలుగొ! కండ!*

*యెల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి,*

*దేశ భాషలందు దెలుగు లెస్స!*

అను ఆంధ్ర విష్ణుని ఉద్బోధము ముఖ్య కారణమనుట సంభావ్యము. కళింగ దండయాత్రలో రాయలు శ్రీకాకుళ నికేతనుడగు ఆంధ్రమధుమథుని సేవింపబోయి, హరివాసర ఉపవాసమున్న నాటి రాత్రి స్వామి అతని కలలో సాక్షాత్క రించి, రసికుల మెప్పుకై రాయలు రచించిన గీర్వాణ కావ్యములను ప్రశంసించి, "ఇట్టి నీకు ఆంధ్రము అసాధ్యమా? అందునాకు ప్రియముగా నొక కృతిని వినిర్మింపుము"ని ఆనతిచ్చి, కావ్య

వస్తువు ఆముక్త మాల్యద పెండిలి వృత్తాంతమని, భాష, ప్రజలు భాషించు (బాసాడు) తెలుగని నిర్దేశించెను.

ఎప్పుడో ఆంధ్ర దేశమును పాలించిన ఆంధ్ర విష్ణువునకే తెలుగును గూర్చిన మమకారమింత నిలిచి యుండగా, ఎందరో తెలుగు కవులను పోషించి, వారి కృతుల నంకితము పొంది, తెలుగు వారి నాకర్షించ దలచిన రాయల మాట చెప్పవలెనా? ఆయన అప్పుడపుడే తెలుగు సీమల నుండి ఓఢ్ర గజపతులను పారద్రోలి క్రొత్తగా తెలుగు నాటికి ప్రభువయ్యెను. సార్వజనీనమగు బాసాడు కంద తెలుగున తన వైష్ణవ సందేశమును జన ప్రియము చేసి తాను జన ప్రియుడు కావలెను. వారి మధ్య భావ సమైక్యతను వర్ధిల్ల జేయవలెను. కావ్య కథలలో నెచ్చట జూచినా తెలుగు సంభాషణలోని ఒడుపులు, నుడికారపు సొంపులు వెలార్చును. 'తెలుగదేల' అని అలతి అలతి పద విన్యాసముతో నాట్యమాడిన ఆట వెలదియే ఇందుకు మొదటి దృష్టాంతము.

ఇట్టిదే తెలుగు సంభాషణ వైచిత్రిని తెలిపెడి ఒకటి రెండు పద్యములను చూతము.

***నీ యిచ్చయె మిన్నక పో***
***వోయి మునిప్రవర! విన్ను ఒప్పింతును భూ***
***నాయకు సభ ఇందులకై***
***యే యద్దము వలవదు - అవల వేసువ్వాదవ్***

ఇది పాండ్యరాజు సభలో ప్రతి వాదులను గెలిచి, రాజును వైష్ణవునిగా చేయుమని మన్నారు స్వామి విష్ణుచిత్తున కానతిచ్చినపుడతడందులకు సమర్థుడను కానని విన్నవించినప్పటి స్వామి వచనము. దీనిలో స్వామి ప్రాభవము, అతని మాటలలో బాసాడు ఒడుపు, ప్రస్ఫుటములు.

కేశిధ్వజుడు తన ధేనువు పులివాత బడినపుడు, యజ్ఞము భంగము కాకుండ ప్రాయశ్చిత్తము తెలియుటకు అంతకు పూర్వము తనచే పరాజితుడై అరణ్యవాసమున నున్న ఖాండిక్యుని సమీపించినపుడు ఖాండిక్యుని మంత్రులతనిని చంపుమని చెప్పిన ఘట్టమున పద్యములు నుడికారపు నడుపులతో నిండియున్నవి.

*"ఇంక రెన్నాళ్లు మూచి, నీవంక వెనుక*
*గలుగకుండిన బ్రజలూళ్లు దలచిపోవ" --- (3-39)*

***"ఈవేళ బలియు నలరిం***
***బో విడిచితి పొమ్మువాడు పోయిన రాజ్యం***
***బేవిధి గ్రమ్మఱ నావెర***
***నీవారవని వ్రేలు మడచి యేర్పడజెపుమా!" (3-44)***

ఇట్లే, వెళ్లి శైవము ముదిరిన పాండ్యరాజా యామున నటుని తోను (4-60), ఆముక్త మాల్యద తన సఖులతోను. (5-56) విష్ణుచిత్తుడు రంగనాథునితోను, (7-49), ఆడిన సంభాషణలు బాపాడు తెలుగుకు దృష్టాంతములు.

రాయల ద్వివిధ శైలిలో రెండవది - ప్రబంధ లక్షణముల ననుసరించి విద్యా స్పర్థతో కూడిన ప్రౌఢ శైలి. దీని మూల పురుషుడు కుమార సంభవ కర్తయగు నన్నె చోడుడు. ప్రబంధ రచనకు జాను తెనుగును నిర్ణయించిన ఈ కవి రాజ శిఖామణియే అందుకు భిన్నముగు కట్టడి కూడా యేర్పరచెను. ఆయన దృష్టిలో ప్రబంధము పది ప్రాణములు, తొమ్మిది రసములు, పదునెనిమిది వర్ణనలు, ముప్పదియారు అలంకారములు, డెబ్బది రెండు భావములతో కూడి, పద బంధముల నగ్గలించి, బుధ శబ్దభ్రాజమై, దుష్కవి హృత్సరోజ వనములను భంజింపుచు, జగన్మాన్య ప్రభావముతో ఎందును మారులేక, మదనాగము వలె గ్రాలవలెను, సత్కవి కావ్యము విలుకాని అమ్మువలె పరహృద్వ్యధమై తల యూపించనిచో అదొక కావ్యమా? అతడొకవీరుడా?

పాల్కురికి సోమనాథుడు కూడ ఈ ప్రబంధ లక్షణములను శిరసావహించెను.

అసలీ విద్యా స్పర్థ నన్నయ గారితోనే ఆరంభమయ్యెను. ఆయన తన కాలపు వేంగి విద్వత్ పరిషత్తుల ప్రాతికూల్యమును అధిగమించి, వారిని మెప్పించవలసిన వాడయ్యెను. (ఆరుద్ర-1-142)

ఈ వివాదములను ఆయన ఘోరరణముతో పోల్చి, 'పాయక పాకశాసనికి' 'భారత ఘోర రణములో' నారాయణుని వలె తనకు సంస్కృత కర్ణాటక ప్రాకృత,

వైశావిక, ఆంధ్ర వాఙ్మయ ధురంధరుడును, కవిరాజ శేఖరుడును అయిన నారాయణభట్టు అభిమతముగా తోడ్పడినట్లు చెప్పుకొన్నాడు.

ఆనాటి నుండి తెనుగు కవిత శంఖమున బోసినగాని తీర్థముగాకుండెను. మధ్యమధ్య తిక్కనాది మనీషులు ఒప్పియునను జాత్యము కాని సంస్కృతమును తెనుగు కృతులలో చొప్పించకున్నను, రానురాను రాయల నాటికి తెలుగు ప్రబంధ కవులు కవిరాజ శిఖామణి కట్టడి ననుసరించి, పోటా పోటిగ సంస్కృత పదభూయిష్ఠమగు ప్రౌఢతర ప్రబంధములను రచించుట పరిపాటి అయ్యెను.

జాను తెనుగు వాదులగు నన్నె చోడుడు, పాల్కురికి సోమనాథుడు కూడా పండితుల మెప్పుకై ఒకరిని మించి ఒకరు గాఢ సంస్కృత విద్యా స్పర్థ ఆకాశము నంటెను. రాయలీ పద్ధతి నవలంబించి, ఆంధ్ర ప్రబంధ కవులందరికన్న దుర్గ్రాహమగు సంస్కృత సమాసములతోను, పదజాలముతోను, అలంకారములతోను నింపెను.

నన్నెచోడ, సోమనాథులు ప్రబంధ లక్షణములను పాటించి బహువిధ వర్ణనాదులను చేసినను, అవి మితముగా నుండి, వారి కావ్యములు కథా వస్తువు ప్రధానముగ నుండెను. ఏ పురాణము నుండో ఇసుమంత కథను గ్రహించి, ప్రబంధ సంప్రదాయము ననుసరించి, కృత్రిమ వర్ణనల భావము క్రింద అంగారునట్లు చేయసాగిరి. వీరు తమ కావ్యములు రాజ సభలలో కవి పండిత రసికులచే ఔననిపించుకొనుట ప్రధాన లక్ష్యమయ్యెను.

భాషా పాండితియే గాక తన కృతి యందు సుకవి నన్నెచోడ కవిరాజ శిఖామణి విధించినట్లు అరువది నాలుగు విద్యలను ప్రదర్శించుట పరిపాటి అయ్యెను. రాయల నాటికి వరవడి స్థిరపడి కవులలో విద్యా స్పర్థలు సామాన్యమయ్యెను.

రాయల భువన విజయ సంపత్తు ఇట్టి విద్యా స్పర్థతో కూడిన ఉద్దండ పండితులకు నిత్య నిలయమయ్యెను. ఆంధ్ర పండితులే గాక, కన్నడ, తమిళ, మళయాళ పండితులకు ఆశ్రయమయ్యెను. సాహితీ రంగము సమరాంగణ మయ్యెనని

తెల్పు గాథలిప్పటికీ ప్రచారమందున్నవి. భువన విజయ సభలో రాయలు విసరిన సవాలు నెదురుకొని, సంస్కృతాంధ్రములందు ప్రౌఢ పద్యమాలిక నాశువుగా చెప్పి, రాయలచే గండపెండేరము తొడిగించుకొన్న పెద్దన గాథ దీనికొక దృష్టాంతము మాత్రమే! ఈ సమస్త సాహితీ సమరాంగణమునకు, రాయలు సార్వభౌముడు.

ఆయన పట్టాభిషేక కాలమునకు (1509) కావ్యాలంకార మర్మజ్ఞుడని పేరు పొందెను. అష్టదిగ్గజములలో పేరు మోసిన తిమ్మన, పెద్దన, లాయనకు పారిజాత మనువుల నంకితమిచ్చిరి. వానిలో రాయలను- "కవితా ప్రావీణ్య ఫణీశ" "సాహితీ, సమరాంగణ సార్వభౌమ" యని, "భోజక్ష్మాపతి విద్యాపరిపాక" యని పరిపరి విధముల కీర్తించిరి. ఈ ప్రశంసలు ఆముక్త రచనకు పూర్వమే కలిగెను. ఈ కవుల మాటకేమి- ఆముక్త రచనకు స్వప్నమున ప్రేరేపించిన ఆంధ్ర విష్ణువే రాయల రచనలను ప్రశంసించెను. ఆయన రాయలు రచించిన సంస్కృత కావ్యములను పేర్కొని, వానియందతిశయించిన ఉత్ప్రేక్షాదులను, నిధులుగా దాగిన భావ వ్యంగ్య ధ్వనులను, పేర్కొనెను. వీనిని రసికులౌననిరి. పండితులను మెప్పించుటకిన్ని రచనలు చేసినవాడు తనకు ప్రియముగునట్లు ఆంధ్ర భాషయందొక కృతి నిర్మింపడా? ఆంధ్ర భాష ఆతనికసాధ్యమా?

ఆంధ్ర విష్ణుని కోరిక రాయల కొక ఆనతి. రచనోద్దేశము స్థిరపడు సమయమున తెలుగు రాయని ప్రశ్న అతనికొక సవాలు.

రాయలు తెల్లవారగనే, కొలువున ఎల్ల జనులను కానిపించుకొని ఆంధ్ర విష్ణువు తనకు కలలో కాన్పించిన స్వప్న వృత్తాంతమును వారికి చెప్పెను. వారు హర్ష విస్మయ స్వాంతులై ఆ స్వప్నము సూక్ష్మాంశములను వివరించి చెప్పిరి. దాని వలన కలుగు అనేక శుభములు పేర్కొని, ప్రబంధ నిబంధనము గావింపుమనుట రాయల కితోధిక గాథ పారస్పర్యోద్బోధనమును సూచింపుమనని చెప్పిరి. వారంతటితో ఆగక, 'అఖర్వ మహిమాతిధూర్వహుండగు తుర్వవంశంబునం బుట్టినట్టి' నీకిట్టి శోభన పరంపరలే మద్భుతమని ఆయన వంశమును కీర్తించి ప్రోత్సహించిరి.

*ప్రబల రాజాధి రాజ వీర ప్రతాప*
*రాజపరమేశ్వరార్థ దుర్గాపతీశ*
*సాహితీ సమరాంగణ సార్వభౌమ*
*కృష్ణరాయేంద్ర! కృతి వినిర్మింపు మనిరి" (1-44)*

ఈ సంకీర్తనమే కృత్యాదిని చేరి, కృతి రచనలో నొక యంశమును కృతిపతి వంశాదిక వర్ణనాభాగమును పూర్తి చేసెను.

ఇట్లు విద్యాస్పర్ధతో ద్వివిధ కావ్య రచన యందు పండిత కవులచే ఔనని మెప్పించికొని, మరల ఆ విద్వజ్జనముల చేతనే కావ్య రచనకు ప్రోత్సహింపబడిన రాయలాముక్తమును పండితులు విస్మయ స్వాంతులగునట్లు సంస్కృత పద, సమాస గుంభనలతో, ఆంధ్ర విష్ణువుగ్గడించిన ఉత్ప్రేక్షాద్యలంకారాతిశయములతో, తెలుగు ప్రబంధ మర్యాదలననుసరించి, పుర, ఋతు వర్ణనాదులతో సంస్కృత సాము గరిడీలతో రచన సాగించెను. వీనిని చూచియే నేటి పండితులు రాయల ఆముక్త శైలి యంతయు గాఢ, ద్రాఘిష్ఠ సంస్కృత సమాస భూయిష్ఠమని, పాషాణ కల్పమని, పాకము నారికేళమని, దుర్గ్రహ ప్రౌఢి వలన పఠితృతతిచే త్యక్తమైనదని, వ్యాఖ్యలే లేనిచో యేనాడో అంతరించి యుండెడిదని, అసమగ్ర పరిశీలనా ఫలితమగు ఒక అర్థ సత్యమును లోకమున ప్రచారము చేయుటచే, సహృదయులు ఆముక్త రసాస్వాదనా యత్నము నుండి విముఖులగు చున్నారు. ఇది పూర్ణ సత్యము కాదని, కావ్యమున సగమునకు పైబడిన కథా భాగమంతయు, సామాన్య సాహితీప్రియులకు కూడా సుబోధ్యమై, రసవంతమై, ఎట్టి వ్యాఖ్యల నపేక్షింపకయే ఆముక్తము ఐదు వందలేండ్లు సజీవమై సహృదయ రంజకముగ నున్నదని ఈ రచయిత యూహ.

**బాహాదు కండ తెలుగు - రాయల అనుభవము**

రాయల సంస్కృత కావ్య రచన పండిత ప్రశంస నందికొనుటకు. కాని ఆముక్త రచన ఆంధ్ర జలజాక్షుని ప్రీతికొరకు

*"ఆంధ్ర భాష అసాధ్యంబె? అందువొక్క*
*కృతి వినిర్మింపుమింక మాకు ప్రియము గాఁగ" (1-13)*

దుస్సాధ్యమగు గీర్వాణ భాషయందే పండితులు మెచ్చు కావ్యములను రచించిన రాయలకు నిత్యము నాలుకపై యుండు ఆంధ్ర భాష అసాధ్యమా? విశేషించి, తన ఆరాధ్య దైవమగు విష్ణు ప్రీతికై ఒక్కగా నొక్క కృతి అసాధ్యమా? ఆ తెలుగు తీరుతెన్నులు చెప్పవలసిన కారణము తెలుగు వల్లభుడే నిష్కర్ష చేసెను. ఈ నిష్కర్షయే రాయల సంస్కృత శబ్దార్థమునకు వెలియలికట్టయై నిల్వరించకపోయినచో దాని పొంగు కథా భాగమును కూడా ముంచెడిది.

ఏ కావ్య భాషయైనను ఆయా దేశ కాల ప్రభావితమగుట సువిదితమే. కావ్య భాష ప్రౌఢమే అయినచో అది దుర్గ్రహమను పండితుల యాక్షేపణ అపోహ యెట్లగును? రాయల కావ్య భాండారమున రెండవ యరను దర్శించినచో దుర్గ్రహమను ఆక్షేపణ ఎట్లపోహయగునో తెలియును. దానికి గూడ ఆంధ్ర విష్ణుని ఆనతియే ప్రమాణము.

<u>రాయల బాపాడు తెలుగు భాండారము</u>

పండితులౌ ననుటకు వారిచే మెప్పించుకొనుటకు వ్రాసిన సంస్కృతము నటుంచి, ఆంధ్ర భాష నొక్క కృతిని నిర్మింపుమని యానతిచ్చిన ఆంధ్ర జలజాక్షుడు అందలి ఇతివృత్తమును, అందుపయోగించు తెలుగు స్వరూపమును కూడ ఆనతిచ్చెను.

దేశమా (దేశ ప్రజలా) తెలుగు-నేనా తెలుగు ప్రభువును, తెలుగొ కలకండ దేశ భాషలలోనా అదిలెస్స! అని యింతగా కీర్తించిన లెస్సదనమేమి? దానిని కూడ ఆంధ్ర విష్ణువే సూచించెను. తెలుగు తీపి, తెలుగు -లెస్సదనము దాని బాపాడు యొడుపులో (సంభాషణా వైచిత్రి)లో నున్నది. రాయలీ ఆంతర్యమును గ్రహించి కథనంతను అట్లె నడిపెను. అసలీ తెలుగు వల్లభుని వాక్యమే అందుకు నిదర్శనము. దీనిలో తెలుగుదనము, బాపాడు రీతి ఉట్టిపడుచున్నవి. సంస్కృత భాషకు పద సమాస ఘటన నైజమైనచో తెలుగునకు అలతి అలతి తునియల కూర్పు ప్రాణమని కవి బ్రహ్మ తిక్కన యంతటి వారి అభిప్రాయము గదా! ఆంధ్ర విష్ణువిట్లు పలికిన చిన్ని ఆట వెలది, ఆట తుంపులతో అటుకబడినది. ఇది తెలుగు తనమున కొక మచ్చు. ఇందలి తెలుగు బాపాడు ఒడుపేమి?

ఆంధ్ర విష్ణుని ఆనతి కర్తకర్మ క్రియాత్మకమగు వ్యాకరణోచిత వాక్యముగ నేర్పడలేదు. తెలుగెందుకందువా దేశము తెలుగు. నేనా తెలుగు వల్లభుడను. తెలుగొ-కండ! ఏవిలో కర్త, కర్మ, క్రియా నిర్మితముగ వాక్యము లేదు. ఇది తెలుగు మాటాడు రీతి, అయినను, భావమును ప్రకటించుటలో ఇది పూర్ణవాక్యము కన్న సమర్థముగ నున్నది. మరియు సంభాషణలో "ఇందు వలన ఇది అందువలన అది" యను చప్పిడి పద్ధతి కంటె "ఎందుకందువా? నీవెరుగవా?" అను యెదురు గొండి ప్రశ్నలు తెలుగువారి నుడికారమునకు వడిబెట్టి మెలిత్రిప్పును.

ఇంత సంయుక్తముగ, ఇంత స్పష్టముగ, ఇంత దృఢముగ తెలుగు వల్లభుడు బాసాడు తెలుగున ఇచ్చిన యానతిని రాయలు శిరసావహించి కథా భాగమున తెలుగు రాయనికి, తెలుగు వారికి, ప్రియమగునట్లు తెలుగు నుడికారమును గుప్పించి, తెలుగు బాసాడు వడుపును కదను త్రొక్కించెను.

కథలో మొదటి సంభాషణలోనే ఈ తెనుగు బాసాడు వడుపు వినపడును. శాస్త్ర గ్రంథ పఠనమున జాత్యంధుడనని మొరపెట్టు-తన భవన దాసుడగు విష్ణుచిత్తుని విలుబుత్తూరు మన్ననారు స్వామి పాండ్య సభావాదమున పాల్గొని వైష్ణవమును స్థాపింపుమని ఆనతిచ్చును. అతడందుకు తన యసమర్థతను నేకరువు పెట్టుచు విన్నవించును. దానిని త్రోసిపైచి స్వామి ప్రభు దర్పముతో అదలించును.

"నీ ఇచ్చయె? మిన్నక పోవోయి ముని ప్రవర! -" అను పద్యభావమింత నుడికారపు సొంపును వెలార్చుచున్నది.

నీ యిష్టమేనా? మొదలకుండపో! ఆ సభలో గెలిపించునది నేను. అవతల నేనున్నాను-ఈ భాష తెలుగు వారి నోట ఈ-నాటికిని విను తీరు!

*"భూవల్లభుడెట్టెట్టు!*
*లా వాదము జేసి, శివమతంబు జయింప*
*గావచ్చెనా? మూలముగా!*
*రావింపుమటన్న"*

ఇది శైవరాజా తన మతము నోడించుటకు యామునుడు వచ్చెనని రాణి చెప్పగా అదరిపడి అన్నమాట.

యజ్ఞధేనువు పులివాత బడినప్పుడా ప్రాయశ్చిత్తము తెలియుటకు కేశిధ్వజుడు నిరాయుధుడై, ఖాండిక్యుని వద్దకు రాగా, అతని మంత్రులు కేశిధ్వజుని చంపుమని చెప్పిన యుక్తులు-ఇవి. వారి వ్యావహారిక ప్రౌఢికి, సంభాషణా చాతురికి, తెలుగు నుండికారమునకు తార్కాణములు.

ఆముక్తమాల్యద తన భగవత్ ప్రేమను సఖులకు తెలియనీయక దాచి, వారు వేధించగా, 'పోనిండే' అని తేలబల్కెను. అందులకా సఖులామె నెట్లెత్తి పొడుతురో, ఆయెత్తి పొడుపుల్లో తెలుగు కన్నెల గడుసుదనము, సంగీతపు నొక్కులు, నుడికారపు పొడుపులు - ఎట్లు గల గల లాడునో మచ్చుకు ఈ పద్యము.

*'పోనిండన్న, వయస్యలిట్లని రసుంబో నిక్కమింకిప్పుడే*
*కాని- మ్మింకొక కొంత సేపటికి నేకానీ, సఖీ యిల్లియే*
*కానీ! నీ నుడి దన్నవోక్క గుణముల్లానీ, తదన్యాయము*
*ల్లానీ, చెందిన జెంత నీకతవినై గాకెవ్వరిందేల్చెదే!*

ఈ విధమైన సంభాషణాల పడుపుల్లో, నుడికారపు సొంపుల్లో రాయలు తిక్కనను తలపించును.

## ఆముక్త సంస్కృత శైలి - వేదము వారి సమర్థన

మహా మహోపాధ్యాయులు, అభినవ మల్లినాథ సూరి యగు శ్రీవేదము వెంకట రాయశాస్త్రి పాదులు బహుకాలమనేక కష్టముల నెదురుకొని, పండిన పరిజ్ఞానముతో, తమ పెద్ద తనమున ఆముక్త మాల్యద కనవ్య ప్రతిభతో సంజీవనీ అను విపుల వ్యాఖ్యాన రచించిరి. (మొదటి ముద్రణ) అందు రాయలను గూర్చి, ఆముక్తమున ఆయున చూపిన బహుముఖ వైదుష్యమును గూర్చి - 148 పేజీల పన్నయుచ్చుగల పీఠికను రచించిరి. అందులో ఇమిడిక అద్భుతము. మరొకరైనచో దాని నైదారు వందల పేజీలకు తక్కువగా వ్రాయులేరనవచ్చును. పీఠికలో వారు ఆముక్త మాల్యదలోని అనేక భాషా

విశేషములను వెల్లడించిరి. కాని వారి సమగ్ర దృష్టి ఏలొకో ఆముక్త మాల్యద శరీరము వర్ణ భాగమగు కంద తెలుగుపై ప్రసరించలేదు. కవి గుణాదికములను చెప్పుచు, "అతడు మహావీరుడు వ్యావహారికాంధ్ర భాషా పరినిష్ఠితుడు. ఛందో వ్యాకరణ వదీష్ణుడు" అని మాత్రమనిరి. కాని ఆముక్త సంస్కృత శైలిని అద్భుతముగ సమర్థించిరి.

"ఆముక్త శైలి పాషాణ కల్పమనుట అత్యుక్తి - ప్రౌఢమనుట సమంజసము. ప్రౌఢి రసికుల కపేక్షణీయము. దానిచే అద్భుతమగు ఉత్కర్ష కలుగును. మను చరిత్రము ప్రౌఢము కాదా? దాని యర్థమును మహనీయులు జూలూరి అప్పయ్య పంతులుగారు వ్యాఖ్యాన ముఖమున అందరకు తేటపరుపని యెడల అదియు పాషాణ కల్పము కాదా? వసు చరిత్ర, రాఘవ పాండవీయాదుల మాట చెప్పనే అక్కరలేదు. ఆముక్త శైలి పాషాణ కల్పమే అయినను, దానిని భేదించి అర్థము బడయుటచే బుద్ధికుశలత మెండగును. గ్రంథము ధారణార్హము. ధృతము అగును. కఠినతకు, ఇమిడికయు అబిధేయోత్కృష్టతయు, అధికారము చాలమియు కారణములు. అధికారికి క్లేశావహమగు నిస్సార కఠినత దోషముగాని, అనధికారికి అధికారమొసగునదైన సారభూయిష్ఠతా వినిర్మితమయిన ఆముక్తము వంటి కఠిన గ్రంథము పుణ్యఫలము.

ఆముక్త పాకము నారికేళ పాకమనుట కంటె, పరిపక్వ పనస ఫల పాకమనుట మేలు. అది పచనమున గింజలైన త్యజింపనక్కరలేనిది. (వేదము వారి ప్రతి - 1927, పే.59-62-148)

ఆముక్త సంస్కృత శైలి నిటు సమర్థించిన శ్రీ శాస్త్రుల వారి సమగ్ర దృష్టి - వర్ణనాదికమగు అర్థభాగముననే గాని, కథా భాగమును సుందరముగ తీర్చిన కంద తెలుగుపై ఏలొకో ప్రసరించలేదు. అయినను వారు కవి గుణాదికములను చెప్పుచు "అతడు వ్యావహారికాంధ్ర భాషా పరినిష్ఠితుడు" అని ఒక మాట విడిచిరి.

ప్రౌఢ సంస్కృత శైలితో పాటు 'బాసాడు' తెలుగు నుడికారమును శ్రుతి కూర్చిన ఆముక్తము రాయల ద్వివిధ శైలి కుశలతకు గొప్ప తార్కాణము.



# ఆముక్తము - వర్ణనలు

ఆముక్తమున త్రివిధ వర్ణనలున్నవి. వీనిలో పుర, ఋతు వర్ణనలు మొత్తము కావ్యములో నూటికి 29 వంతులున్నవి. వీనిని వదలినను కథాగమనము కుంటుపడదు. మరికొన్ని వర్ణనలు కథలో అంతర్భాగములుగ నున్నవి. వర్ణన పద్యములన్నియు సూక్ష్మాతి సూక్ష్మములగు వాస్తవిక వివరములతోను, కవి కల్పిత అలంకారములతోను నిండియుండును. అందు చేత వ్యర్థ పదములకు తావుండదు. పద్యములు బిగువుగా చేవదేరి, వ్యాయామ స్థిర సంధిబంధుడగు రాయలను తలపించును.

<u>పురవర్ణనలు:శ్రీవిల్లిపుత్తూరు:-</u> ఆముక్తమున శ్రీవిల్లిపుత్తూరు, మధుర, శ్రీరంగములను గూర్చిన పుర వర్ణనలున్నవి. కవి ఈ పురముల విశిష్టత స్ఫురించునట్లు వర్ణనలను రూపొందించెను. విల్లిపుత్తూరును కవి-భక్తి-భక్తులకు, యోగ-భోగములకు కేంద్రమగు గ్రామీణ వైష్ణవ క్షేత్రముగా ప్రదర్శించెను. ఇచటి గృహిణు లుదయమునవే ఉద్యానముల అంతర్భాగములందలి కొలనులలో వనువుతో స్నానమాడి, గృహమాధవుని అభిషేకార్చనలకు తీర్థమును, కలువలను తీసికొని, దివ్య ప్రబంధాను సంధానముతో ఇండ్లు చేరుదురు. ఈ ఇండ్ల ముఖ ద్వారములపైన బంగారు నీరూదినలక్ష్మి, రెండేనుగులు, శంఖ చక్రములు గల చిత్రములుండును. అది దిగువ యరుగులలో ప్రతిబింబించును. ప్రతి దినమా యిండ్లలో అతిథి భాగవతులకు సన్నిధియ్యవు అన్నము, పప్పు, కాల్వలుగట్టునేయి, పలు కూరలు, పాలు పెరుగులు, తాంబూలములతో అర్చన జరుగును. యోగీశ్వరుడగు విష్ణుచిత్తునింట భాగవతార్చన ఆయా ఋతువులకనుకూలములగు పది పదకొండు పదార్థములతో పరమ భోగ్యముగ సాగును. ఈ వర్ణన వలన కవి విల్లిపుత్తూరు భాగవతుల భోగమును సూచించును. ఇతర భోగులపైన కూడ మన్ననారు ఆలయ ప్రభావము వ్యాపించి యుండును. సాయం వేళ, కేళి వన సరస్సుల నుండి గూండ్లకెగిరిపోవు హంసల రెక్కల పెటపెటలు, క్రేంకారములు సాదరిండ్లలో ప్రతిధ్వనించి అచటి వారికి ఆలయ దుందుభికాహళి

ధ్వనులనిపించును. వేశ్యా వీధిలో తమ ఇండ్ల అరుగుల మీద సవిలాసముగ జూదమాడు కళావతులు ఆలయశంఖారావము కొరకు తలలొరగించి యుందురు. శ్రీ కార్యపరులను జూచి అంజలింతురు. ఇట్లు కవి విలుబుత్తూరునొక సాత్త్విక యోగ భోగభూమిగా చిత్రించెను.

<u>మధుర</u>:- ఇది పాండ్య రాజధాని. దీనిని కవి రాజసికమగు వీర భోగ భూమిగ చిత్రించెను. దీని మహోన్నత దుర్గద్వారములు, కవాటములు, వానిపై చిత్రింపబడిన కొండలంత కోతులు, ఆకసమంటు గోడలు, బురుజులు, ఫిరంగులు, పాతాళమును చూచు అగడ్త, భీకరముగ జాముచు కాళ్లకు వేసిన బంధాలతోనే దాంట్లు వేయుచు నెదురువచ్చు మదపుటేనుగ - మధుర వీర భూమియని తెలుపును. వీధులలో పుష్పములమ్ము లావణ్యవతులు, వారితో బేరములాడు శృంగార పురుషులు, అంగళ్ళలోని కుంకుమ, కస్తూరి, కర్పూరము, నవరత్నముల రాసులు, సౌధాగ్రములపై విహరించుచు విలాస జీవనము గడుపు సంపన్న గృహిణులు, ఉద్యాన వృక్షములకు శాస్త్రోక్తములగు కృత్రిమదోహములొనర్చు విలాసినులు, అడ్విలలో జల క్రీడలాడు కామినులు, మధుర భోగభూమియని తెలుపును. మధురరాజగు మత్స్య ధ్వజుడు వీరభోగవసంతరాయుడు.

<u>శ్రీరంగము</u>:- ఇది శ్రీ వైష్ణవ దివ్యదేశములన్నిటిలోను ముఖ్యమైనది. దీనిని కేవల మోక్ష భూమిగా చిత్రించును. శ్రీరంగము అపర వైకుంఠము. వైకుంఠమందలి విరజయే ఇచటి కావేరి. వైకుంఠమందలి దివ్య ఆచార్యులే ఇచటి విరక్త భాగవతులు. వైకుంఠనాథుడే రంగ నాథుడు. అచట విష్వక్సే నగరుడాదులే ఇచటి ఆలయగోపుర రక్షకులు. ఈ సర్వమునకు రంగనాథుడు విభుడు.

<u>ఋతు వర్ణనలు</u>

ఆముక్తమున గ్రీష్మ, వర్ష, శరత్, వసంతములు వర్ణింపబడినవి. ఇది కావ్యము నూటికి 21 వంతు లాక్రమించినది. దీనిలోని వివిధ ఋతు స్ఫూర్తులకు **1.** ప్రకృతి, **2.** వృక్ష, **3.** జంతు, **4.** మానవ స్పందనలను సూక్ష్మ వివరములతో చిత్రించెను. ఒక్కొక్క

ఋతువు రాయల కొక్కొక్క ప్రధాన భావమునావిష్కరించును. వీనినిచట జ్యోతిర్మండలమును గుర్తించుటకు కొన్ని నక్షత్ర రాసులను చూపినట్లు సూచించుట మాత్రమే సాధ్యము.

గ్రీష్మము:-గ్రీష్మము భీష్మము అది నదులను, చెరువులను మడుగులను, బావులను ఎండించును. దిక్కుల ముఖములను కందించి, ఎండమావులతో కప్పును, సుడి గాల్పులను రేపి, అడవులను దావాగ్నితో కాల్చును. సూర్యాగ్నితో లోకమును దహించి, ఆ బూడిదను బూరుగు పింజల నాకసమున కెగజిమ్మును. లేత బొండుమల్లె పొదలు ఎండకు మూర్ఛిలును. ఒడలు కాలినపుడు లేచు అగ్గి బొబ్బల వలె రాత్రిళ్ల వాని చివళ్ళలో పెద్ద పెద్ద పూలు చప్పుటులై పుట్టును. కొంగలు ఎండిన చెరువులలో బురద త్రొక్కుచు వెదకి వెదకి చిన్న చేపలను, నత్తలను మ్రింగును. చెట్ల క్రింద నిద్రించు బాటసారులు, చెట్లనీడలతో దొర్లుదురు. సుకుమారులు పగలుతోటలలో గడిపి, రాత్రి చెంగావి వస్త్రములు ధరించి, తలలో మల్లెలు తురిమి, గుడ్లను మోయు ఎఱ్ఱ చీమల బారుల వలె, చెరకుగానుగుల వద్ద చేరుదురు.

వర్షము:- వర్షము సుందరము, భీష్మము కూడ. ఆముక్త ఋతు వర్ణనలలో వర్షా వర్ణన సార్వభౌమము. రాయలు వర్షమును పుట్టుక నుండి, అంతమగు వరకు సమగ్రముగ వర్ణించెను. మేఘము ఉత్పత్తి అయి, సుడిగాల్పులురేగి, ఇంద్ర ధనుష్పులేర్పడును. ఉరుములు, మెరుపులు, పిడుగులు విజృంభించును. వడగండ్లు తొలి చినుకులు పడి ఆవిరులు లేచును. నీటి తుంపరులతో సృష్టి చీకట్లలో మునుగును. దొంతరులు దొంతరులుగా జల్లుపై జల్లుగా అల్లుకొనును. ఝంఝూమరుత్తు వలన ఏకమై, హోరన, తెరిపి లేకుండ, కడవ వంచినట్లు నీటి బరువుతో భూమిబ్రద్దలగునట్లు కురియును. ఈ సమస్త వర్షముతో మనము తడిసి ముద్ద యగుదుము. చెరకు ఆకు పసిమి, రేణువు బూది, తోలు ఎరుపు - ఇంద్ర ధనుస్సును పోలును. పుట్టగొడుగులు మొలిచి, పుట్ట రంధ్రమును మూయును నేరేడు, ఫలములు పండును. మొగలి, కడిమి, కొండమల్లె మర్రి, అడవి మొల్ల పూయును. మేడిపండ్ల బెజ్జములలో నీరుదూరి లోపలి దోమలు బైటికి వచ్చును.

పక్షులు తడిసికొయ్యబారును. తలమీది నీరు మూసిన కనులలో చేరును. కనులు మొరమొరలాడి రెప్పచివరలు కొంచెము విచ్చును. మరల మూయుశక్తి వానికి లేదు. కనులలోని నీరు ముక్కులపై చేరును. ఊపిరాడక కొంత నీటిని, నోటిలోనికి తీసికొనును. కొంత గూటి కఱ్ఱ కద్దును. వణకు పుట్టి మోకాళ్ల రొమ్ములలో చొచ్చును. తుదకు రెక్కవిదుర్పడలేక చేష్టలుడుగును.

పూరిండ్ల గృహిణులు చెమ్మగిలిగిన వంట చెరకుతో పొయ్యి రాజేయబోగా, అది రాజుటకు బదులు నీరూరును. ఉన్న నిప్పు కూడ ఆరును. ఇల్లిల్లు తిరుగగా రవ్వంతనిప్పు అబ్బును. అబ్బినా ఇంటి కప్పులలోని పూరి పెట్టి విసరక రాజదు. రాజినా ఇంటి వాసాలు పెట్టక రవలదు. రవిలినా దాని వలన కూడగుట కష్టము. కూడయినా పొగముట్టుకొని సుఖ భుక్తి అమరదు. ఆ భుక్తి పట్టిన బహుజనాన్నము తొలి పంక్తికే తీరును. గృహిణులకు పునఃప్రయత్నమే మిగులును. ఈసారి వారు పొయిలో నేతి గుడ్డ ఇంటి కలప మొదలైనవి నాశనమయినా లెక్కించరు. ఇట్లు రాత్రి వరకు వంట చేసినా వారు అన్నము లేని వారేయగుదురు. పడకలకు చేరలేరు. ఇట్లే వర్షములో అవస్థ పడు బాటసారులు, పొలము కాపులు మట్టి మిద్దెలవారు, సూర్యవ్రతులు, అర్ఘ్యప్రదాతలు ఎందరెందరో కనుపింతురు.

<u>శరత్తు</u>:- శరత్తు ప్రశాంతము, సుందరము. శరత్తున మేఘ జలము నేలపాలై, ఆకసము నిర్మల నీలకాంతితో మెరయును. సూర్య చంద్ర నక్షత్రములు దీప్తిమంతములగును. వెలిమబ్బు తుంపులు సంధ్యా కాంతిలో పైలాగమెఱ్ఱబడి, వెలుగుచున్న తెల్లని కర్పూర ఖండముల వలె నుండును. చంద్రకాంతిలో తళతళలాడును. రెల్లు పూయును. వరి పండును. చెఱకు పక్వమగును. చేపలు తామర కాడల పొడవున్న చేపగుడ్లను తినును. కాడల వెంటపైకి పాకుచు తేటనీటిలో వెండి చేపలవలె తళతళలాడును. పొలమున పచ్చ గడ్డిమేయు ఆవులు దూడలను తలచి చేపును. ఆబోతులు వెద ఆవులతో పరుగెత్తలేక గునుకుతీయును. మెదవంచి ప్రయాసతో గొంతు కొవ్వు కరగునట్లు రంకెలు వేయును. మదపుటేనుగులు ఏటిదరిన పోరాడును. వరి చెఱకు చేల వద్ద మంచెలపై కాపుండి, చిలుకలను తోలు కాపు కన్యల అమాయిక హాస్యములతో పొలములు కలకలలాడును.

__వసంతము__:- వసంతము నవ జీవనముతో పొంగును. సూర్యుడు ఉత్తర దిక్కుకు తొలగును. చలి కాలమున నిద్రించి, వసంతమున మేల్కొనినట్లు అగ్ని శిఖలతో దీపించును. వెన్నెల చిక్కని పాలవలె ప్రకాశించును. గాడ్పులు పుప్పొడులతో పైకెగురును. సముద్రమంత మంచును మలయానిలము సులువుగ మ్రింగి సుళ్ళ తిరుగును. పండుటాకులు రాలి చెట్లు ఎర్రగా చిగిర్చి వనలక్ష్మి ప్రసవించిన పసిబిడ్డల వలె వర్ధిల్లును. మొగ్గలు బిడ్డల దంతముల వలె పొటమరించును. మోదుగు, ఇప్ప, గోరంట, మామిడి, గోగు, పొగడ, అశోక, సంపెంగ, ప్రేంకణ, వావిలి, బొట్టుగు, ఇందుగు చెట్లు ద్రాక్ష తీవలు పూచును. వెదురు, జువ్వి గుబురులు పెరుగును. తుమ్మెదలు మధుపానోత్సవములను జరుపును. వీని సొగసు చర్యను రాయలు సుకుమార హాస్యముతో వర్ణించెను. స్త్రీలు చలికాలమున పెదవులకు పూసికొను మైనమును వాడుటమానిరి. దోమతెరలను పైకెత్తిరి. కుంపటులను తీసివేసిరి. చలికాలపు కస్తూరి పూతలు మాని అగరు చందనకలపమును అలదిరి. చెవులకు చందనము పూసి, గులాబీలతో అలంకరించిరి. కొప్పులలో సంపెంగ వరుసలు చేరినవి. చేతులకు వంటకముల వాసనలు పోవుటకు ఎర్రగా మెరయుటకు కుంకుమ పువ్వు పులిమిరి. వ్రతులు చ్యుతులైరి. రాయల నిశిత పరిశీలన, వర్ణనా చాతురికి ఇవి మచ్చుతునకలు.



# ఆముక్తము - రాజనీతి

ఆముక్త మందలి గద్య పద్యముల మొత్తములో రాజనీతి నాటికి తొమ్మిది వంతులకు పైగా నున్నది. దీనిని స్పృశింపనిదే, ఆముక్త సమీక్ష ఏదియు సమగ్రము కానేరదు.కావ్యమున రాయల వ్యక్తిత్వమును ప్రతిబింబింపు ఘట్టములలోనిది అత్యంత ప్రధానమైనది. ఆయన జీవితములో అవినాభావ సంబంధము గలది. దీని యందాయ నకు భక్తితో సమానమగు అభినివేశము గలదు. అందు చేతనే ఆయన భక్తి బంధురమగు ఆముక్తములో దీనినిట్లో చొప్పించెను. అందు కొరకు విష్ణుచిత్తునకు రెండు వందలేండ్ల తరువాతి వాడగు యామునుడు విష్ణుచిత్తునకన్న పూర్వుడనియు, ఆయన కథను విష్ణు చిత్తుడు మున్నవారు వలన వినెననియు కల్పించెను.

ఆముక్త రాజనీతి ఆనాటి రాజ్యాంగములగు అమాత్య అష్ట సైన్యములను గూర్చి, రాష్ట్ర దుర్గ భాండారములను గూర్చి, రాజ అనుసరించవలసిన నీతిని, వివరించును. రాయల దృష్టిలో రాజ అంగి, తక్కినవే అంగములు. అతడున్ననే వానికి స్థితి. వానిని ప్రవర్తింప జేయు సూత్రధారి. అతడే! స్వీయ శరీరాంగములను పోషించి సరిదిద్దినట్లే, రాజ రాజ్యాంగమును దిద్దవలెను. అందు చేతనే రాజును గూర్చి రాయలు 46 పద్యములను వినియోగించెను. ఇది రాజనీతి మొత్తములో నాటయాబై యారు వంతులు స్థల మాక్రమించినది.

రాజ జన్మించుట, దుష్టశిక్షణ, శిష్టరక్షణాదికమైన, ప్రజా పరిపాలన కొరకే, కనుక అతడు ధర్మము నందే దృష్టి యుంచి కష్టముల కోర్చి, ప్రజల యిలబడులను తీర్చవలెను. దాని వలననే అతని జన్మ సఫలమగును. ఎట్టి పరిస్థితులలోను, విసువక, ప్రజలను రక్షించుట, విపన్నుల మొరలు తీర్చుట, రాష్ట్ర వర్ధనమునే హృదయమున కోరుట - ఇవి అతని ప్రథమ విధులు. అట్టి రాజ మేలును ప్రజలు కోరుదురు. వారి యొక ముఖపు కోర్కెను వారి లోపలి పరమాత్ముడిచ్చును.

పండితుడు, బిరుదు, అయిన రాజు - నీతి, నైపుణ్యముల వలన స్వశక్తి వలన, రాజ్య వ్యవహారములను, నాలుగింట మూడుపాళ్ళు తెలియును. తనకు తెలియక సంభవించిన ఒక పాలు, మిత్ర బృందము వలన తెలియును. ఆత్మ పరిశీలన వలన తన తప్పులను తాను గుర్తించి, వానిని త్యజించి, నిరాగ్రహుడై, క్రూర దండనలు విధించక పాలించినచో, చిరకాలము నిలువ గలుగును. భోగము లనుభవించుచునే, రాజు బహిరంతరవైరులపై దృష్టి నుంచవలెను. నిర్దిష్టమగు తన దినచర్యను నిర్ణీత కాలములో నిర్ణీత విధమున అనుసరించవలెను.

ఆముక్త రాజనీతి రాయల స్వీయానుభవముతో కూడి విపులముగ నున్నది. పూర్వ గ్రంథాధ్యయనము కూడ ఇందు చేరి యుండును. వీనిని గుర్తించుటకు ప్రత్యేక పరిశోధన యవసరము.

రాజు, రాజాజ్ఞ కందరూ తల్లడిల్ల వలెను. ఉగ్ర దండము పనికి రాదు. వధ్యులను ముమ్మారు క్షమించవలెను. అదను వచ్చు వరకు ఆగి, అపరాధిని శిక్షించవలెను. సమస్త ప్రజలు, కృప, దండ భయమువలననే , తమ ధర్మములను నెరవేర్తురు. రాజు రక్షక భటులను లాలించి, సరియగు అపరాధిని పట్టి, వెంటనే శిక్షించవలెను. దొంగలను తునుమ వలెను. బెదరినవాడు తనంతట తానే వచ్చువరకు ఆగి, వాడు వచ్చునపుడు వెంటనే చేర్చుకొనవలెను. తాను అతి శూరుడైనను, తన శూరుల గర్వాలాపముల వినుగును ఓర్వవలెను. వారిలో తన శౌర్యమునే కాంచవలెను. సామంతులను భేదోపాయమున నాకర్షింపవలెను. స్వపక్షము వలన ప్రమాదమును మాన్పుకొనుటకు వైరికి సగము రాజ్యమిచ్చియైనను, తెగని మైత్రి జేసికొనవలెను. అదను చూచి వైరిపై పడవలెను. అసాధ్య పర్వతారణ్యములలో వసించి, భూపీడ చేయు ఎరుకల గ్రామములను స్థిరపడని అన్యవీరుల కివ్వవలెను. వారు వారునేమైన నగుదురు. ఆటవికులు కొద్ది తప్పుకే పగ పట్టుదురు. కాని, ఆడినమాట తప్పరు. సత్యము వలన వారిని వశపరచు కొనవలెను. దూతల యెడ, దూరద్వీప వర్తకుల యెడ, కాందిశీకుల యెడ, ఉదారముగ వర్తించవలెను.

ఇంకను మంత్రులు- వీరి అర్హతలు, దుష్ట మంత్రులనణచుట, మంత్రులపై గూఢచారులు, అధికారులు- వీరి క్రమాభివృద్ధి, సచ్ఛీలము, వీరి చెడు నడక, వీరిలో

ప్రజలకుపకారులగువారు, చారులు- వీరి అర్హతలు; బహుమానములు- అప్పులు, వీరి అవసరము, వీరిలో హితాహితులు వంటి సమస్త రాజకీయ విషయములను వర్ణించెను.

దొరలైన వారు పలువురు ఆస్తికలవారు కావలయును. వారిలో స్వార్థులు పెంచుట రాజ్యకు ప్రయోజనము, వారికి తగినంత అధికారము, సైన్యాదులను ఇచ్చి పని గొనవలెను. సామంతులకు మాత్రము మితము తప్పని భూము లివ్వవలెను. కోశము, వ్యయ విభాగములకు ఒక పాలు, ఉగ్ర సేనారక్షణకు రెండు పాళ్లు, భాండాగారమునకు ఒక పాలు, వ్యయము చేయువలెను. మొదట దేశమును స్వాధీనపరచుకొని దుర్గములతోను, సేనలతోను, సంహద్దులను కాపాడవలెను. దేశ వైశాల్యమును పెంచి చెరువులు కాల్వలు త్రవ్వించి పేదలకు ధనరూపమైన పన్నులోను, ధాన్య రూపమైన పన్నులోను, సులువును అనుగ్రహించి వానిని వర్ధిల్ల జేసి ధనమును గ్రహించవలెను. అడవులు పరిహద్దులలో అవసరము, రాష్ట్ర మధ్యమున లేకుండ జేసి దొంగల బాధ తప్పించవలెను. సైన్యమున కాలుబంట్లకు సకాలమున జీతమిచ్చి అశ్వికులకు పారితోషికములతో కూడిన కొలువు ప్రసాదించి, తృప్తులను చేయవలెను. అస్త్ర యోధులకే మంచి గుఱ్ఱములను ఏనుగులను ఇవ్వవలెను. అశ్వగజ శాలలను రాజా తన స్వాధీనమునవే యుంచుకొనవలెను. దండయాత్రలు మజిలీలుగా చేయవలెను. శత్రు బలమును బట్టి ముందుకు పోవుటో, సంధికి దిగుటో నిర్ణయింపవలెను. దుర్గములను బ్రాహ్మణులకే యివ్వవలెను.

ఈ సమస్తమున ధర్మపరుడు, ప్రజారక్షకుడు, పండితుడు, శూరుడు, భోగి నిత్యజాగరూకుడు, పరేంగితజ్ఞుడు, రాజ్యపాలనము యుద్ధ తంత్రమును సమముగ నెరిగినవాడు, అగు రాయల మూర్తియే ప్రకాశించుచున్నది. రాజ్య చక్ర ప్రవర్తకుడతడే మంత్రుల యంత్రాంగములలోని మంచి చెడ్డలను నిర్ణయించునది అతడే. అతని ప్రతాపమునకు ప్రతి రూపమాత్రులే వీరు. ప్రజలను రక్షించుట అతని జన్మ ప్రయోజనము. ప్రజల శుభాకాంక్షలతనికి దైవ రక్ష కల్పించును.



# ఆముక్తము - ప్రజా జీవన చిత్రణ

ఆముక్త కథలలో కంటి. పుర, ఋతు వర్ణనలలో రాయల సమకాలీన ప్రజా జీవనము ప్రతిబింబించును.

<u>స్త్రీలు</u>:- పుర వర్ణనలలో విలుబుత్తూరులో మనకు ఆచారపరాయణులగు వైష్ణవ కుటుంబినులు,, వారి యిండ్ల ముందెండబోసిన కలమవరి ధాన్యమునకు కావలియున్న కన్యలు, వారి వద్దకు పూవుల నమ్ముటకు వచ్చెడి గ్రామ్యతరుణులు, సాయంకాల మందు తమ ఇండ్ల యరుగులపై కూర్చుండి జూదములాడు వేశ్యలు కనుపింతురు. మధురలో సౌధాగ్రములందు విలాసమయ జీవితములను గడుపు సంపన్న గృహిణులు, ఉద్యాన వృక్షములకు కృత్రిమ దోహదము లొనర్చు ప్రమదలు, కోటయగడ్తలో జల క్రీడలాడు కామినులు వీధులలో పుష్పములు, పరిమళ ద్రవ్యములు అమ్ము యువతులు, వారితో నర్మ గర్భముగ బేరమాడు శృంగార పురుషులు, వేశ్యల బజారులో కళా ప్రవీణులగు పణ్య యువతులు కనుపింతురు. ఋతు వర్ణనలలో వేసవిలో చలివేంద్రముల వద్ద బాటసారులకు నీరు పోసెడి అందగత్తెలు, బావులలో పాతాళము నంటిన నీరు తోడుటకు చేంతాళ్ళను కలిపి ముడి వేయు గృహిణులు, వర్షాకాలమున జడి వానలో పొలములలో పునాసపైర్లకు కాపున్న భర్తలకు అంబళ్ళు మోసికొని పోవు కాపు వనితలు, ఎంత సేపటికి రాజని పొయి వద్ద, ప్రొద్దు గ్రుంకులు వంట చేయ నాయాసపడు పూరిండ్ల కుటంబినులు, శరత్తులో వరి, చెరకు చేల వద్ద మంచెలపై కాపుండి, తమ అమాయక హాస్యములో బాటసారులకు తప్పు త్రోవ జూపి నవ్వెడు యువతులు కన్పింతురు.

<u>స్త్రీల యలంకారములు</u>:-విలుబుత్తూరు గృహిణులు కొలనుగట్టుల మీద పసుపుకొమ్ము నరగదీసి, తమ మెడలే గాక గట్టు క్రింద నుండు హంసల రెక్కలు గూడ పచ్చబడునట్లు స్నానమాడుదురు. కాని ఆ యూరి వేశ్యల పసుపు పూత విశిష్టమైనది. వారు గూడ పసుపు పూసుకొని స్నానమాడుదురు. కాని ఆ పసుపు

శుభ్రమైన వస్త్రములో ఒరిసి వత్తినను, దాని కంటక దేహముననే నిగ్గులు దేరునట్లు నాజూకుగా పూసికొందురు. చందన మిశ్రమము సైతము ముదుకగాకుండ పైటలోనే వేయాడించి వక్షస్థల మంతట అలదుదురు. నగల విషయములో గూడ వారు నాజూకుగ నుండు సన్నని తీగల వంటి ముత్యాలహారములను, కంకణములను మాత్రమే ధరింతురుగాని, చిలుము పట్టునని బంగారు నగలు ధరింపరు. పాడిపాడిగ నుండు కస్తూరిని పూసుకొందురే గాని, జిడ్డని పునుగు సహింపరు. తలకు సుగంధ ధూపము వేయుదురే గాని పూలు చెమ్మయని ధరింపరు. జిలుగు వలిపెములే తాల్తురుగాని తక్కినవి ఒత్తుకొనునని నవ్వుదురు.

చలి కాలములో కొందరు స్త్రీలు పెదవులు పగులకుండ మైనముపూసి కొందురు. శరీరము వేడెక్కుటకు కస్తూరిని పూసికొందురు. వసంతములో చలువ కొరకు శరీరమునకు అగరు చందన మిశ్రమము పూసికొందురు. వంట వాసనపోయి ఎరుపెక్కుటకు చేతులకు కుంకుమ పువ్వును పూసికొందురు. చెవులకు చందనము పూసికొని గులాబీలు పెట్టుకొందురు. సిగలో సంపెంగలు, అలంకరింతురు. తెల్లని సన్నని పావడలు ధరింతురు. ఆముక్త మాల్యదవంటి వైష్ణవ కన్యల ప్రతి దినాలంకారములు, పూజా సమయాలంకారములు, పెండ్లి కుమార్తె అలంకారములు విలక్షణములు.

<u>భోజనములు</u>:- ఆముక్తమున రాయలు పది పేరుల భోజనములను వర్ణించెను. విలుబుత్తూరు భాగవతుల ఇంట, పలు తీరుల కూరలు; పాయసములు, విష్ణు చిత్తునింట పిండి వంటలతో కూడి, ఆయా ఋతువుల కనుకూలమగు, బహు విధమృష్టాన్నములు; రాజ పురోహితుని ఇంట వేసవి రాత్రి పలు రకముల ఫల హారములు; వేసవిలో భోగుల చేప మామిడి ముక్కల కూర, దాని కసరుపశమించు టకు చల్లని కొబ్బరి నీళ్లు; వానకాలమున పొలములలో గుడిసెలందు కాపుండు హాలికులు త్రాగు అంబళ్లు, ఒకపాటి అధికారమబ్బి వానలో పొలముపోక ఇండ్ల వద్దనే యుండు రెడ్లు మెక్కెడి వేడి వేడి చిన్నరిగ అన్నము; మానెలతో వేయించిన ఆకు కూరలు; సౌధాగ్రములపై నుండు నృపులారగించెడి అడవి జంతువుల మాంసము,

ఆనాటి వెన్న కాచిన ఆవుల నెయ్యి, రాజనాన్నము, తిరునాళ్ల ఊరేగింపులు చూడబోయిన వారు కాలువ యొడ్డునందు కూర్చుండి తినెడి రాజనాన్నపు చద్ది: గేదె పెరుగు మీగడలతో పిసికి, నారింజ, అల్లపుముక్కలతో కలసిన అన్నము, అడవులలో చెట్ల క్రింద కాపురముండు ఆటవికులు (బ్రహ్మరాక్షసుడు) త్రాగు తాటి కల్లు, భార్య కాల్చి అందించు మాంసపు కరుకుట్లనంజు, దూరపు ప్రయాణములలో తీసికొని పోవు సంబారములు, పొరివిళంగాయలు, అరిసెలు వీటి నన్నిటిని గురించి రాయలు చవులూరునట్లు వర్ణించెను.

__కృషీవలులు__:- విలుబుత్తూరు కృషీవలులు తొమ్మిది రకముల పైర్లను పండింతురు. ఎనిమిది రకముల పూలను పూయింతురు. పనస, అరటి, చెరకు, మామిడితోటలను పెంచుదురు. వేసవిలో తెల్లవారు ఝామునే, తోటలకే తాములు ద్రొక్కుచు గొంతెత్తి శ్రావ్యముగ పాడుదురు. వర్షమునకు భూమి పదును కాగానే సమృద్ధిగా వెదలు చల్లుదురు. శివుని ఎద్దును, యముని దున్నను వదలక, మెట్టమాగాణులనొక్కసారిగ దున్నుచు ఏరువాక సంరంభమును సాగింతురు. భాద్రపదమాసమున పునాస పైర్ల వద్ద గుడిసెలలో కాపుందురు. శరత్తులో చెరకు రసమాడుదురు. శరత్తులో కాపు కన్యలు వరి, చెరకు చేలలో మంచెలెక్కి చిలుకలను తోలుచు బాట యడిగిన వారిని అమాయక హాస్యములతో నాడింతురు.

__బాటసారులు__:-వేసవిలో కొందరు బాటసారులు చెట్ల క్రింద ఒడలు మరచి నిద్రించి నీడతో పాటుదొర్లుదురు. ఎండినయేటిలో చెలమలు త్రవ్వి నీరు త్రాగుదురు. చలివేంద్రములలో నీరు త్రాగబోయి, నీరు బోయు స్త్రీల యందమును త్రాగుదురు. వర్షాకాలమున వాన భయమున ప్రజలు యూళ్ల ప్రయాణములాపుకొందురు. ఆగక వెళ్లిన వారు దారిలో భంగ పడుదురు. దూరాన వచ్చు జల్లు జూచి చెట్ల క్రింద చేరుదురు. కాని అంతకు ముందే వానకు తడిసి, గాలికి ఊగుకొమ్మల వంగుళ్ల వానలో ఇబ్బడి ముబ్బడిగా తడియుదురు. కొందరు చేతిలో గొడుగులు గాలి కెగిరిపోయి మిగిలిన కర్రను పట్టుకొని పరుగు లంకించుకొందురు. కాని, ముంచుకొనివచ్చిన వర్షపు దెబ్బకు

వాని మూర్ఛయుగుదురు. కొందరు వానకు రచ్చ కచ్చేరిలో ఇరికి నరపతి, అశ్వపతి, గజపతుల సైన్యబలములను గూర్చి ముచ్చట్లాడుదురు. వాన తెరపి కాగానే ఎవరి త్రోవను వారు ఉడాయింతురు.

<u>ఇతరములు:-</u> వేసవిలో ప్రజలు గ్రామ గ్రామమున సామంతులకు చలువ చప్పరములు వేయుదురు. ఎరుకలవారు నిర్జల భూములలో పక్షుల నాకర్షించుటకు ఆడాడ నీరుంతురు. సుకుమారులు పగలు తోటలో నుండి రాత్రి చెరుకు గానుగ వద్ద చేరుదురు. వర్షాకాలమున దొంగ తనమును గూర్చిన ఫిర్యాదు విని రాజా శస్త్రమును ధరించి, దొంగలను పట్టుటకు బయలు దేరగా, దొంగలు తాము దొంగిలించిన సొమ్మును రాత్రి పూట ఎవ్వరు చూడకుండ పూర్వ స్థలములలో వేయుదురు. సూర్యవ్రతులు, సంధ్యార్ఘ్య మిచ్చు ద్విజులు, మబ్బుపట్టి యుండుటచే ప్రొద్దు తెలియక చిక్కుపడుదురు. గృహిణులు ఇందుపగింజ రసముతో నీటి పంకమును తేర్చుదురు. శరత్తులో శ్రోత్రియులు యాగము చేయుదురు. కొందరు స్ఫటిక శిలలచే అగ్ని పుట్టింతురు. అద్దములను బూడిదతో తోమి, వర్షాకాలపు చిలుమును పోగొట్టుదురు.

ఇట్లు - నాటి సామాజిక వ్యవస్థలోని ప్రజల జీవన విధానమును నిశితమైన పరిశీలనతో, వర్ణనా వైచిత్రితో - కనులకు కట్టినట్లు కవి వర్ణించును.



# ఆముక్త మాల్యద

## సాహిత్య ఆధ్యాత్మిక సమీక్ష

**(1-4 ఆశ్వాసములు)**

### అధ్యాయము-1

### రాయల కల - ఆముక్త యోజన

*శ్రీ కమనీయ హారమణిఁ జెన్నుగఁ దామును, గౌస్తుభంబునం*
*దా కమలా వధూటియు ముదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం*
*దాకలితంబులైన తమ యాకృతులచ్ఛతఁ బైకిఁ దోఁచి, య*
*స్తోకత నందుఁ దోఁచెనన, శోభిలు వేంకట భర్తఁ గొల్చెదన్* **(1-1)**

*అల పన్నిద్దరు సూరులందును సముద్యల్లీలఁ గావున్న వె*
*గ్గలపుందాపముఁ బాపనా, నిజ మనః కంజాత సంజాత పు*
*ష్కల మార్ద్వీక ఝరి న్నిరారి సోఁగియుంగా జొక్కి, ధన్యాత్ములా*
*ఇల పన్నిద్దరు సూరులం దలఁతు మోక్షేచ్ఛా మతిం దివ్యులన్* **(1-10)**

శ్రీదేవి యొక్క మనోహరమైన ముత్యాల సరము నందలి నాయక మణియందు అందముగ తాను (వేంకటపతి) తన కౌస్తుభ మణియందా కమలా కన్యయు స్ఫుటముగా కనుపింపగా, అన్యోన్య హృదయములందు నెలకొనబడిన తమ యాకారములు (దేహముల) స్వచ్ఛత వలన పైకి కనుపించి, ఆ హారమణి యందు, కౌస్తుభము నందు, ఘనముగా కనుపించె ననునట్లు శోభిల్లు వేంకటపతిని కొల్చెదను. (1-1)

ఆ పండ్రెండుగురు సూర్యులందు (ద్వాదశాదిత్యులు) పట్టుదలతో విలాసముగా నివసించినందున కలిగిన అధిక తాపమును పోగొట్టు కొనుటకో యనునట్లు నారాయణుడు తమ హృదయ కమలములందు పుట్టిన పుష్కలమైన తేనె ప్రవాహమందు సుఖించు చుండగా పరవశులై, ధన్యాత్ములైన భూమి యందలి పన్నెండుగురు సూరులనెడి

(పన్నిద్దరాళ్వారులు) దివ్యులను మోక్షమును కోరెడి మనస్సుతో స్మరింతును

(1-10)

అని భక్తి వేదాంత యోగవిదుడు, "కవితా ప్రావీణ్య ఫణీశుడు" (పారి-4-1), కర్ణాటాంధ్ర ద్రవిడ సార్వభౌముడు నగు శ్రీకృష్ణరాయ మహారాయ[1] లిష్టదేవతా వందనము చేసి, కళింగ దేశ విజిగీషా మనీషతో దండెత్తిపోయి, విజయవాడలో కొన్నాళ్లుండి, ఆ సమీపమున శ్రీకాకుళమున వేంచేసియున్న ఆంధ్ర విష్ణువును సేవించెను.[2]

ఆ రాత్రి రాయల కలయందు స్వామి శ్రీదేవి సహితముగ సాక్షాత్కరించి, తమకు ప్రియముగా నాముక్త మాల్యదా రంగనాథుల పెండ్లిని తెలుగున కృతిగా నిర్మించి, దానిని రాయలకిష్టమైన వేల్పగు వెంకటపతి కంకితముసేయుమని ఆనతిచ్చెను.

రాయలాశ్చర్య భక్తులతో మేల్కొని, ఆ శుభ స్వప్నమును వేదాగ మవిదులగు తన విద్వజ్జనములకు వినిపించెను. వారా స్వప్న మనేక శోభన పరంపరలను దెల్పు చున్నదని, కృతి వినిర్మింపుమని యుద్బోధింపగా, ప్రహృష్టాంతరంగుడైన రాయలు - తాను విన్నవించ బూనిన నాముక్త మాల్యదా మహా ప్రబంధమునకు కథా క్రమమును యోజించుచు, తన యూహా విహంగమును కాలగగనమున కెగయుజేయును. **(1-11-18-44-45-50)**

---

*1* *రాయల తిరుపతి శాసనములలో ... శ్రీ వీర కృష్ణరాయ మహారాయలని మహా రాయలని యే పేర్కొనబడినది. తిరుపతి దేవస్థాన శాసన సంపుటి (3, నం.32, 33)*

2 *రాయలు 27-1-19న శ్రీకాకుళపు "తెలుగు రాయల"ను కుంభ సంక్రమణ పుణ్యకాలమందున దర్శించి, "స్వామి నిత్య నైవేద్యాలకున్ను, అంగరంగ వైభవాలకున్ను యెడమెడవక జరుగుటకై" అయిదు గ్రామాలను శ్రీకాకుళాన... స్థలాల భూమి"ని "తోటలు... శ్రీరామానుజ కూటము, ద్వాదసులు (పన్నిద్దరాళ్వారులు) సహితమైన భూమిన్ని సమర్పించి, "నిత్యనైవేద్యం కట్టడి" చేసిన వివరాలతో గూడిన శిలా శాసనమొకటి శ్రీకాకుళమందా స్వామి ఆలయమున నేటికిని కనుపించుచున్నది. ఆముక్త రచనోద్భవ మప్పటిదేయనుట ఎక్కువ సంగతముగా తోచును. ఆముక్త ఉద్భవ 1615 నాటిదని కొందరు - శాసనము (S-I-I-VOL- IV No. 981)*

# శ్రీ విలుబుత్తూరు - 2వ అధ్యాయము

## 1. ఉదయశ్రీ

## 2. దివిభువుల పరిణయము

ఆ యూహా విహంగము దాదాపెనిమిది శతాబ్దములు వెనుకకు చంక్రమించి, సుపరిచితములగు కర్ణాటాంధ్రముల నధిగమించి, ఇటీవలనే రాయలు పర్యటించిన తమిళనాడులో ప్రవేశించి, పక్షులు కువకువలతో మేల్కొను తొలి సంజలో, సుదూర దక్షిణమున గల 'పాండ్య నగరోర్వీ రత్న సీమంతమగు' శ్రీ విలుబుత్తూరు[3] చేరును. అచట లలితోద్యాన పరంపరలపై విహరించును. మిన్నులతో రాయు సువర్ణ సౌధములపై వ్రాలును. నీలములతోను, పచ్చలతోను నిర్మించి, ఆ సౌధ చంద్ర శాలలలో

3. *శ్రీ విలుబుత్తూరు మదురకు పశ్చిమోత్తరములో నున్నది. పూర్వమీ ప్రాంతము అరణ్యమయమై, మల్లియను బోయ పాలకునిచే పాలింపబడి మల్లినాడనబడినది. మల్లి కుమారులగు విల్లి గండన్‌లలో చిన్నవాడగు గండన్ వేటకుపోయి యూతావున పులిచే చంపబడెను. వానిని వెదకుచు వచ్చిన విల్లి యతనికై చూచి మూర్ఛిల్లెను. ఆ స్థితిలో అతనికి వటపత్రశాయి యగు దేవుడు గండని బ్రతికించినట్లు తోచె. కనులు తెరచి చూడగా గండన్ బ్రతికి యుండెను. వారిద్దరు కొంత దూరములో పులి చచ్చియుండుట జూచిరి. విల్లి తనకు స్వప్నమున కనుపించిన స్వామిని వెదకి, మఱ్ఱి క్రింద పొదల మాటున చిన్న ఆచ్ఛాదన క్రిందనున్న మూర్తిని చూచి, అరణ్యమును ఛేదించి, అచట లభించిన ధనముతో గొప్ప ఆలయమును నగరమును నిర్మించెను. విల్లి నిర్మించిన నగరమే విల్లిపుత్తూరు. క్రొత్తగా కట్టినందున పుదుల్లై, పూదుర్, పుత్తూరులుగా కూడా ప్రసిద్ధమైనది. వటపత్రశాయి ఆలయము వలనను, ఆముక్తమాల్యద సన్నిధి వలనను, నిది ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమయినది. ఇది పెరియాళ్వార్ (విష్ణుచిత్తులు) 'తిరుమొళి' లోను, ఆముక్త మాల్యదచే రచింపబడిన 'నాయచ్చియార్ తిరుమొళి'లోను పుదుల్లై, పుత్తూర్, విల్లిపుత్తూర్ అని పేర్కొనబడినది. ఈ సమాహారములో చివరి రెండు వాక్యములు తప్ప, తక్కినది కీర్తి శేషులగు నా మిత్రులు విద్వాన్ టి.పి. భాష్యకారాచార్యులవారు పి. శ్రీ. రచించిన తమిళ గ్రంథముల నుండి సేకరించి 1978లో నాకు పంపిరి. వారి ఆత్మకు నా శ్రద్ధాంజలి.*

(వలభి=పైమేడ) నలంకారముగ నుంచిన కోయిలల, చిలుకల ప్రతిమలను జూచి, యవి దైవ సృజితములగు సజీవ పక్షులని భ్రమింపును. అచటి యుద్యాన పిక శుకాలాపముల ప్రతిధ్వనులను విని అవి యా ప్రతిమల స్వానములని మరింత భ్రమింపును (1-51)

దివ్య చేతన స్పర్శకు స్పందించి, దివ్యీకృతమగు మానవ చేతన పరిణామమే కథా వస్తువుగా గలది ఆముక్తము. దివి భువుల పరిణయమే దాని యాంతర్యము. అదొక దివ్య మానుష ప్రబంధము. దానికీ దైవ మానవ సృష్టులలోని పిక శుకముల ఆలాప ప్రత్యాలాపములు తగిన నాంది.

(i) <u>ద్రవిడాంగనలు:-</u>

అప్పటికింకను జన సంచారమేర్పడదు. ఈయదనున విలుబుత్తూరు ద్రవిడాంగనలు తమ యుద్యానపు చెంగల్వ దిగుడు బావులలో, నేకాంతముగ పసుపుతో జలక మాడుదురు. అచ్యుతుని యభిషేకమునకై, నీరు నించిన బిందెలను నడుములపై కీలించి గృహోన్ముఖులయి, జన సంపర్కము లేని యుద్యానపు త్రోవలలో నడతురు. వక్షో భారమునకు బిందెల బరువు తోడయి వారి లే నడుము లల్లనాడును. పూజకై బిందెలలో నైచి, చేతితో కాడలు పట్టి తెచ్చుచున్న తామరలు తడబడును. ఇట్లు

---

క్రీస్తు పూర్వము నుండి యీ ప్రాంతము పాండ్య మండలములోనిది. మొదటి బుక్కరాయల కాలమున, కుమార కంపణ, పాళువ మంగులు మధుర సుల్తానును నిర్జించినప్పటి నుండి *(1370-71)* విజయ నగర సామ్రాజ్యములో చేరెను. కృష్ణ రాయల సింహాచల విజయానంతరము *(1516-17)*లో విలుబుత్తూరుతో సహా 77 దాక్షిణాత్య శైవ వైష్ణవ క్షేత్రములను దర్శించి, భూరి దానముల నర్పించెనని శాసనముల వలన తెలియును. ఆయన విలుబుత్తూరులో 'చూడు కొడుత్త నాచ్చియారు (ఆముక్త మాల్యద) సమేతముగా 'పెంపెంగి మన్నారు స్వామిని సేవించి, తిరుముక్కు(ముంగర), కెంపుల వొడ్యాణం, బంగ్గారు నూపురములున్ను, నవరత్న కీలితమైన సింహ్మ ముఖం ప్రభలున్ను సమర్పించి, గుంట్ల తొవ్వించి, రాతి కట్లానకున్ను, నడిమి మంట్ప పానకున్ను లక్షమాళ్ల ఖర్పించి.' నట్లు రాయువాచకమున *(1592-1602)* వర్ణితము (పుట *77-78)* సాహిత్య అకాడమి (ప్రతి-*1982)*

నడమున వారు దివ్య ప్రబంధములను[4] పాడుకొందురు. ఆ జిలిబిలి పాటకు వారి పాదములందలి పాగడముల చిరు రవళి తాళమగును (1-56) (పాగడము/పాదగము = అందె వంటి నగ)

ఇంతలో వారిండ్లు చేరుదురు. అచట వారికొక శుభ దృశ్య మెదురగును. ఇండ్ల ప్రవేశ ద్వారములపైన బంగారు నీటితో వ్రాసిన లక్ష్మీ రూపములు, ఆమెను జలకమాడించు రెండేనుగులు, ఆమె పార్శ్వములందలి శంఖ చక్రములు - క్రిందనున్న రత్నపు టరుగులలో ప్రతిఫలించు చుండును. (1-53). ఈ లక్ష్మీ నారాయణుల శుభ చిహ్నములను భావించుచు, వారు లోనికి పోవుదురు. వీని యాంతర్యమును చివరి యనుబంధములో ముచ్చటింతము.

ఉద్యాన శుక పికాలాపములు శ్రీ విల్లిపుత్తూరు ఉదయశ్రీకి స్వాగత గీతములు కాగా, ద్రవిడ సుమంగలుల దివ్య ప్రబంధ గానమా యూరి వైష్ణవశ్రీకి మంగళా శాసనమయ్యెను.

## మధ్యాహ్న వైభవము

### (i) ద్రవిడ కన్యలు:-

ఇండ్లకు చేరిన ఇల్లాండ్రు - తమ యజమానులు తోడుకొని వచ్చిన పరదేశ భాగవత బృందముల కనేక విధములగు రుచ్యాన్న పానీయాదుల సమర్పణములలో మునిగిపోవుదురు. (1-76). వీని నింటి వారికి సరిపడ సంతరింపవలెనన్నను.

4. *ఇవి 7-9 (2-87) శతాబ్దుల మధ్య దాక్షిణాత్య శ్రీవైష్ణవ మహోజ్జీవకులగు పన్నిద్దరాళ్వారులను మహాభక్తులు ప్రజలను జైన బౌద్ధముల నుండి మరల్చుటకు సులభముగు తమిళ భాషలో వ్రాసి పాడిన 4 వేల పాశురములు. వీనిని నాలాయిరమని (4వేలు), ద్రవిడ వేదమని కూడా అందురు. ఇవి 10వ శతాబ్దమున (రంగ) నాథమునిచే సేకరింపబడి, రాగ తాళములు కూర్పబడి శ్రీరంగము తిరుపతి, కంచి, వంటి ప్రసిద్ధ విష్ణ్వాలయములలో, సంస్కృత వేదములకు ముందు పఠింపబడుచున్నవి. వీనికి తమిళమున పెరియ వాచ్చాన్ పిళ్లై మొదలగు వారనేక గొప్ప వ్యాఖ్యములు రచించిరి.*

నింతలంతలలో తెములు పని కాదు. మరి నిత్యము వచ్చిపోయెడి యతిథి భాగవత సమూహములకైన చెప్పెడిదేమి!

ఈ వంట వార్పులలో మధ్యాహ్నమైనను, ఆ గృహిణుల కూపి రాదదు. మరి వారి యత్నమా నాటి పాపాటుతో ముగియునది కాదు. వారు సాగించునవి నిత్య సంతర్పణలు. అందుకై బియ్యము నిండుకొనక ముందే వరపు జూచి ముంగిళ్లలో కలమ ధాన్యమెండబోయింతురు. మరి దాని కావలికి అందుకు వారికి తీరిక యేది? అది వారి చిన్న కొమార్తెల వంతు!

**(ii) దేవునింటి దుప్పి పిల్ల:-**

ఇంతలో గ్రామ్య తరుణులు పేపగంపల నిండ చెంగల్వ పూదండలను పేర్చి, గుంపులు గూడి అమ్మ వత్తురు. దండలు కంటబడగనే బాలికలకు తమ ముని సిగలు జ్ఞప్తికి వచ్చును. వానినైన దండలు సింగారింప మనసగును. క్షణములో దింపించి, చిటికెలో బేరసారములలో మై మరతురు. ఈ సందడిలో దేవునింటి దుప్పి పిల్ల యెప్పుడు పెట్టెడు కూతలు మాని, సడి చప్పుడు చేయకో ఎట్లో దూరి - మాటి మాటికి ధాన్యము బొక్కులాడును. అయినను, ఆ బాలికలు విసువక దానిని చెంగల్వ సరులతో మాత్రమే యదలింతురు. (1-75) అది దేవునింటి దుప్పి పిల్ల గదా! ఆ యూరి ఆలయ ప్రభావమట్టిది!

**(iii) అతిథి భాగవతార్చన:-**

హిమాచల, మలయాచల మధ్యస్థములగు, వైష్ణవ దివ్య క్షేత్రములను సేవించుటకు పోయి వచ్చెడు అతిథి భాగవత బృందములు - దారిలో విలుబుత్తూరు వటపత్ర శాయిని దర్శించుటకు నిత్యము వత్తురు. వారికా యూరి భాగవతులెదురేగి, సాష్టాంగమిడి, ఆప్యాయతతో నిండ్లకు తోడుకొని వత్తురు. పాద్యమిత్తురు, భోజన కాలమున కొబ్బరాకు ఆసనములపై గూర్చుండ జేయుదురు. వారి ముందు విశాలములగు నరటి యాకులు పరతురు. వాని నిండ రాజనపు వరియన్నము, పప్పు,

5. 'రురు+శాబము = తరుచుగాకూతలు పెట్టు నల్లచారల దుప్పి+పిల్ల.

పలు తీరుల కూరలు వడ్డింతురు. నేయి కాల్వలు కట్టింతురు. నున్నని పోక పాత్తులతో కుట్టిన దొప్పలలో పాలు పెరుగు లర్పింతురు. వార్చిన పిమ్మట తాంబూల మిత్తురు. శ్రమ తీరునట్లు పాదము లొత్తుచు కుశలమడుగుదురు. పోయెద మన్నపుడు చాల దూరము పోయి. తమ సిరికి. తగినట్లు సత్కృతి చేయుదురు. 'సత్పురుషుల నెడబాసితిమే' యని ఖేదముతో తిరిగి వత్తురు. (1-76)

శ్రీ, వైష్ణవులకు తదారాధన కన్న తదీయారాధన విశేషము గదా! ఇది వారి సంఘ వ్యాప్తికి, పరస్పరాప్యాయతకు, తోడ్పడు సంప్రదాయము.

## 3. సాయం శోభ

### (i) పాచికలాడు పద్మముఖులు:-

ఇంతలో ప్రొద్దు వాటారి సాయం శోభ సమకూరును. అది ఆలయ నాట్య కత్తెలకు (పద్మముఖులు- 1-60) శృంగార ప్రదర్శన వేళ ఆలయ సేవాకాలము కూడ. కాని పూజారంభ శంఖారవ మింకను వినరాలేదు. ఏ క్షణముననైన వినబడవచ్చు. ఈ సందున నొక యొయ్యారపు జూదమాడవచ్చు! ఇండ్లలో కూర్చుండి కాదు. ముంగిలి తిన్నెలపైన గుమిగూడి! ప్రదర్శన గదా ప్రధానము!

సారె యదల్చివేయుట తప్ప, తేర్చి వేయుట వారెరుగరు. ఆ యదల్పుకు రేగిన గాజుల గల గల, సారెలు దొర్లుమ్రోత దారిన బోవు యతి గుండెనైన ఝల్లని కలచక మానవు. కాని యెదురుగా నిల్చిన మన్మథునైన మొగమెత్తి చూడవి ఆ యెమ్మెకత్తెల కదియేమి పట్టును. అంతటి పరాకు మన్మథుని సైతము కొరగాని విటుని జేయక మానదు! అసలది పరాకైన గదా! పరాకే యనిన - చాల మెలకువతో కూడిన పరాకు! కానిచో నెదురుగ నిల్చిన మన్మథుని జూడనివారు త్రోవను పోవు శ్రీ కార్యపరులను[6] చూచీ చూడకనే యెట్లు గుర్తింతురు?ఎట్లు చటుక్కున లేచి అంజలి ఘటించి మ్రొక్కుదురు? ఈ యంజలి కొరకు ఇంద్రుడైన వారి కొలువు కాచ పడక తప్పదు!

---

6. ఆలయ ఉద్యోగులలోని వారు వివరములు 3వ అనుబంధమున నీయబడినవి.

సేవా కాలమైనది కాబోలు! శ్రీ కార్యపరులటు పోవుచున్నారు. శంఖారవమిక వినిపింపగలదు. అది వినుటకా విలాసినులు త్రిప్పు కడగన్నుల తళుకు జిగేలున ప్రజల గుండెలను దూసికొని పోవును (1-59)

శంఖారవము వినుటకు తల లోరగించిరనుటచే, వారి వీధి - ఆలయ సమీపమందున్న స్ఫురించును. విజయనగరమందలి సూళై/సూలై బజారిట్టిదే[7] విలుబుత్తూరు వర్ణనకు విజయనగర దృశ్యములు మాతృకలని 4వ అధ్యాయములో ప్రతిపాదింపబడినది.

## (ii) స్యందన ద్వంద్వము:-

రాయల యూహా విహంగమిట్లు - వేకువనే విలుబుత్తూరు లలితోద్యానములపై విహరించి, అందలి సౌధాగ్రములపై వ్రాలి, వాని చంద్ర శాలలలోని పిక, శుక ప్రతిమల ప్రతిస్వానముల వలన భ్రమ చెంది, చెంగలువ దిగ్గియల వద్ద భూమికి దిగ్గి, ద్రవిడాంగనల దివ్య ప్రబంధ గానముచే నాకర్షితమై వారి వెంట నూరిలో ప్రవేశించి, మధ్యాహ్నవేళ వారి ముంగిళ్లలో నెండబోసిన ధాన్యమును బొక్కులాడు దేవునింటి దుప్పి పిల్ల యాగడములకు మురిసి, సాయంకాల మాలయ ప్రాంతమున 'సూళై' బజారు చేరి, అచట తిన్నెలపై పద్మ ముఖులాడు గడుసరి జూదమును గమనించి, ఆలయమునకు బోవు శ్రీకార్యపరులను వెంబడించి, తేరు వీధిని చేరును. అచట మేరు మందరముల వలె నున్న రథముల జంట - దాని చూపు నడ్డగించును. అందొకటి వనజాక్షిది. మరొకటి వనజాక్షునిది. ఒకటి కొకటి దీటైనవి (1-58)[8]. వీని వర్ణన వివరము లౌకిక దృశ్య శీర్షికలో విందము.

---

7. ఆనాటి సూళై (నాట్యకత్తెల) బజారు. నేటి జీర్ణ విజయనగరమున అచ్యుత రామాలయమునకు సమీపమున యుండెడిదని హంపి శిథిలములను పరిశీలించిన పురాతత్త్వ శాస్త్రజ్ఞులు గుర్తించిరి.

8. శ్రీ విలుబుత్తూరులో నిప్పుడొక పెద్ద ప్రాచీన రథమున్నది. దీనిని సాధారణముగా బయటకు తీయరు. ఆమధ్య కొంత కాలము క్రిందట ఊరేగింపులో నది కొంత చెడినది.

## (iii) కేళివన హంసలు - ఆలయ దుందుభి కాహళులు:-

ఇంతలో నా యూరి కేళివన సరస్సులలోని హంసలు గూండ్లకు పోవలెనను కలవరముతో గుంపులుగా లేవపాగును. రాయల యూహా విహంగమీ కలవరముచే నాకర్షింపబడును. లేచెడి అంచరెక్కల పట పటాత్కారములు, గొంతుల క్రేంకారములు ఆచటి పొదరిండ్ల గర్భములలో మ్రోయుట వినును. అందు వారికా ధ్వనులలో సాయంకాలము అందా యూరి మురారి కోవెలలో చెలరేగు దుందుభి కాహళికల ప్రతి ధ్వనత స్ఫురించును. (1-72)

ఆ యూరి వారా సమయమున నెచట నున్నను, నేమి విన్నను, నేమి చూచినను వానిని స్వామి సేవాకాలపు హెచ్చరికలుగా గ్రహింతురు. ఆలయ ప్రభావము వారి చైతన్యమునట్లు నియంత్రించినది.

## (iv) సుగంధి యురటిగెలలు:-

ఈ హెచ్చరిక ననుసరించి వారాలయమునకు బయలు దేరుదురు. రాయల యూహా విహంగము వారిని వెంబడించును. త్రోవలో - వారికా యూరి సుగంధి

---

రాయల కాలమున రెండు రథములుండెనేమో తెలియదు. ఇదెట్లయినను విలుబుత్తూరు వర్ణనలన్నిటి వలెనే స్యందన ద్వంద్వ వర్ణన కూడా రాయల విజయనగర స్మృతులపై నాధార పడినట్లు తోచును. నేటికిని హంపిలోని పంపాదేవి - విరూపాక్షుల కళ్యాణ కాలమున, చైత్ర శుద్ధ పూర్ణిమనాడు ఏప్రిల్ - రథోత్సవములో, రెండు గొప్ప రథముల లంకరింపబడి, వేల కొలది ప్రజలచే లాగబడును. వీనిలో చిన్నది. పంపాదేవిది, పెద్దది విరూపాక్షునిది. *A.K. Balasundaram - Relics of Vijayanagar Glory, P 81, 1948. Anantapur- B.N. Subba Rao, Hampi Guide- P.4, 1964)* పయస్ ఒక్క రథము నూరేగించుట చెప్పినాడు *Sewell- Forgotten Empire - P. 246, 1970)* విఠలస్వామి ఆలయములోని 27 అడుగుల యెత్తు రాతి రథము ప్రసిద్ధము. *Sewell - Plate 6, also Balasundaram P. 85.*

యరటి తోటల వరుసలు కనిపించును. అందలి గెలలు పొడవుగా సాగి, పచ్చగా పండి, నేలను జీరాడుచు, పండ్లు వ్రాలి యుండును. పండ్ల చివరలు మాత్రము వల్లిగా నుండును. ఆ గెలలు వారికి పెద్ద పెద్ద సంపెంగ పూలను చాల దళములుగా కీలించి, పైన లావుగా, క్రింద సన్నముగా నుండునట్లు కట్టి, స్వామి కలంకరించిన గొప్ప తోమాలెలను తలపించును. (1-69). పండ్ల చివరి నలుపు సంపెగలపై వ్రాలి, వాని వాసనకు మూర్ఛిలి వివశమైన తుమ్మెదల గుంపనిపించును. ఇది కూడ వారి చైతన్య నియమన ఫలితమే!

(సుగంధ యరటిని తీరాంధ్రములో 'కర్పూర చక్రకేళి' యందురు).

(V) <u>త్రివిధ వైష్ణవాకర్షణలు:-</u>

గూండ్ల కెగురు హంసల కలకలములో నాలయ దుందుభి కాహళుల పిలుపు విని, పండిన సుగంధి యరటి గెలలో స్వామి సంపెంగ తోమాలెలను భావింపుచు భక్తు లాలయమును చేరుదురు. వారితో పాటు, రాయల యూహా విహంగము కూడ చేరును. వారి కపట వీచు గాలు లెదురు కోలిచ్చి, వారి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక తాపత్రయమును చల్లార్చును. అందుకా గాలిలో మూడు ఉపచర్యలున్నవి. మొదటి వచటి యంభోజాక్షుని అలఘు తులసి మాలలోని తేనె బిందువుల సంస్పర్శ. రెండవది ఆలయ నైవేద్యపు పిండి వంటల పుణ్య పరిమళముల సంగతి. మూడవది స్వామి సన్నిధిలో నాట్యమాడుటకై సజ్జీకృతలగుచున్న లలనల శిగల నుండి జారి విరుగాలు లాడించుచున్న చెంగలు వల సుగంధముల చెలిమి. (1-73)

రాయల వైష్ణవమునకెన్ని యాకర్షణలు! భక్తికి తులసి! భుక్తికి ప్రసాదము!! రక్తికి శృంగారము!!! అన్నియూ వారి దేవునికి సంబంధించినవే! వారి పరమాత్మ సర్వరస మూర్తి! భువన సుందరుడు! భగవద్భావనలో సౌందర్య మీమాంస వైష్ణవ మత విశిష్టత. ఇది ప్లేటో సౌందర్య సోపానమును గుర్తు చేయును.

## 4. రేయి సొగసు – మువ్వల మ్రోత

ఇంతలో ప్రొద్దు పోవును. ఆలయ ధ్వజస్తంభముపై కలవోకగా ప్రాకి, ఉండుండి అందలి పసిడి మువ్వల గుంపును కదల్చును. అవి ఘల్లుమని ఉలియును. ఆ ధ్వని

ఆకసము నంటెడి ప్రాకారపు టంచులపైన వ్రాలిన సంపెంగ శాఖలలో దూరి, అందలి పక్షుల మలికించును. వాని రొద విని, ప్రక్క యిండ్లలోని దంపతులు తెల్లవారెనని, అలకలు తీరి కూడుదురు. (1-74)

**5. రాయల సమగ్ర బుద్ధి**

విలుబుత్తూరు వైష్ణవ వాతావరణ వర్ణనలోని విషయ వైవిధ్యమును బట్టి మనకు రాయల సమగ్ర బుద్ధి చూచాయగా పొడకట్టును. కావ్యము సాగిన కొలది దాని పూర్ణ స్వరూపము గోచరించును.

ఆయన సమగ్ర బుద్ధికి విలుబుత్తూరు మానవ సమాజమే గాక, అచటి స్థావర జంగమ ప్రకృతి కూడా విషయమే! ఈ యన్నిటిలోను ఆయనకు వైష్ణవ వాతావరణ స్పర్శ యనుభూతమగును. దాని వలన కలుగు మానవ హృదయ స్పందనము, ప్రకృతి పులకింపును ఆయన ప్రదర్శించును. వీని నొక చోట క్రోడీకరించి చూచినచో, ఈ విషయము స్పష్ట పడును.

దీనికి సంబంధించిన మరికొన్ని విషయములు రెండవ అధ్యాయములో ఉదహరింపబడినవి.

## 1. మానవ హృదయ స్పందన

(i) వేకువనే శుచిస్నాతలైన ద్రవిడ సుమంగలుల నిర్మల హృదయములందు భక్తి పొంగారి దివ్య ప్రబంధ గానముగా బాహిరిలును. (1-56)

(ii) ముంగిట "కలమపు టెండుగు"లకు కాపుగా నున్న ద్రవిడ కన్యలు - దేవునింటి దుప్పి పిల్ల యాగడములకు కినియక మృదువుగా కలువ దండలతోనే మందలింతురు. (1-75)

(iii) గృహస్థ భాగవతుల మనో వాక్కర్మలు తదీయారాధన కంకిత మగును. (1-76)

(iv) పౌరె యదల్చివేయు తమకములో గూడ "ఆటవెలదు" లాలయ ఝంఝారవమున కెదురు చూతురు. ఎదురైన మన్మథునే తలయెత్తి చూడని యూప్రౌఢలు శ్రీకార్యపరులను చూడగనే లేచి, అంజలించి మ్రొక్కుదురు. (1-59)

(v) కేళివన కుంజ గర్భములలోని రసికులు సైతము హంసల కలకలములో వాలయ దుందుభి, కాహళుల పిలుపు వినుదురు. (1-72)

**2. ప్రకృతి పులకింపు:-**

(i) పండిన సుగంధి యరటి గెలలలో స్వామి సంపెగ తోమాలల యాకృతి యావేశించును. (1-69)

(ii) విలుబుత్తూరు గాడ్పులాలయ సుగంధములతో భక్తుల కెదురేగి, వారి తాపత్రయమును హరించును. (1-75)

(iii) ఆలయ మలయానిలము రాత్రులందు ధ్వజపతాక యందలి మువ్వలను ఘల్లున మ్రోయించి, సంపెగ శాఖలలోని పక్షులను రొదపెట్టించును. (1-74)

ఈ కొద్ది వర్ణనాంశములలో సైతము-ప్రకృతి, మానవ వర్గములు రెండును చేరియున్నవి. ఇవి కవి సమగ్ర దృష్టికి దిఙ్మాత్ర సూచికలు. ఈ దృష్టి - విలుబుత్తూరు లౌకిక దృశ్య వర్ణనలో మరింత స్పష్టపడును. ఋతువర్ణనలోను, సమకాలీన జీవన చిత్రణలోను, పరాకాష్ఠ నందుకొనును.

**6. వైష్ణవ వాతావరణ ప్రయోజనము**

**(i) శ్రీవిలుబుత్తూరు వర్ణన:-**

శ్రీ విలుబుత్తూరు క్షేత్రము కావ్యమున కీలకపాత్రలగు విష్ణుచిత్త, ఆముక్త మాల్యదల జన్మస్థానము. వారి జీవిత చరిత్రలకు కేంద్రము. ఆముక్తము వారిని గూర్చినది. అందువలన నది యాయూరి వర్ణనలతోనారంభమగుట సహజము.

మరియు రాయల నాటికి తెలుగు ప్రబంధ కవులకు అష్టాదశ వర్ణన లాదర్శములయ్యెను. వానిలో పురవర్ణన సర్వసాధారణము. విలుబుత్తూరు వర్ణన ఈ సంప్రదాయము ననుసరించినదనుట స్పష్టము.

కాని, అందలి యంశములను విష్ణుచిత్తుని కథతో నన్వయించి చూచినచో నది కేవలము లాంఛన ప్రాయిముగ జేసిన యాదృచ్ఛిక వర్ణన కాదని, కవి దానికొక ప్రత్యేక ప్రయోజనము నుద్దేశించెనని స్ఫురించును. ఎట్లన -

**(ii) విష్ణుచిత్తుని చర్యకు పూర్వరంగము:-**

విలుబుత్తూరు వర్ణన 26 పద్యములలో సాగినది. వీనిలో పది ప్రత్యేకముగ అచటి వైష్ణవ వాతావరణమును స్ఫురింపజేయును. (1-53-56-58-59-69-72-76) వీని నింతకు పూర్వము గమనించితిమి. మిగిలిన 16 అచటి లౌకిక దృశ్యములను గూర్చినవి.

వైష్ణవ వాతావరణమును గూర్చిన తొలి యైదు పద్యములు (53-56-58-59-69) లౌకిక దృశ్యముల నడుమ నడుమ చెదురు మదురుగా నున్నవి. అందుచే వాని ప్రత్యేక ప్రయోజనమును వెంటనే గుర్తించుట కనువు పడదు. కళను మరుగు పరచుటలో కళ యిమిడి యుండునను నానుడికిదొక దృష్టాంతము.

కాని పురవర్ణన తుది భాగములో వైష్ణవ వాతావరణ మైదు పద్యములలో (72-76) కేంద్రీకరింపబడుటచే స్పష్టముగ గుర్తింపదగియున్నది. ఈ అయిదింటిలో చివరి పద్యమున, నిది ఆ యూరి భాగవతుల యతిథి భాగవ తార్చనలో ప్రత్యక్షముగ మూర్తీభవించును. భాగవతుల చర్యను వర్ణించిన వెంటనే కవి ఆ యూరి 'యుందుండు' భాగవత శ్రేష్ఠుడగు విష్ణుచిత్తుని ప్రవేశపెట్టును. ప్రవేశపెట్టుమనే ద్వయమంత్ర, యోగ, వేద, వేదాంత నిష్ఠలతో గూడి అసాధారణమైన యతని బహుముఖ వైష్ణవ సాధన నొక గంభీరమగు పద్యమున వర్ణించును. (1-77)

ఈ వర్ణన క్రమమును బట్టి చూడగా కవి యీ వైష్ణవ వాతావరణమును కావ్యమున కీలకపాత్రయగు విష్ణుచిత్తుని అసాధారణ వైష్ణవ సాధనము సంగతపరచుట కుద్దేశించెనని స్ఫురించును. విష్ణుచిత్తుని కథకిది పూర్వ రంగము. అతని సాధన నుండియే యతని సమస్త చరిత్ర యుద్భవించెను. అతని చరిత్ర కావ్యగత కథలన్నిటిని కలుపు సూత్రము. ఒక విధముగ ఈ కథలు కూడ విష్ణుచిత్తుని బహుముఖ సాధనకు దృష్టాంతములే! ఈ విషయ మా పద్య పరిశీలనలో విశదపడును. (1-77)

ఇక విలుబుత్తూరు లౌకిక దృశ్యములను చూతము. ఇది పైన తెలిపిన వానితో కలసియే యున్నది. మొదట వైష్ణవ వాతావరణ భాగమును మాత్రమే వ్రాసి విషయ సమగ్రత కొరకు లౌకిక వాతావరణ దృశ్యములను కూడ చేర్పడమైనది.

# అధ్యాయము -2

## లౌకిక దృశ్యములు - (విశ్లేషణ)

**అధ్యయన పద్ధతి:-**

విలుబుత్తూరు లౌకిక దృశ్య వర్ణనల సారస్యమును సమగ్రముగా దర్శించుటకు మనము -

మొదట - వాని నా యా వేళల ననుసరించి, సమీకరించి, అందలి యంశము లను విశ్లేషింతము.

తరువాత - ఆ యంశములను విషయానుసారముగ వర్గీకరించి, వాని సమగ్ర స్వరూపమును దర్శించి, రాయల సమగ్ర దృష్టిని గుర్తింతము.

ఆ పిమ్మట - కవి భావించిన యలంకారములను వర్గీకరించి, వర్ణన బాహుళ్య మును, అలంకార సమృద్ధిని గుర్తించి, ఇందుకు కారణములను విచారింతుము.

తుదకు విలుబుత్తూరు దృశ్యముల వెనుక నున్న విజయనగర స్మృతుల నన్వేషింతము.

వర్ణనల విశ్లేషణలో వర్ణితాంశములతో పాటు కవి నయన మనో వ్యాపార క్రమమును కూడ గుర్తింతము.

అలంకార సమీకరణలో వాని సారస్యమునే గాక, వాని వెనుక నున్న కవి మనస్తత్వము నావిష్కరింప యత్నింతము.

విజయనగర స్మృతుల గవేషణలో విలుబుత్తూరు దృశ్యముల మాతృకలను దర్శింతము.

# దృశ్య విశ్లేషణ

## 1. ఉదయము

**1. విలుబుత్తూరు - వెలుపల నుండి ఉద్యాన పరంపరలు:-**

విలుబుత్తూరు వర్ణన యారంభమున కవి యచట లలితోద్యాన పరంపరలను, అందలి పిక శుకాలాప ప్రతిధ్వానములను పేర్కొని, ఆయూరెందు జూచినను మిన్నులతో రాయు సౌధములతో చెన్నొందుచున్నదని ఇత్యాదిగ తెలిపి, ఈ యాలాప ప్రతిధ్వానములా సౌధోపరి చంద్ర శాలలందుంచబడిన నీల హరిన్మణీ పిక శుక ప్రతిమల స్వానము లనెడి భ్రమను 'పూన్ప' జేయునని యుత్ప్రేక్షించును.

ఈ వర్ణనను బట్టి

1. ఈ లలితోద్యానము లాయూరి సౌధముల కనుబంధించినవని-

2. ఆ సౌధములా యూరి యందన్ని ప్రక్కల నుండెనని-

3. సౌధములతో పాటు, వాని కనుబంధించిన యుద్యానములు కూడ నాయూరి నన్నిదిశల నావరించి యుండెనని ఏర్పడును.

ఇవి యనేక సౌధములకు సంబంధించి యుండుటచే "లలితోద్యాన పరంపరల నుట సార్థకము. (సౌధ శ్రేణులను గూర్చిన చర్చ 2వ అనుబంధమున చూడనగును.)

ఈ యుద్యానములకు తోడా యూరి చుట్టు పూవుదోటలు, ఉప వనములు, కేళి వనములు, పనస, అరటి, తముల పాకు, మావి తోటలుండెనని కవి వర్ణించును. **(1-66-72)**

ఇవన్నియూ వెలుపలి నుండి విలుబుత్తూరుకు వచ్చు వారికి దూరమున నుండగా, ఒకే గుబురుగా కనిపించుట సహజము. ఆగంతుకులకు మొదట దృష్టి గోచరమగునదా యూరి లలితోద్యానాదుల సమష్టి బాహ్యాకారరేఖ మాత్రమే. (*Combined outer skyline*) సూక్ష్మదర్శకుడగు రాయలీ మర్మమును గ్రహించి విలుబుత్తూరు ముఖ చిత్రణలో నచటి లలితోద్యాన పరంపరలను స్థాపించును.

## 2. విలుబుత్తూరు లోపలి నుండి

**(1) సువర్ణ సౌధములు:-**

ఆగంతకు డూరిలో ప్రవేశింపగనే లలితోద్యానములు మాటు పరచిన సువర్ణ సౌధములు స్ఫుటముగా కనుపించును. ఇవి 'మిన్నులతో రాయు' ఉన్నతి గలవి. ఉన్నతా కృతి యెదురైనపుడు, మానవుని దృష్టి దాని యగ్రమునకు మరలుట సహజము. అట్లు చూడగా, సౌధములపై చంద్ర శాలలు (వలభి=మైమేడ) గోచరించును.

**(ii) పికశుక ప్రతిమలు:-**

చంద్రశాలలపై అందలి నల్లని కోయిలలు, పచ్చని చిలుకలు ముచ్చట గొలుపును. వాని సొగసు గమనించు చుండగా, వాని నుండి వెలువడు మంజులా లాపములు శ్రవణ పేయములగును.

**(iii) అంతా భ్రమ:-**

ఇదొక భ్రమ! భ్రమ తొలగగానే ఆ పిక పికములు నీలములతోను, గరుడ పచ్చలతోను నిర్మింపబడిన ప్రతిమలు మాత్రమే. వీని నచట అలంకారార్థముంచిరి! నిజమునకవి స్వనించుట లేదు. ఉద్యాన పిక శుకాలాపముల ప్రతిధ్వానములే ఈ భ్రమను పుట్టించుచున్నవి. (1-51)

**(iv) సౌధముల కప్పులు:-**

కవి చూపు చంద్ర శాలల నుండి సౌధముల కప్పులపైకి ప్రసరించి, వానికి గప్పిన యపరంజి యోడు బిల్లలను (పెంకులు) పద్మరాగ కలశములను గమనించును.

ఏమి! మిన్నులతో రాయు ఈ సౌధములు స్వర్గ పురి యందలి. ఇంద్రుని వైజయంతి భవనమును గెలుచుటకు సిద్ధమై, కోపముతో నిటారుగ నిలిచిన యోధులా! ఈ యపరంజి యోడు బిళ్లలు వారు తాల్చిన కవచములా! పద్మరాగ కలశములు వారు ధరించిన యొరదాలు శిరస్త్రాణములా! (1-52)

(సౌధ యోధులను గూర్చి అలంకార శీర్షికలోను, విజయనగర మాతృక అనెడి శీర్షికలోను చూడవగును)

(v)వీథులు:-

సౌధాగ్రముల నుండి కవి దృష్టి సౌధ వీథులపైకి మరలును. అవి సూత్ర పట్టినట్లు తిన్నగా నుండి కంటికింపగును. (1-53)ఇచట 'వీథి' శబ్దమునకు 'శ్రేణి', 'వరుస' యని చెప్పుకొనుట సరసము. ఇది రెండవ యనుబంధమున వివరింపబడినది.

(vi) వాకిలిమెట్లు:-

సౌధాగ్రములను కలయజూచిన కవి చూపు క్రిందికి మరలును. అచటి ద్వారముల ముందున్న అందమైన మెట్లు దాని నాకర్షించును. పరిశీలించి చూడగా వానికి తాపిన గజ సింహాకృతులు గోచరించును. ఆ యేనుగులు మరకతములతో మలచబడినవి. పాచి పట్టిన దిగ్గజములా! సింహములో! అవియు రాతితో మలచినవే! ఏమి సింహములు! తొండములను తప్ప యేనుగుల దేహములెల్ల మ్రింగినవే! లేకున్న యేనుగుల తొండములు మాత్రమే వాని నోళ్ల నుండి యేల వ్రేలాడును? (1-53)

(vii) ద్వార తోరణములు:-

కవి తన దృష్టిని ద్వారముల మెట్ల నుండి పైకి మరలించును. ద్వార బంధములకు కట్టిన మణి తోరణములు కనుపించి యానందించును.

అవి యా "భవన రాజు" లితర పుర గృహశ్రీలను పెండ్లాడుటకు ధరించిన బాసికములా! (1-53)

(viii) ద్వారములపై చిత్రములు:-

తోరణములు సరే! వాని కెగువనున్న చిత్రములేమి? ఓహో! అపరంజి నీటితో వ్రాసిన లక్ష్మి, ఆమె కిరుప్రక్కల నుండి జలక మాడించు రెండేనుగులు! ఆమె పార్శ్వము లందున్నవి శంఖ చక్రముల చిత్రములు!

క్రింది యరుగులలో గూడ నివియున్నవే! కాదు! ఈ యరుగులు రత్నపు తిన్నెలగుటచే వీని యందా చిత్రములు ప్రతిఫలించుచున్నవి! (1-53) (లక్ష్మి- శంఖ చక్రముల గూర్చిన విశేషములు 6వ యనుబంధమున జూడనగును)

(ix) కొబ్బరాకులు - మొగ్గలు - ముగ్గులు:-

వాకిళ్ల ప్రక్కనున్న రత్నపు తిన్నెల నుండి కవి చూపు వాకిళ్ల ముంగిలి బాటలపైకి ప్రసరించును. ఇవియు రత్నాలు పరచి చదునుగా నిర్మించి నట్లున్నవే! (రత్నకుట్టి మంబులన్)

వీనిలో ప్రతిఫలించుచున్నవి - ముంగిళ్లలోని కొబ్బరుల ఆకులు, మొగ్గలు! ముంగిళ్లను పచ్చని పేడతో నలికి తెల్లని ముగ్గులు పెట్టి నట్లయట్లు శృంగారము ఘటించుచున్నవి! (1-55)

(x) పథము - కొబ్బరులు:-

కవి దృష్టి ముంగిలి బాటల ననుసరించి ప్రజలందరు నడచు పథమును(బజారు రోడ్డు) చేరును. అది కూడ వజ్రములు పరచి నిర్మించినట్లు కాంతి ప్రవాహమును వెలార్చుచున్నది. (వజ్ర కుట్టిమంబగు పథంబు)

పథమున కిరు ప్రక్కల ఎఱ్ఱని బొండములతో నిండియున్న పన్నకొబ్బరి వరుస లెంత మనోహరములు!

ఈ బొండములు పగడపు ఛాయ సిందూరము ప్రామిన పాండ్య వధూ వక్షోజములను నవ్వు చున్నవా?

కాంతి ప్రవాహము వలె సాగిపోవుచున్న యీ విశాల దీర్ఘ మార్గమో! ఇది గంగా ప్రవాహము కదా! ఈ కొబ్బరు లామె కుమారులగు కల్పవృక్షములు కావా? అవును! ఈ యూరి వారు సముద్రుని కొల్లగొట్టి పైకి లాగి తెచ్చిన రత్నములు గాక మిగిలియున్న వానిని వారి కొరకు రక్షింతునని యతడు తన పెద్ద భార్య గంగను, ఆమె కుమారులు కల్ప వృక్షములను నిచట పూటగా నుంచెను! (1-54)

(xi) పసిమి రెక్కల హంసలు:-

విలుబుత్తూరు వజ్రకుట్టిమ మార్గ పరిశీనలలో రాయలకచట సంచరించు పసిమి రెక్కల హంసలు కనిపించును.

ఏమి వింత! ఇవి ఆకాశ గంగ నుండి దిగి వచ్చి, బంగరు రెక్కలతో ప్రకాశించు దివ్య మరాళ సమూహములా!

ఆహో! భ్రమ! ఇవి ద్రవిడ కుటుంబినుల భవన సరోమరాళములు కావా? వారు స్నాన సమయమున పసుపు గొమ్మరగదిపిన రత్నపు మెట్టు క్రింది నీటిలో రాత్రి నిద్రలో పొరలాడినందున గదా - ఏవి రెక్కలు మొత్తము పచ్చబారినవి! (1-64)

**(xii) వరిచేల కాల్వలు-బాతులనిద్ర, రక్షకుల భ్రమ:-**

రాయల యూహా విహంగము వేకువనే విలుబుత్తూరు లలితోద్యానములను చేరు త్రోవలో, నూరి వెలుపలనున్న వరిచేల కాల్వల వద్ద హాస్యమయమగు నొక దృశ్యమును జూచెను. దానిని వర్ణించు పద్యమాముక్తమును పఠింపని వారయినను రసజ్ఞులగు వారి నాల్కలపైన నర్తించు చున్నది.

ఆ యూరి వరి పొలములకు బోవు కాల్వలున్నవి. వాని నీటి నడిమి భాగమందు బాతులు రాత్రిళ్ల తలలు రెక్కల గుములలో గ్రుచ్చి నిద్రింపను. ముడుచుకొని యున్న వీనిని మసక వెలుగులో జూచిన యూరి కాపరులు ఉపస్నాతులై వెళ్లిన బ్రాహ్మణుల వస్త్రపు పిడుచలని భ్రమించి, వానిని వారి ఇండ్లకు జేర్చుదమని రేవులలో దిగుదురు. బాతులు మేల్కొని తటాలున పారిపోవును. బాతుల చురుకు, రక్షకుల భంగపాటు జూచుచున్న వరిచేల కాపరి పడతులు గుంపులు గూడి గేలి చేయుదురు.

*తలఁబక్షపుట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర*
*స్థలి నిద్రింపఁగఁజూచి, యారెకులు సుస్నాత ప్రయాత ద్విజా*
*వలి పిండీకృత శాటికల్పవి దదావాసంబుఁ జేర్పంగ రే*
*వుల డిగ్గన్వెనఁ బాఱువానిఁగని నవ్వున్శాలి గోప్యోఘముల్ (1-65)*

**రాయలహాస్యము:-**

వినగనే నవ్వు కలిగించెడి యా దృశ్య వర్ణన పయస్ గమనించిన రాయల హాస్య స్వభావమున కొక చక్కని దృష్టాంతము. "He is .... cheerful of disposition and very merry" [1]

---

1 *Sewell - A Forgotten Empire - Paes- P. 239. 1970*

ఇట్లే - రక్షకభటుల యువక తవకలు, పంట చేలలో మంచెలనెక్కి, చిలుకల నదలించుచు, బాటసారిని తప్పుదారిని పట్టించిన గోపికల చిలిపి నవ్వు గూడ రాయల హాస్య దృష్టి నాకర్షించును. (4.239-163)

గంభీర కావ్యమగు నాముక్తమున నిట్టివే మరికొన్ని హాస్య పాదకములగు దృశ్యములుండునని మనమనుకొనము.

<u>మధ్యాహ్నవేళ:-</u>

ఉదయమంతయు విలుబుత్తూరు నందనేక దృశ్యములను జూచుచు వినోదించిన రాయల యూహా విహంగమున కచట మధ్యాహ్న కాలమున మూడు దృశ్యములు మాత్రమే ఆసక్తిని కలిగించును. అందొకటి కలమపు టిండుగులను బొక్కులాడు దుప్పి పిల్లను గూర్చినది. రెండవది అతిథి భాగవతార్చనాదికము, వీనిని వైష్ణవ వాతావరణ శీర్షికలో గమనించితిమి. ఇపుడు వీనికన్న నాసక్తి కరమగు లకుముకుల పలిటీలను చూతము.

<u>లకుముకుల పలిటీలు:-</u>

ఈ వింత విలుబుత్తూరు రథ్యల (వీధుల) లోనిది. ఎక్కడి నుండియో లకుముకి పిట్టలు [2] గుంపులు గుంపులుగా వచ్చి, గుబాలున క్రిందికి పడుచు, తృటిలో పైకి

---

2 లకుముకి= చెట్టుకొమ్మపై నుండి నీటిలోనికి దుమికి చేపలను పట్టు పక్షి - (ఆం. శ. రత్నా) దీని కనేక తెలుగు పేర్లున్నవి. నిజముగు-పేరు పిట్ట బుచ్చిగాడు. *King Fisher = Small Bird with long cleft beak and brillint plumage, feeding on fish etc. which ir captives by diving shorter Oxford Dictionary.***1971.** లకుముకులలో **190** జాతులు విస్తృతముగా వ్యాపించియున్నవి. ఇవి. 'కీకీ, కీ' యని అరచుచు, అత్యంత వేగముతో యెగిరిపోగలవు. ఇవి సాధారణముగా నీటి ప్రవాహముల సమీపమున చెట్ల కొమ్మలను పట్టుకొని కూర్చుండి యుండి, నీటిలో చిన్ని చేప కదలిక కనుపించగానే టపాలున తలక్రిందుగా నీటిలోనికి దుమికి, చేపను ముక్కుతో ఒడిసిపట్టుకొని, వెంటనే కొమ్మపైకెగిరి వచ్చి, ముందుగా చేప తలను మ్రింగును. ఇది పిట్ట కొంచెము ముక్కు

లేచుచున్నవి. ఎక్కడి నుండి. ఎందుకు? ఎక్కడికి? అని గమనింపగా సువర్ణ సౌధముల చంద్ర శాలల నంటుచున్న ఉన్నత వృక్షముల గుబురుల నుండియని, ఆ వీధులలో నీలపు తల్లి యొురవరకు తేట నీరు నిండియున్న నడబావులలో తళుకుమను చేపల కొరకని తెలియును. ఇవి గట్టివని దూకుట, వెంటనే పైకెగురుట బంతియాట వలె లేదా!

కాకేమి! అదృశ్యురాలుగా నున్న గేహేందిర ద్రవిడాంగనల పరిచితి వలన నేర్చిన చెండాట ఇది! (1-57)

## సాయంత్రము

**(1) స్పందన ద్వంద్వము:-**

మేరు మందరముల వలెనున్న యీ రథముల జంట విలుబుత్తూరు వనజాక్షీ వన జాక్షుల వని మాత్రము వైష్ణవ వాతావరణ విషయమున గుర్తించితిమి. తక్కిన వర్ణన యంతయు లౌకిక మగుటచే దాని నిచట సవివరముగ ముచ్చటింతము.

నిజమునకు వీని వర్ణన పైన తెలిపినంత సరళము (simple) కాదు. అంత సూటియైనది కాదు. కవి దీనికొక యుత్ప్రేక్షను తలక్రిందులుగా క్లిష్టాన్వయ సూత్రముతో నుక్కిరి బిక్కిరిగా బంధించి, ఒక మహాప్రస్తరగా నిర్మించెను. రాయల యుత్ప్రేక్షల దుర్గ్రాహ్యతకు, అన్వయ క్లేశమునకు నిదొకమచ్చు. దీనిని సుబోధ మొనర్చుటలో ప్రఖ్యాత వ్యాఖ్యాతలకు గూడ కొంత క్లేశము తప్పలేదు. ఇక నా బోంట్లా!

---

మునము. (*Catharine Blow, Animal Encylopaedia P.P. 175-177 Octopus Book Ltd. London, 1980.*

ఇవి సాధారణమగు పిచ్చుక ప్రమాణము, పొడుగు పాటి ముక్కు, రంగు రంగుల వర్ణము కలిగి యుండును. వీనికి సంస్కృతమున కిక్ వాక్ (కికీయను అరుపు కలవి), మొదలగు ఏడు పేర్లు కలవు. ఇవి ఒక్కొక్కమారు 10×20 అడుగుల యొత్తున గాలిలో నృత్యము చేయుచున్నట్లు రెక్కలల్లార్చుచు, చేప కనుపడగనే, తటాలున తలక్రిందుగా సూటిగా నీటిలో దుముకును. వీని సంస్కృతపు పేర్లు, వాని నృత్యగమనమునకు సంబంధించినవే (*K.N. Dave, Birds in Sanskrit Litearature King Fisher PP. 155-158 Motilal Banarasi, 1985.*

రాయుల వారి మహోగ్రస్వర నినుమారు ముమ్మారు సవ్యాఖ్యానముగ పఠించి యెట్టెట్లో సుసంబద్ధమైన తాత్పర్యము నేర్పరచుకొన వలసియుండును. గ్రంధ విస్తరమైనను, ఈ పరిశ్రమ క్రమమును సహృదయులకు నివేదించుట నా విధి.

మొదట పద్యమును, తరువాత పద విభాగమును, తుదకు తాత్పర్యమును గమనింతము. పద్యము

i స్వ నిలిం పావాసద త్యాసన దతల మిథ ప్రారతమ్యంబు లీరెం
ii డును దీనన్లొంచు నమ్మేరువుల నడుగం బోఁగు మధ్య భ్రతోన్న
iii త నపీఠ ద్వంద్వ బృందాలయ చిల తట కల్యాణ మంథాద్రులో నా
iv వన జాక్షి స్వందన ద్వంద్వము లిఖిత నరావాప్త దాంపత్య మొప్పన్ (158)

**గమనిక:-**

(1) పదముల క్రింది గీట్లు పద విభాగమును తెలుపును.

(2) పదములపై యుంకెలు ఆయా పాదములలోని ప్రతి పదార్థ క్రమమును తెలుపును

మరొక ముఖ్య విషయము- పద్యపాదముల వరుసను క్రిందు మీదులు చేసి iv-i-ii-iii- క్రమమున అన్వయము సాధింపవలెను. పద విభాగానుసారముగ ప్రతిపదార్థము గమనించవలెను.

**4వ పాదము:-**

1. చిత్రింపబడిన, 2. నరనారుల చేత, 3. పొందబడిన, 4. పత్నీపతి భావము కలది (దంపతులుగా చిత్రింపబడిన స్త్రీ పురుషుల యాకారము కలది) 5 వనజాక్షి యొక్కయు, వనజాక్షుని యొక్కయు, (లక్ష్మీ నారాయణుల యొక్క) 6 తీరుల 7 జోడు (ఎట్లున్నదనగా )

**1వ పాదము:-**

1. తమ యొక్క (మేరు మందరముల యొక్క), 2 దేవతలకు, 3. నివాసము నిచ్చుట యొక్కయు, 4. ఆహారము నిచ్చుట యొక్కయు, 5. బండొంటి యొక్క, 6. హెచ్చు తగ్గులు, 7. ఈ నివాస ఆహారములిచ్చు రెండు ధర్మములను (గూర్చి),

**2వ పాదము:-**

1. దీనులు 2-3. ఏమేడల వలన పొందుచున్నారో, ఆ మేడలనే, అడిగి తెలిసికొనుటకై 5. (వినయ పూర్వకముగా) మోకాళ్ల మీద నడచి వచ్చిన (మేరు మందరములు) 6. విజృంభించిన 7 కామక్రీడలో 8. కూడికలు గల

**3వ పాదము:-**

1. స్త్రీ పురుష సిద్ధుల యొక్కయు, 2. జంటల యొక్కయు, 3. సమూహముల యొక్క, 4. నివాసములయిన, 5. గుహలును, 6. దరులును గలవైన 7,8,9 మేరు మందర పర్వతములో 10 అనునట్లు (4వ పాదములోని) 5 ఒప్పున్) స్యందన ద్వంద్వము) ప్రకాశించుచున్నది. ప్రతి పదార్థ మర్థమయినది గదా! ఇక తాత్పర్యమును చిత్తగించండి!

(1) శ్రీ విలుబుత్తూరులో లక్ష్మి నారాయణులకు చెరియొక రథము ఉన్నది. వీనిలో దాంపత్య భావమును పొందు నరనారులు చిత్రింపబడిరి.

(2) మేరు పర్వతము దేవతలకు నివాసమిచ్చునది. మందర మాహారము (అమృతము) నిచ్చునది. ఈ రెండిటి యందును ఉద్యత్ రతిలో కూడు సిద్ధ మిథున సమూహములు గల గుహలు, తటములు కలవు.

(3) విలుబుత్తూరులోని మేడలు కూడ ప్రజలకు నివాసమును ఆహారమును నిచ్చునవే!

(4) ఈ రెండు ధర్మములలో గల తారతమ్యముల నా మేడలనే యడుగుదమని, మేరు మందరములు చిన్న యాకృతులను ధరించి దోగాడుచు వచ్చినట్లున్నవి - ఈ రెండు రథములు.

రథములలోని నరదంపతుల చిత్రములు మేరు మందరములలోని సిద్ధ దంపతుల వలె నున్నవి.

ఇంత వివరించినా, ఇంకొక శంక మిగిలియే యున్నది. ఈ రెండు ధర్మముల తారతమ్యము నివాస ఆహారములను గూర్చినదా? లేక మేడలిచ్చు ఆవాస ఆహారములకు పర్వతములిచ్చు ఆవాస ఆహారములకు గల తారతమ్యమును గూర్చినదా? (1-58)

ఇదీ-రాయల వారు 'పెంపెక్కి'న 'యుత్ప్రేక్ష'లను 'పలుకుట' లోని విశేషము! (1-13)

**2. పాచికలాడు పద్మముఖులు:-**

వీరు తేరు వీధిలోనో, ఆ ప్రాంతముననో నివసించు ఆలయ నాట్యకత్తెలు. స్యందన ద్వంద్వమును వర్ణించిన వెంటనే కవి వీరిని గూర్చి ఘనముగ అయిదు పద్యములలో సవివరముగ వర్ణించును. (1-59-63) ఈ వివరములలో శ్రీ కార్యపరులకు మ్రొక్కుట, ఆలయ శంఖారవమున కెదురు చూచుట - వైష్ణవ వాతావరణ శీర్షిక క్రింద గమనించితిమి. మిగిలిన వానిని ప్రస్తుత మాపి 3-7 దృశ్యముల (పూవుదోటలు-మావితోపులు) తరువాత సావకాశముగ ముచ్చటింతము.

**3. పూవుదోటలు - వరిమళ్ళు:-**

వేకువ జామున లలితోద్యాన పరంపరలతో నారంభమైన రాయల యూహా విహంగము పురవిహారము పాచికలాడు పద్మముఖులతో దాదాపు పూర్తియయి సాయంకాలము కొంత గడచినది. ఈ చల్లబారువేళ ఊరి వెలుపలి ప్రకృతి సౌందర్య దర్శనమున కనుకూలము.

ఊరు వెడలగనే రాయల యూహా విహంగము నచట ప్రక్కప్రక్కనే యున్న వరిమళ్లు, పూవుదోటలు ఆకర్షించును. ఇవి ఒకదానితో నొకటి పోటీ పడుచున్నవి.

ఈ వరి చేలలో వరుసలు వరుసలుగా వర్ధిలుచున్న తీగమల్లెలు, ఖర్జూరములు, పుష్పమంజరులు, మామిడి గుత్తులు, కుసుమలు, సంపెంగలు, పచ్చగన్నేరులు, పాళలు అను వరి వంగడములున్నవి. పూదోటలలో గూడ నీయెనిమిది పేర్లు గల పుష్ప జాతులున్నవి. కాని. వరి చేలలో రాజనములు విశేషము. ఆ పేరు గల పుష్ప జాతి లేదు.

పరస నరసనే యున్నయీ చేలు, తోటలు - ఒక త్రాసులో రెండు వైపుల సరి తూగుచున్నట్లు లేవా! అదిగో రాజనపు కాంతి మిగిలి, ముల్లు వరి మళ్లవైపు చూపుచున్నదా! చేలు పూదోటలును'నవ్వుచున్నవి! చేలలోని కొంగల గుంపులా నవ్వుల ధాళధళ్యము!

**4. పండిన కలమ వరి - బలసిన ఎఱ్ఱ గలువలు:-**

పండిన రాజనాల మళ్లను కోయుటకనువుగా నీరు వెళ్లగొట్టిరి. పైరు శోషించి యొరగబడినది. సమీపమున నున్న ఉపవనముల గాలి దెబ్బకు మరింత వంగబడినది. ప్రక్కన కాల్వలో బలసియున్న చెంగలువ గుంపుల మీద తన జుంజురు ముండ్లతో రాయు చున్నది!

నీరు లేక యీ వరికి నిలువునా దప్పి రేగెనో! పూర్వము తాను నీళ్ల త్రాగు వేళ్లను క్రింది నుండి జుంజురు ముండ్ల రూపమున తల పైకి తెచ్చికొని, వంగి చెంగలువల తేనె త్రాగుచున్నదో! (1-67)

**5. పగిలిన పనసలు - ముసిరెడు తుమ్మెదలు:-**

అవిగో! పేరు పనస తోటలు! గండ శిలలతో పోటీపడు పెనుపండ్లు! భూమిలోనే పండి బ్రద్దలైనవి! వీని రసముతో నేల బురదయైనది. పై కూరు తేనె త్రాగుట కన్నివైపుల నుండి తుమ్మెదలు పెనవేసికొని ముసురుచున్నవి!

ఈ పండ్లు వసంత నృపుని మేటి యేనుగు ఆకృతిని తలపించుచున్నవి. వీని రసమా యేనుగు గండ స్థలములు పగిలి మిక్కుటముగా పారు మద జలమే! పండ్ల నంటిన బురద ఆ యేనుగు కొట్టుకొన్న దుమ్ము వలని బురదయే! పెనవేసికొని పెనుగులాడు తుమ్మెదలా యేనుగును బంధించుటకు కట్టబడి, దాని యూపులకు చలించు గట్టి గొలుసులు. (1-68)[3]

---

3. ఏనుగులు రాయలకు నిత్య సన్నిహితములు, అభిమాన పాత్రములు. ఆయన స్వీయ పర్యవేక్షణలోనివి. ఉన్నతములైన వీని శాలలు నేటికిని శీర్ణ విజయనగరములోని అంతః పుర స్థలము నానుకొని యున్నవి. ఏనుగులను కట్టుట కవసరమైన సాధారణపుటేర్పాట్లు వీనిలో లేవు. కాని, వీనిని కప్పుపై భాగమునకు కట్టెడి వారని అబ్దుల్ రజాక్ కథనము. *(D. Deva Kunjari - Hampi. P. 39 - Arch. Survey of India, 1970.* ఆముక్తమున విలుతావులందు రాయలేనుగులను గూర్చి ప్రస్తావించును.

(i) విష్ణుచిత్తుడు నిరంతర ధ్యాన యోగమను గొలుసుతో విష్ణువును చిత్తమున బంధించును. *(1-77)*

ఉన్నట్లుండి చెట్టు నిండ దిగు పనసల ప్రసక్తి (4-274)తో కనుపించును. విజయనగరమున పనస తోటలను గూర్చిన పేయస్, న్యూనిజ్‌ల వర్ణన విజయనగర స్మృతులు (ఉద్యానాదులు) అను శీర్షిక క్రింద చూడనగును.

## 6. తములపు తీగెలు - పోకమానులు

## చెరకు తోటలు - బెల్లపు వంటలు

పనస తోటల ప్రక్కనే వరుసలుగా నున్నవి సుగంధి యరటి తోటలు. వీనిని వైష్ణవ వాతావరణములో గమనించితిమి. వాని ప్రక్కనే చెరకు తోటలు. వీని చుట్టు పోక మ్రాకులు, వీని కంఠముల వరకు వల్లుకొన్నవి తములపు తీగెలు. పోకమట్టలు బరువెక్కి, పడుటచే చెరకు ముత్యములు చిట్లుచున్నవి. చిందుచున్న చెరకు రసము వీనిని సమీపమున నిరంతరముగ బెల్లము వండు పాయిలో పడజేయుచున్నది. ఆ ముత్యములు చూర్ణమగుచున్నవి.

ఇదీ రాయల వాస్తవిక వర్ణన! ఇక వారి ఊహా విభ్రమము-

ఈ తీగె ఒక నాయిక కౌగిలింత. చెరకు ముత్యముల చూర్ణము సున్నము. అది తమయనురక్తిని (ఎరుపును) పెంచెడి మందని నాయిక నాయకుని హెచ్చరించుచున్నది. (1-70)

---

*(iii) కట్టు తప్పిన మదగజము, మధుర వీధులలో భయంకర స్వేచ్ఛతో సంచరించును. (2-24)*

*(iiii) మధుర ఉద్యానములలో చెట్లకు బంధింపబడిన మద గజములు తూలుచు, తొండములతో దుమ్ము, నీరు చల్లుకొనుచు, సమీపింప రాకుండును. (2-25).*

*(iv) మదపుటేనుగుల ఘటావళి రాజు స్వాధీనమున నుండవలెనని (4-232); రాజు వాని దిగుమతికి రేవు సౌకర్యములు కలుగ జేయవలెనని (4-245); వాని విక్రయమునకు, మేతకు, అగు ఖర్చు ఖర్చు కాదని (4-262) రాయల రాజనీతి.*

**7. మావి తోపులు నీటి కుంటలు:-**

చెరకు తోటల ముచ్చట భావించుచు ముందుకు సాగిన రాయల యూహా విహంగమునకా సమీపమున మావి తోపులు గనుపించును. అవియేమో చూతమని లోనికి పోగా, పురాతనపు నీటి కుంటలు కనుపించును. వాడుకలోనివి కావు. మరి నీరో?... ఉన్నది. కాని ఏమి నీరు! దీనిపై దట్టముగ తెట్టగట్టిన మామిడి పూత మీద నడువవచ్చునే! అడుగున పుట్టిపైకి వచ్చిన కలువలు! నేల నంటక మొలిచి తేలు అంతరదామరలు! నీటిలోనే జీబుగ నల్లుకొన్న ప్రాచి: అన్నీ కలసి యెగబోయు కప్రపు వాసన! బలే, నీటిలో నేదో పంకుల చలనము! బలసిన వాలుగ గుంపుల పోరు! ఈ నీరుకోళ్ల గుంపులో! ఇవి కొలకొల కూయుచు మేత కొరకు నీటిలో మెడలు క్రుంకుచున్నవి. కాని, ఆ మెడల వంపుల గుంపులు పైకి కనుపించుచు వినోదముగా నున్నవి! (1-71)

ఈ ఒక్క దృశ్యములో రాయలు తొమ్మిది స్థూల సూక్ష్మ వివరములను తోపు, కుంట, మావిపూత, కలువలు, అంతర దామరలు, ప్రాచి, వాసన, వాలుగల పోరు, నీరుకోళ్ల కొలకొల క్రుంకులు, పైకి కనుపించు మెడల వంపులు వాస్తవికముగా చిత్రించెను. స్థానిక ప్రకృతిని ప్రాణి వర్గ చేష్టలను వీని పరస్పర సంబంధమును, సూక్ష్మ దృష్టితో పరిశీలించి ఉన్న వున్నట్లుగా వాస్తవ చిత్రమును ప్రదర్శించుటలో రాయలకుగల ప్రావీణ్యమున కిదొక మంచి దృష్టాంతము. ఋతు వర్ణనలో ఇది పారమ్యము నందు కొనును.

చివరి యైదు దృశ్యములు (1-72-76) వైష్ణవ వాతావరణ శీర్షికలో ముచ్చ టింపబడినవి. వానితో విలుబుత్తూరు పురవర్ణన సమాప్తమగును. (1-51-76)

కాని మనమింతకు పూర్వము నామమాత్రముగ పేర్కొన్న 'పాచికలాడు పద్మముఖుల' వృత్తాంతమును రాయలు సాదరముగ వర్ణించిన ఆసక్తి కరమగు వివరముల నిపుడు గమనింపవలసియున్నది. (విజయనగర విద్వాంసురాండ్రతో రాయలకు గల సన్నిహిత పరిచయము, వారిని గూర్చిన సన్మానము - 5వ అనుబంధమున చూడగలము.)

# సాచికలాడు పద్మముఖులు

విలుబుత్తూరి వర్ణనలో సామాన్యముగ నొక విషయ మొక పద్యముతో నంతమగును. సువర్ణ సౌధములు మాత్రము మూడు, పరివేలు, గుడి గాలులు- రెండు రెండు పద్యము లాక్రమించినవి. పద్మ ముఖుల వృత్తాంత మొకటి మాత్రమే అయిదు పద్యముల పొడవు సాగినవి. వీనిలో వారి విలాసమయమగు అంతరంగిక జీవన వివరము తీయబడినవి. ఇది కొంత దీర్ఘముగ నుండును. అందుచే ముందు వారి బాహ్య జీవనమును గూర్చి సంగ్రహముగ ముచ్చటించి, తరువాత అంతర జీవితమును గుర్తింతము.

## 1. బాహ్య జీవనము

ఈ యాశ్వాసమున రాయల వర్ణనను బట్టి యీ పద్మముఖుల ముఖ్యవిధి - సాయంకాలములందాలయ పూజా శంఖ ధ్వని (1-59) వినగనే ఆలయమును చేరి, ఉత్కృష్ట నటనోద్యోగమునకు సిద్ధపడి నృత్త గీతములతో స్వామిని, భక్తులను, అలరించుట యని తోచును. (నటన ప్రోద్యోగ సజ్జీభవలలనా.... (1-73)[4]

4వ యాశ్వాసమున ఆలయ స్థానికులతో కలసి వీరు విష్ణుచిత్తునెదురు కొలుగ పోవుట, ఊరేగింపులో నృత్యము చేయుట, రాజకుమారుల యొక్క సఖ్యములకు పాత్రులగుట, ఆ రాత్రి హరి కొలువున వివిధ లాస్య స్పర్ధలలో పాల్గొనుట ప్రభువులు వారి వాదులు పరితీర్చి పంపుట (4-35-36).ఇత్యాది వృత్తాంతము వలన ఆలయ సేవయుండే గాక, వీరు సంఘ జీవనమున గూడ పాల్గొని, తమ నృత్య కౌశలముచే ప్రజలను రంజింప జేసెడివారని, రాకుమారుల చెలిమికి, అభిమానమునకు పాత్రులని, ఆ కాలమున రాకుమారులు నర్తకీ నర్తకుల కళాకౌశల వివాదములను పరితీర్పగల నాట్య విద్యా విశారదులని తెలియును. ఈ నాట్యకత్తెలు 'ప్రేక్షా గృహము' లందు

---

4 విజయనగరపు త్రోవలో, దర్శా దేవదాసీల నృత్యమును గూర్చి పయస్ వ్రాసినది. రాయల వర్ణనకు సరిపోవును. (4వ అనుబంధము.)

(theatre) తెర యెత్తగనే తాళగతి ననుసరించి నాట్యము చేయుట గూడ రాయలు మరొక చోట వర్ణించును. (4-115)

ఇక ఈ పద్మముఖుల గృహ జీవనమును గూర్చి, వీరి గుణ గణములను గూర్చి విందము.

(II) గృహ జీవనము:-

**(1) పద్మముఖుల పాచికలాట:-**

**(i) పాచికల యదలింపు:-**

సాయంకాలమైనది. కొంచెము సేపటిలో ఆలయసేవ యారంభమగును. ఈ వ్యవధిలో ఈ నాట్యకత్తెలు పాచికలతో నొకయొయ్యారపు జూదమాడుదురు. ఇండ్లలో కూర్చుండి కాదు. ముంగిలి యరుగుల మీద గుమికూడి వినోదము కొరకు కాదు. ప్రదర్శనము కొరకు, ఉత్సాహము పెరిగిన కొలది పాచికల నదల్చి వేయుట సాగును. పాచికల గల గల, కంకణముల కిణకిణ యతి గుండెనైన ఝల్లని కలచును. (1-59)

(ii) కవరలుంకించి వైచుట:-

సేవా సమయ మాసన్నమైన కొలది తొందరతో వారు పాచికలను మరింత యుంకించి వైతురు. ఆ యూపుకు కొప్పు సడలును. ఆవలి చేతితో దాని నమర్చబోగా, వైటలోని పట్టు రవికలో మన్మథుని గుండ్రని తలగడవలె నున్న బిగువు చన్ను నిక్కును. (1-59)

(2) అలంకరణ లాలిత్యము:-

రాయలు వారి యలంకరణ లాలిత్యమును సూక్ష్మ వివరములతో వర్ణించును. పాచికలాడు యొయ్యారము బాహ్యలీల, అందరు గమనించునది. అలంకరణ మభ్యంతర కళ. అయినను. రాయల పరిశీలనా పరిధిలోనిదే!

(i) పలు వరుస:-

బహుతాంబూల సేవచే వారి పలువరుస మిక్కిలి కెంపెక్కును. అయినను వారు దాని నొక్క, వరిగింజతోనే తోమి వెన్నెల గాయింతురు. (1-60)

<u>(ii) పసుపుతో జలకము:-</u>

వారు పసుపు పెట్టుకొని జలకమాడుదురు. అది పరిశుభ్రమగు వస్త్రముతో నెరసి యొత్తినను దాని నంటదు. దేహముననే నిగ్గులు తీరును. (1-60)

ద్రవిడ కుటుంబినుల యింటి కొలను గట్టుమీద పసుపు కొమ్మరగ దీసి స్నానమాడుటను గూర్చిన కవి వర్ణన నిది వరకు వింటిమి, ఆ రంగు వారినే గాక గట్టుక్రింద నిద్రించు బాతుల రెక్కల మొత్తమును గూడ పచ్చబరచును. (1-64)

వారు వీరు నొక యూరి వారే: ఒకరు కళావంతులు. మరొకరు ఆచార పరాయణులు.

<u>(iii) కలప మలదుట:-</u>

జలకమాడిన పిమ్మట వారు పైటలోనే చేయాడించి, పరిమళ ద్రవ్యము కలిపిన చందనము, ముదుక గాకుండ అంతట యుంటునట్లు, చంట నలదుదురు. (1-60)

<u>(iv) ఆభరణములు - అలంకరణలు:-</u>

ఇట్లే - వారి యాభరణములు, అలంకరణలు గూడ సుకుమారములు. బంగారము చిలుమంటునని వారు విసర్జింతురు. మేలగు తీగల వంటి హారములను, వలయములను మాత్రమే ధరింతురు. పునుగు జిడ్డని యేవగించి శిరోజములకు ధూపము మాత్రమే పట్టింతురు. పూవులు చెమ్మయని విసరి పారవేయుదురు. జిలుగు వస్త్రములు తప్ప, తక్కిన వొత్తుకొనునని గేలి చేయుదురు. (1-61)

(v) జడ చిక్కు తీయుటా? వీణవాయించుటా?:-

తెల్లవారగనే వారు మేడపై చంద్రశాలలోనో[5] కిటికీల వద్దనో కూర్చుండి, జడను

5. విజయనగర వేశ్యల యిండ్లు శ్రేష్ఠమగు వీధులలో నున్నవని, ఆ వీధులుత్తమ గృహ శ్రేణులతో కూడియున్నవని పయస్ వర్ణన. (4వ అనుబంధము) రాయల విలుబుత్తూరు వర్ణన విజయనగర స్మృతులతో కూడినది. (విలుబుత్తూరు వర్ణన - విజయనగర స్మృతులు)

చన్నులపై వేసి, వేళ్లతో చిక్కుదీయుచు, గోళ్లతో పూలను మీటి తొలగ జిమ్ముదురు. పూవుల పరిమళముచే నాకర్షితములైన తుమ్మెదలు రొద చేయుచుపోవును. వారు వీణాభ్యాసన లగుట వలనను, చాల యెత్తైన మైమేడపై నుండుట వలనను, వారు జడ చిక్కుదీయుట - వీధిని పోవు కాముకులకు వీణాభ్యాసమని భ్రమ కలిగించును. వారి కుచములు వీణ కాయలు. వానిపై వేసిన జడ పాయలు వీణ తంత్రులు. పూవులు దంతపు మెట్లు, చిక్కుతీయుట, ఆమెట్ల వెంబడి వడిగా వ్రేళ్ళతో తంత్రులు మీటుట, తుమ్మెదల మ్రోత వీణానాదము.

ఆముక్తమున వీణా వాదనము మరి రెండు చోట్ల ప్రసక్తమగును. ఇవన్నీ రాయల విజ్ఞానమునకు దృష్టాంతములు. ఇది చివరి యమబంధమున వివరింపబడినది.

3. అంతరలాలిత్యము (గుణములు)

పిలుబుత్తూరు పద్మముఖుల యలంకరణ లాలిత్యము శారీరకము, బాహ్య సంస్కృతికి చెందినది. వారి అంతర సంస్కృతిని తెలుపదు. అందుచే రాయలు పని గట్టుకొని వారి అంతర సంస్కృతిని గుణ లాలిత్యమును వివరించును. ఇది వారిని మధుర పణ్యాంగనల నుండి (2-30) వేరు పరచును.

(i) అలోభము - అభిజాత్యము:-

ఈ పద్మముఖుల చెలికత్తెలు అధమాన్వయులను, జీర్ణులను, అలావణ్యులను, పిలుచుటకై లాభము తెల్పినను, ఆమాటలలోని లౌభ్యము వారి చెవులు సోకదు. అవి శ్రీలు గదా:- (1-60)

శ్రీలు:- ఈ పదము వలన: (1) వారి చెవులే శ్రీ లక్ష్ములని. (2) 'శ్రీ' యను నక్షరాకారము గలవని, రెండు విధముల స్ఫురణ, 'శ్రీ' కి లౌభ్యమంటక పోవుట ఉభయత్ర వర్తించును.

చెవులను శ్రీకారముతో పోల్చుట ప్రసిద్ధ కవి సమయము, ఆముక్త కవికిది ప్రియము కాబోలు 4వ యాశ్వాసమున మంచెలపై నెక్కి చిలుకల నదలించు కాపు కన్యల చెవులను గూడ "శ్రీలు దొరులొట" యని వర్ణించును. (4-163)

(ii) నిర్లక్ష్య పారవశ్యము:-

ఈ విలాసినుల కూడికలలోని వేగము వలన హారములు తెగి, ముత్యములు రాలినను నిర్లక్ష్యము వహింతురు. (1-60)

(iii) సూక్ష్మబుద్ధి:-

తారసిల్లిన మాత్రముననే వీరెట్టి నరుని కులమునైన తెలియుగలరు. (1-60)

(iv) ఔదార్యము:-

విటుడు ప్రభుత చెడి పేద పడినచో వీరు కాపాడి వృద్ధి పొందింప సమర్థులు. (1-60)

(v) అంతిపుర వర్ణన:-

వీరు రాణులుగాకున్నను, రాజు వెలియంతి పురముగా మెలగ నేర్పు గలవారు. రెండవ యాశ్వాసమున మత్స్య ధ్వజాడను పాండ్యభూపతి రాజోచిత వేషమున నలంకృతుడై, నిండు వెన్నెల రేయి చోపుదారులు దారిచేయుగా, రాచనగరు నుండి అవలి వీధిలోని వేరొక యంతి పురమున నున్న భోగిని సంగతికి బాహాటముగ బోవును. (2-75) విలుబుత్తూరులో వెలియంతి పురముగ మెలగనేర్చిన పద్మ ముఖులిట్టి వారై యుందురు. వీరు విష్ణుచిత్తుని నూరేగించుటకు పాండ్యరాజు పనుపున వచ్చిన రాజకుమారులకు (4-9), పూర్వానుభుక్తలట (4-35)

రాయలనాటి విజయనగరమున గూడ, గొప్ప ప్రభువులైనను భోగినుల వద్దకు పోవుట యాక్షేపణీయము కాదని పయస్ కథనము. (4వ యనుబంధము) అందుచే రాయలు వీరిని నృపతి వెలి యంతిపురముగా నెన్నమెలగ - వలతు'' అని వర్ణించుట సార్థకము. (1-60)

(vi) కవితా ప్రావీణ్యము:-

వీరు కవయిత్రులు 'బాస'లో కృతి చెప్పగల నేర్పరులు.

భాష:- (1) దేశి భాష (2) సంభాషణ -'ఇచట ఉభయార్థములు గ్రహించుట సరసము. ఈ పక్షమున విలుబుత్తూరు పద్మముఖులు దేశి భాషలోను, సంభాషణా సమయమున

ఆశువుగాను, కవిత చెప్పగలరని యేర్పడును. తంజావూరి రంగాజమ్మ, మధురవాణి, ముద్దుపళని, యిట్టి వారగుట ప్రసిద్ధము. తంజావూరి సంస్కృతికి విజయనగర సంస్కృతి మాతృక యగుటచే విజయ నగర విలాసినులు ఇట్టి వేర్పరులగుట సంభావ్యము. విలుబుత్తూరు వర్ణన విజయనగర ప్రతిబింబము, విలుబుత్తూరు పద్మముఖులు విజయనగర విద్వాంసురాంండ్ర మానసిక పుత్రికలయి యుందురు.

## సాదర వర్ణన

విలుబుత్తూరు పద్మముఖుల బాహ్యాంతర సంస్కృతి వర్ణనలో రాయలకు వారి యందు గల సానుభూతి, సమాదరము. తేట తెల్లముగా కనుపించును. రాయలు స్వయముగ కవి. కవి పోషకుడు. దేశ భాషలందు 'తెలుగు లెస్స' యని పునరుద్ఘాటించి ఆ భాషలో కావ్యమును రచించిన బహుదేశ భాషావిదుడు. అట్టి వానికి. దేశ భాషలో కవిత్వము చెప్పగల విలుబుత్తూరు విద్వాంసురాంండ్రభిమాన పాత్రలగుట సహజము. ఈ యభిమానము వలననే ఆయన వారి ఉదార గుణ సంపత్తిని ప్రశంసించి, వారిని "సురత వైయాత్య నిధ"లగు మధుర వారిని వలె "పణ్య యువతు" లని పేర్కొనడు. (2-30) నాట్య నాటక కళాకారులతో ఆయనకు గల సన్నిహిత సంబంధమందుకు తోడ్పడి యుండును. ఆయా విషయములు 4వ యనుబంధమున వివరింపబడినవి. కొన్ని ఆముక్త విశేషములను గ్రహించుటకు రాయల జీవిత చరిత్ర, విజయనగర సామాజిక చరిత్ర యవసరమగుచున్నవి.

## లౌకిక దృశ్యములు – వర్గీకరణ

<u>వర్గీకరణ - దాని ప్రయోజనము:-</u>

విలుబుత్తూరు లౌకిక దృశ్యముల యధ్యయనములో మన మింత వరకు వానిని ఆయా వేళల ననుసరించి విశ్లేషించి చూచితిమి. ఇది చాల వరకు పద్యక్రమమునను సరించి సాగినది. ఇపుడీ విశ్లేషితాంశములను విషయానుసారముగ వర్గీకరించి చూతము. ఇందువలన వర్ణనలోని విషయ వైవిధ్యము, రాయల నిరంతర లోక పరిశీలన, విలుబుత్తూరు సమగ్ర స్వరూపము, వాని వెనుకనున్న ఆయన సమగ్ర దృష్టి స్పష్టపడును.

<u>ప్రకృతి మానవుడు:-</u>

విలుబుత్తూరు లౌకిక దృశ్యములను మనము స్థూలముగ ప్రకృతి - మానవుడు అను రెండు శీర్షికల క్రింద వర్గీకరింతము. పిమ్మట వానిని వైష్ణవ వాతావరణ దృశ్యములతో పాటొక పట్టీలో చేర్చి పరిశీలింతము. అందువలన రాయల దృశ్య మిశ్రమములోని గుప్త శిల్పము వెల్లడి యగును.

<u>1. ప్రకృతి:-</u>

విలుబుత్తూరు లౌకిక దృశ్యములలో ప్రకృతి 42 మారులు ప్రసక్తమగును. ప్రకృతి వర్ణనలను తొమ్మిది వర్గములుగా సమీకరించి చూచినచో, ఒక్కొక్క వర్గ మెన్నిమారులు ప్రసక్తమయ్యెనో గుర్తింపగలము.

<u>(i) పక్షి వర్ణము:-</u>

ఇది 8 మారులు కనిపించును. కోయిలలు, చిలుకలు (1-51): (2) లకుముకులు (1-57), (3) ఇంటి కొలని హంసలు (1-64): (4) కాల్వలలో నిద్రించు బాతులు (1-65): (5) వరి చేలలోని కొంగలు (1-66): (6) మావితోపుల నీటి గుంటలలోని నీరు కోళ్లు (1-71): (7) కేళివన హంసలు (1-72): (8) చంపక శాఖలలోని పక్షులు, (1-74).

<u>(ii) మత్స్య వర్ణము:-</u>

ఇది రెండు మారులు - (1) లకుముకులు వేటాడు వీధి బావులలోని మీలు (1-57): (2) మావి తోపుల గుంటలలోని వాలుగలు. (1-71)

<u>(iii) కీటక వర్ణము:-</u>

ఇది మూడు మారులు. (1) పద్మముఖుల జడ పూలపై తుమ్మెదలు (1-62): పనస పండ్ల రసమునకు ముసురు తుమ్మెదలు (1-69): (3) చంపక తోమాలలపై మూర్ఛిలు తుమ్మెదలు. ఇవి ఊహా మాత్రములు (1-69)

(iv). <u>వృక్ష వర్ణము:-</u> పన్నెండుమారులు (1) లలితోద్యానములు (1-51): (2-3) పథము ప్రక్కలందు, వాకిండ్ల యందు గల కొబ్బరులు (1-54,55): (4) లకుముకు

లుండు ఉన్నత వృక్షములు. (1-57): (5) పూవు దోటలు -8 రకములు పూవులు (1-66): (6) ఉపవనములు (1-67): (7) వేరు పనసతోట (1-68): (8) సుగంధి యరటి తోటలు (1-69): (9) పోకలు, తములపు తీగెలు (1-70): (10) మావి తోపులు (1-71): (11) కేళి వనులు (1-72): (12)ఆలయ చంపక వృక్షములు (1-74).

(v). పుష్పవర్ణము:- ఏడు మారులు (1,2) చెంగలువలు (1-56,67): (3,4) తామరలు (1-56,71): (5) తీగె మల్లెలు మొదలగు 8 జాతులు (1-66): (6) తోమాలెలకు కీలించు పెద్ద చంపకములు (1-69): (7) అంతర దామరలు (1-71).

(vi). సస్య వర్ణము:-మూడు మారులు (1) వరి చేల ప్రక్కనున్న ఉపవనముల విసురు గాలి (1-67): (2) పండి యొరిగిన కలమవరి (1-67): (3) చెరకు తోటలు (1-70)

(vii) వాయు వర్ణము:- ఒక మారు (1) వరి చేల ప్రక్కనున్న ఉపవనముల విసురు గాలి (1-67): వైష్ణవ వాతావరణములోని ఆలయ నైవేద్యపు గాలి, ముప్వలను మ్రోగించు మలయపు గాలి.

(viii). జలవర్ణము:-ఆరు మారులు (1) చెంగల్వ దిగుడు బావులు (డిగ్గియులు) (1-56): (2) వీధి బావులు (1-57), (3) భవన సరస్సులు (1-64): (4) బాతులు నిద్రించు వరి చేల కాల్వలు (1-65): (5) మావి తోపుల ప్రాత నీటి గుంటలు (1-71): (6) కేళివన సరస్సులు (1-72).

దీనిని బట్టి విలుబుత్తూరు ప్రకృతిలో రాయలను విశేషముగ నాకర్షించినవి- వృక్ష, పక్షి పుష్ప, వర్ణములని తోచును. మొత్తము 42లోనివి 27 మారులు కనుపించును. అసలు విలుబుత్తూరు వర్ణనమే లలితోద్యాన పరంపరలతోను, పికశుకాలాపములతోను ఆరంభమగుట ఈ మొగ్గును సూచించును.

2). మానవుడు:-

విలుబుత్తూరు లౌకిక దృశ్యములలో మానవ వర్ణము పన్నెండు మారులు ప్రసక్తమగును. వీరిలో-

**i ఆలయ సంబంధితులు:-** నాలుగుమారులు. (1) పాచికలాడు పద్మముఖులు, (2) శ్రీ కార్యపరులు-(1-59-63); (3)నటన ప్రొద్యోగినులైన లలనలు-(1-73), (4)పక్షుల రొదవిని తెల్లవారెనని కూడు దంపతులు-(1-74) వీరాలయ సమీపమున నుండువారు.

**<u>ii ఇతర స్త్రీ పురుషులు:-</u>** ఎనిమిది మారులు. (1) పసుపాడు ద్రవిడ కుటుంబినులు-(1-64), (2) ఊరి కాపరులు, (3)పరిచేల కాపరి స్త్రీలు-(1-65), (4) ఉపస్నాతులగు ద్విజాలు-(1-65) (వీరు మనకు కనుపింపరు), (5)కలమపు టెండుగులను ముంగిళ్లలో కాచు ద్రవిడ కన్యలు, (6) చెంగలువదండలను దెచ్చు గ్రామ్య తరుణులు-(1-75), (7), (8) పూరి భాగవతులు, అతిథిభాగవతులు-(1-76).

పైన చూపినట్లు, విలుబుత్తూరి లౌకిక దృశ్యములలో (16 పద్యములు) కవి, ప్రకృతి సంబంధములగు అంశములను 42 మారులు, మానవులను 12మారులు ప్రసక్తించెను. ఈ గణనలో, దేవునింటి దుప్పిపిల్ల యొక్కటి దప్ప, వైష్ణవ వాతావరణము (10 పద్యములు) లో ప్రసక్తములయిన ప్రకృతి, మానవ వర్గములు కూడ చేరియున్నవి.

**<u>రేయుంబగలు పరిశీలన:-</u>**

వర్ణన సందర్భమునుబట్టి మనమీ దృశ్యముల కూహించిన వేళాక్రమమును పరిశీలించినచో, విలుబుత్తూరులో రాయలు వేకువ జామున శుక పికాలాపములతో నారంభించి, నడిరేయి ఆలయవిమానపు పసిముప్వల మ్రోత వరకు నచటి ప్రకృతి, ప్రాణి మానవ వర్గముల తీరు తెన్నులను, చేష్టా విశేషములను సునిశితముగా గమనించుచు వినోదించెనని స్ఫురించును. తరువాతి ఆశ్వాసములలోను ఋతు వర్ణనాదులను, కథా సన్నివేశములను గమనించినచో రాయలకీ సూక్ష్మ వివరపరిశీలన ఏటి కేడాది సాగు నిత్య వినోదమని స్పష్టపడును.

## <u>విలుబుత్తూరు సమగ్ర స్వరూపము-1</u>

**లౌకిక- <u>వైష్ణవ దృశ్యములు:-</u>**

విలుబుత్తూరు ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమగుటయే గాక, సుందర గ్రామీణ ప్రకృతితో గూడిన ఒకపాటి పట్టణము గూడ. ఈ యన్ని వైఖరులను ప్రదర్శింపనిదే దాని సమగ్ర

స్వరూపమేర్పడదు. వీనిలో వైష్ణవ వాతావరణసూచిక దృశ్యములు విష్ణుచిత్తుని కథకుగాక, కావ్యమంతటికి పూర్వరంగమగుటచే, కవి వానిని వర్ణింపక తప్పదు. కాని, వాని కన్న లౌకిక దృశ్యము లెక్కువగనుండుట సహజము. ఇవిలేని వర్ణన అసమగ్రము, అవాస్తవికమునగును. రాయల స్వభావమునకిది వ్యతిరేకము. ఆయన సమగ్ర దర్శకుడు. ప్రకృతి సౌందర్యోపాసకుడు. లోకజ్ఞుడు. అందుచే వైష్ణవ వాతావరణమును పది పద్యములలో సూచించి, లౌకిక దృశ్యములను పదునారింటిలో విపులీకరించెను. ఆయన "కావ్య నాటకాలంకార మర్మజ్ఞుడు" గదా! ఈ మిశ్రమ వర్ణనక్రమమును పరిశీలించినచో, కవి దాని నొక ప్రణాళికననుసరించి నిర్వహించెనని తోచును. అది ఈ క్రింది పట్టిక వలన విశదమగును, విషయ నిరూపణకై లౌకిక వైష్ణవ దృశ్యములైదైదు సముదాయములుగా వింగడింపబడి, పట్టికలో నెదురు బొదురుగా చూపబడినవి.

## లౌకిక దృశ్యములు వైష్ణవ వాతావరణ దృశ్యములు

### 1వ సముదాయము

(1-51) లలితోద్యానములు

(1-52) మాడువులు

(1-53) లక్ష్మి, యేనుగులు, శంఖ చక్రములు

### 2వ సముదాయము

(1-54) పథము, కొబ్బరులు, బోండములు

(1-55)కొబ్బరులు, మొగ్గలు,ముగ్గలు.

(1-56) దివ్య ప్రబంధ యుగాస్యలు.

### 3వ సముదాయము

(1-57) లకుముకులు-పిసిపలిటీలు

(1-58) వనజాక్ష స్యందనద్వంద్వము

(1-59) పాచికలాడు పద్మముఖులు శ్రీకార్యపరులు

## 4వ సముదాయము

(1-60-63) పద్మముఖుల జాదము తీరు అలంకారములు- గుణములు.
(1-64) ద్రవిడ కుటుంబీనులు-పసుపు గొమ్మరగ దీయుట-రెక్కలు పచ్చబారిన హంసలు.
(1-65) వరికాల్వలలో బాతులు-రక్షకులు
(1-66) పూవు దోటలు
(1-67) పండియొరిగిన కలమవరి.
(1-68) పండి పగిలిన పనసలు.
(1-69) పండి పగిలిన సుగంధియరటి గెలలు - ప్రావితోమాలెలు.

## 5వ సముదాయము

(1-70) తములపు తీగలు-పోకలు చెరకు బెల్లపు వంట.
(1-71) మావి తోటలు.నీటి గుంటలు
(1-72) కేళివన హంసల పటపటలు అలయ దుందుభి కాహళి స్వనములు
(1-73) తావత్రయ హారములగు గుడి గాలులు.
(1-74) అలయ విమాన పతాక మువ్వల మ్రోత.
(1-75) ద్రవిడ కన్యలు-గుడి దుప్పిపిల్ల
(1-76) ఊరి భాగవతులు-అతిథి . ఎలు.

పై పట్టికను బట్టి:-

1). లౌకిక వైష్ణవ దృశ్యమిశ్రమము-2-1: 2-1: 1-2:9-1: 2-5: పాళ్లలో అయిదు సముదాయములలో జరిగెనవి-

2). ప్రతి సముదాయములోను కవి రెండు విధములగు (లౌకిక- వైష్ణవ) వర్ణనలను కోడుగుజ్జాల పగ్గములు రెండు చేతులా పట్టి పారటు తోలినట్లు నడపెనవి-

3).i. మొత్తము వర్ణనలో ఆరంభ, మధ్య, అంతములందు వైష్ణవ వాతావరణ స్ఫోరకములగు దృశ్యములను చొప్పించుటవలనను-

ii). చివరకు వరుసగా అయిదు పద్యములలో వానినే కేంద్రీకరించుట వలనను-

కవి సమస్త వర్ణనయందు వైష్ణవ వాతావరణము వ్యాపించినట్లు స్ఫురింపజేయ గలిగెననీ- తోచును.

## విలుబుత్తూరు సమగ్ర స్వరూపము-2

**పట్టణ గ్రామీణ దృశ్యములు:-**

విలుబుత్తూరు వైష్ణవ క్షేత్రమగుటయేకాక, సుందర ప్రకృతితో కూడిన యొకపాటి పట్టణమని యనుకొంటిమి. ఇప్పుడా పట్టణగ్రామీణ దృశ్యములను వింగడించి చూతము. అందువలన విలుబుత్తూరు స్థానిక పరిస్థితులు మరికొంత స్పష్టపడి, వాని మాతృకల గుర్తింపుకు తోడ్పడును.

**పట్టణ దృశ్యములు:-**

(1)మిన్నులతో రాయు సువర్ణ సౌధములు: (2) మాడువులమెట్లు: ద్వారములపై అపరంజి నీటి చిత్రములు, అపరంజి మోడు బిళ్లలు: పద్మరాగ కలశములు, మణి తోరణములు: (3) సూత్రపట్టిన వీథులు: (4) వజ్రకుట్టిమ పథము, రత్న కుట్టిమములు: (5) పాచికలాడు పద్మముఖులు (1-51-55: 59-63)

**గ్రామీణ దృశ్యములు:-**

(1) లలితోద్యాన పరంపరలు-(51): (2) కొబ్బరులు, బొండములు, మొగ్గలు, ముగ్గులు-(54,55): (3) దివ్య ప్రబంధ యుగాస్యులు(56): (4) లకుముకుల పలిటీలు-(57): (5) వనజాక్ష స్యందన ద్వంద్వము: (6) పసుపు గొమ్మరగదిసి స్నానమాడు ద్రవిడాంగనలు, ఇంటి కొలని హంసలు-(64): (7) వరిచేల కాలువలలో నిద్రించు బాతులు, వరి కాపరి స్త్రీలు-(65): (8) పూదోటలు, వరిమళ్లు, కొంగలు-(66): (9) పండి పగిలిన సుగంధి యరటి గెలల తోటలు-(69): (12) తములపు తీగలు, పోకలు,

చెరకు, బెల్లపు వంటలు-(70): (13) మావి తోటలు, నీటి గుంటలు, కలువలు, అంతరదామరలు, ప్రాచి, వాలుగల పోరు, నీరు కోళ్ల కొలకోల-(71): (14)కేళివన హంసల కలకలము, అలయు దుందుభి కాహళికల మ్రోత-(72): (15) తాపత్రయ హరములగు అలయ వాయువులు-(73): (16) విమాన పతాక మువ్వల మ్రోత-(74): (17) కలమపు బెండుగలు, ద్రవిడ కన్యలు, గ్రామ్య తరుణులు, కలువ దండలు, దేవునింటి దుప్పిపిల్ల-(75): (18) ఊరి భాగవతులు, అతిథి భాగవతులు-(76).

ఈ గ్రామీణ దృశ్యములలో కొన్నింటిని పట్టణ దృశ్యములలో చేర్పవచ్చు. కాని మొత్తము మీద రాయల దృష్టికి విలుబుత్తూరు పట్టణముగా కనిపించుటకన్న గ్రామీణ ప్రాంతముగా తోచెననుట స్పష్టము.

ఈ గ్రామీణ దృశ్యములలో పైరుపంటలు, పుష్పవనములు, పండ్లతోటలు, పక్షి సమూహములు, విదేశీయులు వర్ణించిన రాయలనాటి విజయనగర పరిసరములను, విజయనగరములోని 1,2,3 కోటల మధ్య ప్రదేశమును జ్ఞప్తికి తెచ్చును. వీనిని విలుబుత్తూరు వర్ణన- విజయనగర స్మృతులు"- అను శీర్షికలో వివరముగా చూడగలము. రెండవ యాశ్వాసమున పాండ్యరాజధానియగు మధుర వర్ణన గూడ విజయనగర స్మృతులతో గూడినదే!

విలుబుత్తూరు సువర్ణ సౌధములు- ఇత్యాదులు కూడ విజయనగర రాజ ప్రాసాద స్మృతులతో కూడినవే!

## రాయల సమగ్ర దృష్టి

రాయల సమగ్ర దృష్టిని గూర్చి వైష్ణవ వాతావరణ శీర్షికలో కొంత ముచ్చటించితిమి. విలుబుత్తూరు వర్ణనలో కనుపించు ప్రకృతి, ప్రాణి, మానవ వర్గములు రాయల సమగ్ర దృష్టికి తార్కాణములు. ఆయన వీని మధ్యనొక క్రియా శీలమగు సంబంధము నేర్పరచును. అవి వేనికవి విస్పష్టముగా నుండవు. పరస్పరాన్వితములై వర్ణన కొక ఐక్య చైతన్య స్ఫూర్తినిచ్చును. ఈ 'సమగ్ర సమన్విత క్రియాశీల దృష్టి, రాయల మనస్తత్వమునకు నైజము. ఆయన జీవధర్మము, ఆత్మగుణము.

నిరంతరాధ్యయనము వలన, బహుకాలాభ్యాసము వలన నిది పరిపుష్టమై ఆముక్త నిర్మాణమునందే గాక, ఆయన జీవిత చర్యలన్నిటియందు గూడ ప్రస్ఫుటముగా ప్రతిబింబించును.

ఆముక్త నిర్మాణము:-

ఆముక్త కథలను పరిశీలించుడు. ఆంధ్ర విష్ణువు రాయల కానతిచ్చినది- ఆముక్త మాల్యదా రంగనాథుల పరిణయము గూర్చి చెప్పుమని.

ఎన్నిను గూర్తునన్న, విను, మేమును దాల్చిన మాల్యమిచ్చున
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము. . ."(1-14)

ఈ యానతి ననుసరించి కావ్యమున గోదాదేవి మధురభక్తిని ప్రదర్శించుట సహజము. కాని రాయలీ యవకాశమును దీసి కొని మరికొందరు విష్ణుభక్తుల చరిత్రల నిందు జేర్చి, వాని ద్వారా పలువిధములగు వైష్ణవ సాధనలను, విశిష్టాద్వైత తత్త్వమును- ప్రదర్శింపగలిగెను. విష్ణుచిత్తుని దాస్యభక్తి, కేశిధ్వజుని యోగము, విశిష్టాద్వైత తత్త్వము, యామునుని జ్ఞాన వైరాగ్యములు, దాసరి పరమ ప్రపన్న ధర్మము- గ్రంథమున నిట్లు చేరినవే.

i). ఆముక్త పురవర్ణనలను తీసికొనుడు. గ్రామీణ ప్రాంతమందలి వైష్ణవ క్షేత్రమగు విలుబుత్తూరును, పాండ్యరాజధాని యగు మధురను, భూలోక వైకుంఠమగు శ్రీరంగమును వాని విశిష్టత యేర్పడునట్లు వర్ణింపనిదే ఆయన విరమింపడు.

ii). ఆముక్త ఋతువర్ణనలు గమనించుడు. గ్రీష్మ, వర్షా శరద్వ సంతములు నాలుగింటిని సుదీర్ఘముగా 182 పద్యములలో వినిపింపనిదే ఆయనకు తనివి తీరదు.

iii). గ్రంథస్థ రాజులను చూతమా! అయిదుగురు భిన్నస్వభావులయిన ప్రభువులను ప్రదర్శింపవలసినదే!

1). వీరిలో మత్స్యధ్వజుడు ప్రజాహితకారియగు రాజ్యతంత్రజ్ఞుడు. భూత వశీకరణ మంత్రవేత్త, మహాశూరుడు. కాని సామ్రాజ్యవైభవానందము మరగి, ఇంద్రియారాముడైన భోగినీ ప్రియుడు. తుదకు యాదృచ్ఛికముగా విన్న సుభాషితము

వలన పరివర్తితుడై భగవత్ప్రసన్నుడైన సంస్కారము గలవాడు. రాయల వర్ణనమునట్టి తక్కిన వారికన్న ఆయనకీరాజాపై నెక్కువ యభిమానమున్నట్లు తోచును-(2-39-40-44-81: 4-5)

2). ఖాండిక్యుడు కర్మకుడు, కేశిధ్వజునిచే రాజ్యభ్రష్టుడై, అతడు గురుదక్షిణగా రాజ్యమిత్తునన్నను కాదని, అతని వలన సకల భవక్లేశ సంక్షయమగు ఆత్మ విద్య నెరిగి మధు మథన సాధర్మ్యము పొందిన సత్పురుషుడు-(2-14-16-60-89).

3). కేశిధ్వజుడు ఘన విజ్ఞాని. ధ్యానయోగి. (2-14-86)

4). యామునుడు వేద శాస్త్ర పండితుడు. రాజ్య లాభమువలన బహు భోగోన్నతుడైన వాడు. రాజ నీతిజ్ఞుడు. తుదకు తన పితామహుని ప్రశిష్యుని ప్రబోధము వలన హఠాత్తుగా భ్రమతొలగి సన్యాసాశ్రమము నవలంబించిన వాడు. శ్రీవైష్ణవాచార్యులలో ద్వితీయుడు-(4-41-186-202-285).

5). పాండ్యరాజా వెర్రి శైవము ముదిరి జందెము తెంచిన జంగమ పక్షపాతి-(4-42-47).

## 2. రాయల చర్య:-

రాయల సామ్రాజ్య నిర్మాణమును పరిశీలింపుడు - అన్న మృతి వలన ఆయన 1509లో తలవని తలంపుగా రాజ్యభారము వహింపవలసివచ్చెను. అప్పటికి, దక్షిణ కర్ణాటమున ఉమ్మత్తూరు సామంతులు వశము దప్పిరి. తూర్పున గజపతులు కొండవీటి నుండి ఉదయగిరి వరకు ఆక్రమించిరి. ఉత్తరమున బహ్మనులు కొన్ని కోటలు లాగికొనిరి. మిగిలియున్న వైనను పటిష్ఠముగా లేవు. సమగ్ర దృష్టిగల రాయలకీముక్క వోయిన సామ్రాజ్యము సహింపరానిదయ్యెను. దీనిని సరిదిద్దుటకాయన పదమూడేడు లెత్తిన కత్తిని దింపక దృఢ చిత్తముతో సర్వ దిగ్విజయమును సాధించెను. ముక్కలైన రాజ్యభాగములను పునరుద్ధరించెను. సామ్రాజ్యమును పూర్వముకన్న సమగ్రమొనర్చెను. ఉత్తరమున తుంగభద్ర కృష్ణలను, మూడు దిశలయందు మూడు సముద్రములను

సహజముగు పరిపాలకులుగజేసెను. కర్ణాటాంధ్ర, తమిళ ప్రజలనొక గొడుగునీడకు చేర్చి వారిమధ్య భావ సమైక్యతను వర్ధిల్లజేసెను.

సంగీత, సాహిత్య, నాట్య, నాటక, శిల్ప, వాస్తు కళలను పోషించెను. ఆలయ, తటాకములను, ఆనకట్టలను, కాల్వలను నిర్మించి దేశమును భక్తి భుక్తులతో నింపెను. సమగ్ర వికాసమాయన ఆదర్శము.

ఒక్క మాటలో- రాయల బహుముఖ కార్యకలాపములాయన సమగ్రదృష్టికి బాహ్యరూపములు.

## అధ్యాయము-3

## విలుబుత్తూరు వర్ణనలో అలంకారములు

**ప్రవేశిక:-**

*పలికితివుత్ప్రేక్షోపమలు, జాతి పెంపెక్క*
*రసికులౌనన మదాలస చరిత్ర"*

ఇది ఆంధ్రవిష్ణువు తనకు ప్రియముగా సంధ్రభాషయందాముక్తమును నిర్మింపుమని రాయల కానతిచ్చినపు డాయన గీర్వాణ రచనలను గూర్చి పలికిన ప్రశంసా వాక్యములలోనిది. రాయల రచనకిది యదార్థ యోగ్యతా పత్రము.

వర్ణన ప్రియుడగు రాయలాముక్తమును దాదాపు సగము భాగమును వర్ణనలతో నింపి వానిని సర్వే సర్వత్ర అలంకారములతో భూషించెను. వానిలో నుత్ప్రేక్షల దగ్రస్థానము. విలుబుత్తూరును గూర్చిన 26 పద్యములలో కనీసము 39 మారు లేదో యొక యలంకారమును గుప్పించెనని అభినవ మల్లినాథుల సంజీవన వ్యాఖ్యనుబట్టి తెలియును.

వానినిపుడు సోదాహరణముగా వర్గీకరించి చూతము.

**1). ఉత్ప్రేక్ష:-**

ఉత్ప్రేక్షపై రాయల కెక్కువ మక్కువ. దాని నాయన పట్టపుటేనుగుపై నెక్కించి, కావ్యము నొక సాహితీ సమరాంగణ మొనర్చెను. విలుబుత్తూరు లౌకిక దృశ్యములను

గూర్చిన 16 పద్యములలో పదునాల్గింటి నాయన 17 మారులుత్ప్రేక్షలతో నలంకరించెను. ఒక పద్యమున మూడు, మరొక దానిలో రెండుత్ప్రేక్షలు కనిపించును.

ప్రస్తుతము కాని వస్తుగుణము, క్రియ- ఇత్యాదుల సంబంధమువలన ప్రస్తుత వస్తువు నప్రస్తుత వస్తువుగా నెంచుట యుత్ప్రేక్షయని ఆంధ్రవాచస్పత్యము.

ఇట్లు ఉత్ప్రేక్షించుటలో రాయలకు (విశేషించి బిలంవర్ణనలలో) భూమ్యాకాశపాతాళములందలి అప్రాణి, ప్రాణి వర్గములు రెండును పాల్గొనును

i సౌధ యోధులు:-

రాయల సాహితీ సమరములో విలుబుత్తూరు సౌధ పరంపర యోధశ్రేణి యగును. వాని యుపరంజి యోడు బిల్లలు (పెంకులు) యోధుల కవచములగును. తామరమొగ్గలవలె మలచిన పద్మరాగ కలశములు శిరస్త్రాణములగును. ఆ సౌధములు మిన్నులతో రాయుట ఇంద్రప్రాసాదమగు వైజయంతమును గెలుచుటకు కోపముతో నిలిచిన యుద్ధ సన్నాహమగును-(1-51-52) వీని నింతకు పూర్వము ప్రసక్తించితిమి. తిరిగి విజయనగర మాతృకలనెడి శీర్షిక క్రింద చూడగలము.

ii కలమ వరి దాహము:-

పండి యొరిగిన కలమ వరి తన వెన్నుల జాంజారు ముండ్లతో చెంగలువలపై రాచుకొనుట, ఆ వరి దేహమున దాహము చెలరేగుట వలన,క్రిందనున్న వ్రేళ్లను (జాంజారుముండ్ల రూపమున) పైకి తెచ్చుకొని చెంగలువల తేనె త్రాగుట యగును-(1-67).

ఇట్లే రాయల యుత్ప్రేక్షలు కొన్ని సరళముగా సాగి సహృదయ రంజకములగ నుండును. కాని కావ్యము మొత్తము మీద జూచినచో నివి కృత్రిమములు, ప్రౌఢ తమములు, క్లిష్టాన్వయము నపేక్షించునవి యని తోచును. స్యందన ద్వంద్వమును గూర్చిన క్లేశము నిది వరకు గమనించితిమి. విలుబుత్తూరు వర్ణనల నిది వరకే విశ్లేషించి వర్గీకరించితిమి. గనుక ప్రస్తుతమందలి యలంకారములు తేటపడుటకు క్లుప్తముగా వాని నాయా పట్టికలలో చూతము.

## భావము - ఉత్ప్రేక్ష - (14 పద్యములు-17 ఉత్ప్రేక్షలు)

పద్యము

(1-52) నిలుబుత్తారు మేడలు యోధులు - వాని అపరంజి పెంకులు వారి కవచములు - పద్మరాగ కలశములు శిరస్త్రాణములు- మిన్నులతో రాయుచు (1-51) నిలుచుట - స్వర్గమున గల వైజయంతీ ప్రాసాదమును గెలుచుటకు కోపముతో నిలుచుట.

(1-53) (ఉత్ప్రేక్షాత్రయము) - ద్వారపు మెట్లు - ద్వార తోరణములు

i. మెట్లకు తాచిన మరకతపుటేనుగులు దిగ్గజములు.

ii. సింహముల నోళ్లనుండి వ్రేలాడు తొండములు- తొండము తప్ప ఏనుగు సంతతిని మ్రింగుటవలన-

iii. ద్వార మణి తోరణములు- ఇతర పుర గృహశ్రీలను పెండ్లాడుటకు భవన రాజులు కట్టిన బాసికములు.

(1-54) వజ్రకుట్టిమ పథము - సముద్రుడు కుదువయుంచిన అతని పెద్దభార్య గంగ - ప్రక్కల కొబ్బరిచెట్లు గంగ పుత్రులు.

(1-55) కొబ్బరాకులు- ముగ్గులు- రత్నకుట్టిమములలో ప్రతిఫలించుట- (గోమయముతో) అలికి ముగ్గులు ఘటించుట.

(1-57) లకుముకులు గుభాలున క్రిందికి పడి, పైకి లేచుట - అదృశ్యయగు గృహలక్ష్మి బంతులాడుట.

(1-58) స్యందన ద్వంద్వము - అందలి సరదంపతుల చిత్రములు - మేరు మందరములు - వాని బిలములలోని సిద్ధ మిథునములు.

(1-59) పాచికలాడు పద్మముఖుల పైటలోని పట్టు కంచెలలో నిక్కుబిగువు జన్ను - మరుని గుండ్రని దిండు.

(1-63) ఈ లేమల చెవులు - శ్రీ లక్ష్ములు

(1-66) వరిచేలు పూదోటల పోటీ, వరి చేల గెలుపు, అందలి కొంగమూకలు, చేల తెల్లని నవ్వు.

(1-67) కలమ వరిధాన్యపు జొంజారు ముండ్లు - తలపైకి తెచ్చుకొన్న వేళ్లు - ఆ ముండ్లు చెంగలువలపై రాయుట- అందలి తేనె త్రాగుట.

(1-68) పండి, పగిలి, రసముకారి, బురదయైన పనసపెనుపండ్లు వానిపై ముసరు తుమ్మెదలు వసంత నృపుని పట్టపు టేనుగు ఆకృతి దాని గండములు పగిలి కారు మదజలము దానిని కట్టిన గట్టి గొలుసుల చలనము.

(1-69) (ఉత్ప్రేక్షాద్వయము) i. పండిపగిలిన సుగంధి యరటి గెలలు, పెద్ద సంపెంగలతో దళముగా కట్టిన తోమాలెలు. ii. అరటి పండ్ల చివర నలుపు సంపెంగలపై వ్రాలి మూర్ఛిల్లిన తుమ్మెదలు.

(1-70) తాంబూల వల్లి- పోకమాను నాయికా నాయకులు ఆ తీగ పోకకు చుట్టుకొనుట, నాయిక నాయకుని కౌగిలించుట . . . ఇత్యాది. (సమాసోక్తి- ఉత్ప్రేక్షకు అంగము)

(1-72) కేళివన హంసల రెక్కల పటపటలు, క్రేంకారములు (ఉత్ప్రేక్షా భ్రాంతి మంతముల సందేహ సంకరము)

## 2. జాతి - స్వభావోక్తి :-

విలుబుత్తూరు వర్ణనలో ఉత్ప్రేక్ష తరువాత, స్వభావోక్తి గణనకు వచ్చును. ఉన్నదాని నున్నట్లు వర్ణించుట (యథావద్వస్తు వర్ణన) స్వభావోక్తి. రాయల రచనలలోని జాతి (స్వభావోక్తి)ని గూడ ఆంధ్ర విష్ణువు ప్రశంసించెను. సూక్ష్మాతి సూక్ష్మ విషయము లతో గూడిన స్వభావోక్తులకు రాయలు ప్రసిద్ధుడు. విలుబుత్తూరు వర్ణనయందు తొమ్మిది పద్యములలో స్వభావోక్తి పదింబదిగ కనుపించును.

**భావము - స్వభావోక్తి - (9 పద్యములలో పలుమారులు)**

పద్యము

(1-56) ద్రవిడాంగనలు చెంగల్వ దిగ్గియలలో 'పసుపాడి' అచ్యుత మజ్జనార్థము తెచ్చెడి నీటి ఘటము నడుముపై కీలించి దివ్య ప్రబంధములతో కూడిన ముఖములతో, పొగడముతో ఒప్పు పాదములతో ఉద్యానపు లోత్రోవలలో నడుతురు. చన్నుల జంట లేనడుముపై దయ తప్పి చేతిలోని పూజాంబుజములు బిందెలో తడబడును.

(1-59) నాట్యస్త్రీలు గుంపులుగా అరుగులపైన పాచికలాడుట, పవలయు ధ్వనిగా పొరి యదల్చివేయుట - ఎదురైన మన్మథునైన మొగమెత్తి చూడని పరాకు, శ్రీకార్యపరులను కాంచి లేచి అంజలించి మ్రొక్కుట- విష్ణ్వాలయ పూజాకాల శంఖము వినుటకు తళుకు కడగన్నులు త్రిప్పుట, పాచికలుంకించి వేయుట, కొప్పుసడలుట- అవలి చేతితో అమర్చునపుడు పయ్యెదలోని పట్టు రవిక యందలి బిగువు చన్ను నిక్కుట.

(1-60) ఆ పద్మముఖులు తాంబూలపు ఎర్రని ఎరుపు తొలగి వెన్నెల గాయునట్లు ఒక్క పరిగింజలోనే పలువరుస తోముటకు - పరిశుభ్ర వస్త్రము రాచిఒత్తినను దానికి అంటక శరీరమునందె నిగ్గులు దేరునట్లు పసుపు పూసికొని జలకమాడుటకు; పైటలోనే చేయాడించి ముదుక గాకుండ చన్నుల యంతట అంటునట్లుగా పరిమళ ద్రవ్య మిశ్రమ కలపమునలదుటకు, రతిరయము చేత తెగిన సూత్రమున నిలువక ముత్యములు రాలినను, నిర్లక్ష్యమును వహించుటకు, తారసిల్లిన మాత్రముననే ఎట్టి నరునైన కులము తెలిసికొనుటకు, విటుడు ఐశ్వర్యము చెడి పేదపడినను ఏలుటకు నరపతి వెలి యంతిపురముగా ఎన్నదగినట్లు మెలగుటకును. బాసలో కృతి చెప్పుటకు ( ఆ పద్మముఖులు) నేర్పుగలవారు.

(1-61) ఆ యువతీ బృందము - మేలయిన తీగలవంటి హారములను వలయములను తప్ప బంగారము చిలువని త్రోసివేయును. కస్తూరిని మాత్రమే దేహమున అలదునుగాని, జవాది జిడ్డని ఏవగించును. ధూపము మాత్రము అందును గాని, పూవు చెమ్మయని విసరి పారవేయును. జిలుగు వస్త్రములే గాని ఇతరములు ఒత్తునని నవ్వును.

(1-65) వరి మళ్లకు బోవు కాల్వల నీటి మధ్య, బాతులు రాత్రులందు తలలు రెక్కల గుమిలో గ్రుచ్చి నిద్రించును. ఊరి కాపరులు వానిని ఉషఃకాలమున చూచి, స్నానము చేసి వెళ్లిన విప్రులు చేసిన వస్త్రముల పిడుచలని తలచి, వారి యిండ్లకు చేర్చుటకై రేవులలోదిగగా, తటాలున పారిపోవు బాతులను జూచి వరికాపరి స్త్రీల గుంపులు నవ్వును. (భ్రాంతి- స్వభావోక్తులు).

(1-71) మావి తోపులలోని పురాతనపు నీటి గుంటలు- వానిలో రాలి తెట్టలు గట్టిన మావి పూత- కలువలు- అంతర దామరలు ప్రాచి- కర్పూరపు వాసన- నీటిలో వాలుగల పొరు- నీరు కోళ్ల కొల కొల- అవి నీటిలో మునుగుట వాని వంపు మెడల గుంపులు పైన కనుపించుట.

(1-73) అంభోజాక్షుని గొవ్వ తులసి మాల తేనె తుంపురులు; నైవేద్యపు పుణ్యగంధములు- వీనితో గూడిన గాలి భక్తుల తాపత్రయమును హరించుట- నాట్యమునకు సిద్ధపడు లలనల సిగలనుండి జారిన ఎఱ్ఱ కలువలను అల్లార్చుట.

(1-75) ముంగిట ఎండబోసిన కలమ వరిధాన్యమును కాచుచున్న ద్రవిడకన్యలు- గ్రామ్య తరుణులు చెంగలువ దండలు పేర్చి తెచ్చిన పేము గంపలను దించుట. విశ్వాలయపు దుప్పిపిల్ల మాటి మాటికి ధాన్యమును బొక్కులాడుట- ద్రవిడ కన్యలు చెంగలువ దండలతో తోలుట.

(1-76) ఊరి భాగవతులను తోడి తెచ్చి రుచ్యాన్న పానములతో అర్చించుట ఇత్యాది-

**3 ఉదాత్తాలంకారము:- (ఉదాత్త= గొప్ప, అధికము )**

విలుబుల్యూరు వర్ణనలో విది కవీని మైదు పద్యములలో కనుపించును. రాశిలో తగ్గినను వాసిలో ఘనమైనదే! ఈ యలంకారము ద్వారా రాయలు సాధారణ వస్తువులను గొప్ప వానివిగా భావించి ఘనముగా ప్రదర్శించును. ఈ యలంకారము వస్తువుల యుదాత్తతనే గాక, కవి ఉదాత్త భావనను, ఉదాత్త భాషాభ్యాసములను సూచించును. ఇవి ఆయున సార్వభౌమ జీవన ప్రతిబింబములు. ఈ విషయమును గూర్చిన పేయస్ వర్ణన (సువర్ణ సౌధ-ఇత్యాది) విజయనగర స్మృతులను శీర్షికలో కొంత ఉదహరింపబడినది.

**పద్యము భావము- ఉదాత్తాలంకారము**

(1-51) లలితోద్యాన పరంపరలలో, మిన్నులతో రాయు సువర్ణసౌధములు, వీని చంద్రశాలలందలి నీలహరిన్మణీ పిక శుకములు. ఈ వర్ణన బంగారపు శయన మందిర స్మృతితో కూడినది. *(Sewell, Forgotten Empire, Paes, P. 273, 1970.*

(1-52) ఈ మాడువులు, వాని బంగారు పెంకులు (అపరంజి ఓడు బిల్లలు), పద్మరాగ కలశములు - ఇంద్ర ప్రాసాదమును జయించుటకు కోపముతో నిలచిన సౌధయోధులు - వాని కవచములు, శిరస్త్రాణములు - అపరంజి- పద్మరాగ - ఉదాత్తాలంకారము)

(1-53) (i)ద్వారపు మెట్లకు తాచిన మరకత గజములు - ప్రాచి పట్టిన దిశాకరులు (ii) ద్వారమణి తోరణములు - ఇతర పురముల గృహశ్రీలను పెండ్లాడుటకు భవనరాజులు కట్టిన బాసికము పద్యమంతట ఈ రీతి ఉదాత్త భావనయే!

(1-54) వజ్రకుట్టిమమగు పథము - సముద్రుని పెద్ద భార్య గంగ - పథము ప్రక్కలందలి నారికేళ వృక్షములు - గంగ కుమారులగు కల్పవృక్షములు - వీరిని సముద్రుడు తనయుందలి రత్నముల రక్షకు హామీగా ఇచట ఉంచెను. వజ్రకుట్టిమ రాయల ఉదాత్త భావన.

(1-64) ద్రవిడ కుటుంబినులు స్నాన సమయమున పసుపు గొమ్మరగ తీసిన భవన సరస్సు యొక్క రత్నపుతాప (మెట్టు)

**4. భ్రాంతి మదాలంకారము :-**

ఉన్నది లేనట్లు లేనిదున్నట్లు వర్ణించుట భ్రాంతి మదాలంకారమని ఆంధ్ర వాచస్పత్యము. విలుబుత్తూరు వర్ణనలో నిది ఆరు పద్యములలో గనుపించును. అసలు కావ్యమే ఈ యలంకారముతో ప్రారంభమగును.

(1-51) సువర్ణ సౌధ చంద్రశాలలందలి నీల హరిన్మణీ పిక శుక ప్రతిమలు సజీవములని, ఉద్యానమందలి నిజ పిక శుకముల స్థానములని భ్రమ.

(1-61) తెల్లవారగనే, విలుబుత్తూరు వేశ్యాయువతులు, మేడమీది పై గదియందు - జడ చంటిపైన వేసికొని విప్పును, పూవులను గోటితో తొలగ జిమ్మట. ఆ సమయమున (పూవులను వదలి) పోయెడి తుమ్మెదలు రొదవేయుచున్న వారు గనుక (1) చన్ను+జడ వీణయని (2) పూవులు దంతపు మెట్లని (3) వానిని తొలగ జిమ్మట వేగముగా వీణను మీటుటయని (4) తుమ్మెదల రొద వీణమ్రోతయని భ్రమ కలిగించును.

(1-64) ద్రవిడ కుటుంబినులు స్నాన సమయమున పసుపు గొమ్మరగ దీసిన యింటి కొలను గట్టు క్రింద పొర్లాడి, రెక్కలు పచ్చబారిన హంసలు స్వర్గంగలోని బంగరు రెక్కల హంసలు - అని భ్రమ

(1-65) వరిమళ్ళకు పోవు కాల్వలలో - తలరెక్కలలో గ్రుచ్చి నిద్రించు బాతులను జూచి, ఆరెకులు ఉషస్సునందే స్నానము చేసిన ద్విజాలు వస్త్రపు పిడుచలు - అని భ్రమింతురు.

(1-72) కేళివన సరస్సునందున్న హంసలు సాయంకాలములందు గూండ్లకు పోవుటకు లేచునప్పుడు వాని రెక్కల పటపట, క్రేమ్ క్రేమ్ అను కంఠధ్వని - అచటి కుంజ గర్భములందు ప్రతిధ్వనించును. ఈ శబ్దములు విష్ణ్వాలయమున మ్రోయుచున్న దుందుభి కాహళుల ప్రతిస్వనము అనుభ్రమ.

(1-74) రాత్రులందు మలయపు గాలి మ్రోగించిన ఆలయ విమాన పతాక పసిడి మువ్వల మ్రోతకు భయపడిన పక్షుల రొద విని - తెల్లవారెనని భ్రమపడి దంపతులు అలకలు మాని కూడుట.

5. ఉపమాలంకారము :-

ఒక దానితో నొకటి పోలిక గల రెండు వస్తువులయందలి మనోహరమగు సామ్యమును స్పష్టముగా జెప్పుటయే ఉపమాలంకారము అని ఆంధ్రవాచస్పత్యము. ఈ వర్ణన యందిది రెండుమారులు కనిపించును. ఈ దృశ్యములు గూడ నిదివరకు గమనించినవే. ఇప్పుడందలి యుపమాలంకారమును గుర్తింతము.

పద్యము భావము–ఉపమాలంకారము

(1-54) ఎల్లని కొబ్బరి బొండములు - పగడపు చాయ సిందురము ప్రామిన పాండ్య వధూకుచములు.

(1-63) భూమిలోనే పండి, పగిలి, బుదరయై (రసముగారు) వేరు పనసలు - గండశిలలతో పోటీపడు వసంత నృపుని పట్టపుటేనుగు వంటి ఆకృతి గలవి.

వర్ణన బాహుళ్యము – (కారణములు)

ఈ విశ్లేషణ వలన - రాయల విలుబుత్తూరి వర్ణన అలంకార భూయిష్టముగా నున్నదని స్పష్టమయినది. ఇట్లే -కావ్యము దాదాపు సగము వర్ణనలతోను, అలంకారములతోను నిండియున్నది. వీనిలో చాల భాగము స్థానిక ప్రకృతిని, సమకాలీన జీవితమును చిత్రించును. కాని, పుర ఋతువర్ణన లతి దీర్ఘములై, కథాగమనము నడ్డగించుచున్నవి. "కావ్య నాటకాలంకార మర్మజ్ఞు"డగు రాయలీ యతివ్యాప్తికేల తావిచ్చెను? సహృదయులకిట్టి ప్రశ్నము కలుగుట సహజము. మరి దానికి సమాధానమేమి? రాయలు "కవితా ప్రావీణ్య ఫణీశు" డగుట (పారి. 4-1) వలననా? ఇది కొంతవరకు కారణమే! కాని, మూల కారణమిది కాదు. మూలకారణమాయన మనస్తత్వమే!

(i) <u>రాయల మనస్తత్వము :-</u>

<u>జీవన ప్రేమ</u> :- రాయలు జగద్వ్యాపారమును, జగల్లీలను నమితముగా ప్రేమించిన వాడు. ఆయన సమగ్ర సమన్వయ దృష్టివలె నిదియు ఆయన మనస్తత్వమునకు, మౌలిక జీవధర్మమునకు సంబంధించినదే! ఋతుచక్ర పరిభ్రమణము, ప్రకృతి పరివర్తనము, రేయింబగళ్ళ క్రమము, మేఘములు, కొండలు, నదులు, తీరు గుల్మములు, పశు పక్షి మత్స్య కీటకాది ప్రాణులు, మానవుని సాంఘిక, రాజకీయ, వైయక్తిక, ఆధ్యాత్మిక, మత జీవనము- కళలు, శాస్త్రములు - ఇంకన్నిన్నే లోకవృత్తము లాయన సమగ్ర దృష్టి నాకర్షించును. వాని పిలుపున కాయన హృదయము, మేధ - స్పందించును. వాని సూక్ష్మాతి సూక్ష్మ వివరము లాయనను సమ్మోహ పరచును. అవి ఆయన అంతశ్చేతనలో ముద్రితములగును. ఆయన కావ్య సృష్టికి మూలపదార్థమగును. స్వర్ణకారుడు సువర్ణమును కరగించి, తన శిల్పనైపుణి వలన మనోహరమగు జిలుగు పనితో కూడిన ఆభరణములను నిర్మించినట్లు, రాయలు తాను సేకరించిన వివరములను బహువిధ వర్ణనలుగా రూపాంతరీకరించి, తన యూహా వైభవముతో వానిని అలంకార సమృద్ధములుగా చేయును.

ఇది - ఆముక్త వర్ణనల బాహుళ్యమునకు, అలంకార పౌష్కల్యమునకు మూలకారణము, జగల్లీలయందు, జీవన శైలియందు ఆయనకు గల అనంతాసక్తి అసలు కారణము.

(ii) <u>వైష్ణవ సిద్ధాంతము :-</u>

వైష్ణవ మతమందు విశిష్టాద్వైత సిద్ధాంతమునందు ఆయనకుగల ప్రగాఢ విశ్వాసమాయన జీవనాసక్తిని బలపరచెను.

జగత్తు నారాయణుని లీల. ఆదిలో ఒక్కడగు నారాయణుడు లీల యందే కాకిత తగదని, చేతనా చేతనములందు పాచ్చి యనేక మయ్యెను. (ఆము-3-10) సకల ప్రపంచము విష్ణుశక్తి సమన్వితమై, అతని శరీరమయ్యెను. (3-79) ఆ శక్తి ఆ ప్రాణులందు, తరుగుల్మాది స్థావరములందు, సరీసృప (ప్రాకు జంతువు) ఖగ, మృగ, పశు మనుష్యాది ప్రాణివర్గములందు.......ఉత్తరోత్తర క్రమమున హెచ్చుగుచు

నభివ్యక్తమగును. (3-80). విష్ణుభక్తుడగు రాయలు విష్ణు రూపమగు సమస్త జగత్తును ప్రేమించి, గమనించి, వర్ణించి, అలంకరించును.

(iii) రాయల అలంకారప్రీతి :-

రాయలు స్వీయ జీవనమున గూడ అలంకారప్రియుడు. ఆయన ఆపాదమస్తకమున ధరించు అనర్ఘ మణి మయములగు పదారు స్వర్ణ భూషణములను రాయవాచక కారుడు గ్రంథస్థము జేసెను. (1592-1602)[1] తిరుమలపై స్వామి సన్నిధిలో ముకుళితహస్తుడై దేవేరులతో నిలచియున్న రాయల పంచలోహ (తామ్ర?) విగ్రహమునందివి కొన్ని కనిపించును. పారిజాతకారుడు రాయల బాహువునందలి భూషణోజ్జ్వల మణులను వర్ణించెను. (పారి. 1-20) పెద్దనగారాయన దుకూలాంచలములను చిత్ర వర్ణితములను జేయు మూరు రాయర గండపెండార మణి మరీచి రింఛోళిని వర్ణించెను. (మను 1-12)

రాయల అలంకార ప్రీతియే అనేక దేవతల కాయన అసంఖ్యాకములగు అమూల్యాభరణములను సమర్పించుటలో గూడ వ్యక్తమగును. "తిరువేంగళనాథదేవు" నాపాదమస్తకమలంకరించుటకాయన 1513 నుండి 1522 వరకు కానుకలిచ్చిన "తిరువాభరణములలో (1) ప్రభామండలి, (2) కిరీటము, (3) "కుల్లావు" (4) "బంణ్నసరము" (5) త్రిసరము, (6) సరపదకము, (7) కంఠమాల, (8) భుజకీర్తులు, (9) పీతాంబరము, (10) కడియాలు - ముఖ్యముగా పేర్కొనవచ్చును. ఈ యాభరణములు కొన్నివేల "తూకాలు" గల "పైడి" "కుందనము"లలో బహు సహస్ర వజ్ర, వైడూర్య, మాణిక్య, గోమేధికములు, నీలాలు, కెంపులు, పచ్చలు ముత్యాలు పొదిగినవి. వీనిని గూర్చియు మరి యనేక అమూల్యాభరణముల గూర్చియు రాయల తిరుపతి శాసనములోని వివరము లాశ్చర్యకరములు [2]

---

1. *సాహిత్య అకాడమీ ప్రతి - పు. 63 (1982)*
2.. *T.D.I. VOL 3. PP. 123 - 181*

1516-17లలో సింహాచల విజయానంతరము రాయలు కాళహస్తి నుండి రామేశ్వరము వరకు, తిరిగి విజయనగరము వరకు 20 శైవ వైష్ణవ క్షేత్రములలో (విలుబుత్తూరుతో సహా) సమర్పించిన నవరత్నాభరణములు "ముత్యాల కిరీటం, పచ్చల పతకం.......వజ్రాల కమ్మలు, ముత్యపు ముక్కర, తిరుముక్కు, కెంపుల వొడ్యాణం, బంగ్గారు నూపురములు, నవరత్న కీలితమైన సింహ్మముఖం, ప్రభలు," (వివరి ద్రైదు చూడు కొడుత్తునాచ్చారుకు (ఆముక్త మాల్యద), నవరత్న పొడి భూషణాదులు, సకలాభరణములు, అనర్ఘ్యమైనటువంటి భూషణాదులను రాయవాచకకారుడు గ్రంథస్థము చేసెను. (పు. 77-79)

స్వవిషయమున, తాను కొల్చిన దేవరల విషయమున రాయలు కనపరచిన అలంకార ప్రీతియే ఆముక్తమాల్యదలోని వర్ణనలలో రూపాంతరమున నిండుగ నెలకొన్నది.

(iv) <u>ప్రబంధ సంప్రదాయము :</u>

రాయుల జీవన ప్రేమకు, వైష్ణవ సిద్ధాంతమునకు, అలంకార ప్రీతికి తోడానాటికి ప్రబంధ సంప్రదాయము కూడ రాయల వర్ణన బాహుళ్యమునకు దోహదమొనర్చెను. రాయలనాటి కాంధ్ర సాహిత్యములో కథాప్రధానములైన ఇతిహాస పురాణానువాదములు వెనుకబడి, స్వల్పమగు "పూర్వవృత్తము" ను గ్రహించి, "అహరిత సత్కవి కల్పనా విశేషావహ"మై, బహువర్ణనలకు తావిచ్చు ప్రబంధ రచన సార్వభౌమమయ్యెను. ఆంధ్ర ప్రబంధరచనకు మార్గదర్శకుడైన "కవిరాజ శిఖామణి" నన్నిచోడుడు తన "కుమార సంభవము"న ప్రప్రథమముగా నూతన కావ్య లక్షణము లను పేర్కొనెను. ఆయన యభిమతము ప్రకారము వానిలో "వర్ణనలెల్లచో వర్ణనకెక్క" వలెను. కావ్యములు వరసతివలె నలంకార భావోన్నతిని పొంద వలదా మరి? - అని ఆయన ప్రశ్నము. (కు. సం. 1-39) తన కావ్యము ముప్పదియారు అలంకారములతో గూడిన "దివ్యకథ" యని ప్రకటించి, తాను పాటించిన అష్టాదశ వర్ణనల నాయన పేర్కొనెను. (1-41-43)

అప్పటి నుండి ఆంధ్ర సారస్వతములో ప్రబంధచ్ఛాయలలను కొనసాగి, రాయల నాటికి వర్ణనలు, అలంకారములు, పిక్కటిల్లెడి ప్రౌఢ పద గుంభనముతో కూడిన ప్రబంధ రచన రూఢికెక్కెను.

విద్యా స్పర్ధ :-

కవులిట్టి కవిత నొకరిని మించి యొకరల్లి, రాజ్యసభలలో సన్మానము పొంద యత్నించిరి. ఈ కవితా స్పర్ధకూడా "కవిరాజశిఖామణి"వలన ప్రాచుర్యమును పొందెను. ఈ స్పర్ధనుగూర్చిన ఆయన పలుకు ములుకులు ప్రజ్ఞావంతులగు కవుల నుత్తేజపరచగలవి.

*పదబంధంబుల నగ్గలించి, బుధ శబ్దభ్రాజితమై నద్భుతా*
*స్పదమై, దుష్కవి ప్రాత్సరోజ వనములే భంజింపుమన్ భూరిచ*
*మ్మద లీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్య ప్రభావంబునన్*
*మద నాగంబును బోలె గ్రాల వలదా? మా రెందు లేకున్నతిన్.*
*ముదమున సత్కవి కావ్యము*
*పదరగ విలుకాని పట్టినమ్ముమ, బరపౌ*
*ఢ్ఢిదమై తల యూపింపని*
*యది కావ్యమె, మరియు బట్టి నదియున్ శరమే?*

***(కు.సం. 1-40-41)***

ప్రబంధ యుగాధ్యక్షుడు "సాహితీ సమరాంగణ సార్వభౌముడు"నగు రాయల కీ యుహామిక మరింత హెచ్చుగ నుండుట సహజము. ఆయన "రసికులౌనను' నట్లు" వారిచే మెప్పించుకొనునట్లు మదాలస చరిత్రాది గీర్వాణ కావ్యములను రచించె నని ఆంధ్ర విష్ణుని ప్రశంస వలన తెలియును (ఆము. 1.13) ఇట్లు మెచ్చిన రసికులలో నుద్దండ పండిత కవులగు రాయల అష్టదిగ్గజముల వారుండుట అత్యంత సంభవము. వీరిలో నిద్దరి కృతులగు పారిజాత, మనువుల నాయన అంకితము పొందెను. కాని,

అప్పటి కాంధ్రమందాయన ఏమియు వ్రాయలేదు. ఆంధ్రమాయన కసాధ్యమను ప్రతీతియున్నట్లు తోచును. దీనిని వెల్లడించుచునే గాలోలు నాంధ్ర విష్ణువు

"ఆంధ్ర భాష యసాధ్యంబె? యందువాక్కృ
కృతి వినిర్మింపు మిఁక మాకుఁబ్రియము గాఁగ"

అని రాయల కొక సవాలు విసరెను. దీని నెదుర్కొనుట కాయన పారిజాత, మనువులను మించి, జగన్మాన్య ప్రభావమున మారెందులేక మదనాగమువలె సుస్థితితో ప్రకాశించునట్లు "పరహృద్యధి"మై తలయూపించునట్లు, వర్ణనలెల్లనో "వర్ణనకెక్కునట్లు అలంకారములలో నలంకరింపబడి "భావోన్నతి" పొందునట్లు, దివ్య మానుష కథగా నాముక్తమును రూపొందించుటకు సమధిక ప్రయత్నపరుడయ్యెనని తోచును.

ఆముక్తమందలి వర్ణన బాహుళ్యమునకు, అలంకార సమృద్ధికి ఈయహమిక, విద్యా స్పర్థ, ప్రోత్సహించెననుట యసమంజసముగాదు.

ఆయన భువన విజయ గోష్ఠులలో అష్టదిగ్గజముల మధ్యనిట్టి విద్యాస్పర్థలను ప్రోత్సహించెడివాడని పెద్దన గండపెండేరగాథ వంటి వృత్తాంతము లనేకము ధ్రువపరచును. అందుకే తిమ్మనగారాయనను "గోష్ఠీ వృత్త మణీ రంగ తల"యని కీర్తించెను. (పారి 5-111 = విద్వాంసుల గోష్ఠియనెడు నాట్యమునకు మణి నిర్మిత నాట్యభూమి యైనవాడా!)

## నన్నె చోడుని ప్రభావము

ఆముక్తముపై నన్నెచోడుని ప్రభావము గలదని నిర్దిష్టముగ నిశ్చయించుటకు ఈ రాజకవులిద్దరి కావ్యములలో సామాన్యములగు కొన్ని విషయములు తోడ్పడును.

కుమార సంభవ మష్టాదశ వర్ణనలతో ముప్పది యారలంకారములతో గూడిన దివ్యకథయని కవి చెప్పుకొనెను. (1-41-43) ఆముక్తము దివ్యభావ ప్రేరితులైన వారి చర్యను వర్ణించును. కుమార సంభవము వలెనది దివ్యకథ గాకున్నను దివ్య సంబంధితులైన

మనుష్యుల కథలకన్న భిన్నము. వర్ణనల బాహుళ్యము, అలంకార సమృద్ధి, కథయందలి దివ్యత - కుమార సంభవమునకు ఆముక్తమునకు సమాన గుణములు.

ఇవి గాక, రెండు కావ్యములకు విశిష్టములగు సంఘజీవన చిత్రణ, బ్రాహ్మణాధిక్యము (ఉదా. ఆముక్త రాజనీతి), తమిళ కన్నడ పద ప్రయోగము, ప్రకృతి పరిశీలన, బహు ఋతువుల వర్ణన (నన్నె చోడుడారింటిని, రాయలు నాల్గింటిని వర్ణించిరి). ఆముక్తముపై కుమార సంభవ ప్రభావమును సూచించును.

ఒక అసామాన్య దృశ్య వర్ణనలో నన్నెచోడునితో రాయలకు గల సన్నిహిత సామ్యమీ యభిప్రాయమును బలపరచును.

<u>కుమార సంభవ దృశ్యము :-</u>

*అరుణశాలి కణిశములు శుకాలి గరము గొనుచు నం*
*బర తలమున నోలి నెగసి పారు దిగ్వధూచయం*
*బరయ జెలువ మొనగు, శారదాగమమున మన్మహో*
*త్కర విభాతి తోరణములు గట్టె నట్టులందమై (6-120)*
*(కణిశము = సస్య మంజరి, కంకి)*

<u>ఆముక్త దృశ్యము :-</u>

*గూండ్లకై శాలి మంజరుల్గొనుచు, మూగి*
*యంబరమునఁ బరచు కీరాళు లొప్పెఁ*
*బసరు టొంటొంటి యాకులోఁ బండఁబాలి*
*ఛేద భయమున నెగసిన చేలనంగ (4-162)*

ఈ రెండింటి భావసామ్య మటుంచి (1) అరుణశాలి కణములు× పండఁబారి(న) శాలి మంజరులు; (2) శుకాలి×కీరాళి, (3) అంబరతలమున× అంబరంబున, (4) పారు×పరచు శబ్ద సామ్యము గమనీయము.

నన్నిచోడుడాకాశమున వరుసలుగా పరువిడు చిలుకలను ఉత్సవమున గట్టిన తోరణములతో పోల్చెను. ఈ భావము రాయల వర్ణనలో విడువబడినది. కాని, ఇదే భావము ఆముక్తమున నాల్గవ యాశ్వాసములో విష్ణుచిత్తుని యూరేగింపుటుత్సవ వర్ణనలో కనుపించును. ఈ యూరేగింపులో "సంధ్ర దేశీయులగు గంధకారులు" "పన్నీరువించిన తిత్తులొత్తగా "వాద్యకారుల వాద్యములు తడిసెను. వానినెల్లో వెచ్చబెట్టి వారు "నాదు పలికింప వాయించు ధిమి ధిమి ధ్వానంబులకుంబెదరి, యీవలి యుపవన శుకంబులావలికి, ఆవలి యుపవన శుకంబులీవలికి దట్టంబుగా "గట్టని తోరణంబులై పరవ" అనెడి రాయల వర్ణనకు నన్నిచోడుని వర్ణన మూలమని పించును. నన్నిచోడుని "తోరణములు గట్టినట్లు" అనెడి వర్ణనకన్న, రాయల "కట్టని తోరణంబులై" యనునది విశేషౌచిత్యము కలదిగా తోచును.

పిండితార్థమున :

(1) రాయల వర్ణన బాహుళ్యమునకు, అలంకార సమృద్ధికి ముఖ్యకారణము సమగ్ర దర్శకమగు ఆయన జీవనప్రేమయని-

(2) (i) దీక్షితాయన అలంకార ప్రీతి
(ii) అప్పటి ప్రబంధ సంప్రదాయము
(iii) విద్యాస్పర్థ - దోహదము చేసెనని యేర్పడును.

# అధ్యాయము - 4

## విలుబుత్తూరు దృశ్యములు - విజయనగర మాతృకలు

రాయలు విలుబుత్తూరి దృశ్యములననేక సూక్ష్మ వివరములతో నింపి, కంటికగుపడునట్లు వాస్తవికముగా చిత్రించెను. కొంచెమాలోచించినచో నిన్ని వివరములు కేవల మూహా జగత్తునుండి యూడిపడవని, వాని వెనుక నేదో యదార్థ ప్రపంచ స్మృతి యుండి యుండునని తోచును. ఈ ప్రపంచము రాయలకు బాల్యము నుండి స్థిర నివాసమైన విజయనగరము, దాని ప్రాంతమున యుండుట సహజము. ఈ ప్రాంతమును రాయలకు పూర్వము, రాయల కాలమున దర్శించిన పలువురు విదేశీయుల కథనములను పరిశీలించినచో విలుబుత్తూరు దృశ్యముల మాతృక లవేటి నేని ధ్రువపడును. 1516-17లో రాయలు విలుబుత్తూరును దర్శించినపుడీ పోలికలను గమనించి, ప్రీతుడై గాఢాభిమానముతో వానిని తన కావ్యమున స్థిరస్థాయులను జేసినని తోచును.

ఈ మాతృకలలో కొన్నింటిని నిపుడు గుర్తింపయత్నింతము.

**(1) విలుబుత్తూరు సువర్ణ సౌధములు : (1-51)**

విలుబుత్తూరు వర్ణన లలితోద్యాన పరంపరలతోను, పిక శుకాలాపముల తోను, మిన్నులతో రాయు సువర్ణ సౌధములతోను నారంభించును. ముందీ సువర్ణ సౌధములను గూర్చి ముచ్చటింతము.

"సువర్ణ" శబ్దమిచట మేడలకు పూసిన పసుపు పచ్చని రంగును ఉదాత్తముగ చెప్పుట కుద్దేశింపబడినదని యనవచ్చును. కాని, రాయల రాజ ప్రాసాదమును దర్శించి వర్ణించిన డొమింగో పయస్ (Domingos Paes) కథనమును (1520-22) గుర్తుకుతెచ్చుకొన్నచో రాయల ఉదాత్త భావన వెనుక సువర్ణమయమగు స్వీయ ప్రాసాద స్మృతి యున్నదని తోచును.

**రాయల శయన మందిరములు - పయస్ వర్ణన (1520-22)**

రాయల మన్ననకు పాత్రుడైన క్రిష్టొవావో (Cristoyao de Figueiredo) అను పోర్చుగీసు అశ్వ వ్యాపారి బృందములోని వాడు పయస్. వీరు 1520 మే నెలలో రాయచూరు ముట్టడిలో రాయల విజయమునకు తోడ్పడిరి. ఆ సంవత్సరము ఆశ్వయుజ మాసమున విజయ నగరమున జరిగిన మహానవమి (సెప్టెంబరు 12) ఉత్సవ సమయములో రాయలకు సమీపమున ప్రేక్షక స్థానమీయబడిరి. కార్తీక మాసారంభమున (అక్టోబరు 12) జరిగిన నూతన వత్సర ఉత్సవములకు పిమ్మట రాయలు తాము నివసించుచున్న నాగలాపుర ప్రాసాదమునకు తిరిగి పోయెను. ఆ సమయమున క్రిష్టొవావో అభ్యర్థన నంగీకరించి రాయలు తన విజయనగర ప్రాసాదమును పోర్చుగీసులకు చూపుటకు తిమ్మరసు తమ్ముడగు గోవిందరాజా నాజ్ఞాపించెను. పయస్ తాము చూచిన యద్భుతములను దీర్ఘముగ వర్ణించెను. అందలి రెండు శయన మందిరములను గూర్చిన దాని నిచట సంగ్రహముగ నిందము.

రాజ ప్రాసాదములో ప్రవేశింపగనే యెడమవైపున రెండభ్యంతర శయన మందిరములు కనిపించును. ఇందొకటి క్రింద మరొకటి పైనమన్నవి. క్రిందిది భూమట్టమునకు దిగువనున్నది. దానికి రెండుమెట్లున్నవి. అవి. బంగారు మలాము చేయబడిన రాగితో కప్పబడియున్నవి. అక్కడి నుండి పైవరకు బంగారముతో తాపబడి యున్నది. (lines with gold) నేను బంగారపు పూత (gilded) అనుటలేదు. బంగారముతో లోపల తాపబడిన (lined inside) దనుచున్నాను........ ఈ గదికి బెత్తపు పనితో నిర్మింపబడిన చతుర్ముఖ ప్రవేశిక ఉన్నది. (Four sided porch made of cane work) ఇది కెంపులు, వజ్రములు, తదితరములైన విలువగల సమస్త విధములగు రాళ్ళు, ముత్యముల పనితనము గలది. ఈ ప్రవేశికపైన (Above the porch) రెండు బంగారపు హారములు వ్రేలాడుచున్నవి. (two pendants of gold) వాని వాని మధ్య మెలికలు తీరి ఒత్తుగా కూర్పబడి, విత్తనము వంటి ముత్యముల పనితనమున్నది. (seed pearl work) మందిరము గోళము (dome) పైని గూడ నిట్టి హారములు వ్రేలాడుచున్నవి. ఈ శయన మందిరములో నొక పడక (Bed) యున్నది. దీని కోళ్ళు

ప్రవేశిక పాదముల వంటివి. దీని అడ్డ పట్టీలు (Cron Bars) బంగారముతో కప్పబడి యున్నవి. (covered with gold) దానిపైన నల్లని సన్న పట్టు (black satin) పరుపు ఉన్నది. రెండు దిండ్లు ఉన్నవి. దాని చుట్టు జానెడు వెడల్పున ముత్యపు కటకటాలున్నవి. (railing) వేరే ఆచ్ఛాదనమేమీ లేదు. దీనిపై గదిని నేను చూడలేదు. ఈ భవనములోనే మరొక గది పైనుండి అడుగు వరకు నేల, గోడలు - అంతా దంతమయమై యున్నది......ఈ భవనములోనే బంగారముతో కప్పబడిన రెండు సింహాసనములు, తెరలతో గూడిన వెండి మంచమొకటి యున్నది.

ఆ పిమ్మట పయస్ ఈ భవనమునకు వెలుపల విశాల ప్రాంగణమును...ఆ తరువాత ఆ సమీపమున మంచి పనితనము గల రాతి స్తంభములపై నిర్మింపబడిన భవనమును వర్ణించును. ఈ స్తంభములు, కొయ్యతో నిర్మించిన ఇతర భాగములు కూడ <u>బంగారముతో</u> కప్పిన దానివలె కనుబడునట్లు <u>ములామ</u>ు చేయబడినవి. (274)......మరొక నడవలో వెండి గొలుసులతో వ్రేలాడు మంచ మొకటి యున్నది. దాని పాదములు (Feet) బంగారు కడ్డీలతో (Bars of Gold) చేయబడి, అంతకన్న మేలుగా చేయ జాలనట్లున్నవి. మంచపు పట్టీలు బంగారపు తొడుగు గలిగియున్నవి. దానికి ముందున్న శయన మందిరములో మరొక మంచము <u>బంగారపు గొలుసులకు</u> వేలాడుచున్నది. దీని బంగారపు కోళ్ళకు అనేక విలువగల రాళ్ళు తాపబడియున్నవి. పట్టీలు <u>బంగారముతో</u> కప్పబడియున్నవి. ఈ గదిపైనున్న మరొక చిన్న గదిలో బంగారు ములామ చేయబడి రంగులతో చిత్రింపబడియున్నది. అది దాటిన పిమ్మట, ముందలి భాగములో కృష్ణరాయల ఆజ్ఞ ప్రకారము నిర్మింపబడిన మరొక శయన మందిరమున్నది.........ఇది తక్కిన యన్నిటికంటె అందముగా నుండవలెనని గది మొత్తము క్రింద నేల, తక్కిన సమస్తము - బంగారపు రేకుతో తాపడము చేయవలెనని అచట రంగులు పూయువారు చెప్పిరి. దీనిపై నడలో ఒక ఆవులో సగము పండుటకు తగిన పెద్ద బంగారు కాగులు. మూడు, మరికొన్ని చిన్న పెద్ద బంగారు కుండలు......పెద్ద వెండి కాగులు ఉన్నవి. [1]

---

1 *Robert Sewell, A Forgotten Empire, (Narrative of Domingos Paes pp. 273, 274, 275, N.B.T. 1970.*

ప్రత్యక్ష సాక్షియైన పయస్ కథనము బట్టి మనకు రాయల రాజప్రాసాదపు మెట్లు, విమానము (dome) ప్రవేశిక (porch) గదులు, స్తంభములు, మంచములు ఊయల మంచములు, వాని గొలుసులు, సింహాసనములు, కాగులు బంగారు మలాము చేయబడియో, బంగారు రేకులు తాపబడియో, నవరత్నములు కూర్చబడియో సర్వము స్వర్ణమయమైనదిగా కనుపించును. చిరకాలానుభవము వలన వీని స్మృతులాయన బహిరంతఃశ్చేతనలో జీరించుట సహజము. కవి యాంతర్యమున నెలకొన్న అనుభవముల ప్రయత్నముగా అతని పలుకులలో, వ్రాతలలో ప్రతిఫలించక మానవు. ఈ దృష్టిలో విలుబుత్తూరు "సువర్ణ సౌధము"ల వెనుక రాయల రాజప్రాసాద స్మృతులు మెదలుచున్నవని భావించుట అత్యూహ కాదనుకొందును.

**(2) విలుబుత్తూరు సౌధయోధులు (1-52)**

విలుబుత్తూరు వర్ణనలో రెండవ పద్యములో గూడ రాయలచటి సువర్ణ సౌధములనే ప్రదర్శించును. కాని ఇపుడవి లలితోద్యాన పిక శుకాలాపములను ప్రతిధ్వనించు సౌమ్య రూపమునుపసంహరించి, కోపముతో, ఇంద్రపురియగు వైజయంతమును జయింపబోవు వీరవేషమును ధరించును. వానిపైన కప్పిన అపరంజి యోడు బిల్లలు (బంగారు పెంకులు) వారి కవచములగును. వాని శిఖరములపైన తామర మొగ్గవలె చేసిన పద్మరాగ కలశములు వారి యెఱ్ఱడాలు శిరస్త్రాణములగును. ఇట్టి మిడువులు (మేడలు) అనేకములు. (అనేక వీరులని ధ్వని)

ఈ యనేక సౌధయోధుల వర్ణన వెనుక రాయల స్వీయ సైన్య శ్రేణుల స్మృతులు దాగియున్నవని పయస్ వర్ణనవలన స్ఫురించును. 1520 సెప్టెంబరు 12వ తేదీన మహానవమి ఉత్సవమునాడు సాయంకాలమందు రాయలు విజయనగరము వెలుపల స్వీయ గజ, తురగ, ధానుష్క, పదాతి దళములను సమీక్షించెను. ఈ దృశ్యమును స్వయముగా చూచిన పయస్ దానిని సుదీర్ఘముగ వర్ణించెను. అందులో ఒక భాగము.

........కొందరాశ్వికులు బంగారు మొలాముగల ఫలకములకు విలువగల పెద్ద రాళ్ళను తాపించి, అంచులందు చిన్న రాళ్ళతో జిలుగు కూర్పు చేయించిరి (lace

work)............ వీరు దూదికూరిన యుడుపులను (quilted tunics) ధరించిరి. ఇవి బలిష్ఠమైన ముడి తోలు పొరలతో నిర్మింపబడినవి. కొందరి ఫలకములకు లోపల వెలుపల బంగారు మొలాము చేయించిరి. కొన్ని వెండితో చేయబడినవి. వారి తల కవచములు (head pieces) ఇనుప కుళ్ళాయి(helmet) రీతిగా నున్నవి. వాని అంచులు మెడను అచ్ఛాదించుచున్నవి. ప్రతి దానికి ముఖమును రక్షించు ముక్క (Peace) ఉన్నది. ఈ తల కవచములు వారి ఉడుపుల మాదిరివి. వారు మెడల మీద ధరించు కంఠ కవచములన్ని బంగారు పూతగలవి. ఇవి కొన్ని పట్టుతో చేయబడి - బంగారు వెండి ఫలకములు, మరికొన్ని అర్ధమువలె మెరయు ఉక్కు ఫలకములు గలవి......డాలు కాండ్రకోడెములపై ననేక వెండి బంగారు పూలున్నవి.[2]

పెయస్ వర్ణనను బట్టి విలుబుత్తూరు సౌధయోధుల వర్ణన వెనుక రాయుల స్వీయ సైన్య స్మృతు లున్నవని గుర్తించుట అసమంజసము కాదు.

**(3) విలుబుత్తూరు ఉద్యానాదులు :-**

రాయులకు పూర్వము రాయుల కాలమున విజయనగరమును దాని ప్రాంతములను దర్శించి విదేశీయుల కథనములను బట్టి చూడగా రాయుల విలుబుత్తూరు వర్ణనలోని లలితోద్యానములు, పూదోటలు, కాల్వలు, సరస్సులు చెరకు తోటలు, కొబ్బరులు, పక్షి, వృక్ష, జంతు సంతానములు గూడ, ముక్కికి ముక్కి విజయనగరమునకు, ఆ ప్రాంతములకు చెందినవేయని గుర్తించి, ఆశ్చర్య సంతోషములు పొందుదుము.

**(1) నికొలొగెయ్ కోంటి** (Nicolo Die conte (1420-21)

(కాల్వలు, తోటలు, వృక్ష కదంబములు, వరి, చెరకు - (Sewell) కోంటి ఇటలీ దేశస్థుడు, కృష్ణదేవరాయులకు (1509-30) దాదాపు నూరేండ్లకు పూర్వము 1420-21 ప్రాంతములో, రెండవ దేవరాయలు సింహాసనమునకు వచ్చిన కొద్దికాలమునకు విజయనగరమును దర్శించి యుండవలెను. ఇతని వర్ణనము ప్రకారము :-

---

2 *Sewell Forgotten Empire - Paes pp 265-266 1970*

విజయనగర బాహ్య రక్షణ శ్రేణి వ్యాపించిన అనేక మైళ్ళవరకుగల గుట్టల మధ్యనున్న సమతలములో రాయలు శ్రమించి సూక్ష్మ వివరములతో సహా నిర్మించిన కాలువల వలన నీరు పారించుటకు శక్యమయినది. ఇచట సంపన్నములగు తోటలు, వృక్ష కదంబములు, యేపుగ పెరిగి వరి, చెరకు పైరులు పాంపిరి పోవుచున్నవి.[3]

సూయల్ :- కోంటిని ధ్రువపరచుచు, అతనికి దాదాపు అయిదు వందలేండ్ల తరువాత రాబర్టు సూయెల్ మహాశయుడు 1900లో నిట్లు వ్రాసెను :-

కోంటి వర్ణించిన కాలువ లింకను పనిచేయు చున్నవి. అవి యున్నచోట్ల బంగారు పంటలు, ఉన్నతములైన ప్రాభవముగల వృక్షములు, ఏపుగా పెరిగి పెనవేసికొన్న చెట్లు, చేమలు కనుపించుచున్నవి.[4]

బాల సుందరం :- బళ్ళారి జిల్లా బోర్డు విద్యాధికారియగు ఈయన 1948లోనిట్లు వ్రాసిరి.

హోస్పేట - (నాగలాపురము - రాయలు తన తల్లిపేర క్రొత్తగా కట్టి తరచుగా నివసించునది - (Sewell pp 238-345) లో పదివేల యెకరములలో చెరకు పంట పంచదార ఫ్యాక్టరీ యున్నవి. విజయనగరములో మతంగ పర్వతమునకు తూర్పువైపున అరటి చెరకు తోటలున్నవి.[5]

(ii) అబ్దుర్ రజ్జాక్ (Abdur Razzak,1443)

(తోటలు, గులాబులు, బజారులు)

ఇతడు షాహరుక్ అను పారసీక చక్రవర్తి వలన కాలికట్ జామొరిన్ వద్దకు పంపబడిన పరిపాలనానుభవము గల రాయబారి. ఇతడు రెండవ దేవరాయల

3 *Ibid - P 80*

4 *Ibid- PP 79-81*

5 *A.K. Balasundaram - Relics of Vijayanagara Glory- P.P. 53-71*

సందేశము ననుసరించి విజయనగరములో[6] 1443 ఏప్రిల్ నుండి డిసెంబరు వరకు నివసించి ఇట్లు వ్రాసెను.

1, 2, 3 కోటలకు మధ్యనున్న ప్రదేశము వ్యవసాయ భూములతోను, ఇండ్లతోను, తోటలతోను నిండియున్నది.....(3-7) కోటల మధ్యనున్న బజారు లత్యంత దీర్ఘములు, విశాలములు, లలితోద్యాన పరంపరలు - సౌధములు (1-51) విలుబుత్తూరు పథము-(1-54) గులాబి పూలు ప్రతిచోట అమ్మబడుచున్నవి. ఇవి లేనిదే ఇచటి ప్రజలు బ్రతకలేరు. వారి దృష్టిలోనివి యాహారమంత యవసరమైనవి.[7]

(ii) పయస్ (Domingos Pages,1520-22)

(మామిడి, పనస, నిమ్మ, దబ్బ, కొబ్బరి, వరి, పోకలు - కాల్వలు, చెరువులు, గృహారామములు, పక్షి సంతానము)

ఇతడు పూర్వోదాహృతుడైన పోర్చుగీసు అశ్వ వ్యాపారి. రాయలచే మన్నింపబడినవాడు. 1520లో పోర్చుగీసు గోవా నుండి విజయనగరమునకు ప్రయాణించెను.

<u>త్రోవలో</u> :- (తోటలు, వరి పశు, పక్ష్యాదులు)

ఇతడు కూడ మార్గమధ్యమున తాను చూచిన పల్లె పట్టణముల వెనుక పెంచిన మామిడి, పనస, చింత మొదలగు తోపులను.........చక్కగా వ్యవసాయము చేసిన సారవంతమైన భూములను, విశేషముగానున్న <u>పశు, పక్ష్యాదులను</u> సమృద్ధిగానున్న వరి, ఇతర దేశవాళీ సస్యములు, చిక్కుళ్ళు, పుష్కలమైన గోధుమ పంటలను, తదితర పంటలను వర్ణించెను.[8]

---

6 *K.A. Nilakanth Sastry - A History of South India P- 31 - (Oxford, 1971)*

7 *Sewell - P.P. 85, 88*

8 *Ibid- P 230*

విజయనగరములో :- (తోటలు, వరి, వగైరా)

పయస్ విజయనగరము చేరిన పిమ్మట చూచిన దృశ్యములనిట్లు వర్ణించెను.:-

ఈ నగరమును చుట్టుకొనియున్న కొండ గుట్టలను, వరుసలుగానున్న కోట గోడలు కలుపుచున్నవి. ఈ వరుసల మధ్యనున్న మైదానములోను, లోయలోను (235) వరిసైరు, అనేక నారింజ-నిమ్మ-దబ్బ తోటలు, ముల్లంగి మొదలగు కూర మొక్కలు పెంచబడియున్నవి. ఈ సైరులకిచటి గుట్టల వరుసల మధ్యనున్న అనేక సరస్సుల నుండి నీరు పారింతురు.........ఇచట బండపై బండ పేర్చినట్టున్న తెల్లరాతి గుట్ట లత్యంత చోద్యములు. (వజ్ర కుట్టిమంబగు పథమీ రాళ్ళతో నిర్మించిన విజయనగర పథమేమో! 1-54)............గోవానైపు ప్రవేశద్వారము వద్ద ఈ రాజు (కృష్ణదేవరాయలు) మిక్కిలి దృఢమైన పట్టణములను కోటను నిర్మించెను. (నాగలాపురము). దీనిలో (నాగలాపురములో) పుష్కలముగ నీరున్నది. ఇది గాక రాజచట రెండు గుట్టల నుండి వచ్చు నీరు నిలుచుటకు, వాని ముఖమువద్ద నొక చెరువు కట్టెను. దీనికి నీరు మూడా మడల (leagues) దూరమునగల మరొక చెరువు నుండి గొట్టముల ద్వారా వచ్చును. ఈ దూరపు చెరువొక చిన్న నదిలోనికి పోర్లును.........గొట్టముల నీటిని తోటలకు, వరి పొలములకు పారింతురు.......... నాగలాపురమొక మైదానములో నున్నది. ఇచటివారు నేల అనుకూల్యమును బట్టి (పూవు?) తోటలను (Gardens) పెంచుదురు. ఇవి వేనికవి విడిగా నుండును. (cf) ఆముక్త పూతోటలు, ఉపవనములు, కేళివనములు 1-66, 67, 72) మొదటి ప్రాకారము నుండి నగరమునకు చాల దూరమున్నది. ఈ ఖాళీలో, నీరు రెండు చెరువుల నుండి పుష్కలముగా వచ్చు నీటితో వరి సైరును, అనేక తోటలను పెంచుదురు. నీరు మొదటి ప్రాకారము గుండా వచ్చును. ఇక్కడ పండ్ల తోటలు (Orchards) ఒక చిన్న కొబ్బరి తోపు, చాల ఇండ్లు ఉన్నవి. (cf ఆముక్త, పనస, అరటి, మావితోటలు, కొబ్బరులు 1-68-69-71, కొబ్బరి, 54, 55).,......ఈ నగరమంతా ఒక్కచోటు నుండి కనుపించదు. అందుచే నేనొక గుట్టనెక్కి, నగరములో చాల భాగము చూచితిని.[9]

9 *Sewell - Paes P. P. 230, 35, 36, 37, 38, 45-*

నగరములోని <u>గృహారామములలో</u> చెట్లతోగూడిన అనేక తోపులున్నవి.(many groves of trees within it, in the Gardens of the Houses) [10] నగర మధ్యమున నీరు ప్రవహించు కాలువలు చాలా ఉన్నవి. కొన్నిచోట్ల సరస్సులున్నవి.(Lakes - cf) భవనంలో...........ఆము. 1-64) రాజుకు తన ప్రాసాదమునకు దగ్గరగా కొబ్బరితోపు సమృద్ధిగా ఫలములు కాయు చెట్లున్నవి. మహమ్మదీయుల పేట దిగువ నొక చిన్ననది యున్నది. ఈ వైపున చాల పండ్లతోటలున్నవి. ఇవి యెక్కువ భాగము మామిళ్ళు, పోకలు, పనసలు, (cfఆముక్తమున నిదేవరుస మామిడి 1-76; పోక 1-70; పనస 1-69; కొబ్బరి 1-54, 55) వీనిలో ఇంకా అనేక నిమ్మ, నారింజ చెట్లున్నవి. ఇవొక దానికొకటి దగ్గరగా పెరిగి (cf ఆముక్త - ఉద్యాన పరంపరా 1-51) చిక్కని అడవివలె కానిపించును [11]

**<u>విజయనగరములో పక్షులు :-</u>**

విజయనగరములో కారు చౌకగా అమ్మెడి కోళ్ళు, కౌజులు, అడవి కోళ్ళు బాతుల పోలిక గలిగి, చెరువులలో నుండు ఇతర పక్షులు (cనీరు కోళ్ళు - ఆము 1-71) గువ్వలు, పావురములు - వీనిని గూర్చి కూడ పయస్ వివరముగ వ్రాసెను. [12]

పయస్ కథనము వలన విజయనగరము నందు, దాని ప్రాంతములందు పక్షిజాతులు సమృద్ధముగా నుండెనని తెలియును. రాయలకివి నిత్యానుభవములోనివై యుండును. విలుబుత్తూరు వర్ణనలో పలుమారులు కనుపించు వివిధ పక్షి సంతానమునకివి మాతృకలని తోచును.

**(iv) ఫెర్నావో న్యూనిజ్(స్)(Fernao Nuniz 1535-37)**

(కాల్వలు - పూదోటలు - పండ్ల తోటలు - చెరకు - తమలపాకు తోటలు చేపలు - పక్షులు)

---

10 లలితోద్యాన పరంపరా..... సువర్ణ సౌధముల నెందుంజూడ - ఆము - 1-51, లలితోద్యాన = గృహారామ= *Gardens of Houses.* 'లలితోద్యాన' ములనగా - గృహారామములను వివరణ - గ్రంథాంతమున కననగును.

11 *Sewell- PP. 247, 48*

12 *Sewell*

ఇతడు కూడ పోర్చుగీసు అశ్వ వ్యాపారియే. రాయల అనంతర మైదేండ్లకు విజయనగరముచేరి మూడేండ్లు (1535-37) లాభసాటిగాని అశ్వవ్యాపారము చేసెను.(Sewell, P. 228)

ఇతడు మహమ్మద్-బిన్-తుగ్లక్ యొక్క సేనాని. 1327లో కంపిలి దేవుని చంపి, అనెగొంది నాక్రమించినప్పటి నుండి, అచ్యుత దేవరాయలు చనిపోవుటకు అయిదు సంవత్సరముల ముందువరకు (1537), కంపిలి విజయనగర చరిత్రలను సేకరించి, అనేక సాంఘికాచారములతోపాటు గ్రంథస్థము చేసెను. (Sewell, PP. 279-350) ఇతడు కొంత కాలము అచ్యుతదేవరాయల యాస్థానములో నుండెను. [13] ఇతని వ్రాత ప్రకారము-

<u>కాల్వలు - నగరము చుట్టూ తోటలు :-</u>

"అజరావు" (రెండవ బుక్కరాయలు 1405-6, మొదటి దేవరాయలు 1406-22) నిర్మించిన యానకట్ట నుండి <u>కాలువ</u> ద్వారా, రాజధానికి పారు <u>నీటితో నగరము</u> చుట్టూ అనేక <u>పూల తోటలు, పండ్ల తోటలు, తోపులు, ద్రాక్ష, నిమ్మ, నారింజ, గులాబి తోటలు</u> మంచి మంచి కాయలు కాయు యితర వృక్షములు పెంచిరి [14]

<u>రాయుల కాల్వ</u> :- (వరి తమలపాకు తోపులు - పనస, మామిడి పండ్లు)

కృష్ణరాయలు పోర్చుగీసు రాతిపనివారిని తెప్పించి, చాల ఉన్నతముగానున్న రెండు కొండ బోడుల మధ్యమున్న (345) నడుమ చాల యెత్తు, వెడల్పు గల గట్టుపోసి పెద్ద సరస్సు నిర్మించెను. దాని నుండి త్రవ్విన అనేక <u>కాలువల ద్వారా వరి పొలములకు</u> తోటలకు నీరు పారించిరి (345-47) (కేదారంపు కుల్య-ఆము,1-65).......<u>విజయనగరము</u>, నాగలాపురముల వెలుపలనున్న సాగు భూములలోను, ఇతర

---

13 *Nilkanta Ssatri - History of South India P.P. 234, 5; 285*

14 *Sewell- 7 E-NUniz - P.P. 288-9*

ఈయాన కట్ట కాల్వ పర్వత పాదములోని కఠినమైన రాతిని ఛేదించి నిర్మించినదని, ఇండియాలో కనిపించు అత్యంత విశేషమయిన నీటి పారుదల నిర్మాణమని నాయుల్ వ్రాసెను. *R.E. 150*

స్థలములలోను, గోధుమ, పప్పు, వరి, ఇక్కడ ముఖ్యముగా తిను జొన్న - ఈ పైరులను సమృద్ధిగా పెంచుదురు. వీని తరువాత, ఈ దేశములో చాల భాగములో తములపాకు తోటలున్నవి. ఇచటి వారు దాని నెల్లప్పుడు తిందురు. నోళ్ళలో పెట్టుకొని తిరుగుదురు. (cf ఆముక్త పోకలు, తములపు తీగెలు 1-70)

**పక్షులు, చేపలు, పండ్లు :- (పనస, మామిడి)**

ఇచటి వారనేక విధములగు మాంసములు తిందురు. వీనిలో అన్నిరకముల పక్షులు, నదుల నుండి పెద్ద మొత్తములుగా తెచ్చిన చేపలు ఉన్నవి. ప్రజలు తాము కొనువాని వాస్తవ రూపము, గుర్తించుటకు ప్రతి ప్రాణిని సజీవముగ అమ్మవలెను.

వీరి మార్కెటు లెల్లప్పుడు ద్రాక్ష, నారింజ, నిమ్మ, దానిమ్మ, పనస, మామిడి మొదలగు పండ్లతో సమృద్ధిగా నిండి పొర్లుటచే, వానిని చాల చౌకగా అమ్ముదురు. (356) [15]

ఇట్లు విజయనగరమును గూర్చి ఇటలీ, పర్షియా, పోర్చుగల్, బ్రిటన్, భారతదేశీయులు వ్రాసిన దానినిబట్టి విజయనగరము నందపుడు, ఇపుడూ వరిపైరు, మామిడి, పనస.......కొబ్బరి, చెరకు, పోక, తములపాకు, పూదోటలు, పక్షులు, చేపలు మొదలైనవి సమృద్ధిగా నుండుట తెలియుచున్నది. వీనికి విలుబుత్తూరు వర్ణన అద్దము పట్టినది.

---

*(15) Sewell- F. E-Nuniz - pp 345-47, 56.*
*రెండవ యాశ్వాసములోని లోగుల మామిడి, చేపముక్కల వేపుడు కూర మధుర రాజ పురోహితునింట నతిథి విప్రులకు పెట్టు సురభి రంభాఫలములు, పనస తొనలు, తెల్ల చెరకు ముక్కలు, పలు తెరగుల మావిపండ్లు, ద్రాక్ష గుత్తులు, బలిసిన దానిమ్మ గింజలు, రసదాడి యరటి పండ్లు విజయనగర తోటల నుండి, మార్కెటు నుండి వచ్చినవే! (ఆము. 2-68, 73)*

## విజయనగరము - విలుబుత్తూరు

ఈ సమస్త విజయనగర స్మృతులలోనే రాయలు విలుబుత్తూరు (1) సువర్ణ సౌధములను; (2) సౌధయోధులను; (3) లలితోద్యాన పరంపరలను; (4) పూదోటలను; (5) కేళివనములను; (6) సరస్సులను; (7) కాల్వలను; (8) వరి; (9) చెరకు పైర్లను; (10) పనస; (11) అరటి; (12) మామిడి; (13) తములపాకు తోటలను - సూక్ష్మ వివరములతో, వాస్తవికతను ఉట్టిపడునట్లు వర్ణించెననుట సహృదయ సమ్మతమగు ననుకొందును. రచయిత యనుభవ మతని వ్రాతలలో ప్రతిఫలించుట సహజము. రాయల విలుబుత్తూరు వర్ణనలను, విదేశీయుల విజయనగర వర్ణనలను ఒక పట్టికలో పోల్చి చూచినచో నీ విషయము స్పష్టమగును.

| <u>రాయల విలుబుత్తూరు</u> | <u>విదేశీయుల విజయనగరము</u> |
|---|---|
| (1) ఉద్యానములు- వృక్షములు | |
| (i) లలితోద్యానములు-గృహసంబంధము 1-51-56) | పయస్ గృహారామములు, తోపులు |
| (ii) పూవుదోటలు - పలు వంగడములు (62-66-69) | పయస్ - న్యూనిజ్ - రజాక్‌లు పూదోటలు-గులాబీలు |
| (iii) చంపకములు-ఉన్నత వృక్షములు (5-57-74) | పయస్-న్యూనిజ్-తోపులు కొంటి-వృక్ష కదంబములు |
| (iv) కొబ్బరి వరుసలు (54-55) | పయస్ - కొబ్బరి తోపు |
| (2) పండ్ల తోటలు - పోకలు తములపాకు తోటలు | |
| (i) మామిడి | పయస్ - మామిడి, పనస, పోక |
| (ii) పనస-68 | న్యూనిజ్ - ఇతర పండ్లు |
| (iii) పోక-70 | |
| (iv) అరటి; అరటి ఆకులు (69-76) | బాల సుందరం - అరటి చెరకు |
| (v) తములపాకు తోటలు(70) | న్యూనిజ్-తములపాకు తోటలు |
| (3) పంటలు - నీరు | |

| | |
|---|---|
| (i) వరి వంగడములు-(65-66-67) | కోంటి - పయస్ -న్యూనిజ్ - వరి |
| (ii) వరివేల కాల్వలు - (65) | పయస్ - న్యూనిజ్ - కాల్వలు |
| (iii) చెరకు (70) | బాల సుందరం |
| (4) బావులు -గుంటలు - సరస్సులు | |
| (i) చెంగల్వ దిగ్గియులు (56) | |
| (ii) వీధి నడబావులు (57) | పయస్-న్యూయనిజ్ - సరస్సులు |
| (iii) భవన సరస్సులు (64) | |
| (iv) కేళివన సరస్సులు (72) | |
| (5) పక్షులు | |
| (i) పికశుక- (51) | |
| (ii) లకుముకులు (57) | |
| (iii) సరోమరాళ (64-72) | |
| (iv) బాతులు (65) | పయస్ - అనేక పక్షి జాతులు |
| (v) కొంగలు (66) | |
| (vi) నీరు కోళ్ళు (74) | |
| (vii) చంపక వృక్ష పక్షులు (74) | |
| (6) చేపలు | |
| (i) వీధి బావులమీలు (57) | న్యూనిజ్-అనేక జాతుల చేపలు. |
| (ii) మావి తోపుల వాలుగలు (71) | |
| (7) వేశ్యలు | |
| (i) అరుగులపై పాచికలాడుట (59-63) | రజాక్ వ్రాత (దీనిని ఉదహరించుటలేదు) |
| (ii) సత్కీకృత నాట్యకత్తెలు (72) | పయస్-ఆలయ నాట్యము (తరువాత రాగలదు) |
| (8) సౌధములు | |
| (i) సువర్ణ సౌధములు; మాడువులు (51-52) | పయస్ - రాయల బంగరు శయన మందిరములు |
| (ii) భవనరాజులు (53) | |

## వేశ్యలు-రజాక్ వర్ణన

### వేశ్య వాటిక

టంకసాల వెనుక - 20 గజముల వెడల్పు 300 గజముల పొడవు గల వీధియున్నది. ఈ వీధికిరుప్రక్కల చక్కని పూబొదరిండ్లతో నిండిన ముంగిట వాకిళ్ళు గల శోభన గృహములు బారు తీరియున్నవి. ఈ ప్రాంగణములందు చంద్రకాంత శిలా నిర్మితములైన వేదికలు వరుసగా గలవు. ఆ వేదికలకు వెనుక మేడ గోడలపై సింహములు, పులులు మొదలగు వన్య మృగములు సజీవముగానున్నట్లు చిత్రింపబడినవి. అపరాహ్ణమున నెండవేడిమి యించుక తగ్గుచుండ వారార విలాసినులు చక్కగా నలంకరింపబడిన తమ యిండ్ల ప్రాంగణములందున్న చంద్రకాంత శిలావేదికలపై తివాసుల మీదను, కుర్చీల మీదను, సోఫాల మీదను....... చేటీ జనముతో నుపవిష్టలైయుందురు......నవరత్న ఖచితామూల్యాభరణములతో, మంచి ముత్తెముల హారములతో.........రంగు చీరలతో....చూచువారల హృదయములను జూరగొందురు. (cf విలుబుత్తూరు పద్మముఖులు 1-59-63) (ఎన్. వేంకటరమణయ్య - విజయనగర చరిత్ర 1958 పుట 94)

## అధ్యాయము - 5

## కొన్ని విశేషాంశములు - అనుబంధము-1

### ఉద్యానాదులు

విలుబుత్తూరు వర్ణనలో కవి - (1) లలితోద్యాన పరంపరలను, (2) పూవుదోటలను, (3) ఉపవనములను (4) కేళివనములును పేర్కొనును. తొలి చూపున కివి సమానార్థకములని తోచును. కాని పునః పరిశీలన వలననివి త్రివిధారామములని, వీని ప్రయోజనములు వేరని కవి ఈ-పదమును ప్రత్యేకార్థములలో ప్రయోగించెనని, తెలియును.

## (1) లలితోద్యానములు (1-51) :-

ఇవి కథారంభముననే పేర్కొనబడినవి. ఇందలి పిక శుకాలాపముల ప్రతిధ్వానములు సువర్ణ సౌధముల చంద్రశాలలలోని (వలభీ) పిక శుక ప్రతిమల స్వానములనెడి భ్రమను పుట్టించుచున్నవి. ఈ సౌధములు మిన్నులతో రాయుచున్నవని, అట్టి సౌధములతో శ్రీ విలుబుత్తూరు ఎందు చూచినను చెన్నొందుచున్నదని కవి వర్ణన. (1-51) సందర్భమును బట్టి యీ యుద్యానములు సువర్ణ సౌధములను చుట్టుకొనియున్న గృహారామములని తోచును. శబ్దార్థము కూడా దీనినే సూచించును.

"లలిత" శబ్దము ఈప్సితమును, మనోహరతను తెలుపును. 'ఉద్యాన' శబ్దము విహారార్థము పెంచిన శృంగారపు తోటను వచించును. పర్యవసానముగ లలితోద్యానములనగా విలుబుత్తూరు సౌధముల చుట్టు, సౌధవాసుల విహారార్థము పెంచిన శృంగారపు తోటలని యేర్పడును. ఉనికినిబట్టి, పరిమిత ప్రయోజనమును బట్టి యివి పెద్ద తోటలు కావని, ఆయా సౌధములకు తగుపాటివని తోచును.

(లలిత=(1) లలితమీప్సితా - మేది: (సంజీవని వ్యాఖ్య 1964): (2) మనోజ్ఞము (ఆంధ్ర వాచస్పత్యము); (3) లల ఇచ్ఛాయామ్.......(ఆంధ్ర శబ్దరత్నాకరము 1980); (4) శృంగారపుతోట (అమరము నానార్థ - గురు బాల ప్రబోధిక)

**(2) పూవు దోటలు (1-56)**

ఆ యూరి పరిచేలలో తీగమల్లెలు, ఖర్జూరములు మొదలగు వెనిమిది ధాన్యపు వంగడములు వరుసలు వరుసలుగా వర్థిల్లుచున్నవని (సారిదిం చేర్చిన), అవే పేర్లుగల పూవులతో గూడిన పూదోటలు వానితో పోటీ పడుచున్నవని, కాని వరి జాతులలో రాజనమను తొమ్మిదవ జాతి పేరు విశేషముగనున్నదని.....అందుచే వాని సరితూచు త్రాసు వరిచేలవైపు (రాజనపు) ముల్లు సూపెనని -ఇత్యాదిగ కవి వర్ణించును (1-66)

వరిమళ్ళు పెద్దవగుటచే ఊరి వెలుపల నుండును. వానితో సరితూగు పూవుదోటలు గూడ వాని ప్రక్కనే 'యుండుట - పెద్దవిగా నుండుట భావ్యము. వరిచేలలో వరి వంగడము వలెనే, వానితో పోటీపడు పూదోటలులోని పుష్పజాతులు

గూడ వరుసలు వరుసలుగా వర్థిల్లుచున్నవని, ధ్వని ఊరి వెలుపల నుండుట, పెద్దవిగా నుండుట, అనేక జాతుల పూవులు, వరుసలు, వరుసలుగా నుండుట-యను నీ మూడు లక్షణముల వలన నీ పూదోటలు గ్రామములోని సౌధములను చుట్టుకొని పరిమిత వైశాల్యములో శృంగారము కొరకు పెంచబడు లలితోద్యానములకన్న భిన్నములని, వానికన్న పెద్దవని తలచుట సమంజసము. సాధారణముగా నిట్టివానిని పూల వ్యాపారము. కొరకు పెంచుదురు. ప్రక్కనే పట్టణముండుట వ్యాపారమున కనుకూలము. రాయల విజయనగరము, నేటి మద్రాసు - ఇట్టి వసతులు గలవి.

కనుక-పూవు, దోటలు గృహస్థుల 'ఈప్సితము'ను 'ఇచ్ఛ'ను అనుసరించి ఇంటి చుట్టు "శృంగారము" కొరకు పెంచు లలితోద్యానముల కన్న భిన్నమయినవని అర్థము. విశేషమగు ప్రయోజనము గలవని యేర్పడును. అవి కూడ శృంగార లక్షణము కలవనుకొన్నను అది గౌణము. వ్యాపారము ప్రధానము.

**<u>(3) ఉపవనములు (1-67)</u>**

ఇవి పూవుదోటల వెనువెంటనే వర్ణింపబడినవి. సమీపమునమున్నవని - గాలిదెబ్బకు (నికటోపవనాని లాహలిన్) వంగిన వరి వెన్నులు చెంగలు వలపై రాచుకొనుచున్నవట. అందుచే వరిచేలతో సరితూగుచు వాని ప్రక్కనే యున్నట్లు, పైనచెప్పిన పూవుదోటలే యివి యనవచ్చును. (1-67)

(ఉపవన = యత్ కృత్రిమం వనం తదేవ - మనుష్యులు వేసి పెంచిన తోట - అమరము; వనౌషధి-గురుబాల వ్యాఖ్య, ఇట్లే ఆంధ్ర వాచస్పత్యము, ఆంధ్ర శబ్దరత్నాకరము).

**<u>(4) కేళివనము (1-72)</u>**

(i) వీని యంతరమున సరస్సులున్నవని (అంతః సరః)

(ii) ఆ సరస్సులలో హంసలు (పగలు) నిలకడగా నుండి (స్థాయి) సాయంకాలములందు గూండ్లకు పోవుటకు లేచునని (సాయంకాలములం.....గులాయ గమన ప్రోత్క)

(iii) ఆ సమయమున వాని రెక్కల పటపటలు (గొంతు) క్రేంకారములు (గరుత్పుట పటాత్కారంబుః గ్రేంకారమున్) (అచటి) పొదరిండ్ల లోపలి ప్రదేశములందు (కుంజ గర్భములన్) మ్రోయునవి-

(iv) ఆ మ్రోత ఆ యూరి స్వామియగు మురారి ఆలయమున స్వనించుచున్న దుంధుభి యొక్కయు హెచ్చుచున్న కాహళికల (ధ్వనుల) యొక్కయు. ప్రతిస్వనతను స్ఫురింపజేయునని - సూక్ష్మ వివరములతో కవి వర్ణించెను. (1-72)

ఈ వర్ణనమునబట్టి మనము కొన్ని విశేషములను గుర్తించవచ్చును.

<u>విశేషములు :-</u>

(1) ఈ సరస్సులో హంసలు సాయంకాలము వరకు నిల్చియుండు ననుటచే. ఆ సరస్సు హంసల యాహార విహారములకు తగినంత పెద్దదని, హంసలు బెదరని యేకాంత ప్రదేశమున నున్నదని-

(2) ఇట్టి పెద్ద సరస్సుతో కూడిన యీ కేళివనము కూడ పెద్దదేయని, ఊరికి దూరముగా ఏకాంత ప్రదేశమున నున్నదని-

(3) ఈ కేళివనములోని (హంసల ధ్వనితో ప్రతిస్వనించెడి) కుంజ గర్భములు యజమానుల యేకాంత విహారానుకూలతను సూచించునని-

(4) హంసల పటపటలలో క్రేంకారములలో స్వామి ఆలయ దుందుభి. కాహళికల ప్రతిస్వనత తోచునది (ప్రతిస్వనతఁ దోపన్) ఆ యజమానులకేనని-

(5) ఇట్టి యేకాంత స్థలమున, నేకాంత విహార యోగ్యమగు పెద్ద కేళివనము నాయూరి సంపన్నులూరికి దూరముగా నిర్మించుకొనిరని-

సందర్భమును బట్టి భావింపదగును. అందుచే నివి మొదట చెప్పిన లలిత. పుష్ప, ఉపవనములకన్న భిన్నార్థము. ప్రయోజనము కలవని యేర్పడును.

కేళి : 'కేళి' శబ్దార్థ మీ భావమును పరిపుష్ట మొనర్చుచున్నది. 'కేళి' యనగా:-

(i) ప్రియునితో విహరించు నాయిక క్రీడయని-

విలాసముతో స్త్రీ పురుషులు విహరించుటయని- కోశకారులు (శబ్ద రత్నాకరము, ఆంధ్ర వాచస్పత్యము, ఆంధ్ర శబ్ద రత్నాకరము)

'కేళివని' యనగా క్రీడావనమని అభినవ మల్లినాథుల సంజీవనీ వ్యాఖ్య (1964)

ఇట్టి ఏకాంత కేళికి మిన్నులతో రాయు సౌధములను చుట్టుకొనియున్న లలితోద్యానములు పనిగావు. ప్రక్క సౌధములీ కేళి గోప్యతకు భంగకరములు. ఇట్లీ-పూవు దోటలు గూడ పుష్ప వ్యాపారమునకో, ప్రక్కనున్న వరిచేల పనులకో వచ్చిపోవు జనుల సమ్మర్దము వలన నేకాంతత కనుకూలములు గావు.

<u>పిండితార్థమున :-</u>

కేళివనము లూరికి దూరముగా, జనసంచారములేని ప్రాంతములో సంపన్నులు తమ నాయికలతో క్రీడించుటకు పెంచిన పెద్ద తోటలని, సరోవరనికుంజ సహితములని, ఉద్యానాదులకన్న భిన్నములని యేర్పడును.

విజయనగర ప్రథమ ప్రాకారము నుండి నగరము వరకు చాల దూరమున్నదని, రెండు చెరువుల నుండి పుష్కలముగా వచ్చు నీటితో, ఈ ప్రదేశములో అనేక పూదోటలు (garden) వరి, పండ్లతోట (orchard) కొబ్బరితోపు - పెంచిరని పయస్ కథనము (Sewell-p 245) నీని నిచట స్మరింపదగును.

రెండవ యాశ్వాసమున ప్రేయసీ ప్రియులు వేసవిలో పవలంతా, దీర్ఘములైన నడవబావులలో (దీర్ఘికలు) నొకరిపై నొకరు నీరు చల్లు పోరాటములో నలసి రని కవి వర్ణించును. (2-61). విలుబుత్తూరు కేళివన అంతస్సరస్సులట్టివి కావచ్చును.

పారిజాతమున తిమ్మనగారు సత్యభామా కృష్ణులింద్రుని యుపవనమున 'వనకేళి' గావించి, ఆ పిమ్మట "వేలుపు -గొలనులో" 'సలిల విహరణ' మొనరించిరని (4-13-, 17, 24) దీర్ఘముగా వర్ణించెను. ఆముక్త - పారిజాతముల వలన రాయల కాలమున కేళివనములు, అందలి సరస్సులు, నాయికా నాయకుల యేకాంత కేళికి స్థానములని ధ్రువపడును.

ఈ పరిశీలన వలన - రాయలుద్దేశించిన ఆయా తోటల విశిష్టత ప్రత్యేక ప్రయోజనము, రాయల శబ్ద ప్రయోగములోని మర్మము స్పష్టపడి హృదయరంజక మగుచున్నది.

## విశేషాంశములు - అనుబంధము -2

**(1) వీధులు - (2) పథము :-**

లౌకిక దృశ్య విశ్లేషణ శీర్షికలో 'వీధు'లనగా విండ్ల వరుసలని 'పథ'మనగా - ఆ వరుసల రెండింటి మధ్య ప్రజలందరు నడచెడి పెద్ద మార్గమని సూచింపబడినది. (ఆము. 1-53, 54 పు. 14, 15) ఈ విశేషాంశము నిచట వివరింపవలసియున్నది.

'వీధు'ల వర్ణన (1-53) ముగియగనే 'పథము' వర్ణింపబడినది. (1-54) పద సామ్యము వలన, వెంట వెంటనే వర్ణింపబడుట వలనను, మొదటి చూపునకివి సమానార్థకములని తోపవచ్చును. కాని, పరిశీలించి చూడగా - వచన భేదమువలనను, వర్ణితాంశముల భిన్నత వలనను, కవి హృదయము వేరని తోచును.

వ్యాఖ్యలు -వీధులు :- సందేహ నివృత్తికై ప్రచారములో నున్న రెండు వ్యాఖ్యలను చూడగా - 'వీధుల'కు రెండింటిలోను అర్థము వీధులనియే యున్నది. ఇది నిత్య వ్యవహారమున సుపరితమగు పదమని వ్యాఖ్యాతల భావమైయుండును. అట్లే రెండు వాఖ్యలలోని తాత్పర్య భాగమున గూడ 'వీధు'ల వీధులనియే పేర్కొనబడినవి.

వ్యాఖ్యలు - పథము :- పథమునకు రెండు వ్యాఖ్యలలోను అర్థము 'మార్గ'మని యున్నది. - కాని ఒక వ్యాఖ్యలో పథమునకు తాత్పర్యము 'వీధులు' అని బహువచనమున చెప్పుట పొసగలేదు. ఇందువలన నీ వ్యాఖ్యాతృ చక్రవర్తిపై నా గౌరవము తగ్గలేదు.

రెండవ వ్యాఖ్యలో తాత్పర్యమున పథమనగా - రాజపథమని యున్నది. అర్థమున మార్గమని చెప్పి, తాత్పర్యమున రాజపథమనుట పెద్ద వీధిని సూచించుటకు గాబోలు. ఇది విచార్యము, పెద్ద వీధులను సూచించుటకు రాయలీ యాశ్వాసమున 1-57). రెండవ యాశ్వాసమున (2-23), 'రథ్య' అను పదమునుపయోగించుట గమనార్హము.

చివరకు-కోశకారులిచ్చిన యర్థములలో ప్రస్తుత సందర్భమున నేది పొసగునో చూతము.

<u>వీథులు - కోశములు-</u>

కోశములలో వీథికి (1) శ్రేణి (వరుస) అని; (2) ఇండ్ల వరుస- అని; (3) ఇండ్ల వరుసలు రెండింటి నడిమి త్రోవయని అర్థములు కనబడును.

కాని - వీనిలో కవి భావించినదేది? ఇది నిర్ణయించుటకు ఈ శబ్ద ప్రయోగ సందర్భమున వర్ణితాంశములే మన కాధారములు.[16]

<u>వీథులు - ప్రయోగ సందర్భము :-</u>

విలుబుత్తూరు సౌధములను వర్ణించు మొదటి మూడు పద్యములలో (1-51, 52, 53) చివరి దానిలో 'వీథులు' అని ప్రయోగింపబడినది.

<u>వీథులు - వర్ణితాంశములు :-</u>

సౌధములను గూర్చిన మొదటి పద్యములో - మిన్నులతో రాయుచు, లలితోద్యాన పరంపరలోని పిక శుకాలాపముల ప్రతిధ్వనులతో నిండిన సువర్ణ సౌధములు వర్ణింపబడినవి. రెండవదానిలోనవి బంగారు పెంకులనెడి శరీర కవచములను, పద్మరాగ కలశములను, శిరః కవచములను ధరించి, ఇంద్రపురిని గెలుచుటకై నిలచిన యోధులుగా నుత్ప్రేక్షింపబడినవి. - మూడవ (ప్రస్తుత) పద్యములో- ఆ సౌధముల ముంగిలిమెట్లు (2) అపరంజి నీటితో వ్రాసిన లక్ష్మీదేవి, ఆమెను స్నానమాడించు రెండేనుగులు ఆమె పార్శ్వములందు చిత్రింపబడిన శంఖచక్రములు వర్ణింపబడినవి.

---

16 *(1) వీథ్యాళి రావళిః= పఙ్క్తిః శ్రేణీ- అని అమరుడు - నానార్థ వర్గము (=వీథి, ఆళి, ఆవళి, పంక్తి, శ్రేణి) ఇవి వరుస యందులు గల పంక్తి పేర్లని గురు బాల ప్రబోధిక. (2) వీథి వర్త్మని - అని కూడా అమరుడే (నానార్థ) వీథి శబ్దము మార్గమునకును, అవి శబ్దము వలన పఙ్క్తికిని పేరు అని ప్రబోధిక.*

*2.3 (ఇండ్ల వరుసలు, ఇండ్ల వరుసలు రెండింటి నడిమి (త్రోవ) శబ్ద రత్నాకరము; ఆంధ్ర శబ్దరత్నాకరము.*

మణి తోరణములతో గూడిన ద్వారములను గూర్చిన వర్ణనలో వీధులు ప్రసక్తమైనవి. ఆ పద్యభాగమిట్లున్నది.

**పెఱపురాలి గృహశ్రీల పెండ్లియాడ**
**భవన రాజులు(గట్టిన బాసికమన(**
**దనరు మణి తోరణములతో ద్వార వితతి**
**బరగు వీధులు పురి మాత్ర పట్టినట్లు (1-53)**

ఆ పురి వీధులు - భవనములనెడి రాజులితర గృహశ్రీలను పెండ్లియాడుటకు కట్టుకొన్న బాసికమనునట్లు ఒప్పెడి (తనరు) మణి తోరణములతో గూడిన ద్వార సమూహముచేత వంపులు లేకుండ శోభిల్లును-అని భావము.

ఇచట వీధులనగా నేమి? కోశకారులు చెప్పిన (1) శ్రేణి (వరుస), అను మూదర్థములలో కవి దేని నుద్దేశించెను?

(1) <u>సౌధములు</u> :ఈ మూడు పద్యములలోని విషయము సౌధములేగాని, సౌధ ముల వరుసల రెండింటి నడుమ త్రోవను గూర్చిన ప్రసక్తిలేదు. ఆ త్రోవ నాల్గవ పద్యమున, ప్రత్యేకించి వర్ణించబడి, "పథము" అని పేర్కొనబడినది. దానిని తరువాత చూతము.

(2) <u>సౌధపరంపర</u> : విలుబుత్తూరెచట జూచినను, లలితోద్యాన పరంపరలలోని పిక శుకాలాపములను ప్రతిధ్వనించు సౌధములతో చెన్నంది సెలగుచున్నదని వర్ణన (మొదటి పద్యము) వలన, లలితోద్యాన పరంపరలందున్న సౌధములు గూడ పరంపరలుగా (వరుసలుగా) మున్నవని ధ్వని. అట్లైనచో, ప్రస్తుత వీధి శబ్దము సౌధ శ్రేణిని (వరుసలను) సూచించునని తోచును.

(3) ఇట్లు చెప్పుకొన్న యెడల బహువచనము లోని వీధులనే, యేకవచనము లోని పథముగా భావించు క్లేశము తొలగును.

<u>పథము</u>

<u>కోశములు</u> :- పథమునకు కోశకారులు మార్గము, త్రోవ-అనియే నిర్ద్వంద్వముగ చెప్పిరి. వీధులకు వలె దీనికనేకార్థములు లేనందున, వానిలో సందర్భోచితమేదియని వెదకవలసిన చిక్కులేదు.

<u>పథము-ప్రయోగ సందర్భము :-</u>

మేడల వరుసల వర్ణనను ముగించి, రాయలా వరుసల మధ్యనున్న పథమును వర్ణించును. దీని నాయన "వజ్రకుట్టిమంబగు పథమున్" అని పేర్కొనును. కుట్టిమమనగా "శిలాదులచేత కొట్టబడిన నేల" (శ. ర.) రాలు మొదలైనవి పరచి కట్టిన చోటు" (ఆం.శ.ర.) అని వ్రాసిరి. "మగరాతి నెలకట్టు" - అని యొక వ్యాఖ్య! మూలము కన్న వ్యాఖ్య దుర్బోధమను పరిజ్ఞుల మాటకిది దృష్టాంతరము.!

<u>పథము - వర్ణితాంశములు :-</u>

(i) ఈ పథము వజ్రములతో (లేక వజ్ర కాఠిన్యము గల మెరుపు రాళ్ళతోనో) నిర్మించబడినది.

(ii) ఎఱ్ఱని బొండములు గల కొబ్బరి చెట్లే పథమున కిరువైపుల నున్నవి.

(iii)పథము సముద్రుని పెద్ద భార్యయగు గంగ, కొబ్బరి చెట్లామె కుమారులగు కల్పవృక్షములు

ఆ యూరి వారు (తమ భవన నిర్మాణాదులకు) సముద్రుని కొల్లగొట్టితేగా, మిగిలిన రత్నముల రక్షకు పూటగా నతడు తన భార్యా పుత్రులను వారి వశమున నుంచెనని కవి యుత్ప్రేక్ష.

<u>చర్చా సారాంశము</u>

1) వీధులవలె పథము బహువచనము కానందునను-

2) వీధులను గూర్చిన వర్ణితాంశములు పథమును గూర్చిన వాటికన్న భిన్నములగుట వలనను

ఈ రెండు పదములు ఏకార్థములు కావు.

(3) వర్ణితాంశములను బట్టి వీధులనగా నిచటి ఇండ్ల వరుసలు అందుచేత ఆ పదము బహువచనమున నున్నది.

ఒకటిగా కనుపించెడి యీ పదములను కవి (ఉద్యాన, ఉపవనాదులవలె) భిన్నార్థములలో ప్రయోగించెనని తోచును. మేధావంతులకైన అసాధారణమగు బోధకు ఆకరమైన హృదయము గలవాడని, అప్పటికప్పుడు క్రొత్తగా ప్రకాశించు మాంద్యములేని ప్రజ్ఞగలవాడని - తిమ్మన పెద్దననలాయన[17] నూరకే ప్రశంసింపలేదని తోచును.

## విశేషాంశములు - అనుబంధము - 3

**శ్రీకార్యపరులు (1-59)**

విలుబుత్తూరి ఆలయ నాట్యకత్తెలు మన్మథు డెదురైనను తలయెత్తి చూడని పరాకుతో జాదమాడుదురని (నెత్తమాడు) - అయినను, శ్రీకార్యపరులను గాంచినచో లేచి, యంజలించి, మ్రొక్కుదురని-

జూదమాడుచునే, ఆలయ పూజాకాల శంఖధ్వని వినుటకు కడగంటిని త్రిప్పుదురని

కవి వర్ణించెను. (1-59) (వైష్ణవ వాతావరణ శీర్షిక)

మన్మథునైన సరకుజేయని పద్మముఖులు శ్రీకార్యపరులకింత గౌరవమేల చూపుదురు? శ్రీకార్యపరులనగా నెవరు? అని ప్రశ్నము కలుగును.

శ్రీకార్యపరులనగా - భగవత్కైంకర్యాసక్తులని, భగత్కైంకర్యపరులని ఉభయ వ్యాఖ్యాతలు వ్రాసిరి. కాని , వీరి కైంకర్యమెట్టిదో తెలియుటలేదు.

---

*17 మేధావద సాధారణ బోధాకర హృదయమునకున్ - (పారి- 1-26-); నిస్తంద్ర ప్రతిభా - మను-2-79)*

కోశాధికారులు శ్రీకార్యమనగా -గుడి పారుపత్తెమని, పారుపత్తెమనగా (1) దొరతనమునకు ప్రజలీయవలసిన దానిని రాబట్టెడి యధికారమని (2) ఆయవ్యయాదులపై యధికారమని వ్రాసిరి. (శ.ఆ. అం.శ.ర.)

ఈ యధికార స్వరూపము శాసనములలో మరికొంత విస్పష్టముగా కనుపించును. క్రీ.శ. 796-847ల మధ్య కాంచీ పల్లవరాజగు దంతి విక్రమవర్మ దేవుని తిరుపతి శాసనముల (833-34) వలన, అంతకు పూర్వము నుండియే - దూరప్రదేశములందున్న ప్రజలు తిరుపతిలో తాము నెలకొల్పిన యఖండ దీపమును చిరకాలము రక్షించుటకు, సక్రమముగా నియమితులైన ఆలయాధికారుల వద్ద తమ దానములను, మూల ద్రవ్యముగా నేర్పరచిన నిధిని గూడ భద్రపరచెడి వారని వాస్తవ కార్యనిర్వహణకు నేటి సెక్రటరీని పోలిన "శ్రీకార్యం" (శ్రీకార్యపరుల)తో కూడిన గ్రామ వ్యవస్థయుండెడిదని తెలియును.

'తిరుచ్చోహినూర్' - (తిరుచానూరు)లోని మరొక శాసనము వలన "శ్రీ- కార్యం" వద్ద కొంత బంగారము విధిగా నుంచబడినదని, యీ దానమునతడు బహిరంగముగా ప్రకటించవలెనని, లెక్కలలో "ఊర్నియోగం"గా (గ్రామస్థుల ఆజ్ఞకు లోబడినదిగా) చూపవలెనని తెలియును [18]

దీనిని బట్టి శ్రీకార్యపరులనగా

(1) ఆలయ కార్యనిర్వాహముపైన, ఆలయ నిధులపైన, నధికారము గల యుద్యోగులని-

(2) అందుచేత గ్రామస్థులకు, ప్రత్యేకించి ఆలయ సంబంధితులగు దేవదాసిల వంటి వారికి పూజనీయులని గ్రహింపవచ్చును.

కనుకనే మన్మథునైన తలయెత్తి చూడని పరాకుతో జాదమాడు విలుబుత్తూరు నాట్యకత్తెలు శ్రీకార్యపరులను చూడగనే లేచి, అంజలించి మ్రొక్కుట. ఈ వ్యవస్థ

18 Dr. S. Krishna Swamy Aiyangar - A HIstory of Tirupati - Vol 1. II - 229, 231 - (Madras- 1940)

రాయలకు కనీసమెనిమిది వందలేండ్లకు పూర్వము నుండియే యమలులో నుండుటచే కావ్యమునకెక్కినది.

<u>ఆలయ వ్యవస్థ</u>

మరికొన్ని శాసనములను బట్టి ఆలయ భూముల నిర్వాహమునకు, విక్రయమునకు, క్రయధనమును భద్రపరచుటకు, భూములను శిస్తులేకుండ జేయుటకు, వానిని దాతలుద్దేశించిన ధర్మ కార్యములకు వినియోగించుటకు - గ్రామ సభలుండెడి వవి ఇవి శ్రీ వైష్ణవుల యాజ్ఞకు లోబడి, ఆయ వ్యయపట్టికలు వ్రాయు సిబ్బందితో గూడి యుండెనని తెలియును [19] 2, 4 ఆశ్వాసములలో కనుపించు శ్రీ భండార నిర్వాహకులగు స్థానికులు, అందలము మోయు బోయీలు ఈ సిబ్బందిలోని వారే!

## విశేషాంశములు - అనుబంధము -4

## పాచికలాడు పద్మముఖులు - రాయల స్వానుభవము

<u>రాయల స్వానుభవము :-</u>

విలుబుత్తూరు నాట్యకత్తెలను వర్ణించునప్పుడు (1-59-63) రాయలకు విజయనగర కళావంతులు జ్ఞప్తియందుండి యుందురు. వారి సంగీత, నాట్య నాటక కళల యందాయునకు గల యభినివేశమే విలుబుత్తూరు వారిని గూర్చి సాదరముగ వ్రాయుటకు కారణమని తోచును.

(1) డోమింగో పయస్ సవిరముగ వర్ణించిన రాయల యంతఃపుర నాట్యమందిర[20]మాయున నాట్యాభిమానమును వెల్లడించును.

(2) విజయనగర శిథిలములలో నేటికిని కనుపించు భువన విజయ భవనపుటున్నత మూల వేదిక పార్శ్వములందలి శిలా ఫలకములలోని శిల్పములలో,

---

19 *Ibid, pp. 233, 34*

2 *Sewell- F. E. pp 276-77*

వివిధ వాద్యములను ప్రయోగించుచు, వివిధ నాట్య భంగిమలలో గనుపించు పలువురు స్త్రీలు, స్త్రీ పురుషుల జంటలు యీ యభిమానమునకు శాశ్వత సాక్షులు.[21]

**(3)** రాయలు తాయికుండ నాటకములో స్త్రీ పాత్ర ధరించిన నట్టువ నాగయ్య అభినయమును, అతని బృందము వారి కళానైపుణ్యమును మెచ్చి భూదానమిచ్చెనని ఒక శాసనము వలన తెలియును.[22]

**(4)** రాయలు కవి పండిత గాయక బృందముల విద్యా గోష్ఠితో వినోదించుచు "విద్వత్సభారాయ" బిరుదము వహించుననీ, నాట్యబృందాధ్యక్షుడగు శ్రీ రంగరాజు, ఆయన కుమార్తె కుప్పాయి, మనుమరాండ్రు తిరుమలమ్మ, ముద్దు కుప్పాయి "విద్వత్సభారాయ రంజక" బిరుదులు గలవారని, అదే శాసనము వలన తెలియును. ఈ బిరుదులు కృష్ణరాయలు, నాట్యకారులు - పరస్పరమిచ్చుకొన్నవి కావచ్చును.

రాయల రెండవరాణి చిన్నాదేవి ఆయన రాజ్యమునకు రాకపూర్వ మతడు వరించిన భోగిని (courtesan) అని పయస్ వ్రాసెను.[23]

ఈ విధముగా సంగీత, నాటక కళాచతురలగు విజయనగర వేశ్యల సన్నిహిత పరిచితి వలన రాయలకు వారియందేర్పడిన ఆదర భావము, వారి జీవన పద్ధతుల యాకళింపు - విలుబుత్తూరు పద్మముఖుల వర్ణనలో ప్రతిఫలించెనని తోచును

<u>పయస్ :- విజయనగర పరిసర వేశ్యలు :-</u>

వీరిని గూర్చిన పయస్ వృత్తాంతము కొంత దీర్ఘమయినను రాయల కాలమున సమాజములో వారికి గల ప్రత్యేక స్థానమును తెల్పుటచే నుదాహరింప బడుచున్నది.

---

21 *D. Devakunjari, Hampi, p 23, Archaelogical Survey of India 1970*

22 కిళాంబి రాఘవాచార్యులు - శ్రీ కృష్ణ దేవరాయలు, పు 187, *Ep Cou 99/1916, NO. 558 of A.P.P.B.*

23 *Sewell - F. E. Paes - p 24?*

ఇంతకు పూర్వము తెలిపినట్లు పోర్చుగీసు అశ్వవ్యాపారియగు డొమింగో పయస్ విజయనగరమున రెండేండ్లుండి (1520-22) తాను చూచిన వానిని, ఇతరోపాయముల వలన తెలిసికొన్న వానిని, ఆసక్తికరమైన వివరములతో పోర్చుగీసు భాషలో గ్రంథస్థము జేసెను. వానినాంగ్లమున ననువదించి రాబర్టు సూయల్ మహోదయుడు ఒక విస్మృత సామ్రాజ్యము (A Forgotten Empire) అను గ్రంథములో 1900లో ప్రచురించెను. (National Book Trust of India, New Delhi, Reprint, 1970)

## దర్చా నాట్యకత్తెలు

పయస్ గోవా నుండి విజయనగరమునకు వచ్చు దారిలో దర్చ (Darcha) ధార్వార్?) పట్టణమున జూచిన వేశ్యేశ్వరాలయ నాట్యకత్తెలను గూర్చి వ్రాసెను:-

వీరు నిత్యము నైవేద్య కాలమున స్వామి విగ్రహమునకెదుట నృత్యము చేయుదురు ఆముక్తమున (cf నైవేద్య కాల నృత్యము (1-23)........వీరి యిండ్లు నగరములోని శ్రేష్ఠమగు వీధులలో నున్నవి. రాజ్యములోని అన్ని నగరములలోను నిట్లే. ఈ వీధులు ఉత్తమ గృహ శ్రేణులలో గూడినవి. ప్రజలు వీరిని ఘనమైన వారినిగ నెంచి రాజోద్యోగుల యుంపుడు గత్తెలతో గౌరవనీయ వర్గములలో చేర్చుదురు. మాన్య పురుషు డెవడైన వారి యిండ్లకు పోవచ్చును. అందుకు వారినే నింద యుంటదు. ఈ స్త్రీలు రాణుల సన్నిధిని ప్రవేశించుటకు గూడ ననుమతింపబడుదురు. రాణులతో వారు కొంత కాలము గడిపి, వారితో తాంబూలము సేవింతురు. ఎంత గొప్ప హోదాగలవాడైనను నితరుడెవ్వడు ఈ పని చేయలేడు (పు. 234)

## విజయనగర నాట్యకత్తెలు

విజయనగరమును గూర్చి పయస్ చాల వ్రాసెను. అందులో నాట్యకత్తెలను గూర్చిన దాని సారాంశము :-

విఠలాలయమునకును, మరి రెండు గొప్ప ఆలయములకును, సంబంధించిన యుత్సవములలో ప్రజలు రథములు లాగుదురు. నాట్యకత్తెలు, ఇతర స్త్రీలు - పాటలు

పాడుచు వాని వెంట పోవుదురు. విగ్రహమును వీధివెంట గొప్ప వైభవముతో నూరేగించి, ఆలయమునకు చేర్చుదురు. (పు. 253)

విజయనగరము రాజధాని యైనందున ముఖ్యోత్సవములకు రాజు (కృష్ణరాయలు) కొత్త పట్టణము (నాగలాపురము) నుండి అచటకు వచ్చును. విందులు జరిపి సమావేశమగుట వారి యాచారము. ఈ విందులకు హాజరు కావలసినదిగా రాజ్యములోని నాట్యకత్తెలందరిని పిలిపింతురు. అట్లే దండనాయకులను, సామంతులను, మండలాధిపతులను, వారి పరివారములతో సహా పిలిపింతురు. (పు. 253).......నవమి ఉత్సవ కాలములో కొందరు నాట్యకత్తెలు (పు. 254).......అనేక స్వర్ణ, వజ్ర మౌక్తికాభరణముల నలంకరించుకొని భువన విజయ మందిర ద్వారమునానుకొని..........ఆచ్ఛాదన గల రెండు వలయాకారపు కోష్ఠములలో(galleries) చేరుదురు. (పు. 260)..........తక్కిన వారనేకులుదయ పూజా సమయమున భువన విజయ మందిరము వెలుపల నొక చతురస్ర స్థలములో నాట్యము చేయుదురు. వీరి నాట్యము జూడవచ్చిన అనేక దండనాయకులు, ముఖ్యపురుషులు, ఈ చతురస్రము చుట్టునున్న పంచలలో నుందురు. (పు. 256).........సాయంకాలము మూడు గంటలకు రాజప్రాసాదమున జరుగు వేడుకల కనేకులు వత్తురు గాని, ప్రతివారిని వెంటనే లోని కనుమతింపరు. కాని మల్లులను నాట్యకత్తెలను ఏనుగులను, వానిపైనున్న సాయుధులను మాత్రము లోనికి బోవ ననుమతింతురు. (పు. 256F.N.) ..........ఆ భవన మధ్యమునగల మెట్లగది సమీపములో కొందరు నాట్యకత్తెలు కుస్తీలు పట్టుటకు విశాల ప్రదేశము సిద్ధపరచి యుండును. (పు. 258)...........వేదికపై రాజు ఆసీనుడైన పిమ్మట, లోపలనున్న స్త్రీలు నాట్యమాడసాగుదురు.......ఈ స్త్రీలందరు మెడచుట్టు ననేక రత్నములు, కెంపులు, ముత్యములు, తాపిన బంగారు పట్టెడలను (కంటెలను) ధరించియుందురు. ముంజేతులకు కంకణములు, పై చేతులకు బాహుపురులు, మొలకు వడ్డాణములు నుండును (పు. 260)

ఈ వృత్తిలో స్త్రీలింత భాగ్యమెట్లు పడసిరోయని ఆశ్చర్యము కలుగును. వీరిలో కొందరు భూములు, అందలములు, అనేక పరిచారికా యువతులు ఈయబడినవారు.

వీరి వస్తువులన్నిటిని యే యొక్కడు లెక్కింపజాలడు. ఈ నగరము లోనే లక్ష వరహాలుగల నాట్యకత్తె యున్నదని వింటిని (పు. 260) నేను చూచిన దానిని బట్టి యీమాట నమ్ముచున్నాను.[24]

<u>విజయనగర వేశ్యలు-విలుబుత్తూరు పద్మముఖులు :-</u>

(1) పయస్ వర్ణనలోను, రాయుల వర్ణనలోను (1-73)వీరి ప్రధాన వృత్తి ఆలయ నైవేద్య పూజా కాలములందు స్వామి సన్నిధిలో నర్తించుటగా కనిపించును.

(2) పయస్ వర్ణించిన రథోత్సవము నాటి యూరేగింపులో వీరి పాత్ర (పు. 253) రాయలు వర్ణించిన విష్ణుచిత్తుని యూరేగింపులో వీరి చర్యను (4-35) జ్ఞప్తికి తెచ్చును

(3) విలుబుత్తూరి పద్మముఖుల కలనములు, ఆభరణములు, తెగి రాలిన హారముల యొడ నిర్లక్ష్యత, ప్రభుత చెడిన విటుని నేదుట, జీర్ణులను, అధములను వర్జించుట, ఆతపురవర్తన - ఈ యన్నిటికి మూలము వారి సంపన్నతకు, మాన్యతకు ప్రతిబింబమే.

(4) రెండవ యాశ్వాసమున మత్స్యధ్వజుడను పాండ్య 'మహావల్లభుడు' రాజోచిత వేషమున నలంకృతుడై, విండు వెన్నెలలో, తలవరులు త్రోవ చేయుగా, మధురాపురములోని రాచనగరు నుండి మరొక వీధిలో వేరుగానున్న యంతఃపురములోని భోగిని సంగతికి బాహాటముగ పోవును. ఇది పయస్ వర్ణించిన మాన్య పురుషులు నిశ్శంకముగా నచటి వేశ్యల యిండ్లకు పోవుటను తలపించును.

విలుబుత్తూరు వారి కవితా ప్రావీణ్యమును రాయలు ప్రశంసించినట్లు విజయనగర వేశ్యలను గూర్చి పయస్ వర్ణించలేదు. ఇందుకు పయస్ విదేశీయుడగుట, వారిని సన్నిహితముగా నెరుగకపోవుట, వారి భాషా కౌశలము గమనించకుండుట - కారణములు కావచ్చును. కాని విజయనగరవాసులగు తంజావూరి నాయకుల యాస్థానములోని రంగాజమ్మ మొదలగు కవయిత్రులను బట్టి విజయనగరమున గూడ నట్టి వారుండురని తోచును.

24 *Ibid - pp 234, 251, 253, 254, 256, 258, 259, 260.*

# విశేషాంశములు - అనుబంధము 5

## రాయల వీణా విజ్ఞానము

మొదటి యాశ్వాసము నందొక మారు రాయలు విలుబుత్తూరు పద్మముఖుల వీణాభ్యసనమును పేర్కొనును. (1-62) అయిదవ యాశ్వాసములో మరి రెండు మారులు వీణావాదన విశేషములను వర్ణించును. (5-147, 153)

(1) భగవద్విరహార్త యగు ఆముక్తమాల్యద వసంత ఋతు సహజమగు తుమ్మెదల పాట భరింపలేక, దానిని మాటు పరచుటకు వీణను మీటును. కాని, వీణానాదము, భ్రమర గీతికలు శ్రుతిగూడి రక్తి హెచ్చుటచే నామెకు మరింత బాధ కలిగి, వెంటనే విపంచిని మీటుట నాపి లేచును. దైవికము నెదుట యుక్తులు ఫలింపవనుచు నిట్టూర్పు నవ్వును. (5-147)

(2) ఆమె శ్రీపతి మీది గీతములపై గల ప్రేమతో వీణ నంటగా, విరహాతప్తమగు నామె చేతి వేడిసోకి, వీణమెట్ల మయినము కరుగుటవలన నామె వీణ నావలబెట్టును. (5-153)

## అచల సారికలు :-

ఈ రెండవ పద్యములో వీణమెట్ల మీద నుండు చలసారికలకు మైన మతికించి కదలకుండ జేసి అచల సారికలుగా మార్చు నూతన పద్ధతి యాచరణ లోనికి వచ్చుట కనుపించుచు. ఇందుక భిన్నముగ, ఆయా రాగములకు తగినట్లెప్పటికప్పుడు మేళవింపబడునవి చలసారికలు అచల సారికల నూతన పద్ధతి ఆముక్త రచన నాటికి ఆచరణలోనికి వచ్చి "సరస కళా ధోరణుల" నెరిగిన (సారి 1-33) రాయలచే గ్రంథస్థమైనది. ఆముక్తమునకు కొద్ది కాలము పూర్వమే రచితమైన పారిజాతములో నారదుడు, మేళవించినవి సుమ్మీ దీని మెట్ల"ని హెచ్చరించుచు, కృష్ణుని మాంసలాంసమున మోయించి, ఆగడాలు పట్టించినప్పటి వీణ (సారి 5-86) మనుచరిత్రలో "నాటకున్మేళనంబైన" విపంచి....మేళవింప గదవే లోలాక్షి దేశాక్షికిన్"

అని వరూధిని చెలికత్తెలామెను హెచ్చరించిన వీణ (మను - 3-57), చలసారికలు గలవి.[25] తిమ్మన పెద్దనల నూతన పద్ధతి నెరిగియే యుందురు. గాని, తమ కథా సందర్భమును బట్టి పూర్వ పద్ధతినే సూచించిరని. "నిస్తంద్ర ప్రతిభా" యుతుడగు రాయలు[26] (మను 2-79) తన వీణా విజ్ఞానము త్రుప్పు బట్టకుండ జాగ్రత్త వహించెనని తోచును.

ఆముక్తమున రాయలు నాలుగు విధములగు వీణలను పేర్కొనెను. (1) విలుబుఱ్ఱారు పద్మముఖుల వీణ (1-68); విష్ణు చిత్తుని యూరేగింపులోని ముఖవీణ (4-35); (3) ఆముక్తమాల్యద అచల సారికల వీణ (5-153); (4) దాసరి చాండాలికావీణ (6-7) ఇవి రాయల వీణా జ్ఞానమును సూచించును.

మాధవ గురువులగు రాఘవేంద్ర తీర్థుల పూర్వులలో నొకరగు కృష్ణయ్య వద్ద రాయలు బాల్యమున వీణ నేర్చి[27] గురుదక్షిణగా ముత్యాల రత్నాల హారమిచ్చెనట [28]

<u>రాయల సంగీత ప్రావీణ్యము :-</u>

రాయలు వీణా విజ్ఞానము గలవాడుగా మాత్రమే గాక సంగీత ప్రావీణ్యము గలవాడు. కృష్ణాపుర శాసనమాయనను "సంగీత సాహిత్య, సమరాంగణ సార్వభౌము" డని పేర్కొనుట గమనీయము [29]

---

*25 రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ - సంగీతము - తెలుగు సంస్కృతి పుట - 843 - (హైదరాబాద్ - 1983)*

*26 నిస్తంద్ర ప్రతిభ = నేరవ గల/ మాంద్యము లేని, అప్పటికప్పుడు వికాసము పొందు బుద్ధి - కొమాండూరి అనంతాచార్యుల వ్యాఖ్య. (1914) వావిళ్ల వారి వ్యాఖ్య - (1951)*

*27 Vijayanagara Sixcentenary Volum- P. 315, 1936.*

*28 ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర - సం. 7, పుట 77, 78, 1965.*

*29 Ep. Ind. Vol I, p.401 కిలాంబి రామానుజాచార్యులు, శ్రీ కృష్ణ దేవరాయలు, పు 186 - (హైదరాబాదు , 1960 .*

<u>పోర్చుగీసుల కానుక :-</u>

రాయలకు సంగీతముపైన, సంగీత పరికరములపైన గల ప్రీతి ఆయన కాలమున ప్రసిద్ధమై యుండును. కనుకనే కాబోలు నూతనాగతులగు పోర్చుగీసు అశ్వవ్యాపారులు, రాయలు తన తల్లిపేర క్రొత్తగా నిర్మించిన నాగలాపురములోని రాజభవనములో నుండగా ఆయనను దర్శించి, కానుకగా నిచ్చిన వస్తువులలో కొన్ని సంగీత వాద్యములుండెను. ముఖ్యముగా నీ వాద్యములాయనకు పరమ సంతోషము గలిగించెనని ప్రత్యక్ష సాక్షియైన పయస్ వ్రాసెను.

"Then Christovao.............gave him the letters and the things he brought for him, with which he was greatly pleased; principally with certain organs that, Christovao.............brought him [30]

వీనిలో కొన్ని సంగీత సాధనములు ఒక "క్లావికార్డ్" (Clavichord) వానిని వాయించు పరికరము ఉండెను.

(Some organs and a clavichord, and a player for them" [31]

'క్లావికార్డ్' అనగా పరిణతరూపమున "పియానోఫోర్టి"ని (Piano Forte). పోలిన సంగీత పరికరమని షార్టర్ ఆక్స్ఫర్డ్ నిఘంటువు (1970) తెలుపుచున్నది. "పియానో ఫోర్టి' యనగా అనేక తంత్రులు గల ఒక విధమైన సాధనమని బ్రౌను మహాశయుని ఇంగ్లీసు-తెలుగు నిఘంటువు (1974). దీనినిబట్టి పోర్చుగీసువారు రాయలకు కానుకగా నిచ్చిన క్లావికార్డ్ మన వీణను పోలియుండునని తోచును. అందువలననే. వీణా ప్రియుడగు రాయలకది విశేష ప్రీతిని కలిగించి యుండును.

---

*30 Sewell, F.E., Paes, p. 234.*

*31 Ibid, F. N. 2.*

# అధ్యాయము 6

## యోగి విష్ణు చిత్తుడు

అందుండుం ద్వయ సద్మపద్మవదనుండ ద్వంద్వదుర్దాంతయో
గాందూ బద్ధ మధు ద్విషద్విరదుఁడవ్యాళీఢ ధామండురు
బృందో బృంద తదంత వాగ వశనా సంజాత తజ్ఞధ్వని
స్పంద ద్వైత మతం విదాలయుడు విష్ణుర్విష్ణు చిత్తుండనన్ (1-77)

శ్రీ విలుబుత్తూరు వైష్ణవ వాతావరణమును, అచటి భాగవతులను వర్ణించిన వెంటనే కవి గంభీరమగు నీ పద్యమున భాగవత శ్రేష్ఠుడును, కావ్యమంతటికి కీలక పురుషుడును నగు విష్ణుచిత్తుని నాటకీయముగ ప్రవేశపెట్టును. ఈ కవి - కావ్య నాటకాలంకార మర్మజ్ఞుడు గదా! ప్రవేశపెట్టుచునే అతని బహుముఖ సాధనను సప్రయోజనముగ వర్ణించును.

<u>స్థూలముగా దీని భావము :-</u>

ఆ విలుబుత్తూరులో విష్ణుచిత్తుడను నతడుండును. పద్మము వంటి యతని ముఖము ద్వయ మంత్రమునకు గృహము. అతడు ద్వంద్వములు లేనివాడు. ఎదబెగని యోగమను గొలుసుతో విష్ణువనెడి ఏనుగును చిత్తమున బంధించుటచే సార్థకమైన (విష్ణు-చిత్త) పేరు గలవాడు. మహావేద సమూహమును, దాని అంతములందలి వాక్యములను (ఉపనిషత్తులను) పఠించకనే, వాని నుండియే జనింపవలసిన, స్థిరమైన, నిర్దుష్టమైన (విశిష్ట) ద్వైత జ్ఞానమునకు నెలవైనవాడు, మరియు సదాచార పరాయణుడు.

ఇది, విష్ణు చిత్తుని గూర్చిన తొలి ప్రసక్తి అయినను, కవి-మనకాయన కుల వయో రూపాదులను వివరింపక, సూటిగా ఆయన బహుముఖ వైష్ణవ సాధనను వర్ణించి, విష్ణువును చిత్తమున నెలకొల్పుకొనుట వలన విష్ణుచిత్తుడను సార్థకనామము కలవాడని తెలుపును. విష్ణుభక్తులను వారి కులమును బట్టికాక, విష్ణు సంబంధము వలననే గుర్తింపవలెనను సంప్రదాయము నిచట కవి పాటించెనని తోచును.

మనమీ పద్యమును తొలిసారిగా వినునపుడిందలి శబ్ద గాంభీర్యము, సమాస జటిలత- కొట్టవచ్చినట్లుండును. కాని కావ్యమంతటిని సావధానముగా పఠించిన పిమ్మట తిరిగి పరిశీలించినచో:-

(1) ఇది విష్ణుచిత్తుని మంత్ర, యోగ, సంవిత్, నిష్ఠలను పేర్కొను నెపమున ఆముక్తమందలి వివిధ కథలను సూచించు <u>కీలక పద్యమని-</u>

(2) ఇందలి ప్రతి పదము సార్థకమని-

(3) ఇందలి మంత్రయోగ, సంవిత్, నిష్ఠలు, ప్రాథమిక రూపములో, భిన్న సంప్రదాయములకు చెందినవని, సిద్ధాంతమునందు, క్రియయందు, పరస్పర విరుద్ధములని, పిమ్మట శీఘ్ర లక్ష్యసిద్ధి కొరకు కొన్ని మార్పు కూర్పులతో పరస్పరమను సంధింపబడినవని-

(4) వీనిని సమన్వయమ పూర్వకమగు ఆధ్యాత్మిక దృష్టితో జూచినచో నన్నియు గలసి యొకానొక విశిష్టాద్వైత పూర్ణయోగముగా రూపొందుననియు స్ఫురించును.

ఈ నాల్గు విషయములను ఈ యధ్యాయమునందు తరువాతి అధ్యాయములందు గుర్తింతము.

<u>(1) కీలక పద్యము</u>

ఈ పద్యమున బీజప్రాయముగా నిక్షేపింపబడిన ద్వయ, యోగ, సంవిత్, నిష్ఠలకు ఆముక్తమొక విపుల వ్యాఖ్య అనవచ్చును. ఒక్క గోదాకన్య వృత్తాంతము తప్ప, తక్కిన ఆముక్త కథా వృక్షమంతయు వీనినుండియే పరిణమించును.

<u>(i) ద్వయ మంత్రము</u>

శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే

శ్రీమతే నారాయణాయ నమః॥

అని దాక్షిణాత్య శ్రీ వైష్ణవుల ద్వయమంత్రము శ్రీమన్నారాయణుని (శ్రీ+మత్+నారాయణ) చరణములందు శరణము పొందుచున్నాను. శ్రీదేవితో కూడియుండు నారాయణునకు నమస్సు - అని భావము. ఈ మంత్రము అధికార

భేదము లేక, విధి నిషేధములు లేక, సర్వజనులు - సమస్త దేశ కాలములందు అనుసరింపదగిన శరణాగతి (ప్రపత్తి) ధర్మమును బోధించును. ఇది "సాధనల వైరుధ్యము" అను నధ్యాయములో తిరిగి ప్రసక్తమగును.

ప్రపన్న ధర్మమునకు దృష్టాంతముగా కవి-వరాహ పురాణము నుండి విష్ణువును గూర్చిన కైశికీ గాన మహాత్మ్యమను కథను దీసికొని, పౌరాణిక పద్ధతిననుసరించి పాడి పాడిగా యతుకబడిన దాని, ననేక స్వీయ కల్పనలతో నింపి, ఆముక్తమున 6-7 ఆశ్వాసములలో రసనిర్భరమగు చిన్న కావ్యముగా (మాల దాసరి కథ) రూపొందించెను. ఇది ఆముక్తమునకే కాక, ఆంధ్ర ప్రబంధ వాఙ్మయమునకే మకుటాయమానమగు రచనగా పేరుపొందినది. ఆధ్యాత్మిక దృష్టిలో కూడ నిది ప్రపన్న ధర్మమునకు పరమ దృష్టాంతరముగా సన్నుతి గన్నది.

(ii) యోగము

దీనిని వివరించుటకు కవి విష్ణుపురాణము నుండి ఖాండిక్య కేశిధ్వజుల కథను, అందలి అష్టాంగ యోగమును గ్రహించి కొన్ని మార్పు కూర్పులతో, 3-4 ఆశ్వాసములలో దానినొక చిన్న రసవత్ప్రబంధముగా వెలయించెను. విష్ణుచిత్తుడు యోగియనుట రాయల కల్పనలలో నొకటి. ఈ విషయమును కూడ తరువాత పరిశీలింతము.

(iii) ద్వైత సంవిత్తు:-

దీనిని విపులీకరించుటకు కవి 3-4 ఆశ్వాసములలో విష్ణుచిత్తుడు, యామునుడు - వీరిరువురు మత్స్యధ్వజ, శైవరాజుల ఆస్థాన సభలలో వాదించు వృత్తాంతములను ప్రవేశపెట్టును. (యామున చరిత్రలో రాయలు స్వీయ రాజనీతిని యామున ముఖమున నుపన్యసించును) విష్ణుచిత్త యామునుల నడవడి అంతర్యామి ప్రేరితమగుటచే, వీరి కథలు అనూహ్యమగు మలుపులతో కూడి, పాఠకుల యాసక్తి ఇనుమడింపజేయును. వీరి వాదక్రమము మనకు రాయల భువన విజయ సభలో నడచిన వాద వైఖరులను కండ్లకు గట్టినట్లు ప్రదర్శించును.

(iv) విష్ణు

దీనిని దృష్టాంతీకరించుటకు కవి-విష్ణుచిత్తుని చర్యను విస్తరించి, దానిని

రెండువిధములుగా ప్రదర్శించును. అందు మొదటిది - విలుబుత్తూరు మున్నవారు- విష్ణుని గూర్చిన మాలికా కైంకర్యము (1-78) ఆలయము నూడ్చుట, తీర్థ జలమును తెచ్చుట, మొదలగు భవన దాస్య వృత్తాంతము. (2-91-92) రెండవది అతిథి భాగవతులకన్ని ఋతువులలోను ప్రతిదినము నడిరేయి వరకు వారేమి కోరిన నాయా రుచ్యన్న పానాదుల నర్పించి సంతుష్టులను జేయుట (1-79-85) 7వ యాశ్వాసములో రంగనాథస్వామి విష్ణుచిత్తుని కుమార్తెయగు గోదా కన్యను అతని అనుమతి కోరకయే తన శుద్ధాంతమున జేర్చుకొనుట సదాచారము కాదని, అన్యాయమని, విష్ణుచిత్తుడడ్డ పెట్టుట- తుదకామె వివాహమును విలుబుత్తూరులో తన యింట సశాస్త్రీయముగా నిర్వహించుట మొదలగు కథకూడ విష్ణుచిత్తుని సదాచార పరాయణతకు విపులీకరణయే!

**<u>రెండు ప్రశ్నలు</u>**

ఇచట మనకు రెండు ప్రశ్నలెదురగును.[1] ఈ పద్యమున ఇన్ని కథలను సూచించిన కవి - కావ్య నాయికయగు గోదా కన్య చరిత్ర నేల వదలెను? [2] ఆమె పెండ్లి కథను తనకు ప్రియమగు కృతిగా వినిర్మింపుమను నాంధ్ర విష్ణునానతి ననుసరించి ఆముక్త రచనకు బూనుకొన్న రాయలా కథతో సంబంధములేని ఇతర కథల నేల ప్రవేశపెట్టెను? దీనికి దిగువ సమాధానము లూహింపనగును.

(i) <u>మొదటి ప్రశ్న</u> :- ఆముక్తమాల్యద కథను చెప్పుమని ఆంధ్ర విష్ణువే వాచ్యముగా నాదేశించినందువలనను

(ii) ఆ ప్రకారమే కవి కథారంభమున నాముక్త మాల్యదా ప్రబంధమును విన్న వింపబూనితినని తెలిపినందువలనను ఆమె కథనీ పద్యమున తిరిగి సూచింపనవ సరము లేకపోయెను.

---

1. *"ఎవ్వని గూర్తునన్ను, వినే మేమును దాల్చిన మాల్యమిచ్చునప్పిన్నది మందమున పెండిలిసెప్పుము" = 'హ విన్నవింపబూను నాముక్త మాల్యదా మహా ప్రబంధమునకు గ దా క్రమంబెట్టిదనిన" (ఆము. 1-14-, 150)*

2 *సాత్వస్మిన్పరమ ప్రేమ రూపా: సా పరానురక్తిరీశ్వరే. నారద, శాండిల్య భక్తి సూత్రములు - (1-2; 1-2)*

(iii) మరియు-ఆముక్తమాల్యద అవలంబించిన దివ్యవధూ ప్రేమ యోగము (Bridal-Mysticism) లేక ఆధ్యాత్మిక పరిణయ యోగము (Spritual-Marriage) విష్ణుచిత్తుని సాధన పరిమితిలోనిది కాదు. ఆమె ప్రతిచర్య ఏదో విచిత్ర చర్యయని, ఆమె తపశ్చర్య తన తపశ్చర్యవంటిది కాదని, అదేదో యున్మాదము గానోపునని, విష్ణుచిత్తుడు - తాను కొలుచు విలుబుత్తూరు స్వామికి తన మనో నిర్వేదనను విన్నవించును. (5-157) విష్ణుచిత్తుని సాధన పరిధిలో నిముడని గోదా కన్య సాధన నతని సాధనలను గూర్చిన పద్యమున సూచింపకుండుటయే ఉచితము.

(2) రెండవ ప్రశ్న :-

దీనికి సమాధానముగా ఇంతకు బూర్వమే యధ్యాయారంభమునందు రాయల సమగ్ర దృష్టి - అను శీర్షిక క్రింద తెలిపిన విషయములనే మరికొంత వివరింపవలసి యున్నది.

ఆంధ్ర విష్ణువు వినముచ్చట పడిన ఆముక్తమాల్యద ఆత్మపరిణయ యోగము అవివాహితలగు బాలికల స్వభావమున కనుకూలమైనది. అది శ్రీ వైష్ణవ మోక్ష సాధనలలో నొక్కటి మాత్రమే. ఆ మతమున వివిధ స్వభావములు గల భక్తుల కనుకూలములగు పలు విధములగు సాధనలకు స్థానము కలదు. భక్తి అనగా పరమ ప్రేమ, పరానురక్తి యగుటచే భక్తి సాధనలు హృదయ సంబంధములు దీనికి తోడు మతమునకు భక్తి ప్రాణము, తత్త్వము కవచము, సమగ్ర దృష్టి గల రాయలు- శ్రీ వైష్ణవ- విశిష్టాద్వైత విభాగములను రెండింటిని సాకల్యముగా నెరిగిన వాడు, వానియందు మితాభినివేశము గలవాడును నగుటచే తన మత స్వరూపమును సమగ్రముగా ప్రదర్శింపనిదే ఆయనకు తృప్తి కలుగదు. అందుచేతనే ఆయన ఆముక్తమాల్యద యొక్క, అమాయక ఆత్మ నివేదన మాధారము చేసికొని శ్రీవైష్ణవ కర్మ, జ్ఞాన, భక్తి ప్రపత్తి మార్గముల నైదు ఆఖ్యానములలో కావ్యమున ప్రదర్శించెను.

(1) వీనిలో విష్ణుచిత్తుని భగవద్భాగవత కైంకర్యము శ్రీవైష్ణవ సాంప్రదాయిక కర్మమార్గమునకు దృష్టాంతము.

(2) అతని అపరిమిత వేద, వేదాంత జ్ఞానము, యామునాచార్యుడు ఆచార్య

కులమున నభ్యసించిన వేదశాస్త్ర ముఖ్యవిద్యలు. విశిష్టాద్వైత జ్ఞానమార్గమును సూచించును.

**(3)** కేశి ధ్వజుడు ధ్యానయోగములో నతీంద్రియమగు విష్ణు రూపమును చిత్తమున నిలుపుకొనుట వైష్ణవ భక్తియోగమునకు నిదర్శనము.

**(4)** ఏను ఫలంబెరుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబ, యాజ్ఞా కైంకర్యం బులకు ననుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణ గణన ప్రపన్నుల కెక్కడియది? . . . . .భగవంతుండ రక్షించుననెడి దాసరి మహనీయ వృత్తాంతము శ్రీవైష్ణవ ప్రపన్న ధర్మమునకు పరమోదాహరణము.

ఈ భక్తులలో విష్ణుచిత్తుడే ఏడేడు తరముల నుండి ఆలయ కైంకర్యమున కంకితమైన వేయర్ కుల బ్రాహ్మణుడు [3] ఆముక్త మాల్యద ఒక చిన్నారి శ్రీవైష్ణవ బాలిక. కేశిధ్వజుడు రాజ్యపాలన, అరాతి హనన మొనర్చు నిమివంశ క్షత్రియ ప్రభువు. యామునుడాచార్య కులమున వేదశాస్త్ర ముఖ్య విద్య లభ్యసించిన వటువు. పిరుతవాడే పాండ్యరాజు సభావాదమున నుద్దండ పండితుల నోడించి రాజదత్తమయిన అర్ధరాజ్యమును భోగోన్ముఖుడై ఏలిన రాజనీతిజ్ఞుడు. [4] తుదకు రంగనాథభక్తుడయి

---

3 *ఎన్దై, తన్దై, తన్దై, తన్దై తమ్మూత్తప్పనేழ్ పడికాల్ తొడంగి, వన్దువళి, వళి, యాట్చెయ్, గిన్ద్రోమ్ (నేనును, నా తండ్రియును, వారి తండ్రియు, వారి తండ్రియు, వారి తండ్రియు, వారి తండ్రియు, తాతయు, ఏడు తరములు మొదలుకొని, ప్రయోజనాంతర రహితులమై వచ్చి దాస్యము చేయుచున్నాము).*

*తిరుప్పల్లాండు -6. కే.టి.యల్ నరసింహాచార్యుల టీక 1976- వేయర్ తజ్గళ్ కులత్తు దిత్త విట్టు శిత్తన్ మనత్తే.... వేయర్ శాఖ యందుద్భవించిన విష్ణుచిత్తుని మనస్సున ... పెరియాళ్వారు తిరుమొళి - 5.4.11 - అణ్ణంగరాచార్య స్వామి ఆంధ్ర టీక. కాంచీపురము. 1968.*

4 *యామున ప్రభుని రాజనీతిని రాయలు 81 పద్యములలో విస్తరించి చెప్పెను. (4-205-205) నిజమునకిది రాయల స్వానుభవముతో కూడిన రాజనీతి శాస్త్ర గ్రంథములలోని విషయము.*

సన్యసించి, విశిష్టాద్వైత సిద్ధాంతమునకు పునాది నిర్మించిన ఆచార్య పురుషుడు. ఇక మాల దాసరి. కురుంగుడికి మూడామడల దూరమున నుండు పల్లెలో నివసించెడి పేరుకొనరాని కులమువాడు. (6-3) కులము వలన కలిగిన ఫకల జనదయనీయ మగు పరమార్తికి, నైచ్యమునకు లోబడి, గుడి బహిరావరణ యందే నిలచి, (6-10) ఎండ, గాలి, ఆకలి, లాకును సరకు చేయక చెక్కిళ్ళ నానంద బాష్పములు కప్పగా, చిన్న తంబురను మీటుచు, గుండెలు నీరగునట్లు నుతులు పాడి ఉద్యత్తాండవమాడు పరమ ప్రసన్నుడు (6, 7)

రాయలు వీరందరి చరిత్రలను ఆముక్తమున గుదిగ్రుచ్చుటచే, భిన్న కుల, వయో, స్వభావములు గల స్త్రీ పురుష సాధకుల కనుకూలమగు శ్రీ వైష్ణవ భక్తి సాధనల సార్వజనీనతను, వానికి ప్రాతిపదికయగు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రాశస్త్యమును, కావ్యరూపమున తెలుగువారికి తెలుపగలిగెను. మఱియు రాయలీకథల ద్వారా ఔత్తరాహ భాగవత మతమును (విష్ణుపురాణములోని ఖాండిక్య కేశిధ్వజుల కథ, వరాహ పురాణములోని మాల దాసరి వృత్తాంతము) దాక్షిణాత్య శ్రీ వైష్ణవముతో (విష్ణుచిత్త, యామున, గోదాగాథలు) సమబంధింప గలిగెను. అట్లే ఆళ్వారుల హృదయభక్తిని (విష్ణుచిత్త - గోదా కన్యలు) ఆచార్యుల తత్త్వ చింతనతో (యామున) మేళవించగలిగెను. మరియు వైష్ణవ భక్తికి అష్టాంగ యోగ సాధనము జతపరచగలిగెను. (కేశిధ్వజ)

విష్ణుచిత్తుని బహుముఖ సాధన దివ్యసూరి చరితమునగాని, పరమయోగి విలాసమునగాని లేవు. అట్లే కేశిధ్వజుని జ్ఞానము, యోగము, దాసరి ప్రపన్న ధర్మము వానిలో లేవు. రాయలు శ్రీ వైష్ణవ - విశిష్టాద్వైతముల సమగ్ర రూపమును స్ఫురింపచేయుటకు వీని నాముక్తమున చేర్చెననుట స్పష్టము. నిజమున నాముక్తమాంధ్ర పంచ కావ్యములలో చరమ స్థానమునకు చెందిన సాహిత్య ప్రక్రియయే గాక, వైష్ణవుల ఆధ్యాత్మిక సాధనల కొక చిన్న కోశ గ్రంథమన దగియున్నది.

# అధ్యాయము 7

## ప్రతి పద సార్థక్యము

ఇపుడిక 'అందుండున్' అను పద్యములోని ప్రతిపద సార్థక్యమును గుర్తింతము.

**(1) అందుండున్ :-**

ఎందుండును? ఇంతకుముందు వర్ణింపబడినట్లు, వైష్ణవ వాతావరణము వ్యాపించిన శ్రీ విల్లిబుత్తూరులో అతిథి భాగవతార్చనాపరులగు భాగవత సమాజమునందు (1-76) అని కవి భావము. ఈ చిన్న పదము పూర్వోత్తర కథల ననుబంధించును. విల్లిబుత్తూరు విష్ణ్వాలయ మచటి ప్రకృతిని, పక్షి మనుష్య ప్రవర్తనను - ప్రభావిత మొనర్చుట - అచటి వైష్ణవ వాతావరణము విష్ణుచిత్తుని బహుముఖ సాధనకు పూర్వరంగమగుట - మొదటి యధ్యాయమున విపులముగ జూచితిమి.[5]

2. ద్వయ పద్మ:- (ద్వయ మంత్రమునకు గృహము వంటిదియు) ఈ మంత్ర పాఠము నిదివరకు గమనించితిమి. కవి దీనిని విష్ణుచిత్తుని సాధనలలో ముందుగా పేర్కొనుటలోను, ఆయన ముఖమీ మంత్రమునకు గృహమగుటలోను గల యౌచిత్యమును, సార్థక్యమును గమనింతుము.

(1) ఈ మంత్రము దాక్షిణాత్య శ్రీవైష్ణవులకు ముఖ్యమగు తిరుమంత్రము (నారాయణ అష్టాక్షరి) ద్వయ మంత్రము, చరమ శ్లోకము. (సర్వధర్మాన్పరిత్యజ్య) అను

---

5 *దివ్య ప్రబంధ యుగాన్వలు: దేవునింటి దుప్పి పిల్ల: అతిథి భాగవతార్చన: పాచికలాడు పద్మముఖులు: శ్రీకార్యపరులు: స్పందన ద్వంద్వము: కేళివన కుంజ గర్భములు అలయు దుందుంభి కాహళులు: సుగంధి యరటి గెలలు: తావ్రతయ హారముగు గుడి గాలువులు: విమాన పతాక మువ్వల మ్రోత.*

రహస్యత్రయము లోనిది.[6] వానిలో ఇదియొక్కటే సమస్త జనులు సర్వకాల సర్వావస్థలలోను, విధి నిషేధములతోగూడి, కొన్ని వేళలందు మాత్రమే యనుసంధింపదగినది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' - అను గీతా చరమ శ్లోకము భగవంతుని అభయ వచనము, చేతనుని శరణాగతి నివేదనము తెలుపదు. అందుచే మంత్రత్రయములో ద్వయమంత్రమే సాధకుని శరణాగతికి నిరంతరానుష్ఠాన రూపము కనుకనే పూర్వాచార్యులతో సహా శ్రీ వైష్ణవుల విశేషాదరము పొందినది.[7] "సర్వ కాలం

---

6 *రహస్యత్రయము:- దీనిలో మొదటిది. 'ఓం నమో నారాయణాయ' అనునది. దీనినే తిరుమంత్రమని, మూల మంత్రమని, మంత్రరాజమని, నారాయణ అష్టాక్షరి అని అందురు. ఇది చేతనుడు నారాయణునకు స్వ వినియోగార్హమగు స్వరూపము. (శేషత్వము) గలవాడని బోధించును. (2) ఇంతకు పూర్వముదహరించిన ద్వయ మంత్రము రెండవది. ఇది శ్రీ మన్నారాయణ.... 'శ్రీమతే నారాయణాయ' అను రెండు ఖండములచే నేర్పడుటచే ద్వయమని ప్రసిద్ధి చెందినది. దీనిని మంత్ర రత్నమని కూడా అందురు. దీని వలన ముముక్షువు సిద్ధోపాయమగు శ్రీమన్నారాయ ణుని శరణాగతిని పొందును. ఇది శ్రీ వైష్ణవ ప్రపత్తికి అనుష్ఠాన రూపము. ఈశ్వరుడగు నారాయణుడు దయామయి యగు శ్రీదేవితో నిత్య సంయుక్తుడై యుండి (శ్రీ+మత్+నారాయణ), ఆమె పురుషకారము (సిఫార్సు) ననుసరించి, చేతనుని యపరాధములను క్షమించి అతనికి మోక్షము నిచ్చును. 3. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ! అహంత్వాసర్వ పాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః" అనునది మూడవది. ఇది అర్జునుని గూర్చిన శ్రీ కృష్ణుని అభయ వచనము (భ.గీ. 18.66) సాంఖ్యయోగాది ఉపాయాం తరములను తెలిపి, తుదకు శరణాగతిని బోధించుటచే నిది చరమ శ్లోకమని ప్రసిద్ధి పొందినది. ఇట్లే రామాయణ మందొక శ్లోకమును గూడ శరణాగతి మంత్రముగా భావింతురు. వైష్ణవ సంప్రదాయమున విష్ణు గాయత్రి, వాసుదేవ ద్వాదశాక్షరి, విష్ణుషడక్షరి మొదలగు అనేక మంత్రములున్నను, వానిలో రహస్యత్రయమని పైన పేర్కొన్న మూడు మంత్రములే శ్రేష్ఠములని సంప్రదాయజ్ఞుల మతము. పిళ్లై లోకాచార్యుల ముముక్షుప్పడి (తమిళము) అళ్లసింగరాచారి తెనుగు టీక. 1-8-10 - కాంచీపురము 1949).*

7 *అదే ముముక్షుప్పడి*

క్షేపేన ద్వయం" అని వేదాంత దేశికులు - ఇట్లు నిరంతరముగా ననుసంధింప దగిన దగుటచే విష్ణుచిత్తుడు దానినెల్లపుడు స్మరించుచుండును. అతని ముఖము ద్వయ మంత్రమునకు గృహమనుటలోని మొదటి యౌచితి ఇది.

<u>2. మలొక యౌచితి:-</u> శ్రీవైష్ణవ మోక్షోపాయములలో కర్మ, జ్ఞాన, భక్తి మార్గములు సాధ్యోపాయము లనబడును. వీనిలో మానవ యత్నము ప్రధానము. ఈ సాధనల ఆది, మధ్య, అంతములలో కలుగు అవరోధముల నధిగమించుటకు గాని, మోక్షము నిచ్చుటకు గాని, మానవ యత్నములగు సాధ్యోపాయములు స్వయముగా నశక్తములు. అందుకు సిద్ధోపాయమగు శ్రీమన్నారాయణుడే సమర్థుడు. అట్టి నారాయణుని గూర్చిన శరణాగతి ద్వయ మంత్ర మనుష్ఠాన రూపము. ఇట్లది విష్ణుచిత్తుని సమస్త సాధనలకు కీలకమగుటచే కర్మలకు (యోగధ్యాన), (సంవిత్-నిష్ఠలకు) ముఖ పతాకగా స్థాపించెను. ద్వయ మంత్రమును తక్కిన సాధనలకు ముందుగా పేర్కొనుటలోని రెండవ యౌచితి, ప్రయోజనము ఇది.

<u>(3) పద్మవదనుండు :-</u> (పద్మము వంటి ముఖము కలవాడు) ఇందలి 'పద్మ' 'వదన' శబ్దములు రెండును సప్రయోజనములే వీనిలో 'వదన' శబ్దౌచితిని ముందు చూతము.

<u>(i) వదనుండు:-</u> (ముఖము కలవాడు) 'వద' ధాతువు 'చెప్పుట' అనునర్థము కలది. 'వద' నుండి యేర్పడినది. వదనము. వదించునది వదనము [8] ద్వయ మంత్రమును వదించుటయే ముఖ్య లక్షణముగా గల విష్ణుచిత్తుని ముఖమును కవి వేరొక శబ్దముతోగాక 'వదన' శబ్దముతో నిర్దేశించుట లోని సారస్యమిది.

<u>(ii) పద్మ :-</u> (పద్మము వంటి) సాధారణముగా కవులు శ్రీ ముఖమును పద్మముతో పోల్చుదురు. ఇచట విష్ణుచిత్తుని ముఖమును పద్మముతో పోల్చుటలో కవియుద్దేశించిన విశేషమేమి? - విష్ణుచిత్తుని ముఖము ద్వయ మంత్రమునకు గృహము వంటిదని చెప్పిన వెంటనే, కవి దానిని పద్మముతో పోల్చుటచే - ఈ యుపమానము ద్వయ

---

8 వద్యనేన వదనం, వద్వక్త్రాయాం వాచి - అని గురుబాల ప్రబోధిక

మంత్రాను సంధానముతో సంబంధించిన దనుట సమంజసము. ఈ మంత్రోద్దిష్టమగు శరణాగతి వలన విష్ణుచిత్తుడు తన సమస్త భారములను శ్రీమన్నారాయణుని చరణ సన్నిధిని న్యాసము [9] చేయుటవలన కలిగిన పరితృప్తి - ఆయన ముఖమును పద్మమువలె వికసింపచేసి, ప్రసన్న వర్చస్సును ప్రసరింపజేసినని ధ్వని. కవి ఈ వర్చస్సును మరువక మూడవ యాశ్వాసములో విష్ణుచిత్తుడు పరతత్త్వ నిర్ణయవాదమున పాల్గొనుటకై పాండ్యరాజ సభలో ప్రవేశించునప్పుడు - మరల ప్రసక్తించును. రాజు, ఆయన సభాసదులు విష్ణుచిత్తుని చూడగనే ఆయన వర్చస్సుచే చకితులై లేచి యెదురుకోలుగా నిలచిరట. " . . . . తానతన్వాళ్ల వ్వలుడౌట భూపతియు సభ్యవ్రాతమున్ శంకనై ప్రత్యుత్థానము జేసి నిల్వగ . . . . ." (3-23)

ఒక పూర్వ తమిళ ప్రశంసలో గూడ పాండ్యరాజు, అతని సభ్యులు - సభలో ప్రవేశించెడి విష్ణుచిత్తుని సన్మానించిరని కలదు.

"పాణ్డియన్ కొణ్డాడప్పట్టర్ పిరాన్ వన్దా నెను
ఈణ్డియ శఙ్గ మెడుత్తూద"

పాండ్యరాజు కొనియాడుచుండగా, భట్టనాథులు (విష్ణుచిత్తుడు) వచ్చిరని (సభ్యులు) శ్రేష్ఠములగు శంఖములనెత్తి యూదగా - అని భావము.

(4) <u>అద్వంద్వ్యదశ్రాంత, యోగాందూబద్ధ</u>

<u>మధుద్విపద్విరదు, దన్వర్థాభిధానుండు</u>

జంటలు లేనివాడును, ఎడతెగని (బడలికలేని యోగము గొలుసుతో (తన చిత్తమున) బంధించిన మధు విరోధి (విష్ణువు) అనెడి ఏనుగు గలవాడును, (అందుచే) సార్థకమైన పేరు గలవాడును).

---

9 *(1) అనుకూల్య సంకల్పము. (2) ప్రాతికూల్య వర్జనము (3) మహా విశ్వాసము (4) గోప్తృత్వ (రక్షక) వరణము (5) కార్పణ్యాను సంధానము. (నిస్సహాయత) (6) భరన్యాసము (భార సమర్పణము) అను షడంగములు గల యోగమును శరణాగతి యందురు. వీనిలో మొదటి అయిదు అంగములు, ఆరవది అంగి.*

ఇందలి ప్రతి పదము సార్థకమై సారస్యమును వెలార్చుచున్నది. మఱియు ఈ వర్ణన రాయల యోగశాస్త్ర ప్రావీణ్యమును, లోకజ్ఞతను చాటుచున్నది.

<u>(4-1) అద్వంద్వుడు :-</u> = (జంటలు లేనివాడు)

ఇచట శబ్దమునకు, అర్థమునకు, సంబంధించిన రెండు చమత్కారములు స్ఫురించును.

<u>శబ్ద చమత్కారము:-</u> విష్ణుచిత్తుని ముఖము ద్వయమునకు (ద్వంద్వతకు) నెలవైనది. (ద్వయ పద్మ) - అనిన వెంటనే, అతడు ద్వంద్వములు (ద్వయత) లేని వాడనుట శబ్ద చమత్కారము.

<u>అర్థ చమత్కారము :-</u> అద్వంద్వమనగా, ద్వంద్వములు (జంటలు) లేనివాడనుట సరే. లేక శారీరక శీతోష్ణాదులా? ఉభయములునా? కవి హృదయమేమి?

ఇందుకు సమాధానము - మనమీ పద ప్రయోగ పూర్వాపరముల ననుసరించి గ్రహించుట యుక్తము. 'అద్వంద్వుడు' అని ఎడతెగని యోగమును గొలుసుతో అనగా ధ్యానపరంపరతో విష్ణువనెడి యేనుగును (చిత్తమున) బంధించినవాడని (బద్ధమధుద్విషద్ద్విరదుడు) అని వర్ణితము. అందుచే విష్ణుచిత్తుని అద్వంద్వత అతని అశ్రాంత యోగమునకు సంబంధించినదని గ్రహించుట న్యాయము. విష్ణుచిత్తుని యోగాభ్యాసమున అద్వంద్వతకు గల స్థానమును పరిశీలించినచో నిది స్పష్టపడును. ఈ యోగమెట్టిది?

విష్ణుచిత్తుడీ యోగమును మూడవ యాశ్వాసమున కేశిధ్వజుని ముఖమున విశదీకరించును [10] అది యమ నియమముల నుండి ప్రత్యాహారము వరకు- (3-74,75) పతంజలి యోగము ననుసరించును. అహింసా స్వాధ్యాయాది

---

*10 పతంజలి యోగమే కేశిధ్వజుని యోగమునకు ప్రాతిపదికయని దానిని విష్ణుచిత్తుడామోదముతో పాండ్య రాజుకు పదేశించుటచే నదియే విష్ణుచిత్తుని యోగము కూడ అనియు సాధనల వైరుధ్యము, సమన్వయము అను పర్యాయమున చూడగలము.*

యమనియమముల వలన యోగి మనో నైర్మల్యములను సంపాదించుచు, శరీర స్థైర్య సిద్ధి కొంకేదో యొక భద్రాసనము నవలంబించి, ప్రాణాయామము వలన ప్రాణాపానాది పవనములను వశపరచుకొనవలెనని కేశిధ్వజుడు తెలుపును. (3-75) ఈ భద్రాసనమునే పతంజలి స్థిర సుఖమాసనమ్" అని నిర్వచించును. (యో.సూ. 2.46) పతంజలి యోగాభ్యాసములో శరీర ప్రయత్నమును సడలించుట వలనను, అనంతమున గూర్చిన ధ్యానమువలనను, ఆసనపరిమితి సిద్ధించును. "ఆసన జయము వలన యోగి "ద్వంద్వము" లచే అనభిఘాతుడగును. [12](కొట్టబడని, బాధింపబడని) (Un-Assailed- Yoga system of Patanjali J.H. Woods, p. 192, Harvard University- 1966) అనంత సమాపత్తిని, అద్వంద్వతను వివరించుచు - భాష్యకారుడగు వ్యాసుడు :- ఆ స్థితిలో - (i) శరీరము శవమువలే ప్రయత్నరహితమై, (ii) మొదట భూమికి తాపబడినట్లు, పిమ్మట తన యునికియే లేనట్లు - అనంతాకాశములో లీనమైనట్లు తోచుననియు (iii) శీతోష్ణక్షుత్పిపాసాది ద్వంద్వ స్పృహలు లేక జడమువలె నుండుననియు - తెలుపును. ఇట్టి శరీర బాధలచే అవిచలితుడు గానిదే యోగి తరువాతి యోగాంగములలో మానసిక ధారణ ధ్యానముల నవిచ్ఛిన్నముగా సాగింపనేరడు.

ఇచటి 'అద్వంద్వ' పదమును అనంతర సమాసములో (అశ్రాంత యోగానందాబద్ధ) నన్వయించి చూచినచో - (1) విష్ణుచిత్తుని 'అద్వంద్వ' స్థితి యిట్టిదేననియు (2) అద్వంద్వ పదమిచ్చట పతంజలి యోగతంత్రమున శీతోష్ణాది శారీరక బాధలు లేకుండుటను తెలిపెడి పారిభాషిక పదమనియు స్పష్టపడును. 'అద్వంద్వ పద సార్థకత ఇది.

ఇక విష్ణుచిత్తుని యోగమును గొలుసుతో పోల్చుటలోని యౌచితిని పరిశీలింతము.

---

*11* ప్రయత్న శైథిల్యానంత సమాపత్తిభ్యామ్ *(యో. సూ. 2-47)*

*12* తతో ద్వంద్వా నభిఘాతః *(యో.సూ. 2-48)*

(4- iii) <u>అక్రాంత యోగాందూబద్ధ మధుద్విషద్ద్విరదుడు</u> = ఎడతెగని, బడలికలేని యోగమనెడి గొలుసులతో బంధింపబడిన మధు విరోధి (విష్ణువు) అనెడి యేనుగును కలవాడు).

ఈ సమాసములో పూర్వభాగము నందున్న, అక్రాంత యోగ - అందూబద్ధయను నాల్గు పదముల సార్థకతను మొదట పరిశీలింతము. వీనిలో యోగ శబ్దము కీలకము. దీని అర్థమును నిర్ధేశించినచో తక్కిన వాని సార్థకత విశదపడును.

<u>యోగ :-</u> (యోగమనెడి) విష్ణుచిత్తుని యోగము కేశిధ్వజాని యోగము ననుసరించుననీ, కేశిధ్వజాని యోగము పతంజలి యోగముననుసరించుననియు - ఇంతకు పూర్వము గమనించితిమి. పతంజలి నిర్వచనము ప్రకారము యోగ శబ్దము యమ నియమాది సమాధి పర్యంతముగల యోగ-అష్టాంగములకు సామాన్య వాచకము[13] కాని, వీనిలో ధ్యేయ వస్తువును చిత్తమున బంధించుట కుపకరించెడి అంగములు ధారణ, ధ్యానములు మాత్రమే. ప్రస్తుతము యోగము వలన విష్ణువును చిత్తమున బంధించుటయే తెలుపబడినది. అందుచే సందర్భమును బట్టి ఇచట యోగమనగా ధారణ ధ్యానములనగా నేమో చూతము.

<u>ధారణ, ధ్యానములు:-</u> (1) పతంజలి యోగ తంత్రమున చిత్తమును ఏదేని ఒకే ప్రదేశమున గాని, వస్తువునందుగాని బంధించుట ధారణయగును.[14] ఆ వస్తువునందే తదేకముగు జ్ఞానమును ప్రవహింపజేయుట ధ్యానము.[15]

(2) కేశిధ్వజాని యోగములో కూడ యోగి ధారణా, ధ్యాన విషయమగు విష్ణుని శుద్ధ స్థూలరూపము (ఆము-3-84) నందలి ఒక్క యంగమే ముందుగా తన మనస్సున

---

*13 యమ- నియ-మాసన-ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధ యోష్టావంగాని యోగః (యో.సూ.2.29)*

*14 దేశ బంధశ్చిత్తస్యధారణా - (యో.సూ.3.1) దేశ మనగా యోగి శరీరమందలి భాగముగాని, వేరైన బాహ్య ప్రదేశము గాని, వస్తువుగాని, అని వ్యాఖ్యానము.*

*15 తత్ర ప్రత్యయైక తానతాధ్యానమ్ (యో.సూ.3.2)*

చిక్కునట్లు భావించుము. ఈ సర్వాంగముల భావన వలన నేర్పడిన సకల మూర్తిని యోగి తాను నడచినను, ఊరక యున్నను, మానక ఏదైన చేయుచున్నను,తన మదిని పాయకుండునట్లు స్థిరపరచుకొనును. (ఆము. 3-86) ఇట్లు (1) ధ్యేయ వస్తువు నెడతెగక భావించి, (2) దానిని చిత్తమున స్థిరపరచుకొనెడి ధారణాధ్యానముల లక్షణము పతంజలి, కేశిధ్వజాల యోగములు రెండింటికి సమానము.

<u>అశ్రాంత (ఎడతెగని/ బడలిక లేని)</u>

అశ్రాంత పదమీ రెండర్థములు కలది.[16] అది యిచట యోగ శబ్దమునకు విశేషణము (అశ్రాంతయోగ) యోగమనగా నిచట ధ్యానమని, ధ్యానమనగా ధ్యేయ వస్తువునందు తదేకముగా జ్ఞానమును (ఎఱుకను) ప్రవహింపజేయుటయని చెప్పికొంటిమి. ఈ దృష్టిలో అశ్రాంత శబ్దము :- (1) ఎడతెగని అను నర్థమున విష్ణుచిత్తుని విష్ణురూప, ధ్యానమునకు ముఖ్య లక్షణమగు తదేక జ్ఞాన ప్రవాహమును తెలుపుటచే సార్థకమగుచున్నది. మఱియు బడలికలేని యను నర్థమున కూడ నీ పదము విష్ణుచిత్తుని ధ్యానము, శీతోష్ణాది ద్వంద్వములచే అనభిఘాతమని రూఢిపరచుటచే సార్థకమగుచున్నది.

<u>అందూ :-</u> (గొలుసులతో) ఈ పదమువలన కవి విష్ణుచిత్తుని యోగము (విష్ణురూప ధ్యానము) నందు గొలుసు నారోపించును. గొలుసు నిర్మాణము అనేక చిన్న చిన్న లోహపు లంకెలను వరుసగా నొకదానితోనొకటి లగించు క్రియవలన జరుగును. ఇంతకుముందు తెలిపినట్లు ధ్యానములో విష్ణుని సకలమూర్తి సాక్షాత్కారము కూడ అతని యంగముల నొక్కొక్క దానినే చిత్తమున చిక్కబట్టి వానిని పరస్పరమను బంధించు ధ్యానక్రియ వలన కలుగును. విష్ణుచిత్తుని ఎడతెగని యోగము (అంగాంగ ధ్యానము) నందు లంకెలతో కూడిన గొలుసు నారోపించుటలోని సారస్యమిది.

---

16 *అశ్రాంత - (1) న విద్యతే శ్రాంతిః యస్మిన్ తదశ్రాంతం దీని యందు విశ్రాంతి లేదు. (2) న శ్రామ్యత్యత్ర అశ్రాంతం శ్రములవని భేదేన - దీని యందు బడలిక లేదు అని గురు బాల ప్రబోధిక.*

గొలుసులోని లంకెలను విష్ణురూపమందలి అంగములుగాను, లంకెలను బిగించుట అంగముల నను బంధించుటగాను భావింపనగును.

<u>బద్ధ మధుద్విషద్ద్విరదుడు :-</u> (బంధింపబడిన మధు విరోధి (విష్ణువు) అనెడి ఏనుగును గలవాడు.) ఇచటి 'బద్ధ' అనుపదము ధారణము గూర్చిన పతంజలి నిర్వచనము (దేశబంధశ్చిత్తస్య ధారణా) లోని బంధ శబ్దమునకు ప్రతిధ్వనియే.

ఇచట బంధింపబడునది విష్ణుని 'అమూర్త రూపము' ఇది సమస్త శక్తులకు ఆశ్రయమైనది. అతి మహాత్మ్యముతో వెలుగునది, యోగి హృద్ధ్యేయ మాత్రమైనది. (3-82) ధారణా ధ్యాన విషయమైన విష్ణుని శుద్ధ స్థూల రూపాంతరము (3-84) [17] అనగా రజస్తమో గుణములతో మిశ్రమము కాని శుద్ధ సత్వముతో నిర్మితమైనదని భావము. ఈ రూపము త్రిగుణ మిశ్రమమగు మన ప్రకృతి మండలములో మూర్తి కట్టినది కాదు. శుద్ధ సత్వమయమగు పరమ పదమున నుండునది. నిరవధిక తేజోరూపము గలది [18] చర్మ చక్షువులకు కనుపించునది కాదు. యమ నియమాదుల వలన నిర్మలమై, శుభాశ్రయమున నుంచిన యోగి మనస్సు (3-77) నందు ది స్వల్పకాలము ప్రతిబింబింప వచ్చును. కాని దానినచట స్థిరముగా నిలుపుకొనుట దుష్కరము. కవి ఈ దుష్కరత నేనుగును గొలుసుతో బంధించు దుష్కరతతో పోల్చును. ఏనుగునకును, విష్ణువునకును బృహత్కాయము (విష్ణువు విశ్వరూపి), సత్వగుణము, మహాబలము సామ్య గుణములగుటచే ఈ పోలిక యౌచితి స్ఫోరక మగుచున్నది.

---

*17* ..... *విష్ణు సంజ్ఞానకు యోగి హృద్ధ్యేయమై యొప్పు నమూర్త రూపంబొండు.... సమస్త శక్తులకెల్ల నాశ్రయత బొంది... యతి మహాత్త్వంబుచే వెల్గు; ధారణా ధ్యాన విషయంబై శుద్ధంబగు స్థూల రూపాంతరం బయ్యునంతయునకు గలదు. (ఆము-3,82, 84)*

*18* *నిగమాన్తాన్ శుద్ధ సత్త్వాత్మకమాయ్... నిరవధిక తేజో రూపమాయ్.... యోగి ధ్యేయమాయ్ - పిళ్లై లోకాచార్యుల తత్త్వత్రయమ్, ఈశ్వర ప్రకరణమ్ (సూ.40) శ్రీమాన్ శ్రీపరవస్తు వేంకట రంగనాథ స్వామి అయ్యవారల ఆంధ్ర తాత్పర్యము చెన్నపురి - 1904.*

<u>ద్విరద :-</u> ఏనుగు నిచట రెండు దంతములు కలది. (ద్వి+రద) అని నిర్దేశించుట వలన దాని బలము ద్విగుణీకృతముగా ధ్వనించి, దానిని బంధించుటలో గల దుష్కరత ప్రస్ఫుటముగా గోచరించును.

విష్ణుని మూర్తిని ధ్యానపరంపరతో బంధించుటకును, ఏనుగును గొలుసుతో బంధించుటకును గల పోలిక ఈ రాజకవికి స్ఫురించుట సహజము. విజయనగర శిథిల రాజప్రాసాదమున కెదురుగ నేటికిని నిలచియున్న గజశాలయందీ దుష్కర కృత్యమాయనకు సుపరిచితము.

విష్ణుని రూపమును విష్ణుచిత్తుడు స్వప్రయత్న బలముచే బంధించెనని శ్రీవీర శ్రీకృష్ణరాయ మహారాయరుల యూహ. కాని పరమ సాత్వికుడును. దాసభక్తుడునగు విష్ణుచిత్తున కది సౌలభ్య సౌశీల్యాది గుణసంపన్నుడగు విష్ణువే స్వయముగ నొనర్చిన మహోపకారముగా తోచును. దానినతడు స్వరచితమగు తిరుమొళి (శుభవాక్కు)లో సజల నయనుడై కృతజ్ఞతతో నిట్లు స్మరించును.

"ఓ చక్రపాణీ! మహోపకారకుండా! అనంతుని యందును, గరుత్మంతుని యందును గల ప్రేమనల్పముజేసి, నా హృదయమున నిలచి, నన్నుజ్జీవింప జేసితివి. ఇట్టి నీ సౌలభ్యము ననుసంధించి, శ్రమ యంతయు తొలగిన వాడ నయితిని. నీవు క్షీరార్ణవమును, సూర్యమండలమును, శ్రీవైకుంఠమును వీడి, నిరాధారునివలె నన్నే నీకు తగిన వాస స్థలము గావించుకొంటివే! ఏమి నీ సౌశీల్యము" [19]

---

19 పెరియాళ్వారు తిరుమొళి 5వ పత్తు, 4వ తిరుమొళి 8,9 పాశురములు కాంచీ అణ్ణంగరాచార్య స్వామి తెలుగు టీక కాంచి. 1968.
*సౌలభ్యము:- అతీంద్రియమైన స్వీయ విగ్రహమును చూచుటకు అసమదు వారికి దానిని గోచరింపజేయు ఈశ్వర గుణము.*
*సౌశీల్యము:- గొప్పవారు తక్కువ వారితో కపటము లేక కలసి మెలసి యుండు గుణము.*
*(1) పిళ్లై లోకాచార్యుల తాత్పర్యము ఈశ్వర ప్రకరణము సూ 10. మణవాళమాముని వ్యాఖ్య తెలుగు తాత్పర్యయ సార్థ దీపిక - ఆంధ్రానువాదము కొ.శ్రీ. తిరు వేంకట రామానుజాచార్యులు - కాంచీ సాధారణ సంవత్సరము.)*

<u>అన్వర్థాభిధానుండు</u>:- (సార్థకమైన పేరుగలవాడు)

ఎడతెగని ధ్యానయోగము ద్వారా విష్ణువును తన చిత్తమున నిలుపుకొనుటచే విష్ణుచిత్తుడను సార్థకనామము కలిగెనని రాయలవారి ప్రతిపాదన. కాని శ్రీరామానుజుల శిష్యుడును, శ్రీ రంగరాజ ఆరోగ్యశాఖా వల్లభుడునగు గరుడవాహన పండితుని (11 వ.శతా.) 'దివ్య సూరి చరితమ్' అను సంస్కృత కావ్యమున కాని దీని ననుసరించి వ్రాసిన అన్నమాచార్యుల మనుమడును, రాయల కన్న చిన్నవాడును, సమకాలీనుడును నగు 'తిరువేంగళనాథుని' (చిన్నన్న 1498-1561) 'పరమయోగి విలాస'మను తెలుగు ద్విపద కావ్యమున కాని, ఇట్లు కనరాదు. దివ్యసూరి చరితలో గుణశ్రేష్ఠుడగు భట్టనాథుడు (విష్ణుచిత్తుడు) జ్యేష్ఠమాసమున, గరుడాంశలో జన్మించెననియు, అతడు నిస్సీమ కారుణ్య నిధానుడు, నిరర్గళాశేష కళాప్రియుడు, నిరంకుశాత్మోదయము గలవాడు నగుటచే సత్పురుషులతనిని విష్ణుచిత్తుడని పిలిచిరని మాత్రమే కలదు.[20] 'గురు పరమ్పరా ప్రభావమ్' లోని "పెరియాళ్వార్ వైభవమ్"లో శ్రీ విల్లిబుత్తూరిలో బ్రాహ్మణోత్తములగు వేయల్ కులములో 'విష్ణుచిత్తర్' అను తిరునామముగల భట్టనాథుడు జ్యేష్ఠమాసములో జన్మించె ననియు, అతడు ప్రహ్లాదునివలె జన్మవైష్ణవుడు, సహజ దాస్యయుతుడు ననియు మాత్రమే యున్నది.[21] పరమయోగి విలాసము గూడ. భట్టనాథుడు సకల కళాప్రియుడును, నిరుపమ కారుణ్య నిధియు, వైష్ణవ పూజా నివర్తనుడును నగుట వలన విష్ణుచిత్తుడని ఖ్యాతిపొందెననియే కలదు[22]

---

20 <u>శ్రీ దివ్య సూరి చరితమ్</u>, పంచమ సర్గ శ్లో. 32. 33, అళ్ళసింగరాచార్య ప్రకటితమ్ - 1953

21 <u>గురు పరమ్పరా ప్రభావమ్ పెరియాళ్వార్ వైభవమ్</u> (పుట 72,73) నాకు లభించిన అచ్చు ప్రతిలో గ్రంథకర్త, ప్రచురణ కర్త, ప్రచురణ తేదీలు నష్టమైనవి. ఈ ప్రతి కీ.శే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రుల వారి స్వంత లైబ్రరీలోనిది. డా. వేటూరి ఆనందమూర్తి గారి సౌజన్యము వలన దీనిని చూడగలిగితిని.

22 <u>పరమయోగి విలాసము</u> - పంచమాశ్వాసము 6917-6924 పంక్తులు తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ 1938. దీని ప్రతి నా మిత్రులు కీ.శే. లగు శ్రీమాన్ టి.పి. భాష్యకారాచార్యులు గారి సౌజన్యము వలన లభించినది.

విష్ణుచిత్తుని స్వరచితమగు పెరియాళ్వారు తిరుమొళిలో మహోపకారియగు చక్రపాణియే తన సౌలభ్య, సౌశీల్య గుణములవలన విష్ణుచిత్తుని హృదయమున నిలచెనని ఇంతకు పూర్వము గమనించితిమి. ఈ సౌలభ్యము ఈశ్వరుని జ్ఞాన, శక్త్యాది నిత్య, నిస్సీమ కళ్యాణ గుణములలో నొకటి [23].

ఇంతేగాక-పెరియాళ్వారు తిరుమొళి లోనే విష్ణువు యోగులకు దుర్లభుడని చెప్పుచు, విష్ణుచిత్తుడు తన యనుభవము నిట్లు స్మరించెను.

(i) నా తండ్రీ! హృషీకేశా! యోగులకు దుర్లభుడవగు నిన్ను నా హృదయమున నిల్పుకొంటిని . . . . అట్లే నన్ను కూడ నేను నీలోన చూచుకొంటిని (5. 4, 8, 9)

ప్రాణుల హృదయములందంతర్యామియై యుండి, వాని ఇంద్రియములను తనవైపున కాకర్షించువాడు. హృషీకేశుడు. కర్మనాభిలాషులగు భక్తులకు సులభుడు. యోగులకు దుర్లభుడు. పైనుదహరించిన విష్ణుచిత్తుని రెండు విన్నపముల వలన నతని చిత్తమున విష్ణువు నిలుచుటకు విష్ణువు సౌలభ్యమే కారణమని, విష్ణుచిత్తుని యోగాభ్యాసము కాదని స్ఫురించును.

పై విన్నపములో మరియొక విశేషము. విష్ణువును చిత్తమున బంధించుటవలన విష్ణుచిత్తునకు సార్థక నామము కలిగెనని రాయల వారొక్క కారణమునే తెలిపిరి. కాని, విష్ణువుయొక్క చిత్తమున తనను నిలుపుకొనుటయును మరొక కారణమును గూడ. విష్ణుచిత్తుడే తెలుపును.

ఈ యన్నిటిని బట్టి - విష్ణుచిత్తుడు యోగి కాడని తోచును. అయినచో-రాయలు ఆయనకీ యోగమునేల యంటగట్టిరను ప్రశ్న కలుగును.

వైష్ణవ పాంచరాత్రాగమములలో యోగపాదమునందు భక్తునికి యోగాభ్యాసము విధింపబడినది. అట్లే విశిష్టాద్వైతుల ప్రమాణ గ్రంథములలో నొకటి యగు విష్ణుపురాణమందు ఖాండిక్య కేశిధ్వజ సంవాదములో యమ నియమాసన

---

23 పూర్వోదాహృత తత్త్వత్రయము ఈశ్వర ప్రకరణము సూ.8

ప్రాణాయామప్రత్యాహారముల పిమ్మట, ధారణాధ్యానములలో విష్ణుని రూపము నేకాగ్రముగా భావించుయోగికి విష్ణుసామ్య రూపమగు ముక్తి లభించునని సవిస్తరముగా వర్ణింప బడినది. శ్రీ రామానుజు లీ వ్యాఖ్యానమందలి యోగమును శ్రీ భాష్యములో విపులముగ చర్చించిరి. ఇట్లు వైష్ణవ ప్రమాణ గ్రంథములలో వివరింపబడుటచే యోగము శ్రీ వైష్ణవ భక్తులకు, విశిష్టాద్వైత ఆచార్యులకు సమానముగా ఆదరణీయ మైనది. అందుచే సమగ్ర దృష్టిగల రాయలు వైష్ణవ సాధనగా ప్రదర్శింపనెంచి, కేశిధ్వజోపాఖ్యానమును - మూడవ యాశ్వాసమున విష్ణుచిత్తుని వలన చెప్పించెను. అందుకు ప్రాతిపదికగా విష్ణుచిత్తుని ప్రవేశపెట్టు తొలి పద్యములోనే అతడు అశ్రాంత యోగము వలన విష్ణువును తన చిత్తమున బంధించి సార్థక నాముడయ్యెనని వర్ణించెను. ఈ సంవాదము ద్వారా రాయలు తన కథిమాన పాత్రములైన రాజనీతిని (3-2-46) విశిష్టాద్వైత తత్వమును (3-8-12) విష్ణు, ధ్యాన, యోగ విధానమును, (3-73-86) ప్రదర్శింపగలిగెను.

**ఉరు - ఛందో - బృంద తదంత - వా - గ పఠనా - సంజాత**

**తజ్జన్య - నిష్పంద - ద్వైత - సు - సంవిదాలయుడు**

గొప్ప - వేద-సమూహమును: వాని తుది భాగములగు ఉపనిషద్వాక్యములను, పఠింపకనే కలిగినదియు ఆ వేద వేదాంతముల పఠన వలన కలుగ వలసినదియు- స్థిరమైనది-యునగు (విశిష్ట) ద్వైతమును గూర్చిన - నిర్దుష్టమైన - జ్ఞానమునకు నిలయమైన వాడునగు)

ఈ సమాన ఘటన చిత్రమైనది. ఇందలి శబ్దములు దాదాపుగా నన్నియు సుపరిచితములే, కాని వాని కూర్పు, భావములోని కుదింపు- వానిని దుర్బోధములుగా చేయు చున్నవి. రాయలవారి రచన యంతట నీ వైలక్షణ్యము కొట్టవచ్చినట్లు కనిపించును. పెద్దన గారాయనను (1) "అవల్గత్తురగ బహువిధారోహ కళా రేవంతుడ"ని [24] (2) "వ్యాయామ స్థిర సంధి బంధుడ"ని వర్ణించును.[25] ఈ వర్ణన రాయల శబ్ద

24 మను. *(1-43)*= విశృంఖలముగా నన్నివైపుల దుముకు లాడుచున్న గుఱ్ఱము లను అందుకు తగినట్లుగా నెక్కు విద్య యందు ప్రవీణుడని తాత్పర్యము - రేవంతుడు అశ్వ శిక్షకులకు దైవమని ఒక పరిశోధకుడు. *(Bhat)*

25 మను. *6-124*

ప్రయోగమునకు, సమాస జటిలతకు కూడ వర్తించును, కాని ఆయన రచనలో పొల్లు మాటలుగాని, పాద పూరణకై పడికట్టు శబ్దములుగాని, మృగ్యములు. ప్రతి శబ్దము సప్రయోజనముగ నుండును. ప్రస్తుత సమాసమందలి పదజాలమును గూడ నోపికతో పరిశీలించినచో నన్నియు సార్థకములని స్పష్టమై సహృదయ రంజకము లగును.

విష్ణుచిత్తుడు మహా వేద వేదాంత సమూహమును చదువకనే, వానిని చదివినందువలననే కలిగెడి చక్కని విశిష్టాద్వైత జ్ఞానమును గ్రహించిన వాడని ఈ సమాస తాత్పర్యము, ఇక ఇందలి ప్రతిపద సార్థక్యమును గమనింతము.

**ఉరుచ్ఛందో బృంద తదంతవాక్ :-**

(= ఉరు-ఛందో-బృంద-తత్-అంత-వాక్)

(గొప్ప వేదముల సమూహమును - ఆవేదముల- తుదిభాగములందలి వాక్యములను (ఉపనిషత్తులను) - ఇందలి ఉరు, బృంద, అంత - పదముల సార్థకతను గమనింతము ఉరు= (గొప్ప)- 'ఛందః' (వేద) పదమునకు విశేషణము ఋక్, యజుస్, సామ, అథర్వణములుగా విభజింపబడిన వేద సంహితల (మంత్ర) విస్తృతిని తెలుపును.

**బృంద (సమూహము) :** ఇది వేద సంహితల కనుబంధితములగు బ్రాహ్మణ, ఆరణ్యక సమూహమును సూచించును.

**అంత (తుది భాగములందలి వాక్యములు) :-** ఇది సంహిత మంత్ర సముదాయములు) బ్రాహ్మణ, ఆరణ్యకములకు తుది భాగములందుడెడి ఉపనిషత్తులను తెలుపును.

**వీని విస్తృతి :-** సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు కలిపి ఏబది లక్షల అక్షరరాశి గలవని పరిశోధకులు గడించిరి. ఋగ్వేద సంహితా (మంత్ర) భాగమొక్కటే 1017 సూక్తములతోను, పదివేల పైచిలుకు ఋక్కులతోను, 1,53,826 పదములతోను, 4,32,000 అక్షర సముదాయము తోను, కూడిన బృహద్గ్రంథము, తక్కిన మూడు వేదములు కలిసి దాదాపు అంత నిష్పత్తి కలవే; నాల్గువేదములందు గల పది సంహితలు, పదిహైదు బ్రాహణములు, అయిదు ఆరణ్యకములు పదునాల్గు ఉపనిషత్తులు

(10:13:108 ముఖ్యములని కొందరు) - కలసి మొత్తము నలుబది నాల్గు గ్రంథములగును. వీనిలో శతపథ బ్రాహ్మణమొక్కటే, దాదాపు ఋగ్వేదమంత విస్తృతి గలది [26]

ఊరు :- బృందపదముల వలెననేగాక, పద్యమున దాదాపు రెండు పాదములాక్రమించిన దీర్ఘ సమాస నిర్మాణము వలన కూడ కవి విస్తృత వేద స్వరూపమును ధ్వనింప జేయును. మొదటి హరిహర బుక్కరాయల కాలమున విజయనగర రాజుల పోషణలో నాల్గు వేద మంత్ర సంహితలకు, బ్రాహ్మణములకు, ఆరణ్యకములకు, అనేక వేద పండితుల సాయముతో సాయణాచార్యుల ఆధ్వర్యమున భాష్యములు వ్రాయబడినవి. సాయణ సోదరుడగు మాధవ విద్యారణ్యులు 'పంచదశి' యను నద్వైత గ్రంథమును రచించెను. వీరిరువురు విజయనగర ప్రభువుల మంత్రులు. కృష్ణరాయలు విజయనగర విద్వత్ప్రభువు. "వేదార్థస్థాపన ప్రవీణుడు" [27] వగుటచే ఆయనకు వీరి ఉరువృందో బృంద తదంత వాక్ పరిశ్రమ పరిచితమగుట అత్యూహ కాదనుకొందును. ఆముక్త మందాయన అనేక ఉపనిషత్ బ్రాహ్మణ, ఆరణ్యకములలోని విషయములనుదహరించుట ఈ యూహను బలపరచును. (3-10) ఛాందోగ్య, నారాయణ, మైత్రాయణీ, తైత్తిరీయ మహోపనిషత్తులు (ఆశ్వా-3-11): అరుణములు; (ఆశ్వా-3-13): సుబాలోపనిషత్తు, ఐతరేయోపనిషత్తు (ఆద్యా 3-45), ఋగ్బ్రాహ్మణము ఇత్యాదులు.

అపఠనా సంజాత తజ్జన్య నిష్పంద ద్వైత సునం విదాలయుడు

(ఆ పఠనా - సంజాత - తత్ - జన్య నిష్పంద - ద్వైత - సుసంవిత్ - ఆలయుడు)

(వేద వేదాంతములను పఠించకనే - కలిగినదియు వానివలన కలుగ వలసినదియు - స్థిరమైనదియు (విశిష్ఠా) ద్వైతమును గూర్చిన నిర్దుష్టమైన - జ్ఞానమునకు - నెలవైనవాడు.)

---

26 *K.S. Srinivasacharya, The Vedas what and why, Madras, 1973.*

27 *పారి - 1-29*

<u>అపఠనా - పంజ్ఞాత</u> :- (వేద వేదాంతములను పఠించకనే కలిగినదియు) - ఇచట మనకొక ప్రశ్న కలుగుట సహజము. వేదవేదాంతములను పఠింపకనే విష్ణుచిత్తునకు వాని వలన కలుగవలసిన జ్ఞానమెట్లేర్పడెను?

ఈ ప్రశ్నకు అభినవ మల్లినాథ సూరి, మహామహోపాధ్యాయులు నగు కీ.శే. శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి వర్యులు అనన్య పాండితీ గరిమతో నొక సమాధానమును సూచించిరి.

'అపఠనా'లోని నఞ+ర్థము ('వ్యతిరేకార్థము) యొక్క భావము "చదువుటకన్న వేరైన కారణముచేత" అనియు ఆ కారణము జన్మాంతర పుణ్య మనియు వివరించిరి.

జన్మాంతర పుణ్యమైనను ఏదో ఒక యాలంబము ననుసరించిగాని పరిణతి చెందదు. విష్ణుచిత్తుని విషయమున ఈయాలంబనమేది? ఇందుకు సమాధానము మన మాముక్తము నుండియే గ్రహించుట యుక్తము. ఈ యన్వేషణలో మన దృష్టిని రెండు సందర్భము లాకర్షించును. మొదటిది విష్ణుచిత్తున కాచార్యుడు కృపచేసిన తెలివి! (1.78) అది ఈ పద్యమునకు తరువాత గల గద్యములో చెప్పబడినది. రెండవది విష్ణుచిత్తుని అతిథి భాగవత గోష్ఠి. అది ఇక ముందు రాగల పద్యములలో వర్ణింపబడినది. (1-79.85)

ఆచార్యోపదేశము వలన విష్ణుచిత్తుడు ప్రకృతికన్న తాను పరుడని, తన కన్న పరమేశ్వరుడు పరుడని, తనకును, పరమేశ్వరునకును, అనాద్యమగు స్వామి భృత్య సంబంధము కలదని, ఆ సంబంధము వలన పరమ పదమున గూడ తనవంటి భాగవతులకు అప్రాకృతములగు బహు భద్రమూర్తులను భజించి భగవత్పరిచర్య చేయుటయే పరమ పురుషార్థమని తెలుసుకొనెను. ఈ తెలివియే - విశిష్టాద్వైత తత్త్వ - హిత - పురుషార్థములకు సంక్షేప రూపము. దీని పూర్ణ స్వరూపము శ్రుతి స్మృతి, సూత్ర, సమాజమున కైంకర్యము గర్పించుటవలన గలుగును. (3.6) ఇదియే వేద వేద్యమగు విష్ణుతత్త్వము (4.5) దీనినే విష్ణుచిత్తుడు పాండ్యరాజా రాజ సభావాదమున రాద్ధాంతపరచినది. ఇందు కొరకతడు వేదవేదాంతముల నన్నింటిని పఠింపకపోయినను, తన మతమును సమర్థించెడు ముఖ్య ప్రమాణముల నెరిగి యుండును.

ఇక్కడొక ప్రశ్న కలుగును. ప్రమాణ గ్రంథములను పఠింపకనే యతనికి ప్రమాణములెట్లు ప్రాప్తించెను? దీని సమాధానము మన కతని యతిథి భాగవత గోష్ఠియందు లభించును. మలయాచలము నుండి హిమాచలము వరకుగల దివ్య దేశములను సేవించుచు, మార్గమధ్యమున శ్రీ విలుబుత్తూరు స్వామిని దర్శించుటకు వచ్చిపోయెడు వైష్ణావళితో విష్ణుచిత్తుని గృహము కిటకిట లాడెడిది. (1.79) వారికతడు ఎండనక, వాననక, చలియనక, ఆయా ఋతువులకు హితవగు మృష్టాన్నములను పెట్టెడి వాడు. (1-80, 82) ఆయ్యన ఇంటి సమీపమున వడిరేయి ఆలించినను, విష్ణుకథలు, దివ్య ప్రబంధాను సంధానము మ్రోయు చుండెడిది. (1-84) విష్ణుచిత్తుని కాలమున (క్రీ.శ. 725 ప్రాంతము) దాక్షిణాత్య శ్రీ వైష్ణవమొక ప్రక్కన జైన, బౌద్ధములను, మఱొక ప్రక్కన అద్వైత, శైవమతములను - ముఖ్యముగా నెదుర్కొని స్వమతమును రక్షించు కొనవలసి యుండెను. అందుకై శ్రుతి, స్మృతి, సూత్ర ప్రమాణముల కొఱక న్వేషణ జరుగుచుండెడిది. ఇట్టి పరిస్థితులలో విష్ణుచిత్తునింట కూడెడు వైష్ణావళిలో పండితులు స్వమత సమర్థకములగు ఘటక శ్రుతి, స్మృతి సూత్రముల నుపన్యసించుట అత్యంత సంభవము. ఈ వైష్ణవ పండిత గోష్ఠిలో శ్రుతమైన వేద వేదాంత వాక్యములు విష్ణుచిత్తుని అంతశ్చేతనలో (Sub-Consciousness) చేరి అప్రయత్నముగా సుసమన్వితములై యుండును. ఈ జ్ఞానమే (సుసంవిత్) అంతరాత్మ ప్రబోధము వలన (హరి తన చేతో గతి నాలయు 3-4) పాండ్యరాజు సభలో సువ్యవస్థిత రూపమున బహిర్గతమయ్యెను.

ఈ యూహ శ్రీ వేంకటరాయ శాస్త్రులు వారి (వ ఇ+ర్థ) వివరణకు (అపఠనా చదువుటకన్న వేరైన కారణముచే నవీన మనోవిశ్లేషణ శాస్త్రమునకును (Psycho-Analysis) లోకానుభవమునకును, సమ్మతమని తోచును.

అపఠనమనగా నిచట, విష్ణుచిత్తుడు సంప్రదాయ పద్ధతిలో వేదవేదాంతము లను గురు ముఖమున పద, జట, ఘన, క్రమమున సంత చెప్పు కొనలేదనియు, వానిని గూర్చిన భాష్యములను గాని, శిక్షా వ్యాకరణాది వేదాంగములను గాని

అధ్యయనము చేయ లేదనియు మాత్రమే గ్రహించుట యుక్తము [28] వానిని బొత్తిగా విన్నైన లేదని కాదు. ఆ పక్షమున - శ్రుతి - స్మృతి, సూత్ర సమాజమును ఎన్నడు విన్నైన వినకయే - పాండ్యరాజ సభయందతడు వానిక్షైక కంర్యమును కల్పించుటగాని ద్వైపాయన సూత్రశ్రుతుల నుదహరించుటగాని అసంగతమగును.

విష్ణుచిత్తుని ప్రసంగములో (1) బ్రహ్మసూత్రములు, (2) క్షం౦ ఛాందోగ్య, నారాయణ, మైత్రాయణీ, తైత్తిరీయ, ముద్గల సుబాల, **కౌషీతకీ**, ఐతరేయ, మహోపనిషత్తులు (3) అరుణములు (4) విష్ణుపురాణము - ప్రసక్తములగుట గమనీయము. (3.8 10-13) ఈ యన్నియు పూర్వజన్మ పుణ్యము వలన స్ఫురించె ననుట కన్న గురుముఖమున పఠింపకున్నను, విష్ణుచిత్తుడు వీనిని అతిథి, వైష్ణవ, పండిత గోష్ఠిలో శ్రద్ధతో విని, శ్రవణ, మనన, నిదిధ్యాసముల వలన హృద్గతము చేసికొని యుండునని లేక అవి అతని అంతశ్చేతనలో అప్రయత్నముగా సుసమన్వితము లయ్యెనని గాని భావించుట సమంజసము.

తజ్జన్య :- (ఆ వేద వేదాంతముల వలన కలుగవలసినదియు) వేద వేదాంత వాక్యముల నెరగుట జ్ఞానము కాదు. వానిని గూర్చిన మనన, నిదిధ్యాసముల వలన కలుగునది మాత్రమే జ్ఞానము. కవి యిచట వేద వేదాంత వాక్యముల శబ్దరూపమును తెలియుటనే (తత్ - జ్ఞాన) జ్ఞానమనగ, వాని వలన కలుగవలసిన (తజ్జన్య) ఎఱుకను జ్ఞానమనుట సార్థకము.

విష్ణుంఠ :- (స్థిరమైన) వేదవేదాంత వాక్యములలో కొన్ని ద్వైతము నంగీకరించు భేద శ్రుతులని, మఱికొన్ని అద్వైతమును ప్రవచించు అభేదశ్రుతులని, ప్రసిద్ధిచెందినవి. విశిష్టాద్వైతులు వీనిలో వేనిని తిరస్కరించక, అన్నిటిని కొన్ని ఘటక శ్రుతులవలన

---

28 *విష్ణుచిత్తుని గూర్చి నాథముని కృతమగు నొక పూర్వ ప్రబంధములో నతడు గురు ముఖముగా నేర్చుకొనకయే సకల వేదములను పలికెనని చెప్పబడినది. గురుముఖ మనధీత్య ప్రాహ వేదానశేషాన్ - శ్రీమాన్ కె.టి.యల్. నరసింహాచార్యులు గారి రత్నత్రయి (తిరుప్పల్లాండు) మునుమూరు, 1976*

నిస్పందిగ్ధముగా సమన్వయించి, చిదచిద్విశిష్టమగు (చిత్తు అచిత్తులతో కూడిన) అద్వైతమును స్థిరపరతురు

నిస్పంద-(స్థిరమైన) శబ్దమిట్లు సార్థకమగుచున్నది. ఈ స్థిరీకరణయే పైన తెలిపినట్లు సభావాదములో విష్ణుచిత్తుడు శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకైక కంఠ్యమును కల్పించి జగమెరుగునట్లు రాద్ధాంతపరచుటగా (3-6) ప్రమాణములతో విశిష్టాద్వైతమును తేటమాటలతో తెలుపుటగా (3-6) గుర్తింపనగును.

<u>ద్వైత - సు - సంవిత్</u> :- 'ద్వైత సు సంవిత్' అనగా - జీవేశ్వర భేదము యొక్క - మంచి - జ్ఞానము అని మహోపాధ్యాయుల వారు వాడిరి. సంజీవనీ వ్యాఖ్య (పు - 73.9) కాని ఈ అర్థ కల్పనలో నొక చిక్కెదురగును. జీవేశ్వరుల భేదమును తెల్పునది ద్వైతమనుట సరియే. కాని ద్వైతము, రూఢ్యర్థమున మాధ్వ దర్శనమును తెలుపును.[29] కాని, పాండ్యరాజు సభలో విష్ణుచిత్తుడు జగమెరుగునట్లు రాద్ధాంత పరచినది. ప్రమాణములతో తేటగా మాటాడినది. ఆయన స్వీయ, విశిష్టాద్వైత మతమని స్పష్టముగా పేర్కొనబడినది.

> **"ఆత్మమతము జగమెరుంగగ రాద్ధాంతమొనర్చి (3-6)**
> **విశిష్టాద్వైతంబును దేటగా తెలుప మాటాడెన్ప్రమాణంబులన్ (3-9)"**

అందువలన నిచట 'ద్వైత' మనగా విశిష్టాద్వైతమనియే చెప్పుకొనవలెను. అయినచో కవి దీనిని ద్వైతమని పేర్కొనుటలోని సారస్యమేమి? దీనిని గ్రహించుటకు మనము విశిష్టాద్వైత తత్త్వమును గూర్చి కొంత యాలోచింపవలెను.

<u>విశిష్టాద్వైతము</u> :- ప్రకృతి, జీవ, ఈశ్వరులనెడి తత్త్వత్రయమును ప్రతిపాదించును. వీనిలో ప్రకృతి జడము, జీవుడు చేతనుడు, ఈశ్వరుడు పరమ చేతనుడు.

---

29 *మాధ్వదర్శనము అయిదు అత్యంత భేదములను తెలుపును. ఇవి ముక్తావస్థలో గూడ ననువర్తించును. ఇవియే జీవ ఈశ్వరులకు, ఈశ్వరజడములకు, జీవజడములకు, జీవజీవులకు, జడ జడములకు గల భేద పంచకము - వఝె పూర్ణ ప్రజ్ఞాచార్యులు ద్వైత వేదాంతము. విజ్ఞాన సర్వస్వము. 7సం. పు. 472-3 (1962)*

జీవేశ్వరులిద్దరకు స్వయంప్రకాశము, జ్ఞానము, ఆత్మతత్త్వము, కర్తృత్వము- మొదలగు లక్షణములు సామాన్యములు. ఈ లక్షణ సామ్యము వలన వారొక వర్గమునకు చెందుదురు. జ్ఞాన శూన్యాది లక్షణముల వలన ప్రకృతి రెండవ వర్గమునకు చెందును.

కనుక సంఖ్యాగణనలో విశిష్టాద్వైతమున తత్త్వములు మూడుగా కనుపించి నను, చేతన, అచేతనల వర్గ విభాగములో రెండేయగును. పిండితార్థమున వివట ద్వైత సంవిత్తునగా జడ - ఆత్మ×అనాత్మ భేదము వలన తత్త్వము రెండు విధములనుట విశిష్టాద్వైత పూర్వాచార్య సమ్మతమే [30]

<u>సుసం విదాలయుడు :-</u>

(సు - సంవిత్ - ఆలయుడు-విశిష్టమైన- జ్ఞానమునకు - ఇల్లయినవాడు మంచి జ్ఞానమునకు ఇల్లయినవాడు అని సంజీవనీ వాఖ్య)

<u>సు-సంవిత్</u> :- విష్ణుచిత్తుని జ్ఞానమును కవి 'సంవిత్' శబ్దముతో తెలిపి యూరకొనక, దానికి 'సు' అను విశేషణమును కూర్చుట దానివేరొ కుసంవిత్తు నుండి వేర్పరచ దలచినట్లు తోచును. కవి కాయూహ లేనిచో 'సు' విశేషణము ప్రత్యేక ప్రయోజనములేని గణపూర్వకమగు పడికట్టు రాయి యగును. కాని అనంతర కథతో నన్వయించి చూచినచో నీ యక్షరము సార్థకమని తెలియును. మూడవ యాశ్వాసము పాండ్యరాజ సభలో పరతత్త్వ నిర్ణయవాదమున విష్ణుచిత్తుడు వాదసరణిలో నిరీశ్వరులగు సాంఖ్య, మాయా, మీమాంస, వైశేషిక, బౌద్ధ, చార్వాక వాదములను, బ్రహ్మసూత్ర, ఉపనిషద్వాక్యముల వలన ఖండించి, ఈశ్వరుని నిరూపించి, ఆ యీశ్వరుడు

---

30 ఏకం తత్త్వమితి ప్రతిపాదయంతి సూరయః, ఆత్మానాత్మేతి ద్విధా విభజ్య నిరూపయంతి ఋషయః ఒక్కడే యగు తత్త్వమును పండితులు ప్రతిపాదింతురు. ఆత్మ - అనాత్మయని రెండు తత్త్వములుగా విభజించి ఋషులు నిరూపించు చున్నారు. ఇచట ఆత్మ పదము జీవాత్మ, పరమాత్మ, రెండిటికి అన్వయించును. శ్రీ మే.వ. భాష్యకారాచార్య స్వామి, యతీంద్ర మత దీపిక తెలుగు అనువాదము పు. 159- సింహాచలము - 1975

సర్వవ్యాపియగు విష్ణువనియు, సూర్యునిలోగల నారాయణు డనియు - తెలిపి - శ్రుతి, స్మృతి సూత్ర సమాజమున నైకకంఠ్యము గల్పించి, సిద్ధాంత మొనర్చి, ప్రమాణములతో తేటగా తెలిపిన విశిష్టాద్వైతమతమే. (3-6-12) రాయలుద్దేశించిన స్థిరమగు (నిష్పంద) సుసంవిత్తు, తక్కినవి కుసంవిత్తు. ఈ భేదమును దృష్టిలో నుంచుకొనియే రాయలు విశిష్టాద్వైత సంవిత్తుకు 'సు' యను విశేషణమును జతచేసెను. ఈ దృష్టిలో 'సు' విశేషణము కూడ సార్థకమని స్ఫురించును.

<u>ఆలయుడు</u> :- (ఇల్లయినవాడు)

జనులు నిలీనమై (అణగి) యుండునది ఆలయమని కోశకారుడు [31] విష్ణుచిత్తుడు ద్వైత సంవిత్తుకు ఆలయమైన వాడగుటలో కవి, అజ్ఞానమతని యంతరంగమున నణగి (నిలీనమై) యున్నదని ధ్వనింపజేయును. ఇచట ధ్వని మాత్రముగ సూచించిన దానినే కవి ఆ తరువాత గద్యములో నతడు జడభరతునివలె ఇతరులు గుర్తించరాని జ్ఞానముగలవాడై యుండెనని వాచ్యముగా తెలుపును.

**"భరత భూమి సురపతనంబునుంబోలె దుర్విభావ్య బోధుండై" (1-78)**

<u>నిష్ఠన్ :-</u> (సంప్రదాయబద్ధమగు ఆచార పరాయణతో) (సదాచార నిష్పత్తితో - అని మహోపాధ్యాయుల వారు)

విష్ణుచిత్తుని సమగ్ర సాధనలోని మంత్ర, సంవిత్తుల వర్ణనతోనే దాదాపు పద్యమంతయు నిండిపోయినది. ఇక వర్ణించ వలసినది ఆయన సదాచార పరాయణత, నిత్యానుష్ఠానము. ఇది బహుక్రియలతో గూడినది. ఆయా వేళలనుబట్టి మారునది. అందుచే, సందర్భానుసారముగ వర్ణింపవలసినది. కనుకనే కవి దీని నిచట 'నిష్ఠన్' అను చిన్న పదముతో సూచించి వర్ణనౌచితిని పాటించెను. తరువాతి గద్యమున దాని నాయూరి చక్రపాణికి మాలికాకరణ కైంకర్యముగా వర్ణించును. (1-75) ఆ పిమ్మట పద్యములందతిథి భాగవతుల కాయా ఋతువుల కనువగు రుచ్యన్నపానాదులను సమర్పించుటగా వర్ణించును. (1-80, 84) మఱియు రెండవ యాశ్వాసమున

31 నిలీయన్తే ఆలీయన్తే జనోఽత్ర నిలయః ఆలయశ్చ - <u>గురు బాల ప్రబోధిక.</u>

ప్రఖ్యాతములగు రెండు పద్యములలో, విష్ణుచిత్తుడు స్వయముగ నేలను త్రవ్వి స్వామి ఆరామమును నిర్మించుట, ఆలయము నూడ్చుట, తీర్థమును తెచ్చుట, స్వామి శృంగార పల్యంకిని మోయుట, వనమాలికలను నిర్మించుట, స్వామి ధ్వజమును, వీవనను, గొడుగును, పట్టుట, వడివడిగా దీపములను పెట్టుటలతో గూడిన ఆలయ దాస్యమును హృదయంగమముగ వర్ణించును (2-90, 91)

విష్ణుచిత్తుని ఆచార్య పరాయణత - ఈ భగవద్భాగవత కైంకర్యములకే పరిమితము గాక ఆయన జీవిత చర్యనంతటిని నియంత్రించి (CONDITION) తుదకాయన చరమ జీవితములో పరాకాష్ఠ నందుకొనును. 7వ యాశ్వాసమందాయన తనకు దైవదత్తమైన యేకైక పుత్రికయగు గోదాకన్యను, తన యనుమతి పొందకనే రంగనాథుడు ఆత్మ దివ్య శుద్ధాంతమున జేర్చుకొనుట సదాచార విరుద్ధమని యాక్రోశించును. రంగనాథుని యన్యాయమును భాగవత పరిషత్తు ఎదుటికి లాగును. దయానిధియగు అమ్మకు నివేదించును. రంగనాథుని వింత చూపును దుయ్యబట్టును. (7-44-47) భాగవత క్షోభకు భయపడిన రంగనాథుడు గోదా కన్యను తిరిగి తండ్రికి లభింపజేయును. సదాచారమును పాటించి కన్యకొరకై విష్ణుచిత్తునింటికి బ్రహ్మరుద్రేంద్రాదులను రాయబార మంపును. విష్ణుచిత్తు ననుమతి ననుసరించి సపరివారముగా ఆయనింటికి తరలివచ్చును. వివాహతంత్రము యథాశాస్త్రముగ నడచును. సపత్నీకుడైన విష్ణుచిత్తుడు రంగనాథవరునకు గోదా వధువును ధారవోయును. (7-52-66)

ఇట్లు 'నిష్ఠన్' అన్న చిన్న పదము విష్ణుచిత్తుని జీవిత చర్యనంతటిని సూచించుటచే సార్థకమయినది.

<u>విష్ణుచిత్తుండనన్</u> :- (విష్ణుచిత్తుండు - అనన్ = విష్ణుచిత్తుడనబడుచు) ఎడతెగని యోగమనెడి గొలుసుతో విష్ణువను ఏనుగును చిత్తమున బంధించుటచే, విష్ణుచిత్తుడను సార్థకనామము కలిగినదని కవి యూహ నింతకుముందు చర్చించితిమి. యోగులకు

దుర్లభుడైన విష్ణువును అతని సౌలభ్యము వలన తన హృదయమున నిల్పుకొంటినని, అట్లే విష్ణుని చిత్తమున తనను నిల్పుకొంటినని. పెరియాళ్వారు తిరుమొళిలో విష్ణుచిత్తుడే తెలుపుట కూడ ఇంతకు పూర్వము గమనించితిమి.

**అనన్ :-** (అనబడును) తెలుగునాట నెవరినైన నీ పేరేమని యడిగినప్పుడు "నన్ను ఫలానా అందురు" - అని బదులు చెప్పుట తెలుగు పలుకుబడి తీరు. ఏ పేరైన నొక వస్తువునో వ్యక్తినో గుర్తింపుకుద్దేశింపబడిన సంజ్ఞయే గాని, ఆ పేరే ఆ వస్తువుకాదు. వ్యక్తికాదు. ఈ యెఱుకయే ఈ పలుకుబడికి మూలము. రాయలవారు 'బాసాడు' తెలుగు పలుకుబడి తీరుతీయములను గుర్తించిన వాడగుటచే [32] విష్ణుచిత్తుడు అను పదము చివర 'అనన్' అను శబ్దమును సార్థకముగ చేర్చెను. ఆముక్తమంతట కనుపించెడి నుడికారపు మెలకువల కిదొక చిన్న యుదాహరణ యనవచ్చును.

<u>ముగింపు</u> :- ఇట్లు ఆముక్త కథారంభమున విష్ణుచిత్తుని ప్రవేశపెట్టెడి 'అందుండున్' అను పద్యము -

(1) ఆముక్త రచనా ప్రణాళికకు కీలకమై

(2) రాయలవారి సమాస నిర్మాణ గాంభీర్యమునకు, ప్రతి పదసార్థక్యమునకు

(3) విశిష్టాద్వైత తత్త్వ, హిత, పురుషార్థములను గూర్చిన రాయలవారి ప్రగాఢ పరిజ్ఞానమునకు దృష్టాంతమై, సహృదయ రంజకముగ భాసిల్లుచున్నది.

ఇందాయన స్వోపజ్ఞతతో నిర్మించిన విష్ణుచిత్తుని మంత్ర, యోగ, సంవిత్ నిష్ఠారూపమున సమగ్ర సాధన - దివ్య సూరి చరిత్రాది గ్రంథములందు కనరాదు. అది ఆధ్యాత్మ సాధనలను గూర్చిన రాయల సమగ్ర దృష్టిని వెల్లడించుచు, విశిష్టాద్వైత పూర్ణయోగమనదగియున్నది. ఇట్లనుటకు గల కారణములను మరొక యధ్యాయమున ముచ్చటింతము.

---

*32 ఎల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి - (1-15)*

# అధ్యాయము 8

## భిన్న సంప్రదాయములు - సాధనల వైరుధ్యము

6, 7 అధ్యాయములలో మనము 'అందుండున్' అను పద్యము యొక్క కీలక స్వభావమును, అందలి ప్రతిపద సార్థక్యమును గుర్తించితిమి. ఈ యధ్యాయమున అందలి మంత్ర, యోగ, సంవిత్, నిష్ఠలు మౌలికముగా భిన్న సాంప్రదాయములకు చెందినవనియు, సిద్ధాంత, క్రియా, లక్ష్యములందు (తత్త్వ, హిత, పురుషార్థములందు) పరస్పర విరుద్ధము లనియు, కాని శీఘ్ర లక్ష్యసిద్ధి కొఱకు కొన్ని మార్పులు కూర్పులతో నొకరీతిగా ననుబంధింప బడినవనియు గుర్తించవలసియున్నది.

### భిన్న సంప్రదాయములు

విష్ణుచిత్తుని సాధనలలో మొదటిది ద్వయ మంత్రము. ఇది దాక్షిణాత్య శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు చెందినది. రెండవది యోగము. ఇది సాంఖ్య సంప్రదాయమునకు చెందినది. నాల్గవది సదాచారనిష్ఠ. ఇది పాంచరాత్ర చర్యాపాదమునకు చెందినది. వీనిలో మొదట ద్వయ మంత్ర యోగముల పరస్పర వైరుధ్యములను గుర్తింతము.

### సిద్ధాంత తత్త్వవైరుధ్యము (అధ్యా 8 - ద్వయ × శ్రీ యోగ

| ద్వయము<br>సేశ్వర వైష్ణవము | యోగము<br>నిరీశ్వర సాంఖ్యము |
|---|---|
| ద్వయమునకు మూలమగు వైష్ణవము సేశ్వరము. భక్తి ప్రపత్తి ప్రధానము (ప్రపత్తి= శరణాగతి, భరన్యాసము) | యోగమునకు మూలమగు సాంఖ్యము నిరీశ్వరము. జ్ఞాన ప్రధానము. (సాంఖ్య మనగా సమ్యక్ ఖ్యాతి - సరియగు |

ద్వయము మోక్షసాధనకు శ్రీమన్నారాయణుని శరణమును బోధించును. (ప్ర. 91) ప్రపత్తి పాంచరాత్రాగమముల ప్రత్యేకబోధ [33] వేదాంత దేశికులు దీనిని సింహస్వన్యముతో పొర్కిరి. [34]

జ్ఞానము) [35] యోగము మోక్షసాధనకు యమనియమాది అష్టాంగమును బోధించును. యోగములో నొక ఈశ్వరుడు కలడు కాని అతడు ముక్తి ప్రదాతకాదు.

ఈశ్వరుని గూర్చిన ఉభయ మతముల భేదములను విశిష్టాద్వైతము యోగము అను శీర్షిక క్రింద చూడగలము.

## క్రియా (హిత) వైరుధ్యము)

**ద్వయము**

**స్వప్రయత్నము**

ద్వయ ప్రబోధితమగు శరణాగతిలో స్వప్రయత్నము కేవలము నిషిద్ధమని కొందరు-కొంత యవసరమని కొందరు. ప్రపత్తి నావ వంటిదని- దానిలో ఊరక కూర్చుండుటయే ప్రపన్నుని వంతని, తక్కిన పనియంతయు నావికుడగు భగవంతుని గూర్చిన (1) అనుకూల్య సంకల్పము (2) ప్రాతికూల్య వర్జనము (3) అతడే రక్షించునను మహా విశ్వాసము (4)అతనినే రక్షకుడుగా వరించుట,

**యోగము**

**స్వప్రయత్నము**

విష్ణుచిత్తుని యోగాఖ్యానములో స్వప్రయత్నము కొట్టవచ్చినట్లు కనిపించును. ఎడలెగని గొలుసు వంటి యోగము (ధ్యానము)తో విష్ణువను ఏనుగును తన చిత్తమున బంధించి అన్వర్థ నాముడయ్యెనని గదా కవి వర్ణన! కవి విష్ణుచిత్తుని యోగ వివరములను వర్ణించలేదు గాని పాండ్యరాజుకు ఆమోదముతో వినిపించిన కేశిధ్వజుని యోగమును బట్టి చూడగా నది విష్ణు

---

33 S.R. Bhat- Panchara- p. 105, 1968.

34 Rahasya Traya Sara- In S.S. Raghavachar - Visistadvaita- p. 59, 1977.

35 విజ్ఞాన సర్వస్వము - 7 . పు. 115, 1969.

(5) ఆతనియందు ఆత్మభారములన్నియు నిక్షేపించుట, (6)తన నిస్సహాయతను (కార్పణ్యమును)తెలిసికొనుటయును ఆరు అంగములతో కూడిన షడంగయోగమని ప్రాచీనమగు పాంచరాత్ర అహిర్బుధ్న్య సంహిత పేర్కొనెను. [36]వీనిలో భర సమర్పణ అంగియనియు, తక్కినవి అంగములనియు అందురు.

ప్రపాదము-అర్వాచీన వైష్ణవాచార్యులుగూడ మోక్షసిద్ధికి చేతనుని శరణాగతి,భగవంతుని ప్రసాదము ముఖ్యములని తలచిరి.

తెంగలులు : పిళ్లైలోకాచార్యాది తెంగలులు (దక్షిణాదివారు) శరణాగతి స్వప్రయత్న మపేక్షించని సిద్ధోపాయమని, కర్మ జ్ఞాన భక్త్యాదులు స్వప్రయత్న సహితమగు ఉపాయాంతరములని, అవి జీవుని పారతంత్ర్య స్వరూపమునకు విరోధములని బోధించిరి. వీరి దృష్టిలోనివి జీవుని పారతంత్ర్య స్వరూ

చిత్తుని యోగమునకు ప్రాతిపదికయని తోచును. దానిని కేశిధ్వజుడు అష్టాంగాష్టకాఖ్య ఘనయోగమని పేర్కొనును. (3-87). అష్టాంగయోగమనగా రూఢ్యర్థమున పతంజలి యోగమే కేశిధ్వజుని వివరణను-పతంజలి యోగ సూత్రములందలి అష్టాంగ వివరణతో పోల్చినచో నది దాని రూపాంతరమని తెలియును. ఆ యోగ సాధకుడు యమ నియమముల వలన మనోనైర్మల్యమును సంపాదించి, భద్రాసనాదులందొకటి నవలంబించి, ప్రాణాయామము వలన ప్రాణాపానములను నిరోధించి, ప్రత్యాహారము వలన శబ్దాది విషయముల నుండి ఇంద్రియములను త్రిప్పి మనస్సున కధీనముచేసి, ధారణా ధ్యానములందు చిత్తమును విష్ణు రూపమునందుంచి తాదాత్మ్యముతో నతని సాధర్మ్యమును

---

36 షడాహ వేద విదుషో వదంతి ఏనం మహామునే
అనుకూల్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం
రక్షిష్యతి విశ్వాసో గోప్తృత్వ వరణం, తథా
ఆత్మ నిక్షేప, కార్పణ్యే షడ్విధా శరణాగతిః
అత్ర నా వీరి దృష్టాంతాత్ ఉపాయ జ్ఞానవ్ ఏవతు
నరేణ కృత్యమ్ అన్యత్తు నావికస్యే వ తద్వారేః
అహిర్బుధ్న్య సంహిత *XXXVII, 27, 28 S.N. Das Gupta A History of Indian Philosphy - Vol 3, p. 55*

పము నెరుగని అజ్ఞాను లవలంబించునవి. జీవుని పారతంత్ర్య స్వరూపమునకు విరోధములని బోధించిరి. వీరి దృష్టిలోనివి జీవుని పారతంత్ర్య స్వరూపము నెరుగని అజ్ఞానులవలంబించునవి జీవుని స్వరూపము తన రక్షణలో స్వప్రయత్నమును గంధ మాత్రముకూడ సహింపదు. స్వప్రయత్నోపాయములు జ్ఞానులు పారతంత్ర్య స్వరూపమునకు వినాశకరములగు అపాయములు [37] వీరి దృష్టిలో మోక్షార్థి యగు వాడు భగవంతుని పైననే తన భారమునిడి, స్వప్రయత్నరహితుడై, అతనికి వశమైయున్న చాలును. అతడే ముముక్షువును గమ్యస్థానమునకు చేర్చును. ఇందుకు దృష్టాంతము వారు తల్లి పిల్లి నోట గరచికొనిపోవునపుడు కదలక మెదలకయుండు మార్జాలకిశోర న్యాయము నుదహరింతురు. వేదాంత దేశికది వడ హాలాచార్యుల దృష్టిలో మోక్షప్రాప్తికి కొంతయత్నమవసరము. ఇందుకు దృష్టాంతముగ వారు తల్లి కోతి లభించునపుడు దాని పొట్టను గట్టిగా అంటిపట్టుకొని సురక్షిత స్థానమును చేరు

పొందునని కవి వర్ణన. (ఆము. 3-74,75) (84, 85, 86) సాధర్మ్య సిద్ధిని గూర్చిన భాగము తప్ప తక్కిన వివరణయంతయు- యమ, నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార - ధారణా - ధ్యాన - సమాధయోష్టాంగాని అను పతంజలి నిర్వచనముతోను వానిని గూర్చిన యతని వివరణతోను సంవదించును. (యో.సూ. 2-29, 30, 32, 46, 49, 54, 55; 3-1, 2, 3) ఈ చిత్తవృత్తి నిరోధాభ్యాసము దీర్ఘ కాల నిరంతర యత్నమని మాత్ర కారుడే పేర్కొనుట గమనీయము. అవిద్యాదికమైన అశుద్ధి క్రమక్రమముగా తొలగి జ్ఞానము దీపించి ప్రకృతి సంయోగము తొలగుటకు యోగాంగముల యనుష్ఠానము అవసరము (యో.సూ.2-28)

---

37 పిళ్లై లోకాచార్యుల (తమిళ, శ్రీ వచన భూషణము - కందాడై శేషాచార్యుల తెనిగింపు - 2వ ప్రకరణము, 116, 118 సూత్రములు (1925) డిటో - అణ్ణంగరాచారి (1970)

మర్కట కిశోర న్యాయమునుదహరింతురు. పిండితార్థమున ద్వయ మంత్ర శరణాగతి స్వప్రయత్నము విరోధము లేదా- నామ మాత్రముగ సహాయకము. ఉభయత్ర భర సమర్పణము ప్రాణము.

ప్రవృత్తి- ద్వయోపాసన అర్థాను సంధానముతో కూడి వాఙ్మనస్సుల అత్యంత ప్రవృత్తిని కోరును.[38]

నివృత్తి- యోగాభ్యాసము చిత్త వృత్తి నిరోధక సాధనముగుటచే వాఙ్మనస్సుల అత్యంత నివృత్తిని విధించును.

ఈ విధముగా స్వప్రయత్నమును బొత్తిగా సహించని విష్ణుచిత్తుని ద్వయ మంత్ర శరణాగతి, అత్యంతయత్నముతో కూడిన అతని యోగాభ్యాసమునకు విరుద్ధముగా తోచును.

## లక్ష్య (పురుషార్థ) వైరుధ్యము

**ద్వయ**

వైష్ణవులు జీవన్ముక్తి నంగీకరించరు. వారి మతమున ముక్తుడు దేహపతనానంతరము అర్చిరాది మార్గమున పయనించి దివ్యమంగళ విగ్రహమును పొంది, శ్రీవైకుంఠమున ద్వయమంత్రోపాసితుడగు శ్రీమన్నారాయణుని చేరి, అతనిని పరివేష్టించియుండు అనంత గరుడాది

**యోగ**

యోగదర్శనమున పురుషుడు తాను వేరు, ప్రకృతివేరు - అను వివేక జ్ఞానము వలన, ప్రకృతి నుండి సంయోగము తొలగి, చితిశక్తి స్వ స్వరూపమునందు ప్రతిష్ఠితమగును. (యోసూ.4-33) ఈ కైవల్యమే (ప్రకృతి నుండి ఒంటరితనము) యోగి సాధించు ముక్తి. ఇది

---

38 మంత్ర రత్నాను సంధాన సంతత స్ఫురితాధరమ్
తదర్థ తత్త్వ నిధ్యాన సన్నద్ధ పులకోద్గతమ్ అని
మనవాళమాముని దినచర్య వర్ణింప బడినది.
ముముక్షుప్పడి - 2-116 కాంచీ అణ్ణంగరాచార్యుల ఆంధ్ర టీక పు. 73, 1949.

నిత్యముక్తులతోను, తనవలె సంసృతి చక్రమునుండి ముక్తులయిన వారితోను కూడి ప్రీతికారిత నిత్యకైంకర్యానందమును పొందును. కైంకర్యమగు ముక్తి అతని స్వాభావిక శేషిత్వమున కనుగుణమైనది. మరికొన్ని వివరములను యోగము - విశిష్టాద్వైతము అను శీర్షిక క్రింద గమనించగలము.

చేతన మాత్రమగు నతని స్వభావమున కనుగుణమైనది. ఈశ్వర ప్రసాదము వలన గాక స్వప్రయత్నము వలన సిద్ధించును. జీవించియుండగనే సిద్ధించును. కాని నిత్యమగు కైవల్యము శరీర పతనానంతరము కలుగును. కైవల్యమున పురుషునికి ఇతర పురుషులతో గాని, పురుష విశేషమగు నీశ్వరునితోగాని, ప్రకృతితోగాని, సంబంధముండదు. మరియు ఇట్లు కేవలము జ్ఞాన స్వరూపుడుగానున్న దశలో పురుషునకుఆనందానుభవమున్నట్లు పతంజలి యోగ దర్శనముగాని, దానికి ప్రాతిపదికయగు సాంఖ్యదర్శనముగాని క్రింద తెలుపదు. మరికొన్ని వివరములను యోగము విశిష్టాద్వైతము అను శీర్షిక క్రింద చూడగలము.

## యోగము X ద్వైత సంవిత్తు- యోగి విష్ణుచిత్తుడు

విష్ణుచిత్తుని అశ్రాంత యోగమునకు పిమ్మట కవి ద్వైత సుసంవిత్తును పేర్కొనెను. ఇది నిర్దుష్టమైన విశిష్టాద్వైత జ్ఞానమనియు, అతని అశ్రాంత యోగము పతంజలి కేశిధ్వజుల యోగమునకు రూపాంతరమనియు, ఇంతకు ముందు చెప్పికొంటిమి. ఇపుడా ద్వైత సంవిత్తునకు, యోగమునకు గల వైరుధ్యమును గమనించవలసియున్నది. వీనిని ప్రమాణములు, తత్త్వములు, సృష్టి, సాధన, మోక్షము అను నైదు శీర్షికల క్రింద చూతము.

**యోగము:-**

**ప్రమాణములు:-** విష్ణు చిత్తుని ద్వైత సంవిత్తు వేద వేదాంత జన్యమని, కవియే తెలుపును. అతడు ఉరుచ్ఛందో బృంద తదంత రాగ పరనా సంజాత తజ్జన్య నిష్పంద ద్వైత సు సంవిదాలయుడు అని గదా కవివర్ణన (1-79)

మూడవ యాశ్వాసములో పాండ్య రాజ సభయందు విష్ణుచిత్తుడు "విశిష్టాద్వైతమును దీటుగా తెలుప మాటాడెం బ్రమాణంబులన్" అనియు కవియే తెలుపును (3-9).

ఇందుచే విష్ణుచిత్తుని విశిష్టాద్వైత సంవిత్తుకు వేద వేదాంతములు ముఖ్య ప్రమాణములని స్పష్టపడుచున్నవి. (ఆగమములు, పురాణములు కూడా).

కాని, అతని యోగ మట్టిది కాదు. దాని ప్రధాన సిద్ధాంతమగు ప్రకృతి పురుషుల సంయోగ వియోగములకు మూలము కపిలుని సాంఖ్యదర్శనము. కపిలుని తత్త్వజ్ఞానము (అనుమానమును ముఖ్య ప్రమాణముగా గ్రహించుటచే) భ్రాంతి మూలమనియు, సాంఖ్యస్మృతి నిరాకరింప బడుటచే యోగ స్మృతియు, నిరాకరింపబడుననియు, విశిష్టాద్వైతాచార్యుల సిద్ధాంతము[39].

**(2) తత్త్వద్వయము:-**

సాంఖ్యయోగములు అనుమాన ప్రమాణము ననుసరించి జగద్వ్యాపారమున ప్రకృతి, పురుషులనెడి రెండు చరమ తత్త్వములను మాత్రమే గుర్తించును. ప్రమాణములేనందున ఈశ్వరుడు సిద్ధింపడు.

కాని, పతంజలి యోగ సూత్రములలో నామమాత్రుడగు ఈశ్వరు డొకడున్నాడు. కాని, అతడు జన్మమరణాది క్లేశములు లేని ఒకానొక పురుష విశేషము మాత్రమే.[40] సృష్టి, స్థితి, లయ కారుడగు నీశ్వరుడుకాడు. ఈ మతమున ప్రకృతి

---

39 *ఆంధ్ర శ్రీ భాష్యము 2.2.2.3- సం. 2, పు. 10*

40 *పురుషస్య దర్శనార్థమ్, కైవల్యార్థమ్, తథా ప్రధానస్య*
*పంగ్వంధవదు భయోరపి సంయోగస్తత్కృతః సర్గః*
*సాంఖ్య కారిక - ఆంధ్ర శ్రీ భాష్యము - 2-21- దృశ్యము. (ప్రకృతి) యొక్క స్వభావము*
*పురుషుని కొరకేర్పడినది.*

పురుష తత్త్వములు రెండును వేరుగా నుండు స్వతంత్ర సత్త కలవి. వీనిలో ప్రకృతి యొక్కటి. జడము. అయినను జగత్కర్త్రి. పురుషులనేకులు. చేతనులు అయినను అకర్తలు ఉదాసీనులు సాక్షిమాత్రులు. ద్రష్టలు ప్రకృతి దృశ్యము పురుషునికి దర్శన రూపమైన భోగము నిచ్చుటకును దర్శన వియోగ రూపమైన కైవల్యమిచ్చుటకును ప్రవర్తించుట దాని స్వభావము.

<u>(3) ప్రకృతి-సృష్టి:-</u> ప్రకృతి యొక్కటే అయినను అది సత్త్వ రజస్తమోగుణములను మూడు ద్రవ్యములతో సంకీర్ణమై యుండును. సహజావస్థలోనివి సమతులితములుగా నుండును. ఆ స్థితిలో ప్రకృతి జగత్తును పరిణమింప జేయజాలదు. ద్రష్టలగు పురుషుల సామీప్యమున ప్రకృతిలోని గుణ సామ్యము భంగమయి అది వికృతిగా మారును. ఆ స్థితిలో నది పురుషుల ప్రయోజనము కొఱకు గుణ, తారతమ్యములతో గూడిన మహత్తు మొదలు స్థూల జగత్తు వరకుగల వస్తురూపములను పరిణమింపజేయును.

<u>(4) పురుషులు:-</u> వృత్తి సారూప్యము:- పురుషులు శుద్ధులు, సాక్షిమాత్రులు నైనను, ప్రకృతి నిర్మితమగు విచిత్ర జగత్తును, అంతరి బుద్ధివృత్తుల ద్వారమున దర్శింప సాగుదురు[42]. బుద్ధి వృత్తులు వస్తు స్వరూపమును పొందినవగుటచే వాని ద్వారా చూచు పురుషులు, నిజ స్వభావమును మరచి బుద్ధి వృత్తులతో సారూప్యమును భావింతురు[43].

<u>(5) సంసార బంధము:-</u> అందువలన పురుషుడు ప్రకృతి దత్త శరీరమునందు చేరి త్రిగుణముల తారతమ్యముల వలన కలుగు కార్యములకు తానే కర్తనని భోక్తనని భ్రమించి, వానియందు సక్తుడై, శరీరము ననుసరించుచు, దానికి సహజమైన జనన మరణ రూపమగు సంసృతి చక్రమున బద్ధుడగును. ప్రకృతి పురుష సంయోగము అవిద్యవలన కలుగును. అవిద్య యనగా- (1) అనిత్యమును నిత్యమని, అశుచిని శుచియని, దుఃఖమును సుఖమని, అనాత్మను ఆత్మయని భావించుట "చూచువాడు

---

*42* ద్రష్టా దృశి మాత్రః శుద్ధోపి ప్రత్యయానుపశ్యః <u>యోగసూ. 2-20</u>

*43* వృత్తి సారూప్య మితరత్ర <u>యో. సూ. 1-4</u>

*44* అనిత్యాశుచి, దుఃఖానాత్మసు నిత్య, శుచి, సుఖాత్మ ఖ్యాతిరవిద్యా - <u>యో. సూ.</u> 2-5

చూడబడు వాడు దానితో సంయోగము పొందుట దుఃఖహేతువు. అందుచే ఈ సంయోగము త్యాజ్యము[45].

<u>(6) మోక్ష సాధన:-</u> సాంఖ్య దర్శనము ప్రకారము సాధకుడు జనన మరణ రూపమగు శరీరము తానుకాదని, తాను నిత్యముక్తుడగు ఆత్మ'యని తనకు జనన మరణములు లేవని, తాను కర్త, భోక్త కానని, ప్రకృతి వికృతుల కన్న తానత్యంత భిన్నుడనని మననము చేయుటవలన ప్రకృతి వియోగము పొంది, సంసార చక్రమునుండి ముక్తుడై, తనకు తాను ఒంటరిగా (కేవలుడై) యుండును. ఇట్లు సాంఖ్య మతమున స్వస్వరూపమననమే ముక్తిని కలిగించును. కాని యోగ శాస్త్రదృష్టిలో కైవల్య సిద్ధికై జ్ఞానాభ్యాసము మాత్రమే చాలదు. దానికి తోడు అష్టాంగ యోగాభ్యాస మవసరము. యోగాభ్యాసము వలన అశుద్ధి క్షీణించి వివేక ఖ్యాతి కలుగును[46]. వివేక ఖ్యాతి యనగా ప్రకృతి పురుషులను గూర్చిన వివేచనా జ్ఞానము. వివేక ఖ్యాతి వలన సాధకులకు ధర్మమే సుసమాధి అను స్థితి కలుగును. (ఇది బౌద్ధయోగ సిద్ధాంతములనుండి గ్రహింపబడినది.) దీనివలన అవిద్యమొదలగు క్లేశములు, కర్మఫలములు సమూలముగా నశించును. జ్ఞాన ప్రకాశము నావరించియున్న మలములు తొలగును. జ్ఞానమనంతమై ఇంకను తెలుసుకొన దగినది అత్యల్పమగును[47]. ప్రకృతి గుణ వ్యత్యాసముల వలన నేర్పడు కార్యములు పురుషునకు ప్రయోజన శూన్యములై విలోమ క్రమమున లయించును[48].

<u>(7) మోక్ష స్వరూపము:-</u> ప్రకృతి లయించగా ప్రకృతి పురుష సంయోగము అభావమై, చితిశక్తి ప్రకృతి బంధము నుండి స్వరూప ప్రతిష్ఠితమగును, ఇదియే పతంజలి యోగమున కైవల్యము. కైవల్యమునందు పురుషుడు తనకు తాను ఒంటరిగా నుండును [49]. ఇదియే సాంఖ్యయోగముల పరమ పురుషార్థము. ఈ కైవల్యములో ఇతర పురుషుల ప్రసక్తిగాని, ప్రకృతి ఈశ్వరుల సంబంధముగాని, ఉండదు.

---

*45* (ద్రష్టృ దృశ్యయో స్సంయోగో హేయహేతుః *<u>యో. సూ.</u> 2-17*)

*46* యోగాంగానుష్ఠానాదశుద్ధి క్షయే జ్ఞాన దీప్తిరా వివేక ఖ్యాతేః *<u>యో.సూ.</u> 2, 28.*

*47* యోగ సూత్రములు - *4, 28, 29, 30*

*48* యోగ సూత్రములు - *4-33*

*49* యోగ సూత్రములు - *2-25; 4-33*

## 2 విష్ణుచిత్తుని (విశిష్టా) ద్వైత సంవిత్తు

ఇంతవరకు మనము విష్ణుచిత్తుని యోగమును గూర్చిన ముఖ్య విషయము లను గమనించితిమి. ఇపుడతని ద్వైతసంవిత్తునందలి ముఖ్యవిషయములను చూతము.

<u>(1) ప్రమాణములు:-</u> విశిష్టాద్వైత సంవిత్తునకు వేద వేదాంతములు ప్రమాణములని ఇంతకు పూర్వమే గమనించితిమి.

<u>(2) తత్త్వత్రయము:-</u> విశిష్టాద్వైత దర్శనము వేదోపనిషదాది శబ్ద ప్రమాణముననుసరించి ప్రకృతి పురుషులను తత్త్వద్వయమునే కాక చిత్ (జీవ), అచిత్ (జడ): ఈశ్వరులను మూడు చరమ తత్త్వములను ప్రతిపాదించును. ఇవి మూడు భిన్న స్వరూపములు గలవైనను, ఒకదాని నుండి మఱొకటి వేరుపరచరాని స్వతస్సిద్ధమగు (అపృథక్సిద్ధి) సంబంధము కలవి. వీనిలో ఈశ్వరుడొక్కడే స్వతంత్ర సత్త కలవాడు. చిద చిత్తులు అతనికి ఇష్ట వినియోగార్హమగు శరీరము. ఈశ్వరుడు శరీరి-(ఆత్మ) ఈశ్వర శరీరమగుట వలననే అవి పదార్థములుగా చెప్పబడుచున్నవి [50]. ఆత్మను విడిచిన శరీరము అస్తిత్వమును కోల్పోవును, అట్లే ఈశ్వరుని విడిచిన చిద చిత్తులకు స్వరూప, స్థితి, ప్రవృత్తులుండవు.

<u>(3) సృష్టి:-</u> సాంఖ్యులు ప్రతిపాదించు పురుషుని వలన గాని, ప్రకృతి వలనగాని, సృష్టి కలుగనేరదు. సాంఖ్యయోగములందు పురుషుడు నిర్వికారుడు. అకర్త, ఉదాసీనుడు, కైవల్యమే స్వరూపముగా గలవాడు, అట్టివానికి సాక్షిత్వము, ద్రష్టృత్వము, భోక్తృత్వము అసంభవము, నిత్య ముక్తుడగు పురుషుడు ప్రకృతి నెన్నడు చూడడు. ప్రకృతి గుణములను తనయందా రోపించు కొనడు. వానిచే బద్ధుడుకాడు. నిర్వికారుడగు నతని సాన్నిధ్యము వలన ప్రకృతిలో వికారములు కలుగనేరవు. [51] సాంఖ్యదర్శనము చెప్పు ప్రకృతి

---

50 తస్మాద్బ్రహ్మ వ్యతిరిక్తస్య కృత్స్నస్య తచ్ఛరీరత్వేనైవ వస్తుత్వాత్ శ్రీ భాష్యము 1-1 శరీర శరీరి భావము శ్రీ భాష్యమున పలుమారులు పలు రీతులుగా వివరింపబడినది. ఉదా: శేష-శేషి, అంశ, అంశి; ఆధార - ఆధేయ; నియంత-నియామ్యాదులు- ఇది విశిష్టాద్వైతమునకు ప్రాణభూతమగు ప్రతి తంత్రము. (ప్రత్యేక యుక్తి)

51 ఆం. శ్రీభా - 2-2-9- సం. 2. పు. 116, 117

జడమగుటచే చేతనునితో కూడి యుండక స్వతంత్రముగా సృష్టి చేయజాలదు.[52] దారువు మొదలగు నచేతన పదార్థములు రథాదుల నిర్మాణము నెఱిగిన చేతనునిచే నియమింపబడనిదే వానిని నిర్మింపలేవు. అట్లే అచేతనమగు ప్రకృతికూడ చేతనుని (ఈశ్వరుని) సహాయములేనిదే, ఈ విచిత్రప్రపంచమును సృజింపజాలదు. కేవల ప్రధానము జగత్కారణము కాదు[53]. చేతనుని నియమనము నపేక్షింపకయే ప్రకృతి స్వయముగా జగత్తును సృజించు పక్షమున, సృష్టికి విరుద్ధమగు ప్రళయము కలుగుటకు వ్యవస్థ లేకపోవును. సర్వేశ్వరునిచే నియమింపబడి సృజించిన పక్షమున అతడు సత్య సంకల్పుడు గనుక, సృష్టి ప్రళయములకొక వ్యవస్థ గలుగును[54].

## బ్రహ్మమే సృష్టి కారణము

ప్రకృతి సృష్టికారణమను సాంఖ్యవాదమునందు లోక దృష్టములగు దోషములుండుటచే [55] విచిత్ర శక్తులుగల బ్రహ్మయే [56] జగత్కారణమనెడి శ్రుతిని[57] మనమవలంబించవలెను.

ప్రపంచమీశ్వర శరీరము, దాని స్థూల రూపము ప్రతి కల్పాంతమున తన్మాత్ర- అహంకారాది పరంపరగా పూర్వ పూర్వ కారణ వస్తువులందు లయ మగుచు తుట్టతుదకు ఈశ్వరుని నుండి వేరుగా తెలియరావంత సూక్ష్మావస్థను పొందును. అప్పుడది తమస్సనెడి అచేతన వస్తువుగా మిగిలియుండును[58]. అట్టి

52 ఆం. శ్రీభా - 2-2-1- సం. 2. పు. 100

53 ఆం.శ్రీభా - 2-2-1- సం. 2. పు. 107

54 ఆం.శ్రీభా - 2-2-3 సం. 2. పు. 107

55 ఆం. శ్రీభా- 2-1-29- సం. 2. పు. 90

56 ఆం. శ్రీభా- 2-1-28 - సం. 2. పు. 90

57 ఆం.శ్రీభా - 2-1-27 - సం. 2 . పు. 89

58 ఆం.శ్రీ భా - 1-4-27- సం.1, పు-594.

స్థితిలో చేతనలగు జీవాత్మలు కూడ నామ, రూప, చేష్టా రహితములై జడ వస్తువులవలె స్తబ్ధములై అచిత్తునందు చిక్కుకొని యుండును. మహదాశయములను సాధింపదగినట్టివగు వాని ప్రస్తుత దుస్థితిని జూచి ఈశ్వరుడు పరమ దయాళుడై వాని నుద్ధరించి, వానితో క్రీడింపగోరి సూక్ష్మరూపమున నున్న ప్రపంచమును పరిణమింపజేసి, జీవాత్మలను అందలి వివిధ శరీరములలో ప్రవేశింపజేయును. వానియందు తాను అంతరాత్మగా ప్రవేశించును[59]. ఇది ఈశ్వరుని లీల[60]. అతడు లీలామాత్ర సృష్టిస్థితి లయకారి[61].

<u>మోక్షసాధన:-</u> జీవునికి కరణ కళేబరములు కర్మమొనర్చుట కీయబడినవి. సర్వకర్మములు ఈశ్వరారాధన రూపములే. వాని వలన జీవుని పూర్ణ స్వరూపావిర్భావము కలుగును. అతని కృపకు పాత్రుడై మోక్షమును పొందును. ముక్తుని మోక్ష స్థితిని రెండు ప్రమాణ గ్రంథములలో నిట్లు వివరింపబడినది.

<u>మోక్ష స్వరూపము:-</u>

(1) <u>యతీంద్ర మతదీపిక:-</u> <u>వైష్ణవులు</u> జీవన్ముక్తి నంగీకరింపరు. వారు లక్షించునది సేవాముక్తి, రామానుజ దర్శనమునకు ప్రవేశ గ్రంథమగు యతీంద్ర మతదీపిక ప్రకారము:- ముక్తుడు దేహావసానమున సుషుమ్న బ్రహ్మరంధ్రముల ద్వారా దేహము నుండి వెలువడి, సూర్యకిరణముల ద్వారా అగ్ని లోకమును చేరి దినాది కాల దేవతలచే సత్కరింపబడి. . . . సూర్యాది లోకములను దాటి ప్రకృతి మండలమునకు హద్దగు విరజా నదిని దాటి, సూక్ష్మ శరీరమును విడచి అమానవ పురుషుని హస్త స్పర్శవలన

---

59 ఆం. శ్రీ. భా.- 1-4-27-సం.1, పు-594. రామానుజుల గీతా భాష్యము- 3-10.

60 ఆం. శ్రీ. భా. 2-1-33. సం.2, పు.95;

61 అఖిల భువన జన్మస్థేమ భంగాది లీలే- బ్రహ్మణి శ్రీనివాసే- <u>ఆం. శ్రీ. భాష్యము-</u> మంగళ శ్లోకము: సకల జగత్సృష్టిస్థితి సంహారకంవాయ్ ఇవనే సకల జగత్తుకుమ్ కారణభూతన్, ఇతక్కు ప్రయోజనమ్, కేవలలీలై - పిళ్లై లోకాచార్యుల తత్త్వత్రయమ్. ఈశ్వర ప్రకరణమ్ - 1,11,21- పరవస్తు వెంకట రంగనాథస్వామి అయ్యవారల ఆంధ్ర తాత్పర్యము- పు. 145. 169. 176-(1904).

చతుర్భుజములతో కూడిన అప్రాకృత దివ్యమంగళ శరీరమును పొంది . . . . శ్రీవైకుంఠనగరమును జేరి, మహామణిమంటపమును విష్వక్సేన గరుడాది నిత్యముక్తులతో కూడియున్న నారాయణుని సమీపించి, అతనిచే నాదరింపబడి జగద్వ్యాపారము తప్ప, తక్కిన అన్నిట అతనితో సమానమగు నానందమనుభవించును. (విష్ణు సామ్యరూప, స్వరూప గుణ, విభవములందు గూడ విష్ణు సామ్యమును బడయును) పరమ పురుష సన్నిధిలో నుండి, అతని సంకల్ప నిర్వహణార్థము బహు శరీరధారియై సర్వలోక సంచార సమర్థుడగును.

(2) శ్రీ భాష్యము:- యతీంద్ర (రామానుజ) మత దీపికకు మూలగ్రంథమగు శ్రీభాష్యములో శ్రీరామానుజులు పలుతావులందు ముక్తుని స్థితి. బ్రహ్మ (నారాయణ) సామ్యమని ఆరణ్యక ఉపనిషత్ భగవద్గీతా ప్రమాణములతో నిరూపించిరి. మరియు శరణాగతి, వైకుంఠ గద్యలలో ఉజ్జ్వల భక్త్యావేశముతో కూడిన అంతర్దృష్టితో దాని స్వరూపమును చిత్రించిరి. దానినిట్లు సంగ్రహింపవచ్చును:- ముక్త పురుషుడు తాని లోకమున నెట్టి ధ్యానముతో నుండెనో. ఈ లోకమునుండి బయల్వెడలియు అట్టి గతియే కలవాడై-(శ్రీ.భా. 3-3-52; ఛాం. ఉ-3-14-1); విరజా నదిని దాటి శ్రీ. భా. 3-3-27; కౌషీ. ఉ. 1-3-4); బ్రహ్మలోకమును పొంది- (శ్రీ.భా. 3-3-36; ఛాం.ఉ-8-13-1); పరమపురుషుని సాక్షాత్కరించుకొని, అతనితో పరమ సామ్యమును పొంది- (శ్రీ.భా. 3-3-57; ముం.ఉ. 3-1-3); అతనిని ఏ భావనతో నుపాసించెనో అట్టివాడై- (శ్రీ.భా. 4-4-17; 4-4-21); అతనితోపాటు సమస్త కళ్యాణగుణముల ననుభవించును (శ్రీ.భా.4-4-4: తై-ఆర-1-2) ఈశ్వరుని సాధర్మ్యమును, సాహిత్యమును, సామ్యమును పొందును. (శ్రీ.భా. 4-4-4; భ.గీ. 14-2) స్వస్వరూపావిర్భావము కలవాడై- (శ్రీ.భా. 4-4-1) స్వ సంకల్పానుగుణముగా శరీర రహితుడును, బహుశరీర సహితుడు నగును- (శ్రీ.భా. 4-4-12: 4-4-15) అన్ని లోకములందును యథేష్టముగా సంచరించును. (శ్రీ.భా. 3-3-30) పరమ పురుషునివలె క్రీడారసమనుభవించును.

ఈ స్వ స్వరూపావాప్తి రూపమగు మోక్షము భగవత్ప్రసాదము వలననే కలుగును[62]. (శ్రీ.భా. 3-2-37) బ్రహ్మ సామ్యాపత్తియే మోక్షమగుటచే నీ మతమున మోక్షమనగా, జీవి పరిపూర్ణ వికాసాభివ్యక్తి అని ఏర్పడును. సాంఖ్యయోగ కైవల్యములోవలె యథా పూర్వస్థితిని చేరి నిష్క్రియుడై ఏకాకి గాకుండడు. సృష్టి, స్థితి, చేష్టలు, మోక్షము- ఈ దశలన్నియు ఈశ్వర సంకల్పితమగులీల. జీవుని భ్రాంతివలన, అధ్యాస వలన కలిగినవి కావు. ఈ సమస్త దశలు జీవుని పరిపూర్ణ పరిణామమునకై ఉద్దేశింపబడినవి.

## శరణాగతి- వైకుంఠ గద్యలు

ఈ గద్యలలో శ్రీ రామానుజులు మహనీయ భక్త్యావేశ జనితమగు అంతర్దృష్టితో జీవుని ప్రాప్యస్థానమగు వైకుంఠమును అందలి నారాయణుని పరిజనమును అతని దివ్య మంగళ విగ్రహమును కనులకు గట్టినట్లు చిత్రించిరి. శరణాగతి గద్యలో ముక్త జీవులు నారాయణుని పరివేష్టించి, పరిపూర్ణ, అనవరత నిత్య విశదతమ- అనన్య ప్రయోజన- అతిశయప్రియ- భగవదనుభవజనిత- ప్రీతి కారిత, నిత్య కైంకర్యానంద మనుభవించుటను వర్ణించిరి. వైష్ణవ మతమున జీవి ప్రధాన లక్షణము శేషత్వమే (పారతంత్ర్యము). అతని ముక్తియు నట్టిదే!

ఇట్లు విశిష్టాద్వైతుల పరమ పురుషార్థము భగవత్సాక్షాత్కార, సామ్య, కైంకర్యరూపమై యున్నది. వైకుంఠ గద్యలో శ్రీరామానుజులు తనకీ సుఖమెప్పుడు కలుగునా? ఎప్పుడు కలుగునా? (కదా హం, కదా హం) యని ఉత్కంఠతో తపించును[63]

---

62 *ఫలమత ఉపపత్తే* - *ఆం. శ్రీ. భా. 3-2-37. సం.2, పు.71: ప్రాపకుమమ్ . . . . అవనే - (లభింపజేయువాడును అతడే). శ్రీవచన భూషణమ్- 3-70- కందాడై శేషాచార్యుల ఆంధ్రీకరణ 1925.*

63 ముక్తుని స్థితి పిళ్లై లోకాచార్యులు 'అర్చిరాది' అనుగ్రంథమున విస్తరించి వర్ణించెను. యోగి విష్ణుచిత్తుడు - విశిష్టాద్వైత పూర్ణయోగము - యోగము

## విష్ణు చిత్తుని నిష్ఠ × యోగము

విష్ణు చిత్తుని నిష్ఠ ఆముక్తమునందు ద్వయమంత్ర జపము, శాంతి, దాంతి పరతంత్రత, మాలికాకరణకైంకర్యము (1.77.78) ఆలయ, ఆరామ, క్షాళనము, ఆలయ సమ్మార్జనము, జలాహరణము, శృంగార పల్యంకికావహనము, ధ్వజ గ్రహణము, వీవన, గొడుగులను దాల్చుట, దీపికారోపము చేయుట,- అని. అతడే రెండవ యాశ్వాసములో మన్ననారునకు విన్నవించును-2-90-91 మఱియు సంవత్సరము పొడువున ఆయా ఋతువుల కనుకూలమగునట్లు అతిథి, భాగవతులకు నడిరేయి వరకు పిండివంటలు, పాయసములతో తృప్తిగా నాహారము నర్పించి, శనివారములందు అభ్యంగనముల నమర్చి, నడు రేయి వరకు విష్ణుకథలు, దివ్య ప్రబంధములు అనుసంధించుచు భగవద్భాగవతార్చన పరుడై యుండును.(1.78-84)

ఈ నిష్ఠలేవియు అష్టాంగ సాధనతో కూడిన అతని యోగమునకు సంబంధించినవి కావు. అవి బహిర్ముఖక్రియలు. జగదంగీకార మతమగు పాంచరాత్ర చర్యాపాదమునకు సంబంధించినవి. అతని యోగము, అంతర్ముఖధ్యానము జగన్నిరాకరణ దర్శనమగు సాంఖ్య సంప్రదాయమునకు చెందినది.

<u>సాధనల సమన్వయము:-</u>

ఇంతవరకు విష్ణు చిత్తుని మంత్ర, యోగ, సంవిత్ నిష్ఠలు మౌలికముగా భిన్న సంప్రదాయములకు చెందినవనియు, తత్త్వ, హిత, పురుషార్థములలో పరస్పర విరుద్ధములనియు గుర్తించితిమి. అయినచో నివి ఒకే సాధనలో ఎట్లు, ఎప్పుడు ఎందుకు గుది గుచ్చబడిన వను ప్రశ్న కలుగును. ఇందుకు తృప్తికరమైన సమాధానము మనకు భారతీయ మతములను, దర్శనములను, చారిత్రక పరిణామ దృష్టిలో పరిశీలించినగాని లభించదు. ఈ పరిశీలన వలన మన మతములు, దర్శనములు వేలకొలది సహ జీవనము వలన పరస్పర ప్రభావితములై రూపాంతరము పొందెనను ముఖ్యవిషయము గుర్తింపగలము. కాని, ఇది బృహత్తర మగుటచే ఇచట రేఖామాత్రముగనే దర్శింపగలము.

# యోగి విష్ణు చిత్తుడు
# విశిష్టాద్వైత పూర్ణ యోగము

**యోగము:-**

యోగ శబ్దము యుజ్ - ధాతువునుండి ఏర్పడినది. కూటమి, కలయిక- అను అర్థము గలది[1]. మనస్సును ఆత్మతోను, (పతంజలి), ఆత్మను పరమాత్మతోను, (అద్వైతులు), లేక ఈశ్వరునితోను (శైవులు- వైష్ణవులు) లేక దేవితోను (శాక్తులు) కలుపు సాధనలన్నిటికి నిది వర్తించును. వివిధ యోగ గ్రంథములలో, వందకుపై చిలుకు యోగ సంప్రదాయములు కనుపించును. ఇవన్నియు మంత్ర, హఠ, రాజ, లయ, యోగములను నాలుగు వర్గములకు చెందును[2]. కాని గీతాచార్యుడు కర్మ, జ్ఞాన, భక్తి, సాధనలు గూడ పరమేశ్వర సంయోగమును కలిగించున వగుటచే వానిని గూడ యోగ శబ్దముతో పేర్కొనును. ఈ విస్తృతార్థమున విశిష్టాద్వైత మత ప్రయోజనము కూడ జీవేశ్వర సంయోగమగుటచే దానిని కూడ యోగమనవచ్చును.

**పూర్ణయోగము:-**

పూర్ణయోగమను పదము ఇటీవల శ్రీ అరవిందుల వలన ప్రసిద్ధి బడసినది. ప్రతి యోగ సంప్రదాయమునందు యాదార్థ్యమును గూర్చియు, దానిలో మానవుని స్థానమును గూర్చియు, ఒక సిద్ధాంతము ననుసరించి మానవుడు పొందవలసిన పరమ

---

1 ఇది - నేటి ఆంగ్లములో కలుపుట, జతపరచుట - అను అర్థముగల *Yoke* అను క్రియా పదమును పోలిన ఆర్య భాషా పదము ప్రాచీన ఆంగ్లములో *GEOC* డచ్చి భాషలో *JUK*, జర్మనులో *JOCH*, లాటిన్‌లో *JUGUM*, గ్రీకులో *JUGON*, సంస్కృతములో యుగం అను పదములు సమానార్థకములు-

2. వీనిని *i*. శైవ, వైష్ణవ, శాక్తాది సేశ్వర్యయోగములుగను. *ii*. పాతంజల, జ్ఞాన, వేదాంతాది ఆధ్యాత్మిక *(metaphysical)* యోగములుగను. *iii*. సాంఖ్య, జైన, బౌద్ధాది నిరీశ్వర యోగములుగను, వర్గీకరించవచ్చును.

ప్రయోజనము (పురుషార్థము)[3] ఆ ప్రయోజనమును సాధించునుపాయములు (హితము), ప్రధాన భాగములుగా నుండును. విశిష్టాద్వైత పరిభాషలో వీనిని తత్త్వ, హిత, పురుషార్థములందురు. ఆ మత మీమూడు విషయములందు పరిపూర్ణతను లక్షించుటచే దానిని విశిష్టాద్వైత పూర్ణయోగమున వచ్చును. ఈ విషయముల నొక్కొక్క దానినే పరిశీలించినచో నిది స్పష్టపడును.

<u>తత్త్వ సమగ్రత:-</u>

భారతీయ దర్శన కారులు యాదార్థ్యమును (reality) గూర్చిన విచారణలో- ప్రకృతి, పురుషులు, ఈశ్వరుడు, అనెడి మూడు మూల తత్త్వములను గూర్చి చర్చించిరి. (1) వీరిలో కొందరు జగద్వ్యాపారము అనాత్మమగు మానసిక, భౌతిక స్కంధముల సంఘాతముచే జరుగుచున్నదని భావించిరి. వీరు ఆత్మను, ఈశ్వరుని ఒప్పరు (బౌద్ధులు). (2) కొందరీ జగద్వ్యాపారము ప్రకృతి- పురుష- (పుద్గల-జీవ) సంయోగము వలన జరుగుచున్నదని ఊహింతురు. వీరు కూడ ఈశ్వరునొప్పరు (సాంఖ్యులు- జైనులు). (3) మరి కొందరు జగత్తు, జీవులు, ఈశ్వరుడు అన్నియు మిధ్యా కల్పనలేనని, నిర్విశేష చిన్మయ బ్రహ్మమొక్కటే సత్యమని వాదింతురు (అద్వైతులు).[4] ఈ యందరి కన్న భిన్నముగ విశిష్టాద్వైతులు చిదచిదీశ్వర తత్త్వముల మూడింటిని అంగీకరింతురు.

వీనిని గూర్చియే, విష్ణు చిత్తుడాచార్య కృపవలన తెలిసికొన్నది. ప్రకృతి కన్న తాను పరుడు. తనకును ఈశ్వరునకును అనాద్యమగు శేష-శేషిత్వ సంబంధము కలదు. (1-78) ఇట్లా చార్యుని వలన సూత్రప్రాయముగ తెలిసికొన్న జ్ఞానమే అతని

---

3 *తై. ఉ. 3.11, 6.2: బృ. ఉ. 5.7, 3.23? ము.ఉ. 7.1: ఛాం.ఉ.-6.3.2.-* ఇత్యాదులను శ్రీరామానుజులు శ్రీ భాష్యములో జిజ్ఞాసాధికరణమున మహాసిద్ధాంతమునందు - *(1.1.1)* ఆకాశ, ఇంద్ర, ప్రాణ, అంతర్యామి, ప్రకృత్యధికరణాదులందు పదే పదే యుదహరించును. శ్రీ. భా.

4 అంశ- అంశి, ఆధార - ఆధేయ, నియంత, నియామ్య, విశేషణ- విశేష్య, ప్రకార- ప్రకారి, శేష-శేషి, ఇత్యాదులు *M.Y.* పు. *82-89.*

యంతరంగమున పరిపక్వమై గుప్తముగ నుండెను. దానినే అతడు దైవాదేశమువలన పాండ్యరాజ సభావాదములో బహిరంగముగ నుపన్యసించెను. ఆ యుపన్యాస మందతడు చిదచిదీశ్వర తత్త్వముల సంబంధము నిట్లు వర్ణించెను.

**జగత్పరిణామము:-**

ఆదిలో నారాయణు డొక్కడే ఆయెను. బ్రహ్మలేడు. భూమ్యాకాశములు లేవు. సూర్య చంద్రులు లేరు. నక్షత్రములు లేవు. నీళ్లులేవు. అగ్నిలేదు- అట్లుండగా నారాయణుడు - "లీలకు ఏకాకిత ఒప్పదు. పెక్కయ్యెదను"- అనుచు చిద చిత్తులందు చొచ్చి అట్లయ్యెనని ఛాందోగ్యము తెలుపును. (3.10) ఆత్మయు అవని, గగనాదులు నగు నఖిల చిదచిత్ప్రపంచము అతని శరీరములే. నారాయణుడే చేతనునకు మాత, పిత. భ్రాత, నివాసము. శరణము. సుహృత్తు, గతి-(3-13). సకల ప్రపంచమును, విష్ణుశక్తి సమన్వితమై, అతని శరీరమై యుండెను. అట్టి విష్ణు శక్తులలో కర్మ శక్తివలన వేష్టితమైన క్షేత్రజ్ఞశక్తి, కర్మానుగుణములగు శరీరముల నెత్తి, విజ్ఞాన తారతమ్యముల నొందును(3-79). ఆ శక్తి, ఆ ప్రాణులలో ఒక్కించుక యుండును, ఆ జాతికంటె తరుగుల్మాది స్థావరశ్రేణియందు, అంతకంటె ఎఱ్ఱ రోకటి బండ, మన్నిండి పాము, మొదలగు ప్రాకెడి ప్రాణులందు అంతకంటె ఆకాశగమనములగు పక్షులందు, వానికంటె వన్యమృగములందు, అంతకంటె ఏనుగు, గోవు, మొదలగు సాధు పశు సంతతియందు, అంతకంటె మర్త్యులగు మానవ సమూహములందు, అంతకంటె యక్ష, గంధర్వ నాగాళియందు, అంతకంటె దేవతలయందు, అంతకంటె దక్ష ప్రజాపతియందు, అంతకంటె ఆద్యుడగు హిరణ్యగర్భునందు ఉండును.(3.80) ఇట్టి రూప కోటులెల్ల ఆ విష్ణుని తనుచయములే. అతడచింత్యశక్తితో నిఖిల భూతములయందు నాకసమువలె నిండి యొసగును. (3.81). ఇదియే విష్ణు చిత్తుడు తెలిపిన చిదచిదీశ్వర సంబంధము. దానివలన నేర్పడు జగత్పరిణామ క్రమము.

<u>శరీర- శరీరి సిద్ధాంతము:-</u>

చిదచిత్తు లీశ్వరుని శరీరమని, అతడు వానిని ధరించెడు శరీరి (ఆత్మ) యని తెలిపెడి ఉపనిషదర్థ విశిష్టాద్వైతమునకు కీలకమగు ప్రతి తంత్రము. దీనిని విశిష్టాద్వైత దర్శన కారులనేక ప్రతి ప్రమాణములతో అనేక విధములుగా[5] విశదీకరించిరి. చిదచిత్తు లీశ్వరుని కన్న భిన్న తత్త్వములయినను అతని నుండి విడదీయరాని స్వతః సిద్ధమగు (అపృథక్సిద్ధ) సంబంధముగలవై ప్రళయ కాలమందు నామరూప చేష్టారహితమగు సూక్ష్మావస్థకు చేరును. సృష్టికాలమున నామరూప చేష్టా సహితమగు స్థూలావస్థను పొందును. ఈ రెండు దశలలోను అవి ఈశ్వరుని శరీరమే- అతనికి ధార్యములు, అనగా అతని యొక్క స్వరూప సంకల్పములను విడిచినప్పుడు అవి సత్త లేనట్లుండును[6] చిదచిత్తు లీశ్వరుని అంశలు, విశేషణములు, ప్రకారములు నగుటచే - నిజమునకీశ్వరుడొక్కడే తత్త్వము[7].

<u>సగుణ- నిర్గుణ:-</u>

మొదట అద్వితీయముగ నుండి, అనేక మయ్యెదనని సంకల్పించి, అట్లయిన దానిని ఛాందోగ్యము సత్-అని పేర్కొనును.[8] ఇచట సత్ శబ్దముచే తెలుపబడిన దానినే నారాయణోపనిషత్తు పురుష నారాయణుడని పేర్కొనును[9] విష్ణు చిత్తుడీ

---

5 *శ్రీ. భా. 2.3.17- ఆత్మాధికరణము- సం.2 పుట. 186.*

6 *తత్త్వత్ర. సూ. 1.39. ధార్యమాకై యావతు అనిమద్రైయ స్వరూప సంకల్పంగళై యొళ్ళిన్ద పోయుతన్ సత్తై యిల్లై యాద్పడి యిరుక్కై.*

7 *S.R. పు. 44. అశేష చిద చిత్ప్రకారం బ్రహ్మైక మేవ తత్త్వం. వేదాంత దేశికులు - న్యాయ సిద్ధాంజనము.*

8 *సత్ ఏవ సోమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయమ్.*
*తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత*
*తదపోఽసృజత . . . . ఛాం. ఉ. 6.2- వే. వేం. శా. పు.205*

9 *ఓమ్ । అథ పురుషోహవై నారాయణోఽ కామయత ।*
*ప్రజాః సృజేయేతి । నారాయణాత్ ప్రాణో జాయతే . . . .*
*నారాయణోపనిషత్తు - వే. వేం. శా. పు. 205.*

సత్, నారాయణ పదముల కైక్యమును కల్పించి నారాయణుడే సృష్టిని సంకల్పించెనని తెల్పి, నిర్గుణ సగుణములను సమన్వయించును. (3.10).[10] ఆ పిమ్మట ఆ నారాయణుడు ధ్యానయోగ్యమగు రూపము కలవాడని తెలుపును. ఈ విధముగ నతడు ఉపనిషద్బ్రహ్మ చింతనను సగుణారాధనతో సంబంధింప జేయును. దీనిని విపులీకరించుచు అతడిట్లు చెప్పును:- (1) సత్ శబ్ద వాచ్యమగు పరబ్రహ్మము ఇట్టిదట్టిదని వచించుటకు గోచరమును కానిది. ఆత్మ సంవేద్యము, జ్ఞానైక నిరూపణీయము నగుటచే జ్ఞాన శబ్ద వాచ్యము గూడ అగును. బ్రహ్మాత్మకమగుట వలన బ్రహ్మ సంజ్ఞయు పొందును. (3.79). (2) అట్టి పరబ్రహ్మమునకు ద్వితీయమై విష్ణు సంజ్ఞితమగు అమూర్త రూపమొకటి కలదు. అది యోగి హృద్ధ్యేయము. దానినే ప్రాజ్ఞకోటి సత్ సంజ్ఞతో వచించును. ఆ రూపము సమస్త శక్తులకు ఆశ్రయము (3.82). దేవ మానవ పశు పక్ష్యాది చేతనములతోను, అద్రి సముద్రాది అచేతనములతోను కూడిన స్థూల విశ్వరూపమున కన్న, అది విలక్షణమైనది. కల్యాణ గుణ భూతి గరిమతో తనరునది. అతి మహత్త్వముతో వెలుగునది. అట్టి శక్తులతో అలరెడి ఆ బ్రహ్మము జగదుపకృతి కొరకు తన లీలచే దేవ తిర్యఙ్మనుష్య నామ చేష్టలతో గూడిన యవతారములను కల్పించుచుండును.

ఇట్లు విష్ణు చిత్తుడు సత్ సంజ్ఞితమగు పర (నిర్గుణ) బ్రహ్మమే పురుష నారాయణుడని, ఆ పరబ్రహ్మమునకు యోగి హృద్ధ్యేయమును, విష్ణు సంజ్ఞితమును అగు అమూర్తరూపము కలదని తెలిపి, ధారణ ధ్యాన విషయమగు ఆ విష్ణుని శుద్ధ స్థూల రూపము నాపాద మస్తకముగా వర్ణించి (3.82, 84, 85) దానిని ధ్యానించు పద్ధతిని వివరించును. (3.86) ఇట్లతడు జగద్వ్యాపారమున ప్రకృతి-పురుష- ఈశ్వర తత్త్వములను మూడింటినంగీకరించి, వానిని శరీర- శరీరి సంబంధముచే నెనుబంధించి,

---

*10* స్వరూపము:- జ్ఞానానందములు; రూపము: శ్రీ నీళా భూ సమేతమగు దివ్య మంగళ విగ్రహము; గుణములు: జ్ఞాన శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజో, దయా, వాత్సల్య, సౌశీల్య, సౌలభ్యాదులు- త. త్ర. ఈశ్వర ప్రకరణము. సూ. *1,6,8,11.*

సగుణ- నిర్గుణముల నేకీభవింపచేసి- తత్త్వచింతనను మూర్తి ధ్యానముతో జతచేసి విశిష్టాద్వైతమునకు తత్త్వ సంపూర్ణతను కలిగించెను. ఈ సగుణ సమన్వయము మనకు ఆముక్తమున ఏడవయాశ్వాసమున విష్ణుచిత్తుడు రంగనాథుని అర్చామూర్తిని (సగుణమును) ఆపాద మస్తకము దర్శించి, ఆ వెంటనే- అణువు కన్న చిన్నదగు పరస్వరూపమును ( నిర్గుణమును) స్తుతించునపుడు మరింత విశదముగ తెలియును. (7-34-40)

II పురుషార్థ సమగ్రత:-

ముముక్షువగువాడు జగద్వ్యాపారమునకు మూలములగు తత్త్వత్రయమును గూర్చి, వానిలో జీవుని స్థానమును గూర్చి, తెలిసికొన్న పిదప, తన పరమ పురుషార్థమగు మోక్షమును గూర్చి విచారింపసాగును. అజ్ఞానము వలన, రాగద్వేషాదుల వలన, జరామరణాదుల వలన, దుఃఖభూయిష్ఠమై, కర్మ ప్రవర్తితమగు సంసార చక్రమునుండి తొలగుటయే మోక్షమని, భారతీయ మతములన్నియు నంగీకరించును. కాని, జగద్వ్యాపారమును నడిపించు తత్త్వములను గూర్చిన భేదాభిప్రాయముల ననుసరించి, వాని మోక్ష భావనలు గూడ భేదించును. దీనిని తులనాత్మకముగ పరిశీలించినచో విశిష్టాద్వైత మోక్షభావన యొక్క సమగ్ర స్వభావము తెలియును.

(1) స్వర్గము:- (కర్మమీమాంస)

ఈశ్వర ప్రమేయములేకనే జగద్వ్యాపార మెల్లప్పుడు సాగుచునే యున్నదనియు యజ్ఞాది పుణ్యకర్మల వలన కలుగు అపూర్వ శక్తి వలన స్వర్గ సుఖముల ననుభవించుటయే మానవుని పరమపురుషార్థమని కుమారిలునకు పూర్వులగు కర్మమీమాంసకులు భావించిరి. వీరి సిద్ధాంతములో ఇహము నందు వలెనే స్వర్గమందు కూడ ఈశ్వర తత్త్వమునకు స్థానములేదు. మరియు, కర్మవలన కలుగు స్వర్గాది ఫలము క్షీణించిన వెంటనే పురుషుడు మరల జన్మమెత్తవలసి యుండును. అందుచే వారి మోక్ష సిద్ధాంతమసమగ్రమగును.

**2). కైవల్యము:-**

ఇట్లే, సాంఖ్య, యోగ, జైనమతములవారు ఈశ్వర ప్రమేయములేని ప్రకృతి పురుషుల సంసర్గము వలననో, (సాంఖ్యము, యోగము), లేక జీవునిలోనికి కర్మ పుద్గలము ప్రవేశించుటవలననో (జైనులు) - జీవి, సంసార చక్రమున చిక్కుకొనునని యు, పురుషుడు కేవలము తనకు తానై యుండుటయే మోక్షమనియు (కైవల్యము) అందురు. వీరి కైవల్య భావనలో ప్రకృతి తత్త్వము, ఈశ్వర తత్త్వము- ఉండును, లోపించును. మరియు ముక్త పురుషులకు పరస్పర సంబంధము లుప్తమగును. ఇందువలన వీరి కైవల్య భావన అసమగ్రమగును.

**3). నిర్వాణము:-**

ఇక, బౌద్ధుల భావనలో సంసార చక్రము ఆత్మ తత్త్వములోను, ఈశ్వర తత్త్వములోనూ నిమిత్తములేకనే తృష్ణా చోదితములగు మానసిక, భౌతిక. స్కంధాదుల సంఘాతము వలన నేర్పడి దుఃఖమయముగా వర్తించును. తృష్ణా భేదనము వలన సంసరణ దుఃఖము ముగియును, దుఃఖనాశనమే వారి మోక్షము, నిర్వాణము. దుఃఖనాశనమయి యేమి కలుగునో దాని నిర్దిష్ట స్వరూపమును సాధారణముగా వీరు నిర్వచించరు. మరియు వ్యక్తి నశించుటచే తృష్ణా నాశనములో పాటు స్కంధ సంఘాతమగు నిర్వాణము ననుభవించు వాడెవడో వీరు చెప్పరు. మరియు వీరి నిర్వాణములో ప్రకృతి ఈశ్వర తత్త్వములకు కూడ స్థానములేదు. ఇందువలన బౌద్ధుల నిర్వాణభావన కూడ అసమగ్రమేమగును.

**4). బ్రహ్మైక్యము:-**

అద్వైత- మాయావాదుల దృష్టిలో- జగత్తు, జీవుడు, ఈశ్వరుడు జగద్వ్యాపారము 'సర్వము అవిద్యా కల్పితములు' నిర్విశేష చిన్మాత్రమగు బ్రహ్మైక్యమే మోక్షము, లేని ప్రపంచములో లేని జీవికి లేని బంధము తొలగునమట మోక్ష యత్నమునకే విరుద్ధము, మరియు వీరి మోక్షదశలో జగత్తు, జీవులే కాక, ఈశ్వర తత్త్వము కూడ లుప్తమగుట వలనను వీరి భావన కూడ అసమగ్రమే యగును.

5). సాయుజ్యముక్తి:-

పైన తెలిసిన స్వర్గ, కైవల్య, నిర్వాణ, బ్రహ్మైక్య రూపములగు మోక్ష సిద్ధాంతముల కన్న వేరయినది విశిష్టాద్వైతుల పరమ పురుషార్థభావనము. అది తత్త్వత్రయమును గూర్చిన వారి ప్రాథమిక సిద్ధాంతము ననుసరించి యేర్పడినది. వారు సంసార దశలోను, మోక్షదశలోను కూడ అవినాభావ సంబంధితములగు చిదచిదీశ్వర తత్త్వత్రయము (ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు) నంగీకరింతురు. వానిలో దేనిని నిషేధింపరు.

ఈశ్వరుని స్వరూప, రూప, గుణము లెప్పుడును పరిపూర్ణములే.

తత్త్వ సమగ్రత:-

ప్రకృతి, పురుషులు (జీవాత్మ) లీలావిభూతి- (ఇహము) ఇందు అపరిపూర్ణములై యుండి మోక్ష పదమగు నిత్యవిభూతులందు పరిపూర్ణతను పడయును.

ప్రకృతి:- ప్రకృతి రెండు రూపములు గలది. ఒకటి లీలా విభూతి (ఈ లోకము) యందలిది. రెండవది నిత్య విభూతి (పరమపదము)లోనిది. లీలా విభూతిలోని సత్త్వ రజస్తమోగుణ మిశ్రమము. దీనినే అవిద్య, మాయ, యని కూడ వ్యవహరింతురు. ఇది సృష్టి, స్థితి, లయ రూపమగు భగవల్లీలకు ఉపకరణమై, దేశ, కాల సంబంధములగు వికారములను కలిగించును. కర్మ బద్ధులగు జీవులకు స్థానమై, వారి జ్ఞానానందములకు తిరోధాయక మగును. 'దేహమే' తామనుకొనుట- మొదలగు విపరీత జ్ఞానమును వారికి కలిగించును[11].

నిత్య విభూతి-(పరమ పదము)లో, ప్రకృతి రజస్తమస్సులు కలియని శుద్ధ సత్త్వరూపమున నుండును. జ్ఞానానంద జనకమై ముక్త జీవులకును, నిత్య ముక్తులకును పరమ పద నాథుడగు ఈశ్వరునకును స్థానమై యుండును. పరమ పదమున ముక్త జీవులు శుద్ధ ప్రకృతి నిర్మితములో గల ఆకారములను ధరింతురు. ఇవి కర్మాను సరణములు కావు. కేవలము భగవదిచ్ఛా భోగ్యములు. నిరవధిక తేజో రూపములు, అత్యద్భుతావహములు[12].

---

11 త. త్ర. అచిత్ ప్రకరణము

12 వై. పు. సూ. 9.10.

<u>జీవులు:-</u>

కర్మబద్ధులైన జీవులు లీలా విభూతిలో కర్మానుగుణములును ఈ మరణాది నిత్యవికారములును, మిశ్రమ ప్రకృతి దత్తములునగు శరీరములను ధరించి సంసార యాత్రను సాగింతురు. వీరి జ్ఞానప్రకాశము ఇంద్రియాదుల వలన సంకుచితమై ప్రసరించును[13].

<u>పురుషార్థ సమగ్రత:-</u>

కర్మబంధమునుండి ముక్తులైన జీవులు నిత్యవిభూతి యందు ఈశ్వర సామ్యమగు స్వరూప, రూపగుణములను పడసి[14] పరిపూర్ణులైన నిత్య ముక్తులతోను, ఈశ్వరునితోను, కలసియుండి ఈశ్వరాభిమత నిర్వాహకములగు సేవానందము ననుభవింతురు.

ఈ విధముగ విశిష్టాద్వైతుల పురుషార్థయోజన చిద చిత్తులకు పరిపూర్ణ పరిణామము నుద్దేశించును. ఈ పరిణామక్రమమును ఇంతకు పూర్వము గమనించితిమి. ఇది యాదృచ్ఛికముగా జరుగునది కాదు. ఈశ్వర సంకల్పమువలన నారంభమయ్యి ఈశ్వర ప్రసాదము వలన సిద్ధించునది[15]. ప్రళయ దశయందు అచిత్ (జడ) పదార్థములతో సమానముగా సూక్ష్మ రూపమున నణగియుండు జీవుల నీశ్వరుడు దయమాన మానసుడై కరణ కళేబరములతో చేర్చును[16] ఇది అతని లీల[17]. కరణ

---

13 *<u>త. త్ర.</u> చిత్ప్రకరణము. సూ. 43 (బద్ధులు), 67 (జ్ఞాన సంకోచము)*

14 *శ్రీ భూ నీళా నాయకత్వము, జగత్ సృష్టిస్థితి సంహార శక్తి జీవునికి కలుగదు.*

15 *అది నారాయణుండాయెనొక్కఁడు . . . . లీల నేకాకిత వనదు- పెక్కుఁయ్యెదనని సర్వ చిదచిద్విశ్వయుంబు సొచ్చి- (3-10); విజ్ఞానమున జేసి విషయాది వలన నెమ్మనమాహరించి బ్రహ్మము బరికింప వలయు నిశ్రేయసంబునకట్లు చింతింపనీఁడు తప్పింతకు నడు నాత్మలావంబిచ్చు నాకర్షకము విహార్యశ్శ్య సారము లార్చునట్లు- (3.74).*

16 *అచిద విశేషితాన్ ప్రళయ సీమని సంసరతః కరణ కళేబరైర్ఘట యితూ దయ మాన మనాః" <u>త. త్ర.</u> ఈశ్వర ప్రకరణము. సూ 21. పు. 177.*

17 *లోకవత్తు లీలా కైవల్యమ్ - <u>బ్ర.సూ.</u> 2-1-33.*

కళేబరములతో జీవులొనర్చు సర్వకర్మలు ఈశ్వరారాధన రూపములగుటవలన నవి వారి పూర్ణ స్వరూపావిర్భావమునకు తోడ్పడును. ఇట్లీశ్వరశక్తి చోదనము వలన జీవులు ధాతు దశ నుండి మానవదశకు చేరిన పిమ్మట- (3-10-79-80) వారీశ్వర సంకల్పములను గ్రహించి, అందుకు ప్రతి స్పందనగా ఈశ్వర సామ్యలబ్ధికై కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తి యోగముల ననుసరించి, అతనియందు లగ్న చిత్తులై, దేహ పతనానంతర మతని కృప వలన అతని స్వరూప, రూప, గుణ, సామ్యతను పడయుదురు.

ఈ విశిష్టాద్వైత పరమ పురుషార్థ (మోక్ష) భావన వారి తాత్త్విక భావన వలెనే సంపూర్ణ దృష్టికలది.

IV హిత సమగ్రత:-

విశిష్టాద్వైతుల తత్త్వ, పురుషార్థములవలెనే వారి హితము (మోక్షోపాయము) కూడ సంపూర్ణ పథకము కలది. అది మానవుని సమస్త సత్తకు విష్ణు సామ్యమును లక్షించును. అందుచే విశిష్టాద్వైతుల సాధన పద్ధతులు కూడ జీవుని సమస్త కోశములకు విష్ణు చైతన్యసమృద్ధిని కలిగించునవిగా రూపొందించబడినవి. విష్ణుచిత్తుని మంత్ర, యోగ, సంవిత్, నిష్ఠ లిట్టివే. ఈ బహుముఖ సాధనను పరిశీలించినచో అది సాధకుని అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములను విష్ణు (విశ్వ) చేతనాను భూతితో నింపి వానిని దివ్యీకృతములు చేయ నుద్దేశింప బడినదనియు, విశిష్టాద్వైత కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తుల కనుష్ఠాన రూపముగా సరిదిద్దబడినదనియు తెలియును. ఈ సమగ్ర సాధనవలన సాధకుని సమస్త కోశములు ప్రబుద్ధములై, తమనైజ గ్రహణశక్తి ననుసరించి విష్ణు తత్త్వమును వివిధ వైఖరులలో ననుభూతమొనర్చుకొనును. ఇది తైత్తరీయ, బృహదారణ్యకములలోని కోశబ్రహ్మోపాసనల నొకరీతిగా తలపింపజేయును.[18]

---

*18). అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్:*
*మనో బ్రహ్మేతి వ్యజానాత్: విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్.* *తై. ఉ. 3-2-5.*
*వాగ్వై బ్రహ్మేతి . . . . ప్రాణోవై బ్రహ్మేతి . . . చక్షుర్ బ్రహ్మేతి . . .*
*శ్రోత్రం వై బ్రహ్మేతి : . . మనో బ్రహ్మేతి*
*హృదయాన్వై బ్రహ్మేతి . . . బృ. ఉ. 1.2.7.*

విష్ణు చిత్తుని సాధన నిపుడు విశిష్టాద్వైత కర్మ జ్ఞానాది మోక్షోపాయములతోను ఉపనిషత్ కోశములతోను సమన్వయించి చూతము.

**(1) విష్ణు చిత్తుని నిష్ఠ:- (కర్మ- అన్నమయ కోశము)**

ఇది విష్ణు చిత్తుని సమగ్ర సాధన సోపానములో మొదటి మెట్టు. విశిష్టాద్వైత మోక్షోపాయములలో మొదటిదగు కర్మకు అనుష్ఠాన రూపము. ఇది క్రియాశీలమగు, అన్నమయ కోశమునందు కైంకర్యరూపమగు విష్ణ్వనుభూతిని నెలకొల్పుట కనువుగ రూపొందించబడినది. ఈ కోశము స్థూల పదార్థములతో కూడుకొన్న దగుటచే దీనిలో జ్ఞాన ప్రకాశము మందముగ నుండును. కన్ను, చెవి, కాలు, చేతులు మొదలగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల దర్శన శ్రవణ, గమన-గ్రహణ, స్పర్శాది క్రియల మూలమున మాత్రమే యది వస్తు స్వరూపమును గ్రహింపగలదు. విలుబుత్తూరు చక్రపాణికి భవన దాస్యమును చేపట్టి విష్ణుచిత్తుడొనర్చు మాలికా కరణము, తీర్థ జలాహరణము దీపికారోహణము మొదలగు భగవత్కైంకర్యము లతని అన్నమయ కోశమును విష్ణుని అర్చా మూర్త్యనుభవముతో నింపును. ఈ కైంకర్యనిష్ఠ శరీరమును గూర్చియు, ఆరాధనను గూర్చియు, విశిష్టాద్వైతులకు గల భావన ననుసరించి యేర్పడినది. వారి దృష్టిలో- జీవునకు కరణ కళేబరములతో గూడిన విచిత్ర దేహ సంపత్తి ఈశ్వరారాధన కొరకు అనుగ్రహింపబడినది.[19] ఈ దేహము వలన చేయు సమస్త కర్మలు, ఈశ్వరారాధన రూపములు.[20] అట్టి యారాధన వలన కలుగు భగవదనుభవము వలన జీవి స్వస్వరూపావిర్భావమును పొంది, విష్ణు సామ్యమును పడయును. ఈ విధముగ విష్ణుచిత్తుని భగవత్కైంకర్య నిష్ఠ-జ్ఞాన ప్రకాశమున కనువుగాని అతని అన్నమయ కోశమును అర్చావతార అనుభూతితో నింపును.

---

19 *విచిత్రా దేహ సంపత్తి రీశ్వరాయ, నివేదితుమ్!*
*పూర్వమేవ కృతా బ్రహ్మాన్ హస్త పాదాది సంయుతా-*
*త. త్ర. ఈశ్వర ప్రకరణము. సూ. 21.*

20. *యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్*
*యత్త పస్యసి కౌన్తేయ, తత్కురుష్వ మదర్పణమ్ - భగ. 9-27.*

**(2). విష్ణు చిత్తుని ద్వైత సంవిత్తు:- (జ్ఞానము - మనోమయ కోశము)**

ఇది విష్ణు చిత్తుని సాధన సోపానములో రెండవమెట్టు. ఇదియే విశిష్టాద్వైత మోక్షోపాయములలో రెండవదియగు జ్ఞానము. ఇది తర్క వితర్కాత్మకమగు మనోమయ కోశమును విష్ణు తత్త్వావగాహనతో నింపును. ఈ కోశము విశ్లేషణ సమన్వయముల వలనను, శ్రవణ మననాది ధ్యాసల వలనను మాత్రమే తత్త్వమును గుర్తింపగలదు. అందుచే విష్ణుచిత్తుడు దీనిని వేద వేదాంత వాక్యజన్యమగు ద్వైత సంవిత్తునకు ఆలయము జేయును. వేద వేద్యమగు విష్ణు తత్త్వాను భూతితో నింపును.

**(3) విష్ణుచిత్తుని అశ్రాంత యోగము:- (భక్తి విజ్ఞానమయ కోశము)**

ఇది విష్ణు చిత్తుని సాధన సోపానములో మూడవ మెట్టు. విశిష్టాద్వైత మోక్షోపాయములలో మూడవదియగు భక్తికి అనుష్ఠాన రూపము. తైలధారవలె అవిచ్ఛిన్నమై దర్శన సమాకారమగు ధ్యానమే భక్తి. ఈ భక్తి పూరిత ధ్యానము ఆత్మ దర్శనాను కూలమగు విజ్ఞానమయ కోశమును విష్ణుని అమూర్త రూపానుభూతితో నింపుట కనువగు సాధన. ఈ కోశము అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములకు అంతరమైనది. జీవాత్మకు స్థానమైనట్టిది. అన్న, ప్రాణ, మనోమయ కోశములకు సహజమగు దేహేంద్రియ చిత్త విక్షేపముల కతీతమైనది. ఆ కోశములందు ప్రధానములగు రజస్తమము లిచట అత్యల్పముగ నుండును. వాని యందల్పముగ నుండు సత్త్వగుణ మిచట ప్రధానముగ నుండును. అందువలన నిది ఆత్మ దర్శనమునకొక నిర్మలమగు అద్దమువలె నుపయుక్తమగును. ఇది పర, అపర ప్రకృతులకు గడి సీమ. దీని నుండి క్రిందికి జూచు జీవాత్మకు అపరప్రకృతి సంసర్గమేర్పడి, దేహ-ఇంద్రియ-ప్రాణ-చిత్త వృత్తులతో తాదాత్మ్యభావన కలుగును. పైకి చూచినచో పరమాత్మ దర్శనము లభించును. ఈ దర్శనము పైన తెలిపిన తైలధారవలె నవిచ్ఛిన్నమై, దర్శన సమాకారమై, భక్తిపూరితమగు ధ్యాన పరంపర వలన కలుగును. ఇట్టి ప్రేమ పూరితమగు ధ్యానమువలన పరమేశ్వరు డాకర్షితుడై, సహజముగ నిర్మలమైనదియు, పరాపరములకు సంధి స్థానమైనదియు, యమనియమాది

యోగాభ్యాసమువలన సమస్త ప్రవృత్తి విక్షేపరహితమయి, పరమాత్మ దర్శన యోగ్యమైనట్టిదియు, అగు ఈ విజ్ఞానమయ కోశమున తనశుద్ధ సత్త్వాల రూపము నా యోగి అంతర్దృష్టికావిష్కరించును. ఇట్లు విష్ణుచిత్తుని అశ్రాంత యోగ మతని విజ్ఞానమయకోశమును విష్ణుని శుద్ధ సత్త్వాల రూప సాక్షాత్కారానుభూతితో నించును.

**(4) విష్ణు చిత్తుని ద్వయమంత్రము:- (ప్రవృత్తి- ప్రాణమయ కోశము)**

ఇది విష్ణుచిత్తుని సాధన సోపానములో తుదిమెట్టు. మోక్షోపాయములలో శ్రీమన్నారాయణుడే సిద్ధోపాయమని బోధించు ప్రపత్తికిది అనుష్ఠాన రూపము. రాగరసోత్సాహములకు నెలవగు ప్రాణమయ కోశమును[21] శ్రీనారాయణుల దివ్యప్రేమ తత్త్వానుభూతితో నింపుట కనువగు సాధన.

ద్వయమంత్రము[22] లోని శ్రీమన్నారాయణ శబ్దము. (శ్రీ+మత్+నారాయణ) శ్రీదేవితో నిత్య సంశ్లిష్టుడయి యుండు నారాయణుని తెలుపును. అతడు జీవుల కర్మములను తూచి, వాని ఫలమింతయని నిశ్చయించి, దానిననుభవింపజేయు నిగ్రహానుగ్రహ స్వతంత్రము కలవాడు. అతని యనుగ్రహము అతని నిగ్రహము చేత సంకుచితమై ఏదో ఒక సమయమున మాత్రమే ప్రకాశింపగలదు. శ్రీదేవి మాత్రము అనుగ్రహమే స్వభావముగ గలది. అనుగ్రహమెన్నడును సంకుచితము కాదు. ఆమె చేతనుల యపరాధముచే విముఖులైన ఈశ్వరుననునయించి అతడా యపరాధములను గణింపక వారియందు కృపాళువగునట్లు చేయును. మరియు ఆమె చేతనులు స్వకర్మానుగుణముగ ఈశ్వరుని యందు విముఖులై యుండుట తొలగించి,

---

21 ప్రాణోవై సమ్రాట్ పరమం బ్రహ్మ . . . . ప్రియమిత్యేన దుపాసీత . . . కా ప్రియతా యాజ్ఞవల్క్య? . . . ప్రాణ ఏవ- (ప్రాణమే ముఖ్యమైనది. పరబ్రహ్మ దానిని ప్రేమతో నుపాసింపవలెను. యాజ్ఞవల్క్య ప్రేమయనగానేమి? . . . ప్రాణమే ప్రేమ.) బృహ. 4.1.3.

22 శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే । శ్రీమతే నారాయణాయ నమః - అనునది ద్వయ మంత్రము.

వారికి భగవద్రుచిని కలిగించి భగవదాశ్రయమున కున్ముఖులను జేయును. ఇట్లు ఘటింప జేయుటనే పురుషకారమందురు. ఏ చేతమునకెప్పుడార్తి కలుగునో వాని నప్పుడే కృతార్థుని జేయుట కామె ఈశ్వరునితో నిత్య సంశ్లిష్టమై యుండును[23]. ద్వయ మంత్రాను సంధానము వలన విష్ణుచిత్తుడీ జగన్మాతా పితరుల ప్రేమను నిరంతరముగ స్మరించును. ఆ మంత్రమతని ప్రాణమయ కోశమునకు బాహ్యవృత్తియగు ఉచ్ఛ్వాస నిశ్వాస తరంగముల ద్వారా ఆ కోశమును శ్రీమన్నారాయణపరమప్రేమగుణామృతితో నించి దివ్యీకృత మొనర్చును.

ఈ విధముగ మంత్ర, యోగ, సంవిత్, నిష్ఠలతో కూడిన విష్ణుచిత్తుని సర్వతోముఖ సాధన అతని సమస్త కోశములను వాని వాని స్వభావములననుసరించి విశిష్టాద్వైత పూర్ణ యోగమునకు సాధన సమగ్రతను సమకూర్చుచున్నది.

<u>ముగింపు:-</u>

ఈ యధ్యాయారంభమున మనము విష్ణుచిత్తుని సాధనయందలి తత్త్వ, హిత, పురుషార్థములన్నియు సంపూర్ణతను లక్షించుటచే అది విశిష్టాద్వైత పూర్ణయోగ మనదగియున్నదని ప్రతిపాదించి, పిమ్మట వాని సమగ్రత నాయా శీర్షికల క్రింద పరిశీలించితిమి.

తత్త్వ విషయమందాయన జగద్వ్యాపారమునకు మూలమగు ప్రకృతి - జీవ- ఈశ్వర తత్త్వత్రయములలో నేనిని నిషేధించక, శరీర-శరీరి ప్రతితంత్రము వలన వాని పరస్పర సంబంధములను నిర్దేశించి, చిదచిద్విశిష్టమై సమగ్రమగు అద్వైత తత్త్వమును రూపొందించును.

హిత (ఉపాయము) విషయమందాయన జీవి అన్న, ప్రాణ, మనో, విజ్ఞాన మయ కోశములలో దేనిని ఉపేక్షించక, వాని వాని స్వభావముల కనుకూలములైన మంత్ర, యోగ, సంవిత్, నిష్ఠలతో కూడిన సమగ్ర సాధన నవలంబించును.

---

23). పురుష కారమును గూర్చిన విషయములు శ్రీ పిళ్లైలోకాచార్యులవారి శ్రీ వచన భూషణమునై మనవాళమా ముని వ్యాఖ్యాననుసరించి వ్రాయబడినవి. సూ. 6,7,8,10- ఇత్యాది.

పురుషార్థ విషయమందాయన మానవుని సమస్త సత్త దివ్యీకృతమై- విష్ణు సామ్య, స్వరూప, రూప, గుణ, పరిపూర్ణతను పొందు లక్ష్యమును స్వీకరించును. ఇది బృహదారణ్యక తైత్తిరీయాది ఉపనిషత్తులలోను, గీతయందు, బ్రహ్మ సూత్రములలోను దేహాంతమున బ్రహ్మవిదుడు పొందునని చెప్పబడిన అధికతర కళ్యాణమూర్తి[24], బ్రహ్మ సహానుభూతికి[25], విష్ణు సాధర్మ్యమునకు[26], విశిష్టాద్వైత దర్శనకారుల విపులీకరణ యునవచ్చును.

పరమేశ్వర సంకల్పమువలన యుగయుగములలో ధాతు, వృక్ష, జంతు దశలనుండి మానవదశకు పరిణమించిన జీవి, పరమేశ్వర సంకల్పితమైన నవీన పరిణామ క్రమముచే నాకర్షింపబడి పూర్వము కన్న శీఘ్రతరముగ పరిపూర్ణ మానవతను పొందుననెడి నేటి పూర్ణ యోగ సిద్ధాంతములతో[27] నీ విశిష్టాద్వైత పూర్ణయోగమును తులనాత్మకముగా పరిశీలించుట- ఆసక్తికరమగు పరిశోధనా విషయమగును.

---

*24 i). అన్యన్నవతరం కళ్యాణతరం రూపం కురుతే- ii). ద్వాదశాహవదు భయ విధం బాదరాయణోఽత:- (బృ.ఉ. 4.4.4. శ్రీ. భా 4.4.1.2)*

*25 బ్రహ్మ విదాప్నోతి పరం . . . . సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి- తై. ఉ. 3-1.*

*26 మమ సాధర్మ్య సమాగతాః- భగ. 14.2.*

*27 వీనిలో i).కుంభకోణమువారి భక్తరహిత తారక యోగము, ii). పుదుచ్చేరి వారి పూర్ణ యోగము. iii). Tiel Hard de Chardenయొక్క, క్రైస్తవ పరిణామ సిద్ధాంతము. ప్రసిద్ధములు.*

## రాజ సభకు విష్ణుచిత్తుని ప్రయాణము

**మన్ననారు ఆదేశము:-** మధురలో మత్స్యధ్వజునకొక పరదేశి విప్రుని సుభాషితము వినుట వలన పరతత్త్వాన్వేషణము గురించిన వింత యనుభవము గలుగగా, శ్రీవిల్లిబుత్తూరులో దైవోద్బోధ వలన అదే విషయమును గూర్చి విష్ణుచిత్తునకు అంతకన్న వింత యనుభవము కలిగెను. అతడొకనాడు తన నిత్య విధిననుసరించి మన్ననారుస్వామి వక్షస్థలమున "అతుల తులసీ సుగంధి మాల్యమును" చేర్పబోయెను. అపుడాస్వామి ఉదార గంభీర మధురోక్తితో పాండ్యరాజ సభా వృత్తాంతము నతనికానతిచ్చి యిట్లనెను. (2-88).

> **"నేడు మహామతీ, మధుర నీవు రయంబున జొచ్చి, యందు బాం**
> **డీడు దివాణము న్బిలువ నెంచిన, బ్రేలెడు దుర్మదాంధులన్**
> **బోఁడిమి మాన్చి, మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్;**
> **వాఁడును రోసివాఁడిహము, వైష్ణవుగా నొనర్పు నల్పునన్".**

ఈ యానతిలో మూడు భాగములు గలవు. సూక్ష్మబుద్ధియగు విష్ణుచిత్తుడు వీని నెట్లు గ్రహించి, క్రమము తప్పక నిర్వహించెనో ముందు చూడగలము. ఇచట స్వామి 'మహామతీ' అని సంబోధించినట్లు చెప్పుటలో గల మెలకువ గమనార్హము.

విష్ణుచిత్తుని ప్రవేశపెట్టిన పద్యములోనే అతడు వేద వేదాంతములను పఠింపకనే వాని వలన గలుగు జ్ఞానమును చక్కగా గ్రహించెనని కవి చెప్పెను. దీని భావము, విష్ణుచిత్తుడు వేద వేదాంతములను గురు ముఖముగా పఠింపకున్నను, వానితో తగు మాత్రపు పరిచయము కలదనియు, అవి అతని అంతశ్చైతన్యమున సమన్వితము అయ్యెననియు చెప్పికొంటిమి. విష్ణుచిత్తుడిట్లు ఇతరులకూహింపరాని జ్ఞానము గల వాడయినను (దుర్విభావ బోధుండు-1-78) అంతర్యామియగు మన్ననారునకిది తెలియనిది కాదు. (అంతర్యామివి నీ వెఱుంగనియది లేదు-5-57) కనుక మహామతీ' యని సంబోధించెను. కాని హనుమంతునివలె విష్ణుచిత్తుడు కూడ నితరులు ప్రబోధించనిదే స్వశక్తి నెఱుగడు, అతనిని మేలుకొలుపుటకే ఈ సంబోధన ఉద్దేశింపబడినట్లు తోచును.

**విష్ణుచిత్తుని వడకు:-**

విష్ణుచిత్తునకీ యనుభవము సరికొత్తది. అతడిదివరకెడతెగని యోగపులంకెలతో తన చిత్తమున విష్ణువను ఏనుగును బంధించుట మాత్రమెఱుగును. (ఆక్రాంత యోగాంధూ బద్ధ మధు ద్విషద్ద్విరదుడు. 1-77). అది ప్రధానముగా అతని స్వప్రయత్నము వలన సాధించిన అనుభవము. స్వప్రయత్నము లేకనే విష్ణు ప్రభావము వలన కలుగు అనుభవము నతడెఱుగడు. మరియు, అర్చావతారమున పరమేశ్వరుడు స్వసంకల్పితమగు మౌనసమాధి వీడి శ్రవణగోచరముగా పలుకుట నతడెన్నడు నెఱుగడు. ఉన్నట్లుండి స్వామి గంభీర కంఠధ్వనిని వినగానే అతడు వడ వడ వడకెను. ఇది శారీరకమగు చేష్ట. ఇందుకు కారణము మానసికమగు భయము. అర్జునునకు విశ్వరూప సందర్శనము వలన కలిగిన మహా భయమిట్టిదే! నిరక్షరాస్యుడగు మహమ్మదు ప్రవక్తను ఖురానును పఠింపుమని దేవదూతయగు గాబ్రియేల్ ఆదేశించినపుడతనికి కలిగిన దిట్టి భయమే. దైవ దర్శనమో వాక్ శ్రవణమో కలిగినపుడత్యంత భయముతో పాటు, ప్రబలమగు ఆకర్షణ కలుగునని ఇటీవలి మత, శాస్త్ర వ్యాఖ్యాతలు గుర్తించినదే. (The Holy- Mysterium Tremendon by Rudolph Otto)

**విష్ణుచిత్తుని ప్రణామము:-**

విష్ణు చిత్తుని మానసిక భయము వలన శరీర కంపము కలిగి అతడు నిలుచుండ జాలక పోయెను. వడ వడ వడకుచు నతడు స్వామికి సాష్టాంగ నమస్కారము చేసెను. సాష్టాంగములో సర్వాంగములు భూమిని తాకుట వలన అతని శరీర కంపముడిగెను. దానితోపాటు మానసిక భయము తగ్గెను. స్వామి కంఠధ్వనిని తాను వినగలుగుట ఒక దివ్యానుభవమని అతనికి తోచెను. అట్టి మహాద్భాగ్యమునకు మనస్సు హర్షముతో పొంగెను. అది శరీరముపైకి వ్యాపించి, సమ్మదాశ్రులను, పులకలను ముప్పిరింపజేసెను. స్వామి కరుణను గుర్తించి అతని హృదయము భక్తితో నిండెను. అతడు సాష్టాంగమునుండి లేచెను. కాని, భక్తి వలన దేహము వినయముతో ముందుకు వంగెను. అపుడతడు కొంత తెప్పరిల్లి స్వామికి తన భావమును విన్నవింప సాహసించెను. ఈ మానసిక శారీరకానుభవ క్రమము నంతటిని రాయల వారొక చిన్న తేట గీతిలో నద్భుతముగా వర్ణించిరి.

***అనిన వడ వడ వడఁకి సాష్టాంగ మెఱఁగి,***
***సమ్మదాశ్రులు, పులకలు ముమ్మరింప***
***వినయ వినమిత గాత్రుఁడై విప్రవరుడు***
***వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె- (2.89)***

భయము - వడకు- హర్షము- పులకలు, భక్తి- వినమిత గాత్రము, ఇత్యాదిగా పాత్రల మనోభావములను, శారీరక విన్యాసములను, సూక్ష్మ దశాంతరములతో గుర్తించి చిన్ని చిన్ని మాటలచే ప్రస్ఫుటము చేయుటలో రాయల సామర్థ్యమును గుర్తింప వచ్చును. ఈ నేర్పు కవి బ్రహ్మ తిక్కన కావ్య శిల్పమును తలపించును. ఇచట "విన్నవించు" - అను పదమెంతో యౌచిత్యముతో కూడినది. అది వైష్ణవుని దాస్యభక్తిని స్ఫురింపజేయుచు విష్ణు చిత్తుని పాత్ర పోషణ కుచితముగా నున్నది.

<u>విష్ణుచిత్తుని విన్నపము:-</u>

వడ వడ వడకినా, భక్తి నిండారినా, వినయ వినమిత గాత్రుడైనా, విష్ణు చిత్తుడు మన్ననారు ఆదేశమునకు వెంటనే లోబడడు. స్వీయాభిప్రాయమును వెల్లడింపక మానడు. ఆయన స్వభావముచే మనస్వి (మహామతి). ఆయన సాధన ప్రధానముగా మనోమయ భూమికలో జరుగును. ఆ భూమికలో వ్యక్తి స్వీయాభిప్రాయమును, ఇచ్చను, తర్క, వితర్కములకు సిమ్మటగాని, దైవేచ్ఛకు లొంగడు. శాస్త్రజ్ఞానము, రాగరంజన, వాది భంజనములు, పునర్జన్మ హేతువులనియు, తన పరమ పురుషార్థమునకు నిష్ప్రయోజనములనియు పూర్వమతడు చక్కగా వితర్కించి విడచినవే. ఇపుడు స్వామి తాను విడచిన వాటినే తిరిగి అవలంబింపుమని చెప్పనేమి? . . . . . ఆయన స్వామికి చెప్పు సమాధానము విందము. దానిలో ఆయన స్వభావము మఱికొంత విశదపడును.

"స్వామీ! నేను శాస్త్రగ్రంథ పఠనమున గ్రుడ్డిని- మీ పూదోటను కఠినమైన గడ్డపారతో త్రవ్వి త్రవ్వి చేతులన్నియు కాయలు గాచిన మోటువాడనే! మీ భవన దాస్యము దప్ప నితర ప్రపంచము నెరుగని వాడనే ! ఇట్టి నన్నా వాదుకు పంపుట! రాజసభలో ఓటమైన ఆ అపయశములు మీకు గాకుండునా! (1) మీ ఇల్లు తుడుచుటో,

(2). తీర్థము తెచ్చుటో, (3) మీ శృంగార పల్యంకిని మోయుటో, (4).నిలువెత్తు మాలలు కట్టుటో, (5) అధికారము లభించినచో మీ ధ్వజమును మోయుటో, (6) చామరము విసరుటో, (7) గొడుగు పట్టుటో, (8) పడి పడిగా దీపమాలికలను వెలిగించుటో- నాకు తెలిసిన పనులు, ఓ నరసింహా! అట్టి నాకు వాదములేల? నీ లీలలకు పాత్రులితరులు లేరా? స్వామీ! నన్ను నితః పురాపఠిత శాస్త్రగ్రంథజాత్యంధు, నా రామక్ష్మాఖనన క్రియాఖర ఖనిత్రగ్రాహతోద్యత్కిణస్తోమా స్పష్టకరు, ప్రపద్యపద దాసు, న్వాదింగాఁ బంపుటే భూమీ భృత్పుర నోటమైన నయశంబుల్మీకు గాకుండునే! (2.91)

గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్య ధ్వజ
గ్రహణంబో, వ్యజనాత పత్ర ధృతియో ద్రాగ్దీపికారోపమో
నృహరీ వాదమునాకు! లేరె యితరుల్ నీ లీలకు న్పాత్రముల్?

ఇది విష్ణు చిత్తుని విన్నపము. ఈ విన్నపములో ఆవేశము పాలు ప్రత్యక్షము. దీనిని కవి ప్రఖ్యాతములగు నీ రెండు పద్యములలో ప్రవహింపజేసెను. ఇవి నాల్గు శతాబ్దములనుండి సాహితీ పరుల నాల్కలపై నాట్యమాడుచున్నవే!

వీనిని మనము (1) ఔచిత్య పుష్టి, (2) శీలపోషణ, (3) రచనా శిల్పము- అను మూడు దృక్కోణములనుండి పరిశీలించి యానందింపవచ్చును.

ఇందలి యంశములన్నియు కవి విష్ణుచిత్తుని ప్రవేశపెట్టుచు తెలిపిన ధ్యాన యోగాది సాధనలో ఉదహరించిన "నిష్ఠ" అను చిన్న పదమునకు వివరణలే. ఆయన నిత్యాను ష్ఠానములోనిదే. పరమపదమున గూడ భాగవతులకు అప్రాకృతములయిన బహు భద్ర రూపములను ధరించి భగవత్పరిచర్య చేయుటే పరమ పురుషార్థమని వితర్కించి, విష్ణుచిత్తుడు మాలికాకరణ కైంకర్యమును చేపట్టెనని కవి మొదటనే తెలిపెను.(1.78). ఆ వెంటనే కవి- ఆయన భాగవత కైంకర్యమును విపులముగా వర్ణించెను. (1.79-85). ప్రకృత పద్యములందలి వివరములు అతని భగవత్కైంకర్యమును విపులీకరించును. వీనిని కవి అచటనే ఏకరువు పెట్టినచో

సొగసుండదు. ప్రాణవంతముగాని జాబితాయగును. సందర్భము ననుసరించి వానిని విష్ణుచిత్తుని చేతనే ఆవేశముతో చెప్పించుటవలన వానికొక ఓజస్సు, ఔచితీపుష్టి సమకూరినవి.

(2) శీల పోషణ:-

విష్ణు చిత్తుని పరమ పురుషార్థ వితర్కమందాయన వాద నైపుణ్యము, అతిథి సానునయమందాయన సంస్కృత భాషా పటిమ, ప్రదర్శింపబడినవి. ప్రకృతపు పద్యములందు రెండు గుణములు చక్కగా పోషింపబడినవి. మొదటి పద్యమందలి "స్వామీ! నన్ను నితః పురాపఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధు . . . . . ఆ రామక్ష్మా ఖనన క్రియాఖర ఖనిత్ర . . . ." ఇత్యాది వాక్ప్రవాహములో విష్ణుచిత్తుని ఆవేశము, సంస్కృత వాక్పటిమ తెలియునని అనుకొంటిమి. రెండవ పద్యమందలి గృహ సమ్మార్జనాది ఎనిమిది, విధములగు భవన దాస్యముల వర్ణన ఆయన మతిమత్త్వమును, సూక్ష్మాంశముల నుదహరించి ఎదిరి వారిని ప్రతిఘటించు వాదనైపుణిని ప్రదర్శించును. ఈ గుణములు మూడవ యాశ్వాసములో, రాజ సభావాదమున అన్యమత ఖండనముననను, స్వమతోపన్యాసముననను, మరింత స్పష్టపడును. ఏడవ యాశ్వాసములో రంగనాథును పాలంభించుటలో (1-44-47) పరాకాష్ఠను చేరును.

పదశిల్పము:-

ఈ రెండు పద్యములలోను, కవి రెండు భిన్న రచనా శిల్పములను ప్రదర్శించెను. రెండింటిలోను సంస్కృత పదములే విశేషముగా నున్నను, మొదటి దానిలోని రచనను మార్గపద్ధతియని, రెండవదానిలో దేశిపద్ధతి యని అనవచ్చును.

మొదటి పద్యములో (1) దాదాపు మూడు పాదములు ఇతః పురాపఠిత . . ఆ రామక్ష్మాఖనన" ఇత్యాది రెండు దీర్ఘ సమాసములతో నిండి పోయినవి. అందలి పదములు కూడ సుబోధకములు కావు. సుభగధ్వనులు కలవి కావు. (2) భావ ప్రకటన కూడ సంస్కృత భాషామర్యాదను, సమాస నిర్మాణ సరణిని అనుసరించును. చదువబడని శాస్త్రగ్రంథములను గూర్చి పుట్టు గ్రుడ్డిని . . . అనుట కిందుకుదాహరణము.

"ఆ రామక్ష్మాఖనన" ఇత్యాది సమాసమున "స్వామీ! నీ ఉద్యాన భూమిని త్రవ్వెడి పని కొఱకు పట్టుకొనిన కఠినమైన పనిముట్ల వలన పొడమిన కాయల సమూహముచే నునుపులేని చేతులను కలవాడను" అనుట భావములోను భాషలోను సంభాషణ పరిశీకన్న వర్ణన పద్ధతికి సంబంధించి యున్నది. ఇది స్వామి గంభీర కంఠధ్వనిని క్రొత్తగా వినుటవలన కలిగిన ఆవేశపు పొంగును. పారవశ్యమును, గంభీరముగా తెలుపుచున్నది. రెండవ పద్య శిల్ప మిందుకు సరిగా భిన్నము- (1) మొదట కలిగిన మానసిక ఆవేశము, పారవశ్యము ఆరామక్ష్మాఖన వాది వాక్ప్ర వాహముగా బహిర్గతమై, కొంతవరకు స్వాధీనములోనికి వచ్చినది. ఇపుడది దీర్ఘ సమాస ధార నాశ్రయించక చిన్న చిన్న పదములతో కూడిన ఎడతెగని కూర్పులో వ్యక్తము కాజొచ్చెను. ఈ భావ పరివర్తనమును - గృహసమ్మార్జనమో మొదలగు ఏడు చిన్న తుంపులతో కూడిన పద్యపాదములలో గుర్తింపగలము. ఈ తుంపులొక్కొక్కటి - రెండు మూడు పదములతో మాత్రమే కూర్పబడి మొదటి పద్యములో సూచింపబడిన భవన దాస్యమును హృదయంగమముగా విస్తరించును. (2) అగుటకివి సంస్కృత పదములే గాని, వాని పలుకుబడి తీరు తెలుగునాటి సంభాషణా రీతికి సంబంధించినది. ఇట్టి సంభాషణలు కర్త, కర్మ, క్రియా క్రమములతో కూడిన సంపూర్ణ వాక్యములుగా నుండవు. గృహసమ్మార్జనమో"- అని మొదటిది. నృహరీ! వాదము! నాకు" అనుటతో అంతమగు మూడున్నర పాదములు- విష్ణుచిత్తుడు చేయుపనుల జాబితాయేగాని వాక్యము కాదు. నృహరీ! అనునది ఆశ్చర్యార్థకమే కాని, నృహరీ! వాదము నాకెందుకయ్యా! అనుటవలె పూర్తి వాక్యము కాదు. ఇది తెలుగు బాస లెప్పదనము, బాసాడు వడుపులో నున్నది. దీనిని రాయలు ఆముక్తమందలి సంభాషణలన్నిటిలోను ప్రదర్శించును. "ఎల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి, దేశభాషలందు తెలుఁగు లెస్స" యని తెలుగు రాయలు గ్రంథావతారికలో కన్నడ రాయలకు సూచించినదీ మర్మమునే!

ఆంధ్ర విష్ణువు మొదట కృష్ణరాయల సంస్కృతరచనా కౌశలమును ప్రశంసించును. పిమ్మట తెలుగు నుడి కారపు తీపిని ఉగ్గడించును. సంస్కృత రచనలలో

రసికులవలన నానపిపించుకొనిన నీకు తెలుగసాధ్యమా? అనుచు ఈ దేశము తెలుగు నేను తెలుగు వల్లభుడను. తెలుగా! తీయని కలకండ. సామంత రాజులతో వారి వారి భాషలలో బాసాడిన నీ విది యెఱుగవా! ఇపుడా తెలుగు బాసలో మాకు ప్రియముగా కావ్యమును కూర్పుము" అనిన తెలుగు రాయల అవతి కన్నడ రాయలకొక సవాలయినది.

ఆముక్త మంతటిని పరిశీలించినచో రాయలు తన పూర్వాభ్యాసము ననుసరించి దాదాపు సగము గ్రంథమును పుర బుత్వాది వర్ణనములతోను, సంస్కృత పదములతోను నించుటయు, మిగిలిన సగము నందలి కథా శరీరమును బాసాడు కండ తెలుగుతో నింపుట తెలియును. ఆముక్త శైలీద్వయమను భాండారమున కాంధ్ర విష్ణుని అవతియే బీజముగా భావింపవచ్చును.

విష్ణు చిత్తుని పాండితి:-

విష్ణుచిత్తుడు తాను శాస్త్రగ్రంథ పఠన విషయమున బొత్తిగా అజ్ఞుడనని ఎంత చెప్పుకొనినను, ఈ పద్యములందు గన్పించు వాక్పటిమయు అతిథులనను నయించెడి సంస్కృత వాక్యములు ఆయన పాండితిని తెలుపునని ఇంతకు పూర్వము గమనించితిమి. ఈ గైర్వాణీ వాక్పటిమ ఆయనకు యోగాభ్యాసము వలన లభించిన యొక సిద్ధియైనను గావచ్చును.

స్వామి ప్రాభవము:-

కవి- విష్ణు చిత్త మన్ననారుల సంభాషణను క్లుప్తముగను, వడి వడిగను నడిపెను. మధ్యలో దానికి మనమంతరాయము కల్పించితిమి.

ఇదుగో విష్ణు చిత్తుని దీర్ఘోపన్యాసమునకు మన్ననారు సమాధానము,- అనిన తద్భక్తి కెదమెచ్చి యచ్యుతుడు మొలకనగవొప్ప, శ్రీదేవి మోము చూచి వాదితవిచే నేగెలిపింతు, నాదు మహిమ మువిదకను" మని ప్రాభవం బొప్పఁ బలికె,

నీ యిచ్చయె? మిన్నక పో
యీయి మునివ్రవరో! విష్ణు- వొప్పింతుమ భూ

*నాయకు సభ; నిందులకై*
*యే యుద్ధము వలవదవల నేమున్నాదన్. . .(2-902-93)*

రాజ సభలో తానోడినచో స్వామికే అపయశస్సులు కావా? యని సందేహించు విష్ణుచిత్తుని భక్తిని మన్ననారు హృదయమున మెచ్చెను. కాని దాని నాయన బహిర్గతము కానీయలేదు. విష్ణుచిత్తుడెంత భక్తుడయినను, పూర్వవాసనా బలము వలన ఆయనలో స్వ- ఇచ్ఛ మిగిలియున్నదని స్వామికి తెలియును. అది అతనిని భగవంతుని నుండి వేరు పరచును. అతని కైంకర్య దీక్షకు ప్రతిబంధకముగా నుండును. దానిని నతడు పూర్తిగా వర్జింపనిదే తన పరమ పురుషార్థమగు భగవత్కైంకర్య సిద్ధిని పొందలేడు. భగవల్లీలా సంకల్పములను నిర్వహించుటకు తగిన ఉపకరణము కాలేడు. ఈ యుద్ధము తొలగించి అతని కట్టి యోగ్యతను ప్రసాదించుటకే మన్ననారతనిని స్వ- ఇచ్ఛకు వ్యతిరేకముగు కార్యములలో నియోగించుట. అందుచే తన మెప్పును బయటకు కనపరచక- "నీ యిచ్ఛయొ? మిన్నకపోవోయి!" అని అదలించును. పిల్లల అమాయికతను పెద్దలు మెచ్చినా, మందలింపక తప్పనట్లు! ఈ మందలింపులో తెలుగు బాపాడు రీతిని రాయలు ఎంతో మనోజ్ఞముగా ప్రదర్శించును. నీ యిష్టమే! నోరు మూసుకుపో! సభలో నిన్ను ఒప్పిస్తాను! దీనికే అడ్డము వద్దు. అవతల నేమున్నాను! ఇంతకన్న తెలుగు బాపాడు వడుపు ఏమున్నది?

<u>మన్ననారు- మొలకనవ్వు:-</u>

విష్ణుచిత్తునకు ప్రభువు మన్ననారు. ప్రభువుల మెప్పు దుర్గ్రాహ్యము. వారు మెచ్చినప్పుడు ఆగ్రహించినట్లుందురు. అవసరమునుబట్టి నటింతురు. అది వారి చమత్కారము. దేవేరితో మన్నపుడిది ద్విగుణీకృతమగును. ఆ సమయమున దాసుల నాజ్ఞాపింపవలసి వచ్చెనా? ఇక చెప్పెడి దేమి? వారి చమత్కారమునకు ప్రాభవము తోడగును. ఈ మర్మము రాయలకన్న నెక్కువ మఱెవరికి తెలియును! శ్రీదేవితోనున్న మన్ననారులో మనకు అంతఃపురముననున్న రాయలు కనిపించును. విష్ణు చిత్తునదలించెడి స్వామిలో మనము ఎదుటి వానినొక యాట ఆడించి వినోదించు రాయలను జూతుము.

విష్ణు చిత్తుని భక్తికి మెచ్చిన స్వామి, తన యెదుటనున్న అతనితో కాక, ప్రక్కనున్న శ్రీదేవితో నొకమాటయనెనట! ఎట్లనెను? ఆమె మొగము జూచియనెను. మొగము జూచుటలో విశేషమేమి? ఆమె వంక జూచియనెను- లేక ఆమెతో ననెను అనిన చాలదా! చాలదు. ఆమె మొగముఁ జూచి యనెననియే అనవలెను. అట్లనుటలో రెండు ప్రయోజనములున్నవి. (1) స్వామి యామె వైపు మొగము త్రిప్పి యను మాటలు ఇతరులకు వినిపింపకుండ ననగలుగును. (2) తన మాటలచే వలరిన ఆమె ముఖోల్లాసమును జూడగలుగును. అది ఆయనకు ప్రియము. అయినచో ఆమె మొగము జూచి చెప్పెనని ముగింపరాదా? ముగింపరాదు. స్వామి ఒకక్రొత్తమాట నాడబోవుచున్నాడు. ఆ సంతోషముతో ఆయన మొగమున మొలకనగవు మొలచినది. ఆయన మొలకనగవు జూచి నిత్యానపాయిని యగు శ్రీదేవి ముఖముల్లసిల్లును. ఆమె ముఖోల్లాసము ఆయనలో ప్రతిబింబించును.

అవి మొలకనగవే ఏలకావలెను? ఏల కావలెననగా ఆయన హర్షము విష్ణు చిత్తునకు తెలియరాదు. తానతని మందలింప వలసి యున్నది. అయినచో మొలక నగవుతో ఆమె మొగము జూచి యిట్లనెను, అని సంక్షేపించరాదా? అట్లు కాదు! "ప్రాభవంబొప్పబలికె"- యనవలసినదే! ఏల? ఆయన మాటలు రాచఠీవితో గూడినవి. ప్రభువు యొక్క ప్రాగల్భ్యమును దెలుపునవి. ఆడువారియెదుట మగవారి బింకమును జూపునవి. భార్యవద్ద విభుత్వమును వెలయించునవి. ఆ ప్రాభవమా యాడువారికి వెగటు కలిగించునది కాదు. చూడముచ్చటగునది. ఈ విభుత్వమును ముచ్చటను, రాయలు ప్రాభవంబొప్ప, ఒప్పు, అను పదములచే సూచించును. ఇచట 'ఒప్పుట'- రెండు విధములైనది. ఒకటి నాటకమున పాత్రధారి ఒక భావమును ఒప్పించు విధము, రెండవది- ఆ ప్రాభవము చూడ ముచ్చటగా నుండుట. "వాదితనిచే నే గెలిపింతు, నాదుమహిమ మువిద కనుము" అను మాటని ప్రాభవము పతాక స్థాయికి చేర్చును. ఇది రాయల కావ్య శిల్పము. దీనినే ఆంధ్ర విష్ణువు-

*భావధ్వని వ్యంగ్య సేవధిగాఁ జె*

*ప్పితివి సత్యావధూ ప్రీణనంబు" - (1-13)*

అని ప్రశంసించును.

**బాపాడు తెలుగు లెస్స దనము:-**

ఇక ఇందలి పద శిల్పమును చూతము. ఇది యొక చిన్న తేట గీతి. ఇందలి పదములు చిన్ని చిన్నివి. మాటాడు రీతికి సంబంధించినవి. ఈ బాపాడు పదములలోనే కవి పాత్రల మనోభావములను వెల్లడించును; మాటు పరచును. ముఖలక్షణములను ప్రదర్శించును. చిన్ని సన్నివేశమునొక నాటికవలె నడుపును. ఈ నేర్పునే ఆంధ్ర విష్ణువు ఎల్లనృపులు గొలువ నెరుగవే బాపాడి, దేశ భాషలందు తెలుగు లెస్స"- అని కీర్తించినది.

ఆముక్తమున స్వామి మరి మూడు మారులు చిఱునగవుతో మాటాడుట కనిపించును, ప్రతి నగవులో నొక విశేషము గర్భితమై యుండును. ఆ వివరములను ముందు ముందు చూడగలము. అది అటుంచి ఇచట మనము స్వామిని నిత్యస్మిత పూర్వాభిభాషి- అనెడి వైష్ణవుల మనోహరమగు నూహను గుర్తింపనగును.

**విష్ణు చిత్తుని అలుకు:-**

ప్రకృతమునకు వత్తము -

**-అనిన మారుపలుక వెఱకి వయ్యాలు వారియ్య కొనియె బోవ"-**

ఇచట రాయలు విష్ణుచిత్తుని మనస్థితిని రెండు తీరులుగా వర్ణించెను. (1) విష్ణు చిత్తుడు మారుపలుక భయపడెను. (2) అందుచే స్వామి యాజ్ఞకు సమ్మతించెను. ఆవల నేమున్నాడనే" అని అభయము పలికినను ఆయన అనుమానము తెగలేదు. ఇది ఆయన స్వతంత్ర బుద్ధిని తెలుపును. 7వ ఆశ్వాసములో విష్ణు చిత్తుడు తన ఏకైక ప్రియ పుత్రికయగు గోదా కన్యను రంగనాథ వరునకు సర్వ సమర్పణ బుద్ధితో వివాహతంత్రమున ధారవోయు చరమ ఘట్టము వరకు అతని స్వతంత్ర బుద్ధిని రాయలు ప్రదర్శించుచునే యుండును.

విష్ణు చిత్తుని "అలుకు"ను కూడ రెండు దశలలో గమనింపదగును. (1) మొదట ఆయన నిత్యవిధిగా తులసి దామమును స్వామి యక్కున చేర్పబోయినపుడు అదివరకు తాను వినని స్వామి కంఠధ్వని ఆకస్మికముగ శ్రవణపాతమగుట వలన

కలిగిన యులుకు. ఆ కంఠధ్వని గంభీరమైనను తీయనిదే- (ఉదారమధురోక్తి) ఈ అద్భుతానుభవము వలన కలిగిన వడ వడ వణకుటను ఇంతకు పూర్వము చూచితిమి. అయినను ఆ పలుకులలోని మాధుర్యము- "మహామతీ" అను సన్మానము- ఆయనకు కొంత చనువు కల్పించెను. ఆ చనువు ఆధారమున ఆయన తన అశక్తతను విన్నవించుకొనగలిగెను. కాని అనుమంతయగు స్వామి- "మిన్నక పోవోయి" అని అదలించెను. ప్రభువగు స్వామి "మిన్నక పోవోయి" అని ఆజ్ఞాపించెను. శాస్త్రయగు స్వామి ఇందుకు ఏ అడ్డము వలదని శాసించెను. రక్షకుడగు స్వామి "ఆవల నేనున్నా"నని అభయమిచ్చెను. కాని - "మహామతీ! పాండ్యరాజ సభలోని దుర్మదాంధుల పొగరడగింపుము. సత్కృపతో రాజును వైష్ణవుగా నొనరింపుము." అనెడి సన్మాన పూర్వకమగు అనునయ మిపుడు లేదు. ఇపుడు "మిన్నకపోవోయి"- అను నదలింపు మాత్రమే ధ్వనించుచున్నది. అందుచే విష్ణు చిత్తుడు తన యభిప్రాయమును వెన్నునకు విన్నవించు చనువు పోయినది. ఇక మిగిలినది మారువలుక నలుకుటచే నియ్యకొన వలసి వచ్చుట మాత్రమే. మొదటి యులుకు కొంత చనువుతో కూడినది, రెండవది మారు పలుకనీయనిది.

<u>చిన్నినాటకము:-</u> ఈ అయిదారు పద్యములలో రాయలొక చిన్ని నాటకమును ప్రదర్శించును. (1) మొదట మనకాయన నిశ్శబ్దమగు గర్భగుడి మసక చీకటిలో హఠాత్తుగా స్వామి ఉదార మధురోక్తిని వినిపింపజేయును. (2) తరువాత వడ వడ వడకుచు సాష్టాంగమెఱగి. సమ్మదాశ్రువులు పులకలు ముమ్మరింపగా వినయవినమిత గాత్రుడగు విష్ణు చిత్తుని చూపును. (3) ఆ పిమ్మట పేరుకొనిన అతని నిరర్గళమగు విన్నపమును వినిపించును. (4) ఆ తరువాత స్వామి అంతరంగమున మెప్పు, శ్రీదేవిని జూచెడి ఆయన మొలకనవ్వు, 'ఉవిద! చూడు నా మహిమ'మను ప్రాగల్భ్యమును ప్రదర్శించును. (5) తుదకు 'పోవోయి' అని శాసించు స్వామి ప్రాభవమును చూపును. (6) ఆవల నేనున్నానను అభయమిచ్చినను, అనుమానము తొలగక, తొలగకున్నను మారుపలుక నలుకి ఈయకొను విష్ణుచిత్తుని చూపును. ఇట్టి చిన్ని సన్నివేశములను హావభావ రసోచితముగ తీర్చిదిద్దుటలో రాయల "కావ్య నాటకాలంకార మర్మజ్ఞత్వము" (విరూపాక్షభూదాన శాసనమ్) సార్థకమగుచున్నది.

## విష్ణుచిత్తుని భక్తి స్వరూపము

ఇచట మనము విష్ణు చిత్తుని భక్తి సాధనను గూర్చిన ఒక విశేషము గుర్తింపవలెను. అది అతని కథలోని అనూహ్యమగు మలుపుల నర్థము చేసికొనుటకు తోడ్పడును.

ఆముక్తమున రాయలు వివిధ భక్తుల చరిత్రలను చిత్రించెను. కాని అందరనొకే మూసలో పోత పోయలేదు. వారి వారి వ్యక్తిత్వములను, భక్తి వైశిష్ట్యములను, అందలి వేరు వేరు దశలను విలక్షణముగా ప్రదర్శించుటలో ఏమఱలేదు. అందుండుడున్ అను మొదటి పద్యమునందే కవి విష్ణు చిత్తుని సాధనను జప, యోగ, సంవిత్, నిష్ఠలతో కూడిన బహుముఖ సాధనగా ప్రదర్శించును. ఈ జప యోగాదులు సాధకుని స్వ ప్రయత్నముపై నాధారపడునవి. వానితో కూడిన సాధన మేధస్సుకు సంబంధించినది. "దీని యందు నొక్క కొఱత గలదు. అంతరాయంబు నొందినఁ బునర్భవంబు, బొందించి మఱి ముక్తి జేర్చునట్లగుట నింతకంటె సులభో పాయంబాయోధనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శరణాగత ధర్మంబ నిరపాయ ధర్మంబు"(3-89) అని విష్ణు చిత్తుడు మనసా ఎఱుగును. ఈ మర్మ మితరులకు జెప్పును. కాని ఆయన స్వభావము స్వప్రయత్నముపై నాధారపడునది.

ఆయన "ప్రకృతి సంబంధము" స్వాభిమానము, లోకాచార పరాయణత ఆయన సాధనలకు అవరోధములగును. ఆభిజాత్యము, విద్య, మొదలగు అహంకార స్ఫూర్తియే లేని మాలదాసరి వలె (6-ఆశ్వా) ఈయన మొదటి నుండియు పరమ ప్రసన్నుడు గాదు. రాయలు తన గ్రంథమును విష్ణు చిత్తుని నైష్ఠిక భక్తితో నారంభించి గోదా, మాలదాసరుల ఆత్మార్పణ యోగములతో ముగించుట గమనీయము.

## విష్ణు చిత్తుని సాధనలో మొదటి దశ

విష్ణు చిత్తుడు మొదట బహుశాస్త్ర పఠనేచ్ఛ కలవాడు. కాని జగజ్జీవేశ్వర రహస్యమును గూర్చిన ఆచార్యోపదేశము వలన అంతొక ఆకస్మికపరివర్తన కలిగెను. అంతకు బూర్వమతడు హేతువాద, కాణాదాది బహుశాస్త్ర పఠనమునందు

కుతూహలము గలవాడు. జగజ్జీవేశ్వర తత్త్వము తెలిసి, అఖండ నిర్వృతిని గాంచి, సుఖించు యోగికి శాస్త్రములు బహుక్లేశదములనియు, అవి త్రైగుణ్య విషయముల గుటచే రాజరంజన, వాది భంజనములు చేయుచు, పునర్జననములకు విసువని వారికి మాత్రమే తగుననియు, సముత్పన్న విజ్ఞాని తుదకు వానిని విడువవలెననియు శాంతి, దాంతి పరతంత్రతతో పరమైకాంగియగు తనకవి నిరుపయోగములనియు నెఱిగి ఆ యూరి మన్నారుకు మాలికా కైంకర్యము చేయుచు, (1.78) అతిథి భాగవతార్చనతోను (1.79-84) జప, యోగ, సంవిత్, నిష్ఠలతోకూడిన సమగ్ర సాధన నవలంబించెను. ఇట్టి ఆకస్మికానుభూతి, పరివర్తన, [*Conversion*], ఆధ్యాత్మిక సాధన సోపానములో మొదటి మెట్టు. నిజమునకీయనుభవము విశ్వచైతన్యము, మానవ చేతనలోనికి వచ్చుటలో ప్రథమ సన్నివేశము.[*Under hill mysticism*] ఇది యొక్కొక్కరికి ఒక్కొక్క కారణము వలన కలిగినట్లనిపించును. కాని ఆ కారణము నిమిత్త మాత్రమే. నిజమగు కారణము పరమేశ్వర ప్రసాదమే. ఆయన పిలుపే విష్ణుచిత్తునకీ ప్రసాదము, పిలుపు ఆచార్య కృపయను వ్యాజమున కలిగెను. (1.78) ఇది విష్ణుచిత్తుని సాధనలో మొదటి దశ.

<u>రెండవ దశ:-</u> ఇక ఆయన సాధనలో రెండవదశను చూతము. ఆయన చేపట్టిన సమగ్ర సాధన వలన ఆయన అంతశ్చేతనలో కొన్ని అతీంద్రియ శక్తులు మేల్కొని పరిణతము కాజొచ్చెను. వాని వలననే ఆయన మన్నారు ఆదేశము వినగలిగెను. కాని ఆ యాదేశము తానెన్నుకొనిన శాంతి, దాంతి పరతంత్రతకు, పరమైకాంగిక సాధనకు వ్యతిరేకము.అతడు విసర్జించిన శాస్త్రములనే చేపట్టుమని, అతడొల్లని రాజసభకే నడువు మని స్వామి యాజ్ఞాపించెను. భవన దాస్యము నెన్నుకొనిన అతనికి సభావాద మును విధించెను. శాస్త్రగ్రంథముల పఠింపక, స్వామి పుష్పవాటికలో మాలిగా కాలము గడుపు నతనిని రాజసభావాదమున ఒప్పింతునని, ఇందుకే యత్నము వలదని శాసించెను.

ఇది విష్ణు చిత్తుని సాధనలో రెండవదశ. జప యోగాదులతో కూడిన మొదటి దశ కేవలము స్వప్రయత్నముపై నాధారపడినది. దైవాదేశ నిర్వాహరూపమగు రెండవదశలోని అతని సాధనము దైవమే నిర్వహింపసాగెను. ఆధ్యాత్మిక సాధకుల పునరుజ్జీవనములో నిదియొక మహనీయ దశ. సాధకుడుండునే కాని నిజమున కతడుండడు. ఉండునది భగవంతుడే. సాధకుడతని ఉపకరణము మాత్రమే. దానిని తన ఇచ్ఛ వచ్చినట్లు త్రిప్పునది ఈశ్వర ప్రజ్ఞయే. ఇది సాధకునకు పోను పోను క్రమ క్రమముగా విశద మగుచుండును. ఈశ్వరుడు సాధకునకసాధ్యమగు కార్యములను విధించును. దానిని తానే నిర్వహించును. ఈ యనుభవ పరంపరచే "మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్త రిష్యసి'' (గీత-18-58) అను సత్యము సాధకునిలో ప్రతిష్ఠితమగును. అది యతనిని క్రమముగా "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'' (గీత-18-66) అను చరమ సందేశము వైపుకు త్రిప్పి పరమ ప్రపన్నుని చేయును.

విష్ణుచిత్తునికి మన్ననారు కలిపించిన అసాధ్య కార్యములవంటివి ప్రపంచ వ్యాప్త భక్తయోగుల [*Mystics*] చరిత్రలలో ననేకములు కలవు. వానిలో ఒకటి రెండిటి నిచట పరికించుట ఆసక్తి కరము.

(1) క్రీ.పూ. 1480లో గొఱ్ఱెలకాపరియగు 'మోసెస్'ను భగవంతుడు 'సినాయి' పర్వతముపై [Mount Senai] మండుచున్ననొక పొదనుండి ఎదురుకొని "ఇశ్రాయేల్' దేశస్థులను, ఈజిప్టు ప్రభువగు 'ఫారో' [*Farraoh* ] వద్ద బానిస తనమునుండి విడిపింపుమని ఆజ్ఞాపించెను. అందుకతడు విభ్రాంతుడై - "ఫారో' ఎదుటికి పోయి 'ఇశ్రాయేల్' పుత్రులను విడిపించుటకు నేనే మాత్రపువాడను?"

*[Who am I that I should go to pharoa and bring the sons of Israel out of Egypt? Exodus* ](2) 'జెరిమియా' అను ప్రవక్తకు [*Prophet Jeremia* ] మొదటి సారి అంతర్దర్శనము కలిగినప్పుడతడు- ఓ ప్రభూ! దేవా! చూడూ! ఎట్లు మాట్లాడవలెనో కూడ తెలియని బాలుడను నేను- అని విన్నవించెను. [*Ah! Lord God! Behold I do not know how to speak for I am only a youth* ] *Jeremiah-1-6* అయినను "మోసెస్" "జెరిమియాలు" తమకు విధింపబడిన అసాధ్యకార్యములను ఈశ్వరశక్తిచే నిర్వహింపగలిగిరి.

## దైవాదేశము - విష్ణుచిత్తుని వ్యతిరేకత

యోగి సాధనను రెండవ దశలో ఈశ్వరుడే చేపట్టుననుకొంటిమి. దీనిని మరి కొంత పరిశీలింతము. ఆధ్యాత్మికయోగి తన ప్రజ్ఞాకేంద్రమును ప్రకృతి సంబంధమగు కర్మేంద్రియ జ్ఞానేంద్రియ స్పృహల సంతానమగు అహం (నేను- *FALSE EGO*)నుండి దివ్య సంబంధమగు ఆత్మకు మార్చును. అహము పరిమిత శక్తి కలది. అనిత్యమైనది. స్వీయ ప్రయోజన నిర్వాహకములగు స్పృహలతో సాధకుని చర్యను రూపొందించును. ఆత్మ అతనిని పూర్వ స్పృహలకు భిన్నమగు క్రొత్త మార్గములలో చోదించును. సాధకుని ఆత్మకీ ప్రబోధము పరమాత్మనుండి కలుగును. యోగి సాధనను ఈశ్వరుడే చేపట్టుననుట కర్థమిదియే!

దీని వలన యోగి సమస్యలన్నియు నొక్కసారిగా పరిష్కారము కావు. అతని దేహ ప్రాణ, మనో వ్యాపారములు ప్రాకృతికమగు 'అహమ్' [*Natural Ego* ] ప్రభుత్వమునకు చిరకాలమునుండి అలవడియుండును. అవి యోగాభ్యాసము వలన పరిశుద్ధములై, విస్తృతములై, దివ్యీకృతములై, ఆత్మకేంద్రమునకు లొంగుటకు చిరకాలము పట్టును.

అధ్యాత్మ జీవనారంభమున యోగి తన పూర్వ చర్యను మార్చుకొని ఒక నూతన జీవన విధానము ననుసరించును. విష్ణుచిత్తుడు శాస్త్ర పఠనేచ్ఛను విసర్జించి, జప,యోగ, సంవిత్తులను చేపట్టుట ఇందుకుదాహరణము. సాధకుడు తా జేపట్టిన నూతన విధానమే అత్యుత్తమమని తు.చ. తప్పకుండ ఆచరింపవలసినదని గాఢముగా విశ్వసించి వర్తించును. కాని ఈశ్వరుడెట్లు నడిపిన, నట్లు నడువ వలసిన వాడనని గుర్తింపడు. రాను రానతని క్రొత్త సాధన అతని దేహేంద్రియ మనోభూమికలకొక క్రొత్త యలవాటుగా నేర్పడి అతని ప్రవృత్తి యందు నాటుకొనును. ఇంతలో అతని నూతనాభినివేశమునకొక హఠాన్నిరోధమేర్పడును. అతడు ప్రయాణించు దిశకు సరిగా వ్యతిరేకమగు దిక్కునకు మళ్ళుమని ఈశ్వరుడు ఆదేశించును. దాని ప్రయోజనము సాధకుని ప్రజ్ఞకవగతము కాదు. అందువలన నతడు తీవ్ర మనోవేదనతో తపించును.

ఈ తాప మతని జీవి నావరించి ఉల్లిపొరలవలె మిగిలియున్న సాత్త్వికాహంకారమును. సంగమును తొలగించును. అవి తొలగిన పిమ్మట నతడు పైన చెప్పినట్లు భగవంతుని చేతిలోని యుపకరణముగా ప్రవర్తింపనేర్చును. అతని అంతశ్చేతనలో నిలచియున్న భగవత్ప్రాతికూల్యవాసనలు తొలగి కేవలమానుకూల్య మేర్పడును. భగవంతుని రక్షకత్వమునందవంచల విశ్వాసము కలుగును. సర్వ సమర్పణ భావమును పూర్ణముగా నాశ్రయింప కలుగును. ఈ పరివర్తన కాలమున సాధకుని అంతరంగమున స్వీయ భగవత్సంకల్పములకు ఘర్షణలు కలుగును. విష్ణుచిత్తుని జీవితమున నిట్టి తొలి ఘర్షణ ఆచార్యోపదేశమునకు వెంటనే కలిగెను. అపుడతడు తన కఠినమైన పాత్రమగు శాస్త్ర జ్ఞానేచ్ఛను విడువవలసి వచ్చెను. కాని పూర్వవాసనాబలమును జయించుట కతనికి దీర్ఘమగు అంతరంగ వితర్కమవసరమయ్యెను. మలి ఘర్షణ మన్నారతనిని రాజసభకు పొమ్మని ఆదేశించినపుడు కలిగెను. అప్పటికి కొంతకాలమునుండి అతడు భగవత్కైంకర్యసాధన చేయుచుండుటవలన స్వీయాభిమత బలము కొంత సన్నగిల్లెను. అందుచే కొద్ది ప్రతి ఘటనతోనే అతడు భగవదిచ్ఛకు లొంగెను. కాని ఆ లొంగుబాటు భయము వలన కలిగెను. అది తాత్కాలికము. అది పొత్తుగా తొలగుటకు కొంత కాలము పట్టును. దానిని మనమేడవ యాశ్వాసమున రంగనాథుడాముక్త మాల్యదను తన దివ్య శుద్ధాంతమున కలుపుకొనినపుడు చూడగలము. అప్పటి ప్రతిఘటనకు కారణము ఆయనకు కుమారిక యందుగల ప్రేమ. ఇది మొదటి రెండు ఘర్షణలకన్న తీవ్రమైనది. దానితో నతని నాత్మనంటుకొని యున్న పుత్రేషణ రూపమగు మమకారపు తుది పొర తొలగి ఆయన సర్వ సమర్పణయోగము సంపూర్ణమగును.

<u>మన్నారు ఆదేశమెట్లు కలిగెను?</u>

మఱియొక ఆసక్తి కరమగు విషయమును పరిశీలించి ఈ ఘట్టమును ముగింతము. పాండ్యరాజు సభను గూర్చి విష్ణుచిత్తుడు స్వామి వలననే తొలిసారిగా వినెనా? అయినచో ఆ యాదేశమాయన ప్రజ్ఞయందే కోశమున ననుభూతమాయెను?

ఆముక్త కథనమునననుసరించి చూచినచో సభావృత్తాంతమును స్వామి వలననే విష్ణుచిత్తుడు వినినట్లు కనుపించును. కాని పూర్వోత్తర కథనమును బట్టి ఆ సభ

చాలా నాళ్లుగా జరుగుచున్నట్లు తెలియును. ఆదేశమునకు బూర్వము మత్స్యధ్వజుడు కొలువుదీర్చి బహుమతములందు కోవిదులగు వారిని వారి వారి శాస్త్రములలో ఏ వేల్పు మోక్షమొసంగునో చూచి నిశ్చయింపుడని కోరును. వారిలో నొకడు హరుడని, నొకడు హరియని పలుతీరులుగా వాదింపసాగిరి. (2.84-86) ఇట్లు నిర్ణయము వాదగుటచే ప్రతీహారి ముందుగా రాజుకు విజ్ఞప్తి చేయకయే సభలోనికి విష్ణుచిత్తునంపెనని (3-3) ముందు వినగలము. వాదము జరుగుచున్న మధురకు విల్లిపుత్తూరు బదిమైళ్లలోనున్నది. మధుర రాజధాని. ఆ సభ రాజ సభ. దానిని సమావేశపరచినవాడు రాజు. అందుపాల్గొను కోవిదులు బహుసమయములకు జెందిన వారు. సభ చాలానాళ్లుగా సాగుచున్నది. సమీపముననున్న రాజధానిలో రాజేర్పరచిన సభలో కొంతకాలమునుండి జరుగు రభసను గూర్చిన వార్త విల్లిపుత్తూరుకు వ్యాపింపకుండునా? హిమాచల పటీరాచల మార్గమున విష్ణుచిత్తునింటికి వచ్చిపోయెడు వైష్ణవాళి వలననైన (1-79) అతడు వినియుండడా? మూలగ్రంథమగు దివ్యసూరి చరితమున సభా వృత్తాంతమున రాజు దేశమంతట చాటించెనని యున్నది. ఏ విధముగ జూచినను స్వామి ముఖమున వినుటకు ముందే ఇది విష్ణు చిత్తుని చెవినిపడి యుండునని తోచును. అట్లు విన్నప్పుడు సభావాద ఫలితమును గూర్చి యతని యంతరాంతరములలో కలవరమేర్పడుట సహజము. వాదమున అన్యమతస్థులు గెలిచి రాజాదరణమును పొందినచో వైష్ణవ సమాజమేమగును? అన్యమత పక్షపాతియగు రాజువలన ఆ కాలమున తక్కిన మతస్థులకు వారి వృత్తులకు, ఆలయమునకు, కలుగు కడగండ్లు మూడవయాశ్వాసమున చూడగలము. (3-42-47) విష్ణుచిత్తుని కాలమట్టిది. అతడు వైష్ణవమునందు మిక్కిలి యభినివేశము కలవాడు. అందుచేతనే ద్రావిడ వైష్ణవ సాంప్రదాయకు లతనిని విష్ణువాహనమగు గరుడాంశ సంభూతుడని వర్ణించిరి. తైర్థిక వైష్ణవ బృందములకతడు నిరతాన్న దానము చేయుట, భగవత్కైంకర్యనిమగ్నుడగుట - ఇదివరకే చూచితిమి. ఇట్లు, విష్ణు కైంకర్యమందు, వైష్ణవ సమాజ శ్రేయస్సునందు పరమాభినివేశముగల విష్ణుచిత్తునకు రాజసభా పర్యవసానమును గూర్చి కలవరమేర్పడుట సహజము.

ఇది అటుంచి, రాజ సభకు పొమ్మను స్వామి ఆదేశమెప్పుడు కలిగెనో విచారించుట అవసరము. విష్ణుచిత్తుడు మూలమంత్రమును జపించుచు తన్మయుడై అతుల తులసీ సుగంధి మాల్యమును స్వామి వక్షమున చేర్పబోయిన జాగ్రదవస్థలోనే అతడు స్వామి యాదేశమును వినెనని ఆముక్త కథనము. మూలగ్రంథమున స్వప్నమున వినెనని కలదు. జాగ్రత్స్వప్నములలో నెతడే దశలో వినగలిగెనను, అంతకుబూర్వమే సభావృత్తాంతమును రాజు చాటింపువలనను, జనప్రతీతి వలనను, త్రైర్థిక భాగవతుల వలనను విని, వైష్ణవ మత భావి స్థితిని గూర్చి, వ్యాకులచిత్తుడై యుండుట సంభావ్యము. అట్టి వ్యాకుల స్థితిలోని మానవుని మనస్సులో స్వప్నదశలోగాని, స్వప్న సదృశముగు తన్మయావస్థలోగాని, ఒక స్వయంభువ మగు రూపమావిర్భవించి, తరుణోపాయము నుద్బోధించుట తటస్థించునని యూన్ [Jung] అను ప్రసిద్ధ మనో విశ్లేషణ కర్త [Psycho-Analyst] గాఢ పరిశోధన వలన గుర్తించెను. ఇటీవలి కాలమున శ్రీ అరవిందులకు జాగ్రదవస్థలోనే ఆలీపూరు కారాగారమున కలిగిన వాసుదేవానుభవము, ఆ పిమ్మట పాండిచేరికి పొమ్మను ఆదేశము- ప్రసిద్ధములే! గాంధీజీకి సర్వభారత వ్యాప్తమైన హర్తాల్‌ను ప్రప్రథమముగా నడుపుమని మదరాసులో నిద్రావస్థలో కలిగిన ఉద్బోధయు, తరువాత ఆయన జీవితమున ననేక పర్యాయములు కలిగిన అంతర్వాణి యాదేశములు సుపరిచితములే.

## విల్లిబుత్తూరు నుండి మధురకు

మరల కథకు వత్తము. మన్ననారు ఆనతికి విష్ణుచిత్త "ఆళ్వారు" మారువలుక నలికి ఇయ్యకొనెనో లేదో ఇంతలోనే ఆయన పయనమును తూగింపుమని గుడినంబికి స్వామి యానతిచ్చెను. (2-94) ఆ యానతి ననుసరించి స్థానికుడు- స్వామి శ్రీ భండారము నుండి సంబడమును (దారిబత్తెమును) సమకూర్చి, తన పాత యందలమును బోయీలను పంపెను. ఆ అందలమెక్కి, విష్ణు చిత్తుడు రాజసభకు పయనమయ్యెను.

**పెనువేసవి - వైభవము:-**

అది నిండు గ్రీష్మము. దిక్కులన్నియు తెల్లని ఎండమావులతో జ్వలించెను. మండుటెండలకు దిఙ్ముఖములు కంది రాలెను. (2-46) సుడి గాడ్పులు రేపిన ధూళి

చక్రములు వింగిని నేలను ఏకము చేసెను. పడమర పడగాలికి సూర్యుడే వెనుకాడెనా? యన్నట్లు దినములు దీర్ఘములయ్యెను. (2-49) రాత్రులందు కూడ భూమి నుండి ఆవిరులు వెడల, చల్లని తరపి వెన్నెలలను కూడ కాలునట్లు చేసెను. భూమి కాలుచున్న అట్ల పెనమయ్యెను. వెన్నెల ఆ పెనముపైన పలుచగా, విశాలముగా పోసిన అట్లపిండి వలె నుండెను. భూమి నుండి పైకి వచ్చు వేడి, ఆ యట్ల పిండి యెగజిమ్ము కట్టావివలె నుండెను. (2-60).

విలుబుత్తూరు నుండి మధుర ఏబదిమైళ్ల మాత్రమే కాని, వెనువేసవి విభవము విప్పారిన (2-71) కాలమున నదికూడ నొక పెద్ద ప్రయాణమే! మరియు విష్ణుచిత్తుడొక్కడే అందలమెక్కి పయనించినచో బోయీల గుమగు పరుగుల కా పయనమెంతో కాలము పట్టదు. కాని, ఆయన ననుసరించి వైష్ణవబృందమొకటి బయలుదేరెను. వీరు కాలినడకవారు. కొందరు కావి వస్త్రములు కట్టిన విరక్తులగు ఏకాంగులు. కొందరు శిఖాయజ్ఞోపవీతములుకల సాత్తినులు. కొందరవి లేని సాత్తనులు. వీరేమి నడతురు? వీరితో పయనము నెమ్మదిగా కొన్ని రోజులవరకు సాగుచునే యుండును.

మరి వీరందరికి దారి బత్తెములో? ఏమేమి కావలెను? ఆ వస్తువులలో విధి నిషేధముల ననుసరించి ఎవరేమి మోచి తేవచ్చును? విష్ణుచిత్తుడు నిష్ఠాపరుడేకాక మనస్వి. మనస్వియే కాక, కార్యదక్షుడు. అతడీ సూక్ష్మ వివరములన్నిటిని ముందుగా నాలోచించి తగురీతి నేర్పరచెను. ఆయన చర్యలన్నిటియందు నీ రెండుగుణములు కనిపించును.

<u>విష్ణు చిత్తుని సాధ్వి:-</u>

ఆయన ఊహాలనెఱిగి ఆ ప్రకారమే పనులనొనర్చు ననుకూలవతి ఆమె. ఆమె భక్తితో భర్త పయనమునకు కావలసిన సంబళమంతయు సర్దెను. (2-97) ఆముక్త కథాక్రమములో ఒక క్షణమిటు తొంగి చూచి అటు అదృశ్యమగు వ్యక్తులు కొందరున్నారు. విష్ణుచిత్తుని సాధ్వి అట్టిదే! ఆమె ఉనికి ముఖ్యముగా తెరవెనుకనేగాని,

ఆమె నిర్వర్తించు పనులు విష్ణుచిత్తుని సాధనకు కీలకములు. మధుర ప్రయాణ సన్నాహమునకు పూర్వమొకసారి ఆమె మనకు కనిపించి కనిపించనట్లు వంటసాలలో వర్తించును. గగనము నీటి బుగ్గవలె జడి పట్టిన కాలములో వంట చెరుకు దుర్లభ్యము. కాని, ఆమె అతిథులెందరికో వండి వార్చవలెను. భార్య ఇబ్బందిని ముందుగా గుర్తించి విష్ణుచిత్తుడు కొబ్బర బొండముల నెండబెట్టి యుంచెను. వాని నామె రగిల్చి, కనులలో పొగజారకుండ నేర్పుతో అతిథి బృందములకు సరిపోను కలమాన్నమును, ఒల్చిన ప్రప్పును, నాల్గైదు పొగసిన కూరలను, వడియములను, వరుగులను, వండి వానికి తోడుగా దధి, ఘృత, ఘృతుల నమర్చును. (1-80) అట్లే శీతున, వేసవియందు, శనివారములందు ఎందరు వచ్చినను వడిరేయి వరకు వండనలయుని అన్నపూర్ణగా నామె పాఠకుల మనసులలో కపలునే కాని కంటికగపడదు. ఇక ముందు కథలో ఈమె మరి రెండు మారులు క్షణకాలము మనకు కనిపించును. శిశువగు ఆముక్తమాల్యదను, తులసి వనము నుండి భర్త తెచ్చి "అనురక్తి" తో ఆమెకిచ్చును. (5-6). అప్పటికిని ఆమె తెర వెనుకనే వర్తించును. ఆ శిశువునామె గోముగా పెంచి పెద్దదానిని చేయును. తుదకు ఆళ్వారుతో కలసి రంగనాథ వరునకు ధారవోయును (7-66). ఈ యొక్క పర్యాయమే మనమామెను తెర వెలువల చూతుము.

ప్రస్తుతమీ సాధ్వి తన భర్త మధురై (మధుర) ప్రయాణమునకు తెర వెనుకనుండి భక్తితో చేసిన ఏర్పాటులను చూతము.

<u>దారిలో సాపాటు - ధర్మపత్ని ఏర్పాటు:-</u>

విష్ణుచిత్తుడు మండువేసవిలో ప్రయాణమారంభించెను. అది చల్లబాటు వేళలందు మాత్రమే సాగును. మధుర చేరునప్పటికెన్నాళ్లు పట్టునో! త్రోవలో నాగవలసి వచ్చును. వేళకు వంట అమరదు. అపుడుపయోగించుటకు కొన్ని పిండి వంటలమరి యుండుట మంచిది. ఇవి నిల్వయున్నను చెడనివిగా నుండవలెను. 'పూరి విళంగాయు' లిందుకు తగినవి. (కొబ్బరి, యాలుక, కుంకుమ పువ్వు, జీర, మొదలగు సంబారములను వేపుడు బియ్యపు పిండితో బెల్లపు పాకమున కట్టిన ఉండలు) వీనిని

పరిజనమునకు పెట్టకుండ ఆళ్వారొక్కడే అనుభవింపడు గదా! అందువే అందరికి చాలునట్లుగా సాధ్వి పులివిళంగాయల మూటనే అమర్చెను.

చిఱుతిండితో నేమగును? అన్నపుటాదరువు లేనిది ఎన్నియున్న నేమి? అన్నమునకో! మంచి బియ్యమవసరము. దానిని పండెడివారో మగవారు. అదైన, ఏ త్రోవలోనో విడిదిలోనో! మగవారికేమి తెలియును? తీరిక ఏది? దారి బడలికలో ఓపిక ఏది? దాను పోను గాక మఱి విడిదిలో సహా ఎన్నాళ్లుపట్టునో? బియ్యమెక్కువే కావలయును. అవి నిలువయున్న పురుగుపట్టును. అట్లు చెడకుండ వాని నా యిల్లాలు తెల్లగా దంపించి, గడ్డలన్నియు నేరించి ఎనటి పోతకు సిద్ధము చేసెను. మఱి యా బియ్యము క్రొత్తవైనచో అన్నము గంజిపట్టి పసిగా నుండదు.

అరవ వారికే కూరయున్నను, లేకున్నను, సంబారములతో కూర్చిన సాంబారుతో గడచును, సాంబారుపొడి మార్గమధ్యమున నెట్లమరును? అందుకు బదులుగా నాయమ్మ చింతపండులోని గింజలు, పీచులు, ఏరించి, శుద్ధపరచి, సగము బెల్లముతో కూర్చి మరి కొన్ని దినుసులతో కలిపిదంచి, రమ్యమైన సంబారపు చింతపండు తయారు చేయించెను.

ఇంటివద్ద 'ప్యూతన్నత'ల కలవడిన స్వాములకు (1-80) నేయి కారని ముద్ద మ్రింగుడు పడదు. మఱి ఇంతమందికి సరిపడు నేయి ఒక చోట దొరకదు. కనుక దీనిని "గిడ్డి మొత్తము" లనుండి (ఆలమందల నుండి) తెప్పించవలెను. అది ప్రయాణపు కుదుపులలో తొణక కుండుటకు అనేక "లడ్డిగల" (సన్నమూతి పాత్రలు) కెక్కించుట యవసరము. మఱి ఈ లడ్డిగలను తక్కిన సామానులతో గాక ప్రత్యేకముగా భద్రమగు స్థానముల నుంచవలెను. "లోహాండి" (వంటబిందెల) కావళ్ల కొమ్ముల కు వ్రేలాడగట్టించినచో నవి కావడి వానికంటికెదురుగనే యుండి తొణకకుండ చేరును. ఇట్టి నేతి లడ్డిగల నెన్నింటినో సమకూర్చినదా గృహిణి.

ఇక త్రోవలో కూరగాయలమరునా? అది మండుటెండల కాలము గదా! అవి దొరకవు. వానికి బదులు పెరుగు వడియాలు, పచ్చి పరుగులు, ఉపయోగించును.

ఎన్నియున్న నేమి? బేడలు (పప్పులు) లేని భోజనమెట్లు? కనుక వీనిలోనే యొక దానిని మరువక ఆయత్త పరచినదా యాళ్వారునతి.

శ్రీవైష్ణవుల భోజనము పూజలో నొక భాగము. వీని రెండిటికి ఎడతెగని సంబంధము. అందుచే భోజన సామగ్రితో పాటు, పూజా సామగ్రియు నమర్చవలెను. మరి ఆళ్వారు పూజ అధికమైనది కదా! ఆయన అచ్యుత పూజోపకరణము లెన్నో యుండును. అవి చెక్కు చెదరక చేరవలెను. అందుకై వానినామె "ఉరుతర పేటికల"లో పొందుపరచెను. ఆ పని ఆళ్వారు ధర్మపత్నియే నెరవేర్చి యుండును.

## ఆళ్వారు ఏర్పాట్లు - అద్దె గుఱ్ఱము

ఈ సంబారముల సమకూర్పులతో ఆళ్వారు సాధ్వి వంతు ముగిసినది. ఇదంతయు నింటిలో నుండి చేయుంచు పని గనుక ఆమెయే సంబాళించినది. ఇక ఈ వస్తువులెట్లు చేరును? ఎవరు మోయుదురు? ఇవి ఆళ్వారు చేయించవలసిన పనులు. వీనిలో బరువైన సామానులున్నవి. వీనిని పరిజనము మోయలేరు. ఆ రోజులలో నిట్టి బరువు మోతలకు గుఱ్ఱములుండెడివి. అవి అద్దెకు గూడ దొరకెడివి. అద్దె గుఱ్ఱములు పోషణ తక్కువగుటవలన భారము లెక్కువగుట వలన సామాన్యముగా బలహీనములై యుండును. ఇట్టి బక్క గుఱ్ఱములు ఆళ్వారు సామానులను మోయలేవు. లోకజ్ఞుడైన యాళ్వారాపనికొక "లావుగల అద్దెగుఱ్ఱమును" తెప్పించెను. దాని మీద తట్టలపైన రెండు ప్రక్కల జారవేయు సంచులలో (మాత్ర సంచులలో) సర్దించి వానినటు నిటు జారవేయించెను (2-96)

## ఆళ్వారుని ఆచార నిష్ఠ:-

ఇన్ని సంచులు త్రోవలో పోయెడి వారి అందరికంట బడుట మంచిదిగాదు. మరియు ఆ గుఱ్ఱము అటునిటు తొలగునేమో! ఈ యొడిదుడుకులు నివారించుట కాళ్వారు తనకు తోడుగా వచ్చు ఏకాంగుల నా గుఱ్ఱమున కిరుప్రక్కల నడుచునట్లు నియమించెను. రాజుగారి కర్పింపదలచిన అరిశల కావిళ్ల మఱికొందరు మోయు

చుండిరి. మిగిలిన వారిలో సాత్త్వికులు (శిఖాయజ్ఞోప వీతములు గలవారు) సాత్త్వికులు (అవి లేనివారు) పూజోపకరణములు, ఆహార పదార్థములు మొదలగు వానిలో తామేమి తాకవచ్చునో, కూడదో, విధి నిషేధము లెఱిగి తెచ్చుచుండిరి. (2-97). విష్ణుచిత్తుడు నిష్ఠానిధి కదా! (1-77-84) స్వపర మర్యాదల నతిక్రమించుట కనుమతింపడు. తాను కొలుచు రంగనాథుడైనను "మేర" మీరినచో సహింపడు. అతనిని భాగవత పరిషత్తు ఎదుట విచారణకు పెట్టును. (7-44-47).

<u>రాజుగారికి అరిసెలు:-</u>

విష్ణుచిత్తుడు తాను స్వామి యారామమును త్రవ్వి, త్రవ్వి, చేతులు కాయలు గాచిన మోటువాడనని, స్వామి భవనదాస్యమును దప్ప ఇతర మెరుగని వాడనని స్వామితో నెంతగనో మొఱయిడెను. (2-90-91) అయినను అతడు రాచ మర్యాద లెరుగనివాడుకాదు. ఆలయమున కూడ స్వామికి రాజోపచారములు చేయువాడే కదా! స్వామి కర్పించిన అతిరసముల (అరిసెల) నైవేద్యమునే అతడు బహుశా రాజుకు ప్రసాదముగా కొనిపోయి యుండును. రాజు కర్పించెడి ప్రసాదము తీయగా నుండుట విశేష ప్రయోజనకరము కదా! అది వైష్ణవ మాధుర్యోపాసనకొక గుర్తు. విశేషించి ఈ యాళ్వారు అందఱిని తీయని మాటలతో నాకర్షించు వాడని వైష్ణవులెంతురు. స్వామి ఉత్సవ కార్యములలో పాల్గొనుట కాయన సర్వజనములను ఆహ్వానించును. (పల్లాండుగీతి) ప్రతి స్పర్థులనైన తీయగా పలుకరించెడి ఆయన నేర్పును రాజసభా వాదారంభమున గుర్తింపదగును. (3-3-4) తనను జూచి పండితులు, వాదము లాపిరట. వారి నతడు "మనమేమి పరాయిలమా? మాటలాడుడ"ని హెచ్చరించెను.

<u>యోగి- భోగి:-</u>

ఈ తినుబండారముల యమరికను బట్టి విష్ణు చిత్తుడు ధ్యాన విషయమున యోగియైనను, సాపాటు సందర్భమున భోగియేయని తెలియును. అతిథులకు వడ్డించిన, తానే వినియోగించిన ఇంటివద్దనైన, ప్రయాణములలోనైన, అన్ని భోగములుండ వలసినదే! ఋతువునుబట్టి, సమయమునుబట్టి సవివరముగా అన్నియు అమర వలసినదే! ఈ యమరికలలో ఆయన మతిమత్త్వము, కార్యదక్షత, స్పష్టమగును.

# వాది విష్ణుచిత్తుడు

## పూర్వకథ- యోగి విష్ణు చిత్తుడు:-

కథారంభమున విష్ణు చిత్తుడు ఆచార్యోపదేశమున పరివర్తితుడై జప, యోగ, సంవిత్, విద్యలను వరించి, శాస్త్ర జ్ఞాన, రాజ సభావాదేచ్ఛలను వర్జించి, పరమ ఏకాంగియై తన జ్ఞానమితరులకు తెలియనీయక భగవద్భాగవత పూజలతో సర్వకాలము గడుపుచుండెను. ఇంతలో పాండ్యరాజ సభలో జరుగు పరతత్త్వ నిర్ణయ చర్చలో పాల్గొనుమని, దైవాదేశము కలిగి, కొందరేకాంగులు, పాత్రిన, పాత్రములతో కలసి మధురకు ప్రయాణమయ్యెను. ఇదంతయు ప్రథమ, ద్వితీయాశ్వాసములందలి కథ. ఇంతటితో ఈయన జీవితమున నొక ఘట్టము గడచెను. ఈ దశలో యీయనను యోగి విష్ణుచిత్తుడని పిలిచితిమి.

## వాది విష్ణుచిత్తుడు:-

రాజ సభా ప్రవేశమునుండి స్వపుర ప్రవేశము వరకు గల విష్ణు చిత్తుని కథ ఆయన జీవితమున రెండవ ఘట్టమున వచ్చును. దీనిని వాది విష్ణు చిత్తుడను శీర్షికతో ముచ్చటింతము. దీనిలో రాయలు రాజ సభావాదులను గూర్చిన స్వీయానుభవమును, విశిష్టాద్వైత దర్శన మందాయనకు గల ప్రతిభాయుతమగు కూలంకష, నిర్దుష్ట పాండిత్యమును, "శ్రోతఘచ్ఛటలు విచ్చగ" జ్ఞాన సూక్తులతో, కృతి నిర్మించు కౌశలమును, (1-13) రాజనీతిజ్ఞతను హృదయంగమముగ ప్రదర్శించును.

## సభా ప్రవేశము:-

విష్ణు చిత్తుడు మధుర ప్రవేశించకముందే - కొన్నాళ్లనుండి పాండ్యరాజ సభలో నిత్యము వాదము జరుగుచుండెను. అందుచే ముందుగ విజ్ఞప్తి లేకనే ప్రతీహారి ఆయనను లోనికంపెను. విజ్ఞప్తి పూర్వక ప్రవేశము రాజసభా మర్యాద. సభ ముగియునప్పటికి మరికొన్ని సభా మర్యాదలను రాయలు సూచించును.

**సభ్యుల జంకు:-**

విష్ణు చిత్తుడెవరయునది గాని, ఆయనలోనికి వచ్చుచున్నాడని గాని, రాజకుగాని, సభాసదులకుగాని తెలియదు. వారు వాదపు రంతులలో (గలిబిలి) నుండిరి. కాని విష్ణుచిత్తుని చూడగనే భూపతియు, సభ్యవ్రాతము, జంకుతో బ్రత్యుత్థానము జేసి నిల్చిరి. ఆయన మిక్కిలి తేజోవంతుడగుట వలన ("అత్యూర్జస్వలుడౌట"- 3-3) వారికి జంకు కలిగెనట. మరియు పద్మమువలె నుండు ఆయన ప్రసన్న వదనము గూడ వారినాకర్షించి యుండెను. (ద్వయ పద్మ వదనుండు. 1-77)

**విష్ణు చిత్తుని తేజస్సు:-**

విష్ణు చిత్తుని తేజస్సును గూర్చి మన మొక యూహచేయవచ్చును. మొదటి చూపులోని దివ్య ప్రభావము [Charisma] జంకుతో కూడిన ఒక క్రొత్త వాతావరణమును సృజించెను. హరునొకడను- మమనొకడను- విద్వాంసుల రంతులు సమసెను. రాయలిట్టి సన్నివేశముల నెరిగి యున్న వాడు కనుకనే ప్రథమ సందర్శనమునే మెలకుతో వర్ణించెను. "విష్ణుచిత్తుడు సభలో ప్రవేశించుచును" అనిన చాలును ఆయన ప్రవేశించుచుండగానే ఆయన వర్చస్సును చూచి భూపతియు, సభ్యవ్రాతము- శంకతో (జంకుతో) ప్రత్యుత్థానము చేసి, (ఆయన నెదుర్కొని లేచి) నిలుచుండిరి. వర్చస్వియే యోగాకి! జంకేల! విష్ణు చిత్తుడు విలుబుత్తారు స్వామి వాక్యము విని ఏల గడగడ వణకెను? ఇచటను అట్టి అద్భుత ఆశ్చర్యభయములే [Mysterium Tremendum] పనిచేసి యుండును. విష్ణుచిత్తుడొక పూనికతో వచ్చుచున్నాడు. ఆయన దైవాదేశమున దైవకార్య నిర్వాహకమునకై వచ్చుచున్నానను గాఢ ప్రత్యయముతో సభలో ప్రవేశించుచున్నాడు. మానిసి ఏదోనొక మహత్కార్యమునకంకితుడై, మహనీయావేశముతో వర్తించునపుడతని ముఖముననొక యసాధారణ వర్చస్సు వెలయుట సుసంభవమే! దీనిని చూచినవారు చకితులగుటయు సహజమే. విష్ణుచిత్తునిలోని యీ యావేశము ముందు ముందు మఱింత స్పష్టమగును. మఱియు విష్ణుచిత్తుడు బహిరంతరేంద్రియములను జయించి- (శాంతి, దాంత పరతంత్ర-1-78) చిరాకాలము యోగనిష్ఠతో కాలము గడిపి చిత్తమున

విఘ్నుని కట్టి వేసినవాడు. (1-77) ఇక కొంచెము సేపటిలో హరి ఆయన చేతోగతి నొలయుట చూతుము. ఈ సాధన, ఈ సిద్ధి, ఆయన ముఖవైఖరికొక ప్రసన్న గంభీరత నిచ్చి యుండును.

రాజు - ఆతిథ్యము:-

తనను చూడగనే రాజు, సభ్యులు, శంకతో ప్రత్యుత్థానము చేసి నిల్వగ ఆయన సభాస్థలమును ప్రవేశించెను. (3-3) ఆయన తేజస్సుచే ప్రభావితుడైన రాజాయనకు బంగారుమయమై, మంచి రత్నములు పొదిగిన పీఠము నిచ్చెను. అది ఉన్నతమై సభ్యుల కండ్లలో జిగేలుమని మెరయుచుండెను. (కౌన్నత్య ప్రోజ్వల రాజరత్న వరరత్న పీఠ-3-3) పీఠస్థుడైన విష్ణుచిత్తుడా రాజిచ్చు ఆతిథ్యమును స్వీకరించెను. (3-4). ఆయన తేజస్సును సువర్ణ రత్న పీఠపు ప్రోజ్వలనమును మాతనాగంతునకు రాజు చేయు విశేష సన్మానమును. చూచిన సభ్యులు తమ వాద విషయమును మరచి-నిశ్శబ్దముగ (రంతుసేయక) యుండిరి. దాన దీన వారప్రతిభులైరి. పరతత్త్వము హరుడని, ఉమయని, హరియని, అగ్నియని, అర్కుడని, గణపతియని, చంద్రుడని, బ్రహ్మయని, ఎన్నాళ్లనుండియో వాదించువారి నోళ్లాకస్మికముగ కట్టుబడి రంతు సేయక యుండిరి. (3-4) రాజాయన కర్ఘ్యపాద్యాది ఆతిథ్యమిచ్చు వ్యవధిలోనైన వారు తేరుకొనలేదు.

విష్ణుచిత్తుని చొరవ:-

ఇప్పుడు పరిస్థితి విష్ణుచిత్తుని యదుపులోనున్నది. అందుచే మొదటి చొరవ ఆయనే తీసుకొనవలెను. ఇంతలో "ఆవల నేమున్నాడన్" (2-93) యని అభయ ప్రతిజ్ఞ చేసిన హరి ఆయన చిత్తవృత్తిని ప్రచలింపజేసెను. హరి తన 'చేతోగతి మెలయుగ'-(3-4) విష్ణు చిత్తుని సాధన రెండవ దశలో ఆయన హృదయస్థుడైన ఈశ్వరుడాయన సాధనము తానే చేపట్టి నడపసాగెనని లోగడ యనుకొన్న దాని కిది యొక నిదర్శనము.

హరి ప్రేరేపించుచుండగ మాటాడకుండుటెట్లు? మరి యొకడైనచో అప్పటికే పాదలియున్న విద్వాంసుల నారాటముతో నదలించెడివాడే! అట్లుచేసి హరి

వైమనస్యమును సంపాదించి యుండెడి వాడే! కాని విష్ణు చిత్తుడట్లు చేయలేదు. చిరకాల మిత్రులను పలుకరించినట్లు వారిని జూచి "మీరుపక్రమించిన దానిని నిలుపుటకు మనమేమీ క్రొత్తవారమా? మీ ప్రసంగమును కొనసాగింపు"డని (లాతులమా తర వాయుడుగ? మాటలాడుడు- 3.4) కలుపుగోలు తనముతో వారిని కదల త్రోసెను. ఆళ్వారులందరిలో విష్ణుచిత్తుడు భిన్నరుచులు గల ప్రజల నాకట్టుకొనెడి కలుపుగోరు తనము కలవాడని ప్రసిద్ధి. మరియు ప్రతివాదులేమి పలుకుదురో వారి వారి తాహతులెట్టివో తెలియుటకే నయ చాతుర్యముపయోగించును.

## వాదారంభము

**విపరీతాహతు:-**

ఈ చల్లని పలకరింపుతో సేదదీరిన విద్వాంసులు తరువాయి సాగించిరి. కతిపయోక్తులలోనే విష్ణుచిత్తునకు వారి బండారము తెలిసిపోయెను. (కతిపయోక్తులలోన తత్ప్రతిభ దెలిసి-3.5). ఇది ఆయన బుద్ధి సూక్ష్మతకు మరియొక దృష్టాంతము. మనిషిని చూడగనే వాని తాహతు నంచనా వేయగలుగుట విలుబుత్తారు వారి ప్రత్యేకతగాబోలు! ఆచటి ఆట వెలదులు (పద్మముఖులు) తారసిల్లిన మాత్రముననే ఎట్టి మనిషినైన కులము తెలియగలవారు గదా! (పొలసిననే యెట్టి నరునైనఁ గులము తెలియ . . . . వలతుల పద్మముఖులు- 1-60)

**విష్ణుచిత్తుని చిరునవ్వు:-**

విద్వాంసుల బండారము నాకట్టినంతనే ఆయన మొలక నగవుతో రాజు మొగము చూచెను. (నగవు దళుకొత్త రాజు నెమ్మొగము జూచి 3-5) ఈ మొలక నగవులో రెండు భావములున్నవి. (1) విద్వద్వ్రాతము తాహతు నాకళించుకొని, యింతే గద యనునదొకటి. (2) మాటాడుటకు ముందెదిరి వారి నాకట్టు భావము- రెండవది ఈ స్మిత పూర్వాభి భాషణము- విష్ణుచిత్తుడు కొలుచు మన్ననారు, రంగనాథులలో నాల్గు పర్యాయములు నాల్గు భావములతో గనుపించును. (2-62: 4-38: 5-157:

7-48) వైష్ణవులు తమ యారాధ్యదైవమును ప్రసన్న స్మితాస్యునిగ భావింతురు. (వాల్మీకి రాముని స్మిత పూర్వాభిభాషిగ వర్ణించుట ప్రసిద్ధము) ఇది యెదిరి నాకర్షించి యతనిని నిరస్త్రుని [*disarm* ] చేయును. విష్ణుచిత్తుని ప్రసన్న స్మితమునకు రాజా ముఖము గూడ స్నేహ ప్రసన్నమైనదట. (రాజా నెమ్మొగము జూచి"-(నెఱి+మొగము) ప్రభువు మనోజ్ఞ వదనమును జూచి)

## రాజా అనుజ్ఞ:-

అట్లు ప్రసన్నుడయిన రాజాను జూచి విష్ణుచిత్తుడు "తాఁవు మాధ్యస్థమున నున్న నేముగొన్ని నొడివెదము మాటలని, తదనుజ్ఞ వడసెను"-(3.5) స్వామి తులసీ తోటలు త్రవ్వి త్రవ్వి పందులేకుండ చేతులు కాయలు గాచిన మోటువాడనని చెప్పుకొన్నను- (2.98) విష్ణుచిత్తుడు రాజాకరిసెలు పట్టించుకొనిపోవుటలోను-(2.96) మరల ఇచట రాజానుమతి కోరుటలోను, రాజసభా మర్యాదలను పాటించుట నెరుగకపోలేదు. ప్రభువగు గ్రంథకర్త యీ మర్యాదలను వివరించుట మరువనులేదు. మరియు విష్ణుచిత్తుని విజ్ఞప్తి వట్టి పటాటోపముతో కూడినది కాదు. "నేము గొన్ని నుడివెదము మాటలు" అనుటలో ఆయన వినయశీలము, నిర్దంభము- వెల్లడియగును. ఇది గూడ ఒక నయచాతురియే! రాజా మధ్యస్థుడుగ నున్నచో రెండు ప్రయోజనములు సిద్ధించును. (1)తన వాదమున కాయన వలన అడ్డుకలుగదు. తుదకు న్యాయము కలుగును. (2) మరియు ప్రతి వాదులెవ్వరును తనను అక్రమముగ గికురింపజాలరు. ఇట్లు తన త్రోవ చక్కచేసుకొని విష్ణుచిత్తుడు ప్రత్యర్థుల నెదుర్కొనెను.

## వాదక్రమము - దాని సంగ్రహ స్వరూపము:-

రాయలు విష్ణుచిత్తుని వాదమును నిర్మించిన పద్ధతిని సూక్ష్మముగ పరిశీలించి నచో రాజసభావాదములను గూర్చిన రాయల వారి స్వానుభవ పూర్వక పరిశీలన, వాద సరళియుండొక సుసంబద్ధమైన క్రమము కనిపించును. దానిని మనము నాలుగు రీతులుగా గుర్తింపవచ్చును.

1). మొదటి రెండు పద్యములలో (3.6-7) రాయలు ప్రత్యేక ప్రతివాదుల నెదురుకొను పద్ధతిని గాక, అందరకు వర్తించు వాద విధానమును [*technique*] వర్ణించును. (3-6-7).

2). తరువాతి పద్యములలో ఆయన ఆరుగురిని ప్రత్యేక ప్రమాణములతో గెలుచుట వర్ణించును. (3.8) ఇచట మరియొక సూక్ష్మమున్నది. వీరందరు నిరీశ్వరులు. రెండవవారు అవైదిక నిరీశ్వరులు. ఈశ్వరుడులేడను వీరివాదమును మొదట నిర్జించిననే గాని, ఈశ్వరుడున్నాడనుట పొసగదు. వీరినే మన్ననారు "హెండీని దివాణమున్నెలయు నించిన బ్రేలెడు దుర్మదాంధుల"ని పేర్కొన్నది. (2.88). విష్ణుచిత్తుడీ క్రమమును పాటించుట గమనీయము.

3). తరువాత పద్యమున విష్ణుచిత్తుడు ఈశ్వరుడున్నాడని నిరూపించును. (3.9) ఆ తరువాతి మూడు పద్యములలోను ఒక వచనములోను-(3-10,11,12,13) ఉన్న ఈశ్వరుడు విష్ణువనియు, తదితరులతని అంశములని చెప్పి విష్ణుచిత్తుడు విష్ణు పారమ్యమును సమర్థించును. దీనినే మన్ననారు "మన్మహిమముం బ్రకటింపుమ"ని (2.88) ఇచ్చిన రెండవ యానతి.

4). ఈ యాశ్వాసమునగల చివరి 76 గద్యపద్యములలో విష్ణుచిత్తుడు ఖాండిక్యకేశిధ్వజుల సంవాదము నుపన్యసించును. దీని మూలమున రాజ్యపాలన చేయు మత్స్యధ్వజుడు విష్ణుని పొందుటకు అవలంబించదగిన అష్టాంగిక యోగమును వివరించుట కవకాశము కలుగును. ఈ కథ విష్ణుపురాణ మందలిది. రాజార్హమగు భక్తి, జ్ఞాన కలిత అష్టాంగయోగమును వివరించిన పిమ్మట విష్ణుపరిణతాంతః కరణుడైన మత్స్యధ్వజునకు విష్ణు చిత్తుడు భాగవతదీక్ష నిచ్చును. (3.24-89) ఇదియే "వాడును రోసినాడిహము, వైష్ణవుగా నొనరింపు సత్కృపన్" (2.88)అని విష్ణుచిత్తునకు మన్ననారిచ్చిన మూడవ యాదేశము. విష్ణుచిత్తుడిట్లు మన్ననారు ఆదేశములను అద్భుతమగు సూక్ష్మబుద్ధితో గ్రహించి, వానిని క్రమము తప్పక నిర్వహించుటలో- "మహామతీ" అను మన్ననారు సంబోధన సార్థకమగుచున్నది.



## విష్ణుచిత్తుని వాదక్రమము - సవివర పరిశీలన

**I. వాద విధానము - సామాన్య రూపము:-**

మొదటి రెండు పద్యములలో రాయలు వాద విధానపు సామాన్య రూపమును కండ్లకు గట్టినట్లు వర్ణించెను. అది ఆయన కొలువులో పలుమారులు గమనించినదై యుండును.

**ఒక్కనితో వాదము:-**

విష్ణుచిత్తుడు ముందుగా నెవరో అనామకుని జోలికిపోడు. "అందులోనొక మేటి కలిముఖుడై" అతడనిన వన్నియు ముందుగ అనువదించును. (అందులో నొక మేటి కలిముఖుడై యాతడనిన వన్నియును మున్ననువదించి) అట్లనువదించుటచే-వాదికిని సభా సదులకును ప్రత్యర్థిచేయు పూర్వ పక్షవాదము స్పష్టమగును. ప్రత్యర్థి తన వాదమును వాద మధ్యకాలమున మార్చుకొనవీలుండదు. మరియు విష్ణు చిత్తుడాయా యంశములను మరువక, గజిబిజి పడక, ఒకొక్క దానినే క్రమపద్ధతిలో ఖండించుటకు తోడ్పడును. ఇది శ్రీభాష్యాదివ్యాఖ్యాన గ్రంథములందవలంబించిన తర్కరీతి.

**A. దోషోద్ఘాటన:-**

ఇట్లనువదించిన పిమ్మట విష్ణుచిత్తుడా పూర్వపక్ష సారాంశములన్నిటికి అన్ని దోషములు చెప్పెను. ఆ చెప్పుట వేగపడక వరుసగా చెప్పెను. తాను ఖండించు టయే గాదు- సభవారొనవవలెను గదా! "వేగపడిన మతి తప్పి తన వాదమే చెడును. అన్యులకు తన యందు గురి తప్పును. మచ్చర మెచ్చును"- అని మహోపాధ్యాయుల వారి వివరణ.

(ఆముక్త మాల్యద - పేజీ 195-1927 ప్రతి, "తొడిగి యన్నిటికన్న దూషణం బులు వేగపడక తత్సభయొుడఁ బడఁగ బల్కి")

**B. పరాజయ హేతువు:-**

ఇట్లు తాను పలుకుచుండగ వితరులూరకుందురా? ఎవరికి తోచినవి వారందురు. కాని అవి ప్రక్కమాటలు. వానిలోనికి దూరినచో వాదము పెడత్రోవ పట్టును. సందు గొందులు దూరును. దానికంతుండదు. అందుచే విష్ణుచిత్తుడు ప్రక్కమాటలనెన్నక మొదట తాననువదించిన యుక్తుల కొక్కొక్కమాటలోనే పరాజయ హేతువును జూపెను. ఇది ఎదిరివానిని నొవ్వజేయు ఔద్ధత్యముతోగాక, అనుగ్రహముతో చూపెను. (ప్రక్కమాటలనెన్న కొక్కొక్క మాటనె నిగ్రహస్థానమును గ్రహించి-3.6)

విష్ణుచిత్తుని వాదములో ఇచట రెండు దశలున్నవి. (1) మొదటిది దోషోద్ఘాటన, (2). రెండవది పరాజయహేతువును చూపుట.

**C. దొమ్మి- వాదము:-**

ఈ క్రొత్త వాది చేయుగారడిని చూచిన విద్వాంసులకు కంపరమెత్తును. మేటి విద్వాంసుని నోరు మూతపడుచున్నది. ఇక తమ గతియేమి? అని అందరొక దొమ్మిగా (క్రందుగ) రేగిరట. దానికాయన- "కలగక అందర దీర్చి నిలిపె"నట. వారిని మెదలకుండజేసి "అమ్మొదలి వానికి నెముగిడి" తాను చెప్పవలసినదంతయు చెప్పి విజితుని గావించి దయతో విడిచి పెట్టినట. ఇది విష్ణుచిత్తుని సౌజన్యమును ప్రకటించును. వాదమున విజితుడైనవాడు విష్ణుచిత్తుని సౌజన్యము వలన కంటగింపు లేక యుండును.

**D. స్వమత రాద్ధాంతము:-**

వాదములో జయించుటనగా - ఎదుటివారి పూర్వపక్షయుక్తులను ఖండించుటే గాదు - వారన్వయించలేని విషయమును తాను సమన్వయించి సిద్ధాంతము చేయవలెను. అది ఆనాటి సభామర్యాద. వ్యాఖ్యాన కారుల పద్ధతి. మరియు విష్ణుచిత్తుడు స్వీయ మతమును స్థాపించుటకది యవసరము. అన్యమత ఖండనమొక కట్టడమును నిర్మూలించుట వంటిది. కట్టడము నిర్మించుటలో ప్రతి రాయియు సందులు లేకుండ ఒక దానికొకటి యుంటవలెను. ఎగుడు దిగుడుగానున్న శ్రుతి, స్మృతి, సూత్ర సమాజమే

ఆ రాళ్లు. విష్ణుచిత్తుడు వానికైక్య కంఠము గల్పించి, తనమతము జగమెరుగునట్లు రాద్ధాంతమొనర్చెనట. ఈ నిర్మూల నిర్మాణములు సభామర్యాద ననుసరించినవే గాక రాజు కోరినది గూడ. నానా మత ప్రవర్తకులను సమావేశపరచినప్పుడే ఆయన "(1) వాదమొనరించి (2) గెలిచి (3) తత్త్వంబు తెలుపు"డని నిష్కర్ష జేసెను. (2.85) ఈ రాద్ధాంతముతో మొదట విష్ణుచిత్తుడెదుర్కొన్న "మేటిని" విజితుని గావించుట పూర్తి అయ్యెను. ప్రక్కమాటలన్నవారింకను మిగిలియున్నారు. వారి నొక్కొక్కరిని

*"నీవేమంటివి రమ్మం*
*చావలి వానికిని మగిడి, యట్లనె వానిం*
*గావించి; యొకఁడొకఁడు రా*
*నా విప్రుడు వాద నరణి నందరఁగెలిచెన్" (3.7)*

<u>II. వాద విధానము - ప్రత్యేక ప్రత్యర్థులు:-</u>

('మన్నవారు మొదటి యాదేశము ప్రేలెడు దుర్మదాంధులన్ బోడిమి మాన్పి' 2.88)

<u>మొదట నిరీశ్వరులు:-</u>

వాదసామాన్య స్వరూపమును ప్రదర్శించిన పిమ్మట కవి ఆరుగురు ప్రత్యేక ప్రత్యర్థులను విష్ణుచిత్తుడు ప్రత్యేక ప్రమాణములతో గెలుచుటను వర్ణించును. వీరందరు ఫలితార్థమున ఈశ్వరుడు లేడను వారు. పాండీని దివాణమునిండి ప్రేలెడి దుర్మదాంధులని మన్నవారుస్వామి చెప్పినది వీరిని గూర్చియే! వారి పోడిమి మాన్పుటయే విష్ణు చిత్తునకాయన విధించిన మొదటిపని. ("పాండీడు దివాణము న్నిండియు నించిన ప్రేలెడు దుర్మదాంధులన్ బోడిమి మాన్పి 2.88)

స్వామి యాజ్ఞ యటుంచి ఈశ్వరుడున్నాడని నిరూపించుటకు ముందు, ఈశ్వరుడులేడను వాదమును నిర్మూలించవలెనుగదా! అందుచే విష్ణుచిత్తుడు ముందుగ నిరీశ్వరుల నెదురుకొనెను. వారినే రాయలిచట (1) అక్షవాది (సాంఖ్యుడు)(2) మాయావివాది (ఉత్తర మీ మాంసకుడు) అద్వైతి, (3) అపూర్వ వాది (పూర్వ మీ

మాంసకుడు), (4) పీలువాది (వైశేషికుడు), (5) సౌగతుడు (బౌద్ధుడు), (6) ప్రత్యక్షవాది-(చార్వాకుడు) అని పేర్కొన్నది-(3-8).

<u>వైదిక అవైదిక నిరీశ్వరులు:-</u>

వీరిలో సాంఖ్య, వైశేషికులు విష్ణుచిత్తుని నాటికొక రీతిగ వేద ప్రామాణ్యము నంగీకరించిన వారే! పూర్వ మీమాంసకులు వేదమందలి అపూర్వ ఫలదమగు కర్మకాండను ప్రమాణముగ స్వీకరించి ఈ ఫలప్రాప్తికి ఈశ్వరుని నిమిత్తము లేదనువారు. ఉత్తరమీమాంసకులు వేదముల యంతమందలి జ్ఞాన కాండను ప్రధానముగా నెంచి కర్మకాండను ఈశ్వరుని గౌణముగ భావించువారు. బౌద్ధ చార్వాకులు వేదమును, ఈశ్వరుని- అసలే యొప్పనివారు, వైదిక అవైదిక భేదమేగాని, పర్యవసానమున వీరందరు నిరీశ్వరులే!

విష్ణుచిత్తుడు వేద ప్రామాణ్యము నంగీకరించుచు నిరీశ్వరులగు సాంఖ్య, అద్వైత, మీమాంస, వైశేషిక వాదులను బ్రహ్మ సూత్రముల నుదహరించి యోడించెను. వేద ప్రామాణ్యమొప్పని బౌద్ధుని గూడ కఠోపనిషత్తు నుదహరించి గెలిచెనట. అట్లే చార్వాకుని గూడ బ్రహ్మ సూత్రము నుదహరించియే జయించెనట (3-8) ఇంతటితో పాండ్యుని దివాణమున ప్రేలెడి దుర్మదాంధుల పొడిమి మాన్పుమని మన్నవారు విష్ణుచిత్తునకిచ్చిన మొదటి యాదేశము నిర్వహింపబడెను-(2.88).

ఇక్కడ పాఠకులకొక సందేహము కలుగవచ్చును. వేదమునొప్పువారిని బ్రహ్మసూత్రములను, ఉపనిషత్తులను ఉదహరించి గెలుచుట సరే. వేద ప్రామాణ్య మునంగీకరించని బౌద్ధ, చార్వాకులను ఉపనిషద్, సూత్రములచే గెలుచుటెట్లు?

<u>రామానుజ భాష్యము:-</u>

కథలో గెలిచెను. - ఇది యటుంచి అద్వైతిని గెలుచుటకు రాయలుదహరించిన 'భోగమాత్ర' అను బ్రహ్మ సూత్రము (4.4-21) అందుకుపయోగించదని శ్రీమేడేపల్లి వెంకట రమణాచార్యులవారు వావిళ్లవారి ఆముక్తమాల్యదా ప్రతి ఉపోద్ఘాతమున నిట్లు వివరించిరి.

"ఈ సూత్రము రామానుజ శ్రీభాష్యమున ముక్తునకు బ్రహ్మ యాథ్యాత్మా నుభవసామ్య భోగమే గాని జగత్ సృష్ట్యాదులందు సంబంధములేదని మాత్రమే చెప్పును. జీవేశ్వరులు భిన్నులని చెప్పునది కాదు. అట్లు చెప్పు సూత్రములు వేరుగా కలవు. కని ఇచట నుదహరించిన సూత్రము వలన విష్ణుచిత్తుడు మాయావాదిని గెలిచెననుట కనువుకాదు". అని వారి అభిప్రాయము. ఈ విమర్శ సమంజసముగా నున్నట్లు తోచును. (వావిళ్లవారి ఆముక్తమాల్యదా ప్రతి 1914వ పుట.)

ఇంతటితో విష్ణుచిత్తుడు మన్ననారు మొదటి ఆదేశమును (నిరీశ్వరుల నోడించుట) నిర్వహించుట పూర్తి చేసెను.

<u>III. వాద విధానము</u>

<u>ఈశ్వరుని నిరూపించుట:-</u>

( మన్ననారు రెండవ ఆదేశము - మన్మహిమముం బ్రకటింపు. 2-88)

<u>ఈశ్వరుడున్నాడు:-</u>

ఈశ్వరుడు లేడను వారి నోడించిన పిమ్మట విష్ణుచిత్తుడు ఈశ్వరుడున్నాడని నిరూపించవలెను. ఆ ఈశ్వరుడు జ్ఞానానందాత్మకుడు. అందుచే విష్ణుచిత్తుడు ఈ విషయమును ముఖ్యముగా బోధించినవియు, ప్రఖ్యాతములును, అసందిగ్ధములునగు బ్రహ్మసూత్రములను, వేదవాక్యములను ప్రమాణములుగ నుదహరించి ముందుగా ఈశ్వరుని నిరూపించెను.

<u>ఆ ఈశ్వరుడు విష్ణువు:-</u>

ఇక ఆ ఈశ్వరుడెవ్వడో నిష్కర్ష చేయవలెను. విద్వద్వందితుడగు విష్ణుచిత్తుడు దానినిట్లు సాధించెను. ఈశ్వరునకు విష్ణుత్వము (సర్వవ్యాపకత్వము) కలదు. ఇతర దేవతలందరు ఆయన లోనివారే. వారొకరి నుండి మరొకరు భిన్నులు. విష్ణువు తద్విశిష్టుడగుటచే తద్భిన్నుడు. విష్ణుచిత్తుడీ విషయమును ప్రమాణ వాక్యముల ఆధారమున తేట తెల్లమగునట్లువన్యసించెను.

రాయలిచట మొదటి సారిగా విష్ణుచిత్తుని "విద్వద్వంధితుడు" అని పేర్కొనెను. దీనికి కారణమింతమంది వైదిక అవైదిక విద్వాంసులనోడించుటను చూచిన ఆచటి విద్వాంసులలో కొందరాయనను ప్రశంసించి యుందురు. వీరు మధ్యస్థులై యుందురు. ఓడినవారి ఈర్ష్యాయుతమగు హాస్యాస్పద వర్తనను రాయలు సుఖాంతమున వర్ణించును.

<u>1). ఆతదాదిలో ఒక్కడే:-</u>

ఈశ్వరుని విష్ణుత్వము నిట్లు సాధించి విష్ణు చిత్తుడా విష్ణువే నారాయణుడని, సమస్తమునకు మూలకారణమనియు నిరూపింపసాగెను. (1) ఆదిలో నారాయణుడొక్కడే ఆయెనని "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయమ్....." ఇత్యాదిగ ఛాందోగ్యము (6-2) చెప్పుచున్నది. (ఇచట నారాయణ పదము లేకుండుట గమనీయము). (2) అపుడు బ్రహ్మ మహేశ్వరులు, రోదసీ నక్షత్రములు. సూర్యచంద్రులు, జలాగ్నులు లేవు- ( ఏకోహ వై నారాయణ ఆసీన్న బ్రహ్మానే శానో నాపోనాగ్ని షోమౌ నేమేద్యా వా పృథివీన నక్షత్రాణి సూర్యోన చన్ద్రమాః- (మహోపనిషత్తు- అ.వే.వెం.రా. శాస్త్రి)

అపుడా యొక్కడైన నారాయణుడు "ఏకాకిత లీలకు తగదు. పెక్కు అయ్యెదను" అనుచు, చిత్ (జీవ) అచిత్తుల (జడములు) రెండింటియందునుచొచ్చి పెక్కు అయ్యెను. " . . . . . నారమ తైకః" మైత్రాయణీ ఉపనిషత్తు, "స ఏకాకీ నరమేత . . . ." మహోపనిషత్తు -1అ.

ఏకముగానున్న పెక్కగుదునని సంకల్పించి చిదచిత్తులలో ప్రవేశించుట ఛాందోగ్యమున-

ఏకమేవాద్వితీయమ్ . . . . తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి . . . . . (6-2): అనియు అనేనైవ జీవేనాత్మనాను ప్రవిశ్యనామ రూపే వ్యాకరోత్ (6-3) అనియు కననగును. (వేం.రా.శాస్త్రి- పుట. 205). కాని లీల నేకాకిత చనదనుట ఆ రూపమున

ఛాందోగ్యమున లేదు. మహోపనిషత్తున స ఏకాకీనరమేత (16) అనియు మైత్రాయణీ ఉపనిషత్తున "నారమత్రైక:" (ఉ-2) అనియు కలదు.

**2). అతడే పుండరీకాక్షుడు:-**

ఇట్లొకటయి లీలకై పెక్కైనది నారాయణుడే యనుటకు విష్ణుచిత్తుడు తిరిగి ఛాందోగ్యమునే ఉదహరించెను. ఛాందోగ్య అంతరాదిత్య విద్యయందు "సూర్యునిలో పుండరీకముల వంటి కన్నులు కలవాడున్నాడ"ని ఉన్నది.

("యధాకప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ . . . " ఛాందో 1.6 (6-7)

ఇచట "అక్షిణీ" పదముచే రెండుకన్నులని నిర్దేశించుచు ఛాందోగ్యము సూర్యమండలాంతర్వర్తియగు పరమేశ్వరుని విలక్షణత తెలిపెను. బ్రహ్మ, రుద్ర, ఇంద్రులు ఎనిమిది, మూడు, వేయికన్నులు గలవారు. ప్రసిద్ధ దేవతలలో నారాయణుడొక్కడే రెండు కన్నులు గలవాడు.

**3). పుండరీకాక్షుడే నారాయణుడు:-**

అందుచే ఇచట పుండరీకాక్షుడనగ నారాయణుడే యని వైష్ణవుల భావన. "యధా కప్యాసం పుణ్డరీకమేవ"- అనువాక్యమునకు రామానుజుల అద్వైతగురువు యాదవప్రకాశుడు కోతి (కపి) ముడ్డివలె ఎర్రనయిన కనులని నీచోపమతో వ్యాఖ్యానించుట విని రామానుజుడత్యంత వ్యాకులముతో కంట బొట బొట నీరు గార్చెననియు, గుర్వాజ్ఞచే ఆయన ఆ పదములకు సూర్యరశ్మికి అప్పుడే విచ్చుచున్న పుండరీకములవంటి కనులు కలవాడను యర్థమును సాధించి ప్రతిభా వైభవముతో వ్యాఖ్యానించి చెప్పెననియు ప్రఖ్యాత గాథ. చివరికిట్టి భేదాభిప్రాయములతోనే రామానుజులు గురువునుండి విడిపోయి బ్రహ్మసూత్రములకు శ్రీభాష్యమును రచించి విశిష్టాద్వైతమును స్థాపించెను.

**4). ఒక మెలిక:-**

ఇక్కడ ఒక మెలికయున్నది. విష్ణుచిత్తుడుదహరించిన ఛాందోగ్యమంత్రమున నారాయణ శబ్దము లేదు. అందుచే రెండుకన్నుల పుండరీకాక్షుడు నారాయణుడను

తమ వాదము అసందిగ్ధముకాదు. దాని నితరులొప్పక పోవచ్చును. అందుచే విష్ణుచిత్తుడీ లోపమును వాదాంతమున సవరించును- (3-12). దానిని తుదకు చూతుము.

<u>నారాయణుని స్వరూప గుణాదులు:-</u>

మరియా నారాయణుడెట్టివాడు? దీనికి గూడ విష్ణుచిత్తుడు ఛాందోగ్యమునే యుదహరించుచు నిట్లనెను. ఆ ఛాందోగ్యమున నారాయణుని సాటిలేని (1) దివ్య స్వరూపము, (2) దివ్యమంగళ విగ్రహము, (3)అనంత కళ్యాణ గుణైశ్వర్యములు కనుపించును. ఆ నారాయణుడే సర్వచరాచరముల లోపలను వెలుపలను తానే యుండుట నారాయణీయ యజ్ఞికోపనిషత్తు తెలుపుచున్నది. (అన్తర్బహిశ్చత త్సర్వం వ్యాప్య నారాయణః స్థిత- వే.వేం.రా. శాస్త్రి).

<u>సామాన్య విశేష న్యాయము:-</u>

అందుచే విశేష శబ్దములన్నియు సామాన్యమునే చెప్పునను న్యాయముచేత, సర్వవిశేష శబ్దజాలమును కేవల "నారాయణ" శబ్దమందే పర్యవసించును. 3.11 దీనికి ప్రమాణము వేదములందలి అరుణభాగములు.

<u>5). అసందిగ్ధ ప్రమాణము:-</u>

పై వాక్యములేవియు పరమేశ్వరుడు నారాయణుడే అను విషయమును సరాసరిగా ప్రతిపాదించవు. విష్ణుచిత్తుడీ వాక్యములకు తన యుక్తిని జోడించి సమర్థించెను. కాని పండితశ్రోతలు ఇంతకన్న అసందిగ్ధమగు ప్రమాణమును కోరుదురు. అందుచే విష్ణుచిత్తుడు వాదాంతమున తిరుగులేని నారాయణ శాస్త్రము నొకదానిని ప్రయోగించెను. అతడు సుబాలోపనిషత్తు నుండి "అపహత పాప్మాదివ్యోదేవ......" ఇత్యాది సూక్తి నుదహరించి ఆ సూక్తిలో నారాయణశబ్దము పాదుకొన్నది - ఇతర దేవతలు లేరు - అను నిత్యాది శ్రుతులతో వాదు తీర్చెను. (3.12)

("ఏష సర్వ భూతాన్తరాత్మా (2) అపహత పాప్మా, (3) దివ్యో, (4)దేవ, (5) ఏకో నారాయణః (1) ఈతడు సర్వభూతములలోని యాత్మ, (2) పోగొట్టబడిన

పాపములు గలవాడు. (3) స్వర్గ ఆకాశ సంబంధియైన వాడు. (4) ఒక్క దేవుడు. (5) నారాయణుడు")

**6). శరీర శరీరి భావము:-**

అయినచో తక్కిన దేవతలకును నారాయణునకును గల సంబంధమేమి? దీనికి విష్ణుచిత్తుడు (a) ఋగ్వేదానుబంధమగు కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు నుండి ఇంద్ర-ప్రతర్దన సంవాదమును (b) ఐతరేయోపనిషత్తునుండి వామదేవ వృత్తాంతమును ఉదహరించి, చిత్-అచిత్ రూపములన్నియు దేవతలతో సహా నారాయణుని శరీరములనియు, శరీరము చెప్పు శబ్దములన్నియు శరీరి వరకు పోవునవియు, అందుచే నారాయణుని శరీరములగు ఇంద్రాది వాచకములన్నియు, నారాయణునే తెలుపునవియు విశదీకరించెను.

**(7) పుండరీకాక్షుడే మోక్షప్రదుడు :-**

సకల దేవతలు నారాయణుని శరీరములే, అయినచో వారినేల సేవింపరాదు? 1. వారు విష్ణునకు తత్తత్కాల విగ్రహములగుట వలన వారిని సేవించినచో తాత్కాలికములగు (2) ధర్మార్థ కామములనెడి త్రివర్గములు; వాని ఫలితమగు తాత్కాలిక స్వర్గ సుఖము కలుగును. (3) పునరావృత్తి రహితమగు ముక్తి నా దేవత లీయలేరు. అందుచే మోక్షకాంక్షులకు వారి సేవ అయుక్తము. ముముక్షువులు పుండరీకాక్షుని గాక మరియే దైవమునైన నుపాసింపదగదు. మరియు నారాయణుడే చేతనునకు తల్లి, తండ్రి, సోదరుడు, ఇల్లు, రక్షకుడు, స్నేహితుడు, గమ్యస్థానము అని మరియొక శ్రుతి. (సుబాలోపనిషత్తు) తెలుపుచున్నది. కనుక జీవి అతనినే ఆశ్రయించవలెను.

ఇచట విష్ణుచిత్తుని వాదక్రమము గమనార్హము.

1) మొదట అతడు నిరీశ్వరుల నోడించెను.

2) తరువాత వైష్ణవేతరులగు పేశ్వరులను కాదనెను.

3) తుదకు విష్ణు పారమ్యమును సిద్ధాంతీకరించెను.

రాజకోరిక:-

విష్ణుచిత్తుడిట్లు అపవర్గకాంక్షులకు బ్రహ్మ రుద్రాదులను సేవించుట అయుక్తమనియు, వారిసేవ త్రైవర్గికులకు మాత్రమే (ధర్మార్థ కామములను గోరునట్టి వారికి మాత్రమే) యగుననియు వాదమునొక కొలికికి తెచ్చుట చాల ముఖ్యమైన విషయము. అసలీ వాదమంతయు రాజ్యవైభవ, భోగాది త్రివర్గములందు విరక్తిచెందిన మత్స్యధ్వజునిచే నేర్పరచబడినది. అతడు "వర్గత్రయ" (ధర్మార్థకామ) పరత వలన మాటి మాటికి స్వర్గబ్మా లోకముల మధ్యమార్గమున పరుగెత్తు దుర్గతివి ఇక నే వొల్లను. అటుగాక అపవర్గదుడు (మోక్షమిచ్చువాడు) ఏ వేల్పో వాని నెరిగి భజింతును-(2.82) అని సంకల్పించి, బహుసిద్ధాంతముల మెలగు కోవిదులను కూర్చి వారిని "మీ మీ శాస్త్రంబులలో నెవ్వడు మోక్షం బొలయించునో, చూచి, నిశ్చయింపు"డని (2.84) వాద శుల్కమును సభలో వ్రేలాడ గట్టించెను.

అందుచే విష్ణుచిత్తుడా రాజు జిజ్ఞాసను పూర్తిగా తృప్తి పరచుటకు వాదమును అపవర్గదుడగు విష్ణుని వద్ద పర్యవసింప జేసెను.

మన్నవారు మొదటి రెండు ఆదేశములు:-

ఇంతటితో విష్ణుచిత్తుడు "మన్మహిమముం బ్రకటింపు"మని మన్నవారు తనకిచ్చిన రెండవ యాదేశమును నిర్వహించెను-(2.88)

స్వామి విధించిన మొదటి యాదేశము:-

"పాండీని దివాణమున్ నెరయునించిన, బ్రేలెడి దుర్మదాంధులన్ పోడిమి మాన్పు"మని. దీనిని విష్ణుచిత్తుడు వాదారంభముననే నిరీశ్వరుల నోడించు రూపమున నిర్వహించెననుకొంటిమి. ఈ దుర్మదాంధులెవ్వరయినది స్వామి పేర్కొనలేదు గాని

వారు ఈశ్వరుని తిరస్కరించు దుర్మదముచే అంధులయిన వారని యూహించుట సరసము. సందర్భ శుద్ధికూడ దీనిని బలపరచుచున్నది. విష్ణుచిత్తుడు వాదారంభమున పోడిమి యడచినదీ నిరీశ్వరులనే!

**మన్నవారు మూడవ ఆదేశము:-**

ఇక రాజును, "వైష్ణవుగా నొనరింపుమని" స్వామి ఇచ్చిన యాదేశమొకటి మిగిలియున్నది. ఎంతమంది విద్వాంసులనోడించిన నేమి ఫలము? దానివలన వాద శుల్కము మాత్రము లభించును. రాజు వైష్ణవుడైననేగాని, స్వామి యాజ్ఞయు, విష్ణుచిత్తుని కోర్కెయు, వైష్ణవ పరిషత్తుల వృద్ధియు ఫలించవు. రాజు పరిణతాంతః కరణుడుగానిదే అతనిని వైష్ణవునిగా నొనరించుట కుదరదు. ఆయన హృదయము నెట్లాకర్షింపవలెను? ఇంతవరకు విష్ణుచిత్తుడు చేసినది విద్వద్వాదము. దానివలన రాజు మనస్సున కొన్ని ధర్మ సందేహములు చేరి యుండును. అది ధీసంబంధమగు విషయము. అది హృదయ సంబంధియగు భక్తిగా రూపొందవలెను.

**రాజోచిత దీక్ష:-**

భక్తి పుట్టెనే యనుకొందుము. దానికి తగు అనుష్ఠాన విధానము చూపవలెను. అది రాజ్య పాలకుడగు మత్స్యధ్వజుని అంతరంగ రుచికనువైనది కావలెను. విష్ణుచిత్తుని వలె అతడు శాంతి, దాంతి, పరతంత్రతతో పరమైకాంగియై మాలికాకరణ కైంకర్యమును, భాగవత సమారాధనలు చేయుచు కాలము గడపలేడు. అతడు రాజ్యపాలకుడు. క్షత్రియుడు. ప్రజాపోషణ మతని ధర్మము, అశక్తుడు కాని అధికారి. ఈ స్వధర్మమును వదలుట పాపము. (3.61-62) మరియు రాజ్యమును వదలవలెనను విరక్తితో మత్స్యధ్వజుడీ వాదముల నేర్పరచలేదు. అది స్వామి యాజ్ఞయు కాదు. దాని వలన వైష్ణవులకు మేలును కలుగదు.

**రాజరంజనము; ఖాండిక్య కేశిధ్వజుల కథ:-**

1) రాజు రాజుగనే యుండవలెను. అతనికి మోక్షము లభింపవలెను. ఇది సాధ్యమా? ప్రసిద్ధులగు పూర్వరాజులెవరైన నిట్లు చేసిరా? అయినచో నా వృత్తాంతమును

ఆఖ్యాన రూపముగ జెప్పినచో మత్స్యధ్వజుని హృదయమునాకర్షించును. ఇదివరకటి వాదమంతయు వాదిభంజకము. ఇపుడు రాజరంజనము చేయవలెను. వాది భంజన, రాజ రంజన- ఈ పద్ధతిని తానై యవలంబించినచో నది పునర్జన్మ హేతువగునను. భయమిపుడు విష్ణుచిత్తునకు లేదు. ఆయన ఇపుడు స్వామి యాజ్ఞాపేనట్లు చేయుచున్నాడు. అందుచే నదియొక కైంకర్యము, రాజరంజనమొనర్చుటకు -కవి, వైష్ణవులకు ప్రమాణముగు విష్ణు పురాణమునుండి ఖాండిక్య కేశి ధ్వజాలను రాజులకథను చెప్పించెను. ఇది ఆముక్తమాల్యదకు మూలగ్రంథమగు దివ్యసూరి చరితమున లేదు. దీని నెన్నుకొనుటలో రాయల "శ్రుతి పురాణోప సంహితల...... సార సంగ్రహమును" "వేర్చి మార్చు" (1.13) నేర్పు కనిపించును. ఈ కథలో రాజ్యభ్రష్టుడు, కర్మిష్ఠి- యగు ఖాండిక్యుడను రాజుకు అతనిని జయించిన జ్ఞాని, దాయాది, రాజ్యపాలకుడునగు కేశిధ్వజుడు రాజ్యపాలన, అరాతిహననములు చేయుచునే (3.62) రాజగువాడు పూర్వపుణ్యములను భోగములచేతను, దురితములను కష్టానుభవముచేతను ప్రక్షీణింపజేయుచు అష్టాంగిక భక్తి యోగాను సంధానము, (3-89) విష్ణు సామ్యమునుగని ముక్తుడగు (3-86) మార్గమును బోధించును. ఈ మోక్షసాధన ఒక రాజు మరొక రాజుకు చెప్పినదగుటచే పాండ్యరాజగు మత్స్యధ్వజునకు బోధించుటకు, తగినదను యూహతో రాజగు రాయలు విష్ణుచిత్తుని నోట పలికించెను. రాయలు కావ్యమంతట విష్ణుచిత్తుని సూక్ష్మబుద్ధిని పోషించును. ఈ కథ నతనిచే నుదహరింప జేయుటలో గూడ కవి ఈ మెళకువను పాటించినట్లగుపించును.

<u>రాజును వైష్ణవునిగా జేయుట:-</u>

(మన్ననారు మూడవ యాదేశము "వాడును రోసినాడిహము వైష్ణవుగా నొనరింపు సత్కృపన్" 2-88)

ఇంతటితో మన్ననారు విష్ణుచిత్తునకిచ్చిన రెండు ఆదేశములు నెరవేరెను. మొదటిది పాండ్య దివాణమున ప్రేలెడి దుర్మదాంధులను అణచుట. (నిరీశ్వరులను) రెండవది విష్ణుతత్త్వ మహిమమును ప్రకటించుట- (2.88) ఇక పాండ్యరాజును వైష్ణవుగా నొనర్చుమను యాదేశమొకటి మిగిలియున్నది.

విష్ణుచిత్తుడుపదేశించిన వేద వేద్యమగు విష్ణుతత్త్వమును (4.5) వినుటచే రాజు పరిణతాంతః కరణుడయ్యెను (3-89) అనగా, అతనికిపుడు మోక్షప్రదుడగు పరమేశ్వరుడెవ్వరో, అతనినెట్లు ధ్యానించవలెనో, ఆ ధ్యాన ఫలమేమో తెలిసి జిజ్ఞాస తీరెను. అంతః కరణము పరిణతమయ్యెను. ఈ జ్ఞానము మేధాసంబంధి. అది హృదయ సంబంధియగు భక్తిగా పరిణమించి జాలువారిననేగాని నది యతని సర్వాంతరాళములందు హత్తుకొనదు. ఇది శ్రీవైష్ణవ సిద్ధాంతమున ముఖ్యము. ఈ మెలకువతోనే కవి విష్ణుచిత్తుని వాదక్రమమును రాజుకు కలిగిన జ్ఞానము భక్తిగా పరిణమించుటను ఇట్లు క్రోడీకరించెను. "వేదమైన విష్ణుతత్త్వంబిట్లు వాదిగెలిచి తెలిపి వసుమతీశు భక్తినోలలార్చి, భగవత్ప్ర పన్నుగాఁ జేసి, లోకహితము సేయుటను" (4.5), ప్రపన్నునిగా జేయుటేగాక, మూల మంత్ర పూర్వకముగా ఆయనకు ద్వయము ప్రసాదించి-భాగవత ప్రధానుని గావించెనట. (3.89).

ఇచట ప్రకరణమునుబట్టి మంత్రార్థములను వివరించుటచే మత్స్యధ్వజుడు భక్తియందోలలాడెనని తోచును. రాజును భాగవత ప్రధానునిగా చేయుట లోకహితమని కవి ప్రశంసించును. దీనిని కూడ సందర్భమునుబట్టి, భాగవత లోకహితము అని చెప్పుకొనవచ్చును. లేక, వే.వేం.రా. శాస్త్రులవారి ననుసరించి, రాజు వైష్ణవుడైనచో "యథారాజా తథాప్రజా" యను న్యాయమున లోకులెల్లరు వైష్ణవులయి, రాజువలె తాముకూడ హితము పొందుదురనుకొనవచ్చును. ఏదయినను వైష్ణవహితమే యగును. హితమనగా మేలు అని శాస్త్రుల వారి టీక. కాని మనము వైష్ణవుడు మొదట తత్త్వమును తెలిసి, పురుషార్థమును నిర్ణయించుకొని, తత్సాధన కనుకూలమగు నిష్ఠ (ఉపాయము) నెన్నుకొనుటను హితమనుకొనవచ్చును. అట్లు చెప్పుకొన్నచో విష్ణుచిత్తుడు లోకులను సరించదగిన హితమును (మార్గము) కల్పించెను- అని యేర్పడును.

ఇంతటితో మన్ననారు "వాడును రోసినాడిహము, వైష్ణవుగా నొనరింపు సత్కృపన్"- అని ఇచ్చిన మూడవ యాదేశమును కూడ విష్ణుచిత్తుడు తు.చ. తప్పక మనస్విత తో నిర్వహించుట పూర్తియయ్యెను.

# రహస్యత్రయము - శ్రీవైష్ణవ మంత్రములు

వైష్ణవ మంత్రములనేకములున్నను దాక్షిణాత్య శ్రీవైష్ణవులకు మూడు మంత్రములు ముఖ్యములు. వీనిలో శ్రీవైష్ణవ సిద్ధాంత రహస్య మంతయు నంతర్గర్భితమై యున్నందున దీనిని రహస్యత్రయమని యందురు. వీనిలో మొదటిది.

"ఓం నమో నారాయణాయ" అను అష్టాక్షరి. దీనినే మూలమంత్రమని, తిరుమంత్రమని, మంత్రరాజమనియు అందురు. ఇది కొన్ని నియత సమయములలో మాత్రమే జపించునది. ఈ సంప్రదాయమును పాటించియే రాయలు విల్లిపుత్తూరులో విష్ణుచిత్తుడు తులసీ మాల్యమును మూలమంత్రముతో మన్ననారుని అక్కున (వక్షము) సేర్పబోయెనని చెప్పుట (2-87).

ద్వయము:-

ఇక వైష్ణవుల రెండవ మంత్రమును ద్వయమంత్రమందురు. శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే: శ్రీమతే నారాయణాయ నమః" అను రెండు ఖండములు గలుగుటచే దీనికి ద్వయమను పేరుగల్గెను. దీనినే మంత్ర రత్నమని యందురు. ఇది శరణాగతిని తెల్పునది యగుటచే దీనినెవ్వరయిున ఎచ్చటైన, ఎప్పుడయిున, తామే స్థితిలో నున్న, ఉన్నయట్లే జపింపదగినది. ఉదా॥ ఈ మెలకువతోనే కవి విష్ణు చిత్తుని వర్ణించునపుడతనిని ద్వయమంత్రము నెలవుగా గల ముఖము గలవాడని చెప్పును ("అందుండున్ ద్వయ సద్మ పద్మ వదనుండు" 1.77)

"ఓం నమో నారాయణాయ" అనునది నేటి జై, జైల వలె పూర్వము జనసమూహముల యూరేగింపులలో పెద్దగా ఉచ్చరించు యాచారమున్నట్లు తోచును. పల్లాండు మంగళాది శాసనమున 4వ పాశురములో విష్ణుచిత్తుడు ప్రజలను తమ గోష్ఠిలోని కాహ్వానించి అందరు కూడి నాడు నగరము ఎరుగునట్లు "నమో నారాయణాయ" అని పాడుడని వారి కుద్బోధించును. "నాడు నగరముం నన్గరియ (చక్కగా ఎరుగునట్లు)

నమో నారాయణాయ వెన్ను (అని) . . . . పల్లాండు కూరిమినే' (పలుకుడు) అని ఆయన సంబోధన. ఈ మంత్రార్థమును గ్రహించుటకే శ్రీరామానుజులు యామునా చార్యుని శిష్యుడగు తిరుక్కోట్టి యూరు నంబిని పదునెనిమిది మారు లర్థించి, తుదకు లబ్ధమనోరథుడై, దీని నెవ్వరికైన తెల్పినచో నరక ప్రాప్తి కలుగునను గురు నిషేధము నుల్లంఘించి, లోక హితమును గోరి, పరమ కృపాళువై దేవాలయ గోపురమెక్కి, ప్రజలందరకు వెల్లడించినట్లు సాంప్రదాయిక గాథ కూడ కలదు.

<u>చరమ శ్లోకము:-</u>

**సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ,**

**అహంత్వా సర్వపాపేభ్యోక్షయిష్యామి మాశుచః**

అను గీతా శ్లోకము (18-66) శ్రీ వైష్ణవుల మూడవ మంత్రము.

అర్జునకు సర్వసాధన మార్గముల నుపదేశించిన కట్టకడపట వీనిలో నేవియు నాచరింపనేరకున్నను. సర్వజనులు అవలంబించదగినదిగా శ్రీకృష్ణుడు గీత చరమ భాగమున (18-66) నుపదేశించినది గనుక చరమ మనియు, శరణాగతిని తెల్పుటచే శరణాగతి మంత్రమనియు దీనికి వ్యవహారము.

<u>విష్ణుగాయత్రి:-</u>

ఈ మూడు మంత్రములు కాక, "నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్" అను మరియొక మంత్రము విష్ణు గాయత్రి యని ప్రసిద్ధము. దీనిలో నారాయణ వాసుదేవ, విష్ణు, అనుమూడు నామములు చెప్పబడినవి. ఒక విధముగా ఇది వేదములందలి విష్ణును బ్రాహ్మణములందలి నారాయణుని ఆగమపురాణములందలి వాసుదేవుని ఏకీభూతము చేయుమంత్రమనవచ్చును.

## జాలెతెగుట - విష్ణు చిత్తుని విజయము

**సూక్ష్మవివరములు:-**

విష్ణుచిత్తునకు మన్ననారిచ్చిన నాలుగు ఆనతులలో శుల్కమును హరింపుమనునది కూడ ఒకటి, రాయలిది మరువక, దానినతి సూక్ష్మవివరములతో నద్భుతముగ వర్ణించును. అదియొక జాలె, దానినారాజు టంకసాలనుండి సరాసరి తెప్పించిన బంగారు నాణెములతోనించి ఆస్థానిలో వ్రేలాడ గట్టించెను. జాలెలోని కొత్త నాణెములు జాలె అల్లికపుమార్ల సందునుండి బీరపువ్వులవలె మెరయుచుండెను. జాలె క్రింది భాగము లావు. పోను పోను పైన సన్నము. అందుచే నది తలక్రిందుగ వ్రేలాడుచు రాను రాను వృద్ధియగు కాలసర్పమువలె నుండెను.(2.85) దాని యందలి యపేక్షచేతనే బహు సమయముల మెలగు కోవిదులుకూడుట (2.84) ఈ జాలెపుట్టువు రూపునే గాక, దానిని హరించురీతినిగూడ కవి ఆసక్తికరమగు వివరములతో వర్ణించును.

మొదటి వింత - రాజును వైష్ణవునిగా చేయుగానే ఆ జాలె దూలమునకు గట్టిన త్రాటిముడిపుటుక్కున తెగి, టటాలున పెద్దశబ్దముతో నేలపై పడెనట. (వే. వేం. రాస్త్రి).

(పెలుచన్ గంటు పుటుక్కునందునిసి వేపృధ్వింబడె) (4.3)

ఇక తెగిన వైనము చూతము. అది బరువుచేత తెగుటగాదు. ఎవరో బలమంతయు పూన్చి త్రెంపినట్లుగా తెగెను. (బలిమిం త్రెంపగబోలె) మరి ఆ త్రాటికి పురియుండునుగదా! ఆ పురిలో ఎన్నో నూలు పోగులుండును. వాని గతి చూతము, ఆ కలనూళ్లన్నియు పాయలు వడి పర్యాయభంగముగా తెగిరాగా అంటు పోగొక్కటిమిగిలెను. కొంతసేపాగి అదిగూడపుటుక్కుమను ధ్వనితో తెగి జాలె వేగముగా నేలపైబడెను. త్రాడు తెగుటలోని సూక్ష్మవివరములన్నిటిని సునిశితముగా పరిశీలించి పాఠకుల కంటికగపడునట్లు వర్ణించుట రాయల సూక్ష్మ దృశ్య చిత్రణ కళకొక అద్భుత నిదర్శనము [miniature painting] ఇది మూలగ్రంథమున లేదు. (వే. వేం. ర,-

వావిళ్లవారి(ప్రతి- పీఠిక- 1917) జాలె తెగిన పిమ్మట గూడ కొంత సేపు క్రింద పడక అంతరాళమున నిలిచి క్రింద పడెనని వేదము వారు. 1917- 4.3)

ఆ తరువాత మిన్నుల నుర దుందుభులు మ్రోగెను. పుష్ప వర్షముకురిసెను. ఆ వర్షము సన్నగా వ్యాపించి కురిసెనట. వాన కురియుటలోనిది యొక విన్నాణము. విష్ణుని స్థూల రూపస్మరణచే జాగృతమైన విష్ణుచిత్తుని అతీంద్రియ అంతశ్శ్రోత్రవ్యము విస్తరించి, దేవదుందుభి ధ్వనులను వినగలిగెను. వాని పూలవానను చూడగలిగెను. ఈ చైతన్యము రాను రాను ఆయునకు క్రొత్త యనుభవములనిచ్చుట ముందు చూతుము. కవి దీని క్రమోన్మీలనమును జాగరూకుడై ప్రదర్శించును.

## విద్వాంసులకు పారితోషికములు:-

దేవతలదృశ్య సదస్యులు. వారిని మరువనట్లే రాయలు సభలోని పండితులను గూడ మరువలేదు. వారిని సత్కరించుట మరువడు. అది ఆయన సభామర్యాద. దానినిచట వర్ణించిన తీరునుబట్టి చూడగా గెల్చిన విష్ణుచిత్తుని కన్న మత్స్యధ్వజుడు తక్కినవారికే యెక్కువముట్ట చెప్పినట్లు తోచును. పాండ్యుడు పారితోషికము లిచ్చుట కెందరో సేవకులను (సేవివ్రాతము) అంచెలంచెలుగా పంపెను. (అందందపంపక= దీనికి శాస్త్రులవారు అప్పుడప్పుడే అని వ్రాసిరి) వారటునిటు పరుగెత్తునపుడు (భ్రమత్) మణి స్వర్ణ భూషావస్త్ర సమూహములు జారి నేలపై మోకాటి లోతున పేరుకొనెను. అవి రాజభండారము నుండి సభామందిరము వరకుగల త్రోవయంతట ఒక మాలవలె వ్యాపించెను. ఆ మాల భూదేవి శిరమున ధరించిన రంగు రంగుల మాలయా అనిపించెను. (4.4).

## దేవతల మెప్పు:-

ఆ "ధీరాగ్రణి" విజయోద్రేకము సమస్తాకాశమునకు వ్యాపించెను. "గెల్పుటుత్సవము"- ఉత్సవమనగా ఉద్రేకమని, (వే.వేం.రా.శా. పుట-269) దేవతలు "అద్దా"! (సరి) యనిరి. పితృదేవతలు "ఆహా!" యనిరి. సిద్ధులు "ఆహా!" యనిరి. విద్యాధరులనుండి "ఆః!" కలియుగము కృతయుగమైనదను శ్రీసూక్తి వినిపించెను.

కిన్నరులు "విబుధ్యుల మహోద్ధతత్వము నాశనము పొందెను గదా! యని బిగ్గరగా పరచిరి!"- ఇచట ఆశ్చర్యోద్రేకము మొదట ఒక్క పదములో బహిర్గతమయి ప్రశంసా వాక్యముగా విస్తరించి తుదకు శబ్దార్థమున పెద్దగా నినదించెను. (ఉచ్చదల్ కిన్నరం ఉత్+నదత్+కిన్నరం= బిగ్గరగా అరచుచున్న కిన్నరులు గలది. (వే.వేం.రా.శా. వారు పుట-270)

జన సమూహపు టుద్రేకము మొదట మర్దితమై ఏ ఒకరికడనో హఠాత్తుగా ఉద్గతమై, ప్రక్కవారలలో నల్పముగ జాలువారి, తుదకు సమూహమంతట వ్యాపించి ప్రవహిల్లుట సామూహిక మనో ధర్మము. ఇచటి సముద్రేకము అతీంద్రియ శ్రవణ శక్తిగల విష్ణుచిత్తుని అంతశ్శ్రోతవ్యము నుత్తేజ పరచి యుండును. ఈ యుత్తేజ క్రమమున విష్ణుని శుద్ధ సత్త్వాల రూప చింతనను గూర్చిన వివరణ (3.85-86) మొదటి మెట్టు, దేవదుందుభులను వినుట రెండవ మెట్టు, దేవతల మెచ్చుకోలు యుద్రేకముచే ఉద్దీప్తమగుట మూడవ మెట్టు. ఇప్పుడాతడు దేవగణమును, వారి వాక్యాలను, అనుభూతి పరిధిలోనికి తెచ్చుకొన గలిగెను. ఈ యనుభూతి విస్తరణ తుదకు విష్ణునాకాశమున సాక్షాత్కరిచు కొనగలుగుట, తరువాత కథనమున విందుము.

<u>ఓడిన విద్వాంసులు:-</u>

ఈ యుద్రేకముచే రాజు ఖజానా ఖాళీ చేయించెను. సేవకులు భూమిని నింపిరి, దేవతలాకాశమును ధ్వని పూర్ణము చేసిరి. రామరానిది సామూహిక హృదయమును విప్పారజేసెను. కాని ఓడిన విద్వాంసులపట్ల ఈ యుత్సాహము విపరీత ఫలితము గలదయ్యెను. ప్రత్యర్థిని ప్రశంసించు వారి యుత్సాహము వీరి గుండెలను మరింత ముడుచుకొనజేసెను. వీరిని రాయలు ఆరు సజీవ చిత్ర ఫలకములలో చిత్రించెను.

1). వీరిలో కొందరు పెదవులు నాకుచు బయటికి వచ్చిరి. ఆ వెలియరుగుల మీద వెదురుగనున్న తమ పాదుకావాహలను చూడకనే ముందుకుపోయి వెదకిరి. వీరి హోదా కాలినడకన వచ్చు మాత్రపుది అయినను వీరికి చెప్పులను మోయు

వారున్నారు. వీరు నౌకరులు కనుపించనపుడు వారికొరకు వెదికిరేగాని మరే యార్పాటము చేయలేదు.

2). మరి కొందరు వీరి కన్న హోదా కలవారు. అందలపు స్వారి వారి గొప్ప. వారు తమ యెదుటనే యున్న అంత పెద్ద అందలమునే కానక, దాటిపోయి, చేయెత్తి పెద్ద గొంతుతో బోయలను కూకలు వేసిరి.

3). ఇక, పాదూ వాహులు, బోయీలు లేని సాధారణ విద్వాంసులొకరి నౌకరు కలసి వచ్చుట మరచి, నగరు వెలువడుదాక తెగిపోయి నగరు దాటిన పిమ్మట జ్ఞప్తికి వచ్చి, ఆగి తోటివారిని కూడుకొనిరి.

4). ఇక నాల్గవ దృష్టాంతములోని వారి హోదా యేమో తెలియదు గాని, పరాకులో వారిదే పరాకాష్ఠ పై యందరిని పలుకరించువారు లేకున్నను. వారు కొద్ది దూరములోనే తెలివి తెచ్చుకొనిరి. ఈ నాల్గవ తరగతి ప్రముఖులు ఎదురయిన తమ వానిని పరాకులోనే గృహకృత్యమడిగిరి. వారనునవి కొన్ని చెవికి తప్పెను. కొన్ని మతికి తప్పెను. అయినను ఊఁ ఊఁ యని యూకొట్టిరి. (వాడను నవి తప్ప= వాడు ఒకటి చెప్పిన మరి యొకటిగా అని శ్రీ వే.వేం.రా.శా. పుట-271).

5). కొందరు ప్రౌఢులకు పరాకుకన్న పౌరుషము హెచ్చెను. వారినచటి వారు "వాదమే మాయె"నని యడుగగా వారు "ఏమవును? రాజు పక్షపాతమువలన ఆ దాసరి బ్రతికి పోయెను" అనిరి.

6). ఇంతకన్న యభిమానవంతులు "బొలెండి, విమర్శకు దూరమైన (విమర్శలేని) వాకిట ఇక నెవడుండును?" అనిరి (4.7).

7). ఇట్లనుకొనుచు పోవువారూ, వీరూ, శృంగాటకమున (చౌరస్తా= చతుష్పథము) కలసి కొంత సేపు నగరివైపే జూచుచు గుసగుసలాడి, (మంతనములాడి) ఇండ్లకుబోయిరి. (4.8) ఈ ఘట్టమున రాయలు వర్ణించిన వాదక్రమము, తత్త్వన్యాసము, పండిత సన్మానము, రాయలు విద్యానగర భువన విజయ సభలలో తాను స్వయముగా చూచినవైయుండును. కాని, ఓడిన వారివైఖరి సభ వెలుపలిది.

అది రాయలు చూచి యుండనిది. అయినను మొదటి దాని కన్న దానిని మరింత సహజముగా వర్ణించుట విశేషము. ఆయన చారదృష్టి అంత నిశితమైనది కాబోలు! ఆయన రాచ కార్యములకు, దిన విభాగములకును నిర్ణయించునపుడు సాయంకాలము వేగుల వారి గోష్ఠికి కేటాయించెను. (4.271) (88వార పూర్వకము సంజ 4.271")

చారదృష్టియైనను పండితులు పెదవులు నాకుకొనుట, చేయెత్తి కేకలువేయుట, మతి మాలియూ, కొట్టుటవంటి చిన్నచిన్న సూక్ష్మ వినోద విషయములనెట్లు గ్రహించెనో! ఆయనకు హాస్యము సహజ గుణమగుటచే వది కావ్యము నిండుగ వ్యాపించిన ఉత్ప్రేక్షాది ప్రౌఢకల్పనా వ్యూహముల తెరపులలో యెట్లో తొంగి చూడగలుగునని తోచును.

## విష్ణుచిత్తుని యూరేగింపు- రాయల సత్కార సంప్రదాయము

విష్ణుచిత్తుడు వాదమున గెలిచెను. రాజతనిని సత్కరించి పంపెను. అతడింటికి బోయెను. అని ఈ కథాభాగమును ముగింపవచ్చును. కాని, రాయలు వదాన్యుడు. వైభవ ప్రియుడు, రాజ మర్యాదలు పాటించువాడు. అందువలన సభలోని విద్వాంసులందరికి పాండ్యునిచే అనేక పారితోషికముల నిప్పించి సత్కరింపజేసెను. అంతటితో ఆయనకు తృప్తి కలుగదు. ఆచార్యపురుషునకు ఊరేగింపు పూజ చేయవలెను. ఆ యూరేగింపా మహానగరమగు మధురైతో చాలదు. విల్లిబుత్తూరు వరకు (50 మైళ్లు) సాగవలసినదే. ఆ వివరములను భావితరముల వారి భావవీథిలో వెలయించవలసినదే. ఇది రాయల జీవన ప్రియత్వమునకొక నిదర్శనము. అది తెలుగు, తమిళ, కన్నడ దేశములన్నిటి యాచార వ్యవహారములకు విస్తరించును.

<u>మధురలో:-</u>

మత్స్యధ్వజుడు భాగవత ప్రధానుడైన పిమ్మట ఆయనకు రెండు కర్తవ్యము లేర్పడెను.

1). సభా వృత్తాంతమును ప్రజాబాహుళ్యమునకు తెలియజేయుట. సభా ద్వారము దాటీ దాటకనే రాజు పక్షపాతియని, విమర్శదూరుడని, ఓడిన విద్వాంసులు

చేయు వక్ర ప్రచారమును వింటిమి. ఇట్టి యపవాదములు వ్యాపించకుండ వాస్తవమును రూఢిచేయుట పాలకుని ధర్మము. లేనిచో ప్రజలనూయాగ్రస్తులగుదురు.

2) భాగవత ధర్మ విజయమునకు విస్తృత ప్రచారము కల్పించుట భాగవత ప్రధాముని విధి.

రాజోద్దేశ్యములు లౌకికములైనను నారేగింపులోనది విష్ణు సాక్షాత్కారరూపమగు అలౌకికానుభూతిలో పరిణమించును. విష్ణుచిత్తుని అతీంద్రియానుభవ వ్యాప్తిలోనది అత్యంత ప్రధానమగు ఘట్టము. దాని ప్రభావము నేటికిని పల్లాండు గీత రూపమున వైష్ణవ హృదయములపై ప్రసరించుచున్నది.

<u>విజయోద్రేకము:-</u>

ఇట్లు "రూఢిసై" రాజు విష్ణుచిత్తుని మహాగజారూఢుని జేసి "పురియేగించుడ"ని యాజ్ఞాపించెను. పురి యేగించుటయే గాక, "తదీయమైన నగరంబు జేర్పుడ"ని కూడ ఆయన ఆనతి (50 మైళ్లు), ఆ యాజ్ఞ ఉద్యోగులకో, పరిచారకులకో గాదు, దొరలకు, రాజకుమారులకు, ఆనతిచ్చుటే గాదు. ఆయనను వెంబడించునట్లు పంపెను. (బడిన . . . . బనుప) వారా విష్ణుచిత్తుని "మహాగజము"న కిరుగడల పోయిరి. రాచతీవితో గాక, విష్ణుచిత్తుడొక ప్రభువో, దేవుడో అన్నట్లాయనను "కొల్చి" వారిరుగడంబోయిరి. "మహాగజము" పై విష్ణుచిత్త "ధీరాగ్రణి" దానికిరుగడల "దొరలు" రాజకుమారులు- ఒక అపూర్వ మహనీయ దృశ్యము. ఇది ప్రజల నయనేంద్రియముల నాకర్షించును. ఆ రాకుమారులకు ముందు నడచు "నిరంతర వందిస్తుతులు" "తూర్యస్వనములు" "గజేంద్రహయఘంటారావములు" వారి శ్రవణేంద్రియము నాకట్టును. ఈ దృశ్య శ్రవ్య, వైభవములకు పతాకగా "వారకాంతాంఘ్రినూపుర" ధ్వనులానందమును చిందించెను. ఈ యానందకోలాహలము రాజధానియంతట వ్యాపించెను. రాజసభలో నారంభించిన విజయోద్రేకమిపుడు రాజధాని యంతట వ్యాపించెను.

<u>ఆకసమున విష్ణువు:-</u>

మధుర "పురియేగింపు" విలుబుత్తూరు మార్గము బట్టెను. నగర వీథులలో నారంభించిన యుత్సాహము ఊరూర పరిపుష్టమాయెను. ఇది విష్ణుచిత్తుని అతీంద్రియ

విష్ణుచింతనకుద్దీపనహేతువయ్యెను. మార్గమధ్యమును చేరునప్పటికాయన దహరాకాశమునందలి విష్ణురూపము ఆయన మనః ప్రాణేంద్రియ సీమలలోన పొంగి మహోగజముపైనున్న ఆయనకు బాహ్యాకాశమునందే ఖగరాజు మూపున శంఖ చక్రాలంకారితుడగు చతుర్భుజ మూర్తిగ సాక్షాత్కరించెను. ఈ మూర్తిస్ఫురణ క్రమమును రాయలు సూక్ష్మబుద్ధితో వర్ణించును.

**<u>సాక్షాత్కార సూచికలు:-</u>**

ధ్వనికన్న కాంతి, వాసన కన్న ధ్వని, వేగముగా ప్రసరించును. సాక్షాత్కార సమయమున మొదటగా గోచరించినది దివినుండి ప్రసరించు కాంతి. ఇది గరుడారూఢుడగు చతుర్భుజుడు ఆకసమున దూరమునవున్నపుడే, సువర్ణుని (గరుడుని) సువర్ణ "గరుత్పరం పరల నిగ్గు"గ (రెక్కలకాంతి) ప్రసరించుచు వింగివి లేదాగరెక్కించెను. (లేత ఎరుపు)లేతొగరెక్కిన నీలాకాశము ఇంగిలీకపు ఎరుపు నీట దడిపి పైకెత్తుచున్న నల్లని జంట నేతవస్త్రమువలె నీలలోహిత వర్ణముతో భాసించెను.

కాంతి ననుసరించునది ధ్వని. ధ్వనికూడ ఆకాశ [*Ether* ] సంబంధియే. తొగరు కాంతుల వెన్వెనుకనే ఆకాశము ఖగరాజు రెక్కల పెను మ్రోతతో నిండెను. ధ్వనికి పిమ్మట చేరునవి రెక్కల గాల్పులు. అవి కలశాబ్ధి (పాల సముద్రము) మీగడల జిడ్డైరిగించు కమ్మదనముతో వీచెను. ఇదియేమని చూడగా మొదట కన్పించినది విష్ణుపాద స్థానీయుడగు పెన్దిరువడి (పెను+తిరు+వడి= పెద్ద శ్రీపాదము= గరుడుడు- ఇది వైష్ణవ పారిభాషికపదము)

అతడు సమీపించుకొలది అతని రెక్కల మరుగు తొలగుచు అతని మూపునగల కమలేక్షణుడగు చతుర్భుజుడు తోచెను-(4.10)

## <u>సాక్షాత్కార క్రమము</u>

విష్ణుచిత్తుని దృష్టి మొదట విష్ణుని దివ్యాంఘ్రులచే నాకర్షింపబడెను. పై నుండి అవతరించు మూర్తిలో మొదటగా పాదములు కనిపించుట సహజము మరియు

అది విష్ణుని మోయుచు అతని అపరభాగమున నున్న గరుడుని రెండు హస్తోదరములందు అమరియుండెను. అట్లుండుటచేత, ఊర్ధ్వభాగ దర్శనమునకు గరుడుని యాకారము అడ్డు అగును. అందుచే గురుడుని హస్తములందున్న పాదములే ప్రథమముగా దర్శితములగుట సహజము. గరుడుని చేతులు చివురు పొట్లములవలె నుండెను. అందలి పాదములు ఎఱ్ఱగలువల (చెందమ్ములు) వలె ఉండెను. (చివురు కొంచెమెఱ్ఱనివి. కలువలు మరింత ఎఱ్ఱనివి. అందుచే చివురు హస్తములందలి, చెందమ్మిపాదములు స్ఫుటముగ గుర్తించదగినట్లుండెను.)

తమిళ సంప్రదాయమున విష్ణుచిత్తుడీ ఎఱ్ఱని పాదములచెంగావి (శేవడి శెవ్వి) చే సమ్మోహితుడై వానికి పలు కోటియేండ్లు శుభరక్షణము (తిరుక్కాపు) కోరెను. దీనిని ప్రసిద్ధమగు ఈ పల్లాండు (పలుయేండ్లు) దీవెనలో తరువాత చూతము.

2). పాదరక్తిమకు పై భాగమున కనుపించినది విష్ణుడు లీలతో తాల్చు పసిడి చేల 'మెరుపు'. గరుడుని బంగారురెక్కల ఊర్ధ్వచ్ఛాయతో మిళితమై విష్ణుని నున్న మేని నీలిమపై వ్యాపించెను.

3). మొదట పాదములపై వ్రాలి తరువాత మేనుపైకి వ్యాపించిన, విష్ణుచిత్తుని చూపు విష్ణుని వక్షస్థలమునకు ప్రాకెను. అచటి హారములాయన కంటికి విష్ణుహృదయమున వ్రాలిన తన వంటి యోగి వర్గముల నిర్మలాంతః కరణమణి గణములవలె భాసించెను.

4). ఆయన చూపు మరికొంత పైకి వ్యాపించి స్వామి మకరకుండలములను గమనించెను. వానిలోని మకరాకారములు స్వామితో నేమో మనవి చేయుటకు సమీపించినట్లు తోచెను. చెవివద్ద జేరి మనవి చేయు చనువు వానికి "సిరికి పుట్టింటి నెచ్చెలులౌట" చే కలిగెను. కాబోలు!

5). ఆ చెవుల కిరుప్రక్కలనున్న స్వామి ఊర్ధ్వ హస్తములు భక్తజన రక్షకములగు శంఖుచక్రములతో ఒప్పెను. శంఖమున్న చేయి తెల్లని హంసలగుంపు

ఆశ్రయించిన కల్పశాఖవలె నుండెను. చక్రముతో నున్న చేయి సుడిగాలికి రేగిన సుమపరాగ వలయములో అలంకృతమైన కల్పశాఖవలె నుండెను. దిగువనున్న బాహువులు వరము లిచ్చుటకై ముందుకు సాగిన కల్పవృక్షశాఖల వలె దీర్ఘములై యుండెను. ఆయన నాల్గు చేతుల నారాయణుడు గదా!

6). వీనినన్నిటిని మించినవి ఆయన కన్నులు. అవి వికసిత కమలములవలె కరుణామధువు నొలుకుచుండెను-(4.11)

<u>ఆకసమున దేవతలు:-</u>

అప్పటికే ముప్పది మూడుకోట్ల అమరులాకసమున జేరి విష్ణుచిత్తుని యుత్సవమును జూచుచుండిరి. హరిని చూచినంతనే విప్పియున్నవారి గొడుగులు, వానితోపాటు వారిచేతులు తటాలున ముకుళితములాయెను. రాజ సమక్షమున నితరులు గొడుగు ధరించరాదు గదా! రాయులే రాచ మర్యాదను మరువడు- (4.12)

<u>రక్షః పిశాచములు:-</u>

ఏ ఉత్సవమును జూచుటకైనా మంచివారే గాదు, ఇతరులు వత్తురు. ఈ ఉత్సవ దర్శనమునకు అమరులతోపాటు రక్షపిశాచ పుంజములు గూడ సమ్మదముతో ఆకసమునచేరిరి. కాని పాపమాభాగ్యము వారికెంతోసేపు దక్కలేదు. గరుడుని పతత్త్ర (రెక్కల) ప్రభంజనములు సోకగనే వారు భయపడి పారిపోయిరి. వారి పలాయనము ధాన్యపు కళ్లమున చేటల గాలి దెబ్బకు పెద్ద పొల్లుకట్టు ఎగిరిపోవుటవలె నుండెను.

<u>మునుల సామగానము:-</u>

ఇంతలో దివ్యముని బృందము వచ్చి సామగానముతో విష్ణుని సంస్తవమొనర్చిరి. ఆ సమయముననే దేవతలు సందులేకుండ కుసుమధారా వర్షమును గురిపించుచుండిరి. దివ్యమునుల సామగాన స్తోత్రమా కుసుమములందు సంచరించు తుమ్మెదల అవ్యక్తమధుర సంకుల ఝుంకారమువలె యొప్పెను. (4.14) వంది తూర్య స్వనములతో నారంభమైన ధ్వని వేదకవి గానముతో పర్యవసించుట గమనీయము.

అది విష్ణుచిత్తుడిక కొద్ది కాలములో చేయబోవు విష్ణుని దశావతారస్తుతికి నేపథ్యగానమగును- (14-15-31).

సాక్షాత్కృతుడైన చతుర్భుజుని చూడగనే విష్ణు చిత్తుడు విష్ణుని దశావతారముల ననర్గళముగ స్తుతిపరంపరచే ననుభవించెను-4-14.

విష్ణుచిత్తుని (1)సాక్షాత్కారానుభవము, (2) దశావతారస్తుతి- ఇవి రెండును విష్ణుచిత్తుని జీవితమున మిక్కిలి ముఖ్యఘట్టములు. ఆ స్తుతి నేటికిని శ్రీవైష్ణవుల తమిళ వేద అధ్యయనాదులందు సంస్కృత వేదాధ్యయనమున ఓంకారమువలె, ప్రప్రథమమున సంకీర్తింపబడుచున్నది. ఇంతటి ముఖ్యమగు విష్ణుచిత్తుని సాక్షాత్కారానుభవమునకు పూర్వ రంగమును రాయలెట్టి మెలకువతో చిత్రించెనో పరిశీలించుట ఆసక్తికరము. (2) మరియు రాయలు పలికించిన స్తుతిని తమిళ దివ్య ప్రబంధములోని "పల్లాండు" ఆశీస్సుతో పోల్చిచూచుట గూడ ఉచితము.

**అతీంద్రియ చైతన్య వికాసము:-**

విష్ణుచిత్తుని సాక్షాత్కారానుభవమాయున అతీంద్రియ చైతన్యవికాసములో నొక ఉన్నతారూఢ దశను తెలుపును. కవి దీనిని కథారంభమునుండియు మెలకువతో గుర్తింపుచు వచ్చెను.

**తొలిదశ - యోగాభ్యాసము:-**

విష్ణుచిత్తుని ప్రవేశపెట్టుచునే ఆయనను ఎడతెగని యోగధ్యానపు గాలుమచే మధువిరోధియను నేనుగను చిత్తమున బంధించుటచే నన్వర్థాభిధానుడని వర్ణించెను. అది విష్ణు చిత్తుడు ఆచార్య కృపచే తత్త్వహిత పురుషార్థములను తెలిసిన తొలిదశ. ఈ దశ సముద్ర తీరమునుండి చిన్నపడవతో, లోనికి పోవుట కత్యంతము యత్నించువాని తొలియనుభవము వంటిది. ఆ తొలి దశలోని పడవ తీరాభిముఖముల్లై పరుగులిడును విరుగు అలల యుద్ధతి వలన మరల మరల వెనుకకు నెట్టబడును. ఇచట విష్ణుచిత్తుడు ఎడతెగని, యోగపు గాలుములచే విష్ణువను యేనుగును

కట్టివేయుట, విష్ణుచిత్తుని ప్రయత్నముల పరంపరను వాని తీవ్రతను- విష్ణుని అవశత్వమును, విష్ణుచిత్తుడాతని బలిమితో సాధించుటను, తెలుపును. ఇది నావికుడు వెనుకకు నెట్టబడుచునే లోనికి పోయి అచట గాలి సాయముతో పయనించ నేర్చి ఆకస్మాత్తుగ చేపలను పట్టగలుగుటను పోలును.

<u>రెండవ దశ - మన్నవారు ఆనతి:-</u>

విష్ణుచిత్తుని నిరంతర యోగసాధనచే ఆయునకు తెలియకుండనే ఆయనలో కొన్ని అతీంద్రియ శక్తులేర్పడును. అవి స్వప్రయత్నము నపేక్షించకనే సాధకునక తీంద్రియములగు రూపరస గంధ శబ్దాది అనుభవములనిచ్చుట యోగ సాధకుల కనుభూతమగు ప్రసిద్ధ విషయము. దీని ఫలితముగా విష్ణుచిత్తుడు ప్రప్రథమమున విలుబుత్తూరు మన్ననారు స్వామి గంభీర మధురోక్తిని, పాండ్యరాజ్య సభకు పొమ్మను ఆనతిని స్వప్రయత్నము లేకనే వినగలిగెను. (విల్లిబుత్తూరులో నల్ల విష్ణుచిత్తుడతుల తులసీ సుగంధ మాల్యమును నక్కుసేర్చంలో మన్ననారుదార మధురోక్తి . . . . నవ్విధమానతిచ్చి-2.87) ఈ అతీంద్రియ శ్రవణమునంతకు మున్నెరుగని వాడగుటచే విష్ణుచిత్తుడది వినగనే భయభ్రాంతుడై "వడ వడ వడకెను'- (2.89). ఆ యతీంద్రియ చైతన్యముతోనే, ఆయున స్వామికి తన యశక్తిని విన్నవించెను. అందుకా స్వామి "నీ యుచ్చయే" . . . . "మిన్నకపోవోయి" యని ఆదలించెను-2.90-93).

<u>మూడవ దశ- (వాదమున హరి ఆవేశము):-</u>

మరల రాజసభలో వాదము నారంభింప ప్రేరేపించుచు హరి విష్ణుచిత్తుని చిత్తవృత్తిని కదలించును. (అతిథ్యముగాని హరి తన చేతోగతి నాలయు 3-4) ఈ దశలో ఆయునకు సభాకంపముండదు. హరి శక్తి చేతనే ఆయున సునిశిత తర్కమును, అనర్గళోపన్యాసమును చేయగలుగును-(3-4-89). ఇచట సాధకుని సాధనను, దైవశక్తియే స్వయముగా చేపట్టుట చూతుము. ఇది ప్రపంచమందలి వివిధ యోగసాధకులకనుభవమగు విషయమే. ఇట్లా విష్ణుచిత్తుడు యోగ లబ్ధమైన అతీంద్రియ శక్తిమూలమున అర్చామూర్తి ముఖమున ఆదేశమును వినగలిగెను. అంతర్యామి ఉద్బోధవలన "వాటిగెలిచి" విష్ణుతత్వంబు తెలుపగలిగె-(34-5).

అయినను ఈ రెండు అనుబంధములలోను స్థూలదృష్టికి గోచరించు సాక్షాత్కార ప్రసక్తిలేదు. చిత్తమున మధువిరోధిని యోగపు గొలుసులచే బంధించినది కూడ అంతరంగానుభవమే. ఈ మూడు అనుభవములు విష్ణుచిత్తుని అతీంద్రియమగు అంతశ్చైతన్యమున విష్ణుభక్తి విలసనమును తెలుపును. బాహ్య ప్రకృతిలో ఆయన "శుద్ధ స్థూలరూపము" మూర్తిని దర్శించుటకాదు. అది యోగారూఢులకైన అసాధారణానుభవము.

## నాల్గవదశ (స్వరూప (తత్త్వ) రూప చింతన)

ఈ యసాధారణానుభూతికి పూర్వరంగమును రాయలతిశ్రద్ధతో నిర్మించెను. ఈ రంగకల్పనలో విష్ణుచిత్తుని నోట ఖాండిక్య కేశిధ్వజ సంవాదమును వినుపించుట చాల ముఖ్యమగు అంశము. ఈ యాఖ్యానము విష్ణుచిత్తుని చరిత్రకు మూల గ్రంథమగు దివ్యసూరి చరితమున లేదు. దీనిని కావలెననియే కవి వైష్ణవులకు ప్రమాణగ్రంథమగు విష్ణుపురాణములో నొక ముఖ్యఘట్టమునుండి గ్రహించి దానిననేక మనోహర కల్పనలతో నింపి ఆముక్తమున మూడవ యాశ్వాసమున స్వతంత్రమగు చిన్న కావ్యముగా రూపొందించెను. ఈ యాఖ్యానమును వినిపించునపుడు విష్ణుచిత్తుడు విష్ణుతత్త్వమును స్థూలరూపమును ప్రసన్నాస్యమునుండి పద పల్లవముల వరకు ప్రత్యంగ వర్ణనము చేసి, దానిని సర్వకాలము హృదయస్థము చేయు యోగి యత్నమును వివరించును.

<u>భక్తినోల లాడుట:-</u>

"వేద వేద్యమైన విష్ణుతత్త్వము"ను (4-5) యోగి హృద్ధ్యేయమైన అమూర్తరూపమును" (3-82) దానిని అంగక్రమముగ భావించి మదినెప్పుడు పాయకుండుటను(3-86) గూర్చిన ఈ సర్వవిషయములను వివరించునపుడు విష్ణుచిత్తుని సర్వచైతన్యము విష్ణుతత్త్వముతోను, శక్తితోను, రూపముతోను,

నిండారియుండును. మరియు ఉపన్యాసాంతమున ఆయన మత్స్యధ్వజాని "భక్తినోలలార్చి"నపుడు (4-5) రాజుతోపాటు తాను గూఢ భక్తినోలలాడి యుండును. వీనికి తోడాయన మనస్సు "ఇతః పురాపఠిత శాస్త్రగ్రంథజాల్యంబు"గు తనకు బహు సమయంబుల మెలగెడు కోవిదుల (2-90-84) పై జయమును సమకూర్చిన మన్నారు మహిమానుసంధానలగ్నమైయుండును. మరియు సభను వదలగనే గజారోహణ చేయవలసినందున ఆ యాశ్చర్యమినుమడించి యుండును.

గజారోహణకు పూర్వము:-

ఇట్లు గజారోహణ చేయునప్పటికాయన సర్వచైతన్యము (1) విష్ణు తత్త్వజ్ఞానముతో ప్రకాశించెను, (2) సకల శక్త్యాశ్రయుండైన యుష్టపరమాత్ముని.... శుద్ధంబగు స్థూల, రూప, (3-84) చింతనాతన్మయమయి యుండెను. (3-86): (3) భక్తి తరంగములలో నోలలాడుచుండెను.-(4-5): (4) అద్భుతాశ్చర్యభావములలో నుత్తేజితమాయెను, (5) ఉత్సాహోద్రేకముతో నుద్దీప్తమయ్యెను. ఈ విష్ణుచేతన, నారాయణ స్మృతి, ఆయన వాదారంభమున హరి తన చేతోగతి నొలసినపుడు చిన్న జాలుగ జాలువారెను. ఉపన్యాస క్రమమున ప్రవాహమయ్యెను. గజారోహణతో నుత్తుంగ తరంగితమయ్యెను.

అంతర్బహిశ్చ - పరీక్షణ:-

నారాయణ స్మృతితో నిండిన ఆయనకు తానెక్కిన మహాగజము" ప్రక్కల కొలిచి యుండు దొరలు, రాజకుమారులు, జన సందోహము, ఇవన్నియు నారాయణుని రూపములుగా భావించి యుండును. "రూప కోటు లెల్ల నవ్విష్ణుని తనువయమె సుమ్మని (3-81) సకల చరాచరములందు" నారాయణుడే దలమై లోపలి దాగియుండునని (3-11)", తాను రాజ సభలో ప్రవచించినది తలచుచు, యుత్సుకతతోనే తాత్సాక్షాత్కారమున కెదురు చూచి యుండును. ఈ యుత్సుకత గజేంద్రహయ ఘంటాతూర్య స్వన సంరంభముచే నుద్దీప్తమయ్యెను ఆరురుక్షమై" (పైకి ఎక్కునదై (3-78) ద్యుస్థానీయుడగు విష్ణుని దర్శింపనుత్సహించెను. పరమేశ్వరుని

వ్యూహ విభవాది అనేక రూపముల (3-89)నే యొక్కటైన అవతరించునా? యను సముత్సుకతో నిండెను. "మిన్నకపోవోయి" అని యదలించి, "ఆవలనేమన్నాడవో" (2-63) అన్న మన్ననారు ప్రతిజ్ఞావచనము మూర్తిమంతమగునేమో యని యెదురు చూచెను.

<u>సాక్షాత్కారము - సామూహిక సమ్మోహము:-</u>

ఈ యుద్విగ్న, ఉత్సుక, నిరీక్షాతన్మయ స్థితిలో విష్ణుచిత్తుని దహరాకాశమున జాజ్వల్య మానముగ ప్రకాశించు శ్రీ విష్ణువు భక్తుని కోరికను తృప్తి పరచగోరి, ఆయన చిత్తస్థమగు రూపమును ధరించి, బాహ్యాకాశమున చతుర్భుజ కమలేక్షణుడుగ మూర్తీభవించి, ఈక్షణ గోచరుడై ఆయనకు తోచెను-(4-11) ఆ మూర్తిని చూడగనే ఆయన ఆ మహా గజఘంటములను తాళములుగా జేసి అనర్గళస్తుతి ప్రవాహమును వెల్వరించెను. ప్రజలందరి దృష్టి ఆయనపై మళ్లి సామూహిక సమ్మోహనచే [ *mass hypnotism* ] ఆ విష్ణుని చూడగలిగిరి. ఈ యలౌకికానుభూతికి పూర్వరంగమే ఆయన అంతశ్చేతన్య క్రమోన్మీలనము. ఈ యనుభవమొక్కసారి యూడి పడునట్లుగాక, రాయలు దాని పుట్టుపరిణామములను జాగరూకుడై సూక్ష్మబుద్ధితో గమనించి ప్రదర్శించుచు వచ్చెను. పాత్రల మనః ప్రవృత్తులను నిశితముగ పరిశీలించి, వాని విన్యాసమును కథాక్రమముతో ననుభవించుట ఆయన కావ్య శిల్పమందొక మర్మము.

<u>దశావతార స్తుతి:-</u>

సాక్షాత్కారానుభవమునకు పూర్వరంగముగ విశుద్ధధారణా పద్ధతిని వివరించినట్లే కవి సాక్షాత్కార క్షణమున విష్ణుచిత్తుని నోట నాతువుగా వెడలిన అనర్గళ స్తుతి పరంపరా ప్రవాహమునకు పూర్వరంగమును జాగరూకుడై సిద్ధపరచెను. భూతలమపుడు గజేంద్రహయ ఘంటారావములతోను తూర్య స్వనములతోను, ధ్వని తరంగితమై యుండెను. ఆ ధ్వనికి మకుటముగా వందిస్తుతులు ప్రవహిల్లెను (4-9). ఇంతలో ఆకసము పుష్ప వర్షమున చరించు చంచరీకముల సంకుల ఝుంకారముతో నిండెను. ఈధ్వనులన్నిటి పారమ్యము, ముని స్తోమసంస్తవ సామగానమై యొసగెను.

(4-14). వందిస్తుతులు, సామగానములు, కవుల హృదయోద్గతములు. రాయలీ యారోగింపున భువి, దివులను ధ్వని తరంగితము జేసి, ఆ ధ్వనిని కవి హృదయోద్గత గానములో పర్యవసింపజేసెను. ఇట్లు బహిరంతరాకాశములలో నిండారిన ధ్వని, వంది, వేదకవుల కవితగా పరిణమించి, విష్ణుచిత్తుని భక్త్యావేశ పూరిత చైతన్యాంత సీమలో ధ్వనిని ప్రేరేపించెను. అది సూక్ష్మ జగత్తునుండి యుప్పొంగి, పర, పశ్యంతి, మధ్యమా స్థానములను దాటి, వైఖరీదశలో శబ్దమై, విష్ణుచిత్తుని జిహ్వాగ్రమున లయ పూరిత, స్తుతికావ్యముగ వర్తించెను. ఆ స్తుతికి లయగ ఆయన గజఘంటలనే చేతులతో తాల్చి తాళము కల్పించెను. ఈస్తుతి మొదటి పద్యములోని లయ విన్యాసమును వినుము.

<u>కవిరాజ విరాజితము:-</u>

**జయ జయ! దానవ దారణ కారణ శార్ఙ్గరథాంగ గదా సిధరా!**
**జయ జయ! చంద్ర దినేంద్ర శతాయుత సాంద్ర శరీర మహః ప్రసరా!**
**జయ జయ! కేశవ కేశినిషూదన శౌరి శరజ్జల జాక్ష హరీ!** . . . (4-16)

ఇది మను చరిత్రలో లక్ష్మీశ్వర ప్రత్యక్ష సమయమున మనువునోట వెలువడినట్లు కనుపించును (6-104)మను. కాని ఆముక్తమున విష్ణుభక్తి, స్తుతి-సందర్భోచితముగ గనుపించును. మనువు నందీయౌచితి గౌణము.

ఆముక్తము నీ స్తుతి పదునారు ప్రౌఢ పద్యముల కూర్పు. వీనిలో ఆది విష్ణువు దశావతారములు, చేష్టలు, దీర్ఘముగా వర్ణింపబడెను. ఈ వర్ణనలోగల అభూతోపమ, ఉత్ప్రేక్ష-(16), సాపహ్నవోత్ప్రేక్ష-(17), పరిణామము-(18), అతిశయోక్త్యను ప్రాణిత ఉత్ప్రేక్ష-(21), భ్రాంతిమదనుప్రాణితోత్ప్రేక్ష-(22), రూపకానుప్రాణితోత్ప్రేక్ష-(24), అర్థాంతరన్యాసము-(25), ముద్ర- (31). ఈ మొదలగు అలంకారములను మహోపాధ్యాయులవారు గుర్తించిరి. తమిళమున నీ స్తుతి- "తిరుప్పల్లాండు" అనుపేర ప్రఖ్యాతమై ఆపాతమధురమై, ప్రసన్నశైలిలో ప్రవహిల్లిన పన్నెండు పాశురములు (గేయములు)గల మనోహర లఘు కృతి. దీనిలో విష్ణు నృసింహ, రామ, కృష్ణావతారములు-

(1.7-10) మాత్రమే సహజోక్తులలో స్పష్టముగా సూచించబడినవి. మరియు ఆముక్త స్తుతిలో ఆది విష్ణువుకొక ఆరంభస్తుతియే యుండి అవతారములకు 15 పద్యములుండుట దీనిలో అవతారప్రాధాన్యము కనిపించుచున్నవి. విష్ణుచిత్తుని ద్రవిడ స్తుతిలో విష్ణు వైదుపార్లు సూచింపబడెను. కృష్ణుడు మూడుసార్లు, నృసింహ రామకృష్ణు లొక్కొక్కసారి సూచింపబడిరి. తక్కిన యవతార ప్రసక్తిలేదు. ఉన్నవాని కన్న గూడ విష్ణువే తరచుగ కనిపించును. ఇది విష్ణుచిత్తుని కాలపరిస్థితిని సూచించునేమో! ఆళ్వారుల సాహిత్యమంతయు పరిశీలించినగాని ఇది తెలియదు. విహంగ మావలోకమున జాడగా, త్రివిక్రమ, కృష్ణావతార కథలెక్కువ వ్యాప్తిలోనున్నట్లు తోచును.

## ఆముక్త జయధ్యానము - పల్లాండు ఆశీస్సు

<u>ఆశీస్సు:-</u> ఆముక్తమున దశావతారస్తుతిలో మొదటి పద్యమున మూడవ పాదము తమిళమున విష్ణుచిత్తుని పల్లాండు ఆశీస్సులోని ప్రథమ పాశురమందలి నాల్గవ పాదమునకు అసంపూర్ణమగు ఛాయ, పల్లాండులో మీ ఎఱ్ఱని పాదముల రక్షి మీకు శ్రీ రక్ష . . . కలుగుగాక యను దీవెన గలదు. మొదటి మూడు పాదములలో విష్ణుచిత్తుడు మల్లమర్దనుడగు నీలమణి వర్ణు నాశీర్వదించును. ఆయాశీర్వచన పూర్తి పాఠమిట్లుండును.

**(1). పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయి రత్తాణ్డు!**

**(2) పలకోడి నూరాయిరమ్!**

**(3) మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా!**

**(4) ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు!**

దాని నిట్లు తెనిగించవచ్చును-

**1. పలు యేండ్లు! పలుయేండ్లు! పలువేవ వేలేండ్లు!**

**2. పలుకోటి నూరేండ్లు!**

**3. అరి మల్లురను గెలుచు మణివర్ణ!**

**4. నీ అరుణ చరణ సిరికి తిరురక్ష!**

(అనువాదము ఆరుద్ర గారిది. Page 109. సమగ్ర ఆంధ్ర సాహిత్యము Vol 7. 1965) ఈ పాట మొదటి పదమగు పల్లాండు" అను పేరనే ప్రసిద్ధము. ఈ పల్లాండు ప్రత్యేకత. అప్రాకృతమగు భగవంతుని కోమల సౌందర్యమునకు దుష్టశక్తులుగల ఈ ప్రకృతి సంబంధమగు లోకమున నెట్టి ఆపద్యము కలుగునోయను మాతృ వాత్సల్య భీతిచే కల్పించు మంగళాశాసనమగు ఈ వాత్సల్యభావము ఆముక్తమున జయ జయ శబ్దముచే స్ఫురించదు.

విష్ణుచిత్తుడు భగవంతునే ఆశీర్వదించినందున ఈయనకు ఆళ్వారులందరిలోను పెద్దయను అన్వర్థనామమేర్పడెను. (పెరియాళ్వారు, పెరియు= పెద్ద) తమిళమున నీ పేరే ప్రసిద్ధము. ఇది మంగళాశాసనమగుటవలననే దీనిని శ్రీవైష్ణవులు తక్కిన యందరి ఆళ్వార్ల పాటలన్నిటికి ముందుగా ననుసంధింతురు. (1) ఆళ్వారుల భక్తిగేయములను శ్రీవైష్ణవులు ద్రావిడ వేదముగ నెంతురు. (2) సంస్కృత వేదాధ్యయనము ఓంకారముతో ప్రారంభమగునట్లు ద్రావిడ వేదమును వారు (3) నిత్యాను సంధాన, అధ్యయన కాలాదులందు పల్లాండు (4) దీవెనతో నారంభింతురు. దీని మధుర ధ్వనులచే నేటికిని, సామాన్యులకు కూడ స్వామి నాశీర్వదించు భాగ్యమబ్బినది. రాయలీ ఆశీర్వానము నెందుకో పైకి తేలేదు. జయాభివాదమునే రక్షకాశాసనముగ సరిపెట్టుకొనవచ్చునేమో గాని అది అంత రమ్యముగా నుండదు.

<u>ఆముక్త వీరము - పల్లాండు వాత్సల్యము:-</u>

<u>ఆముక్త వీరము</u>- ఆముక్త మందలి దశావతార స్తుతి (4-16-31=16 పద్యములు) అనగనే కేవలము వీరరసము స్ఫురించును. ఒక్క బుద్ధావతారమున దక్క తక్కిన యన్నిటిలోను కొట్టవచ్చినట్లు వర్ణింపబడిన అవతార పరాక్రమ చేష్ట వీరరసమే సార్వభౌమముగా కనుపించును. ఏకొంచమైన భక్తియున్నచో వీరము దానిని మ్రింగివేయును. మరియు ఆ వీరమెన్నియో అలంకారములలో, కవచములలో కప్పబడియుండును. వేంకటరాయ శాస్త్రుల వారి వ్యాఖ్యానమనుసరించి ఈ పదునారు పద్యములలోని పదహారు అలంకారములు, అనుప్రాణిత అలంకారములను

లెక్కించవచ్చును. ఈ అలంకార కవచములను విప్పగా, ఏ రెండు మూడింటిలోనో తప్ప, మిగిలిన వానిలో భావగాత్రము ద్రావిడ ప్రాణామము చేయుచుండును. వీని నిర్మాణము జటిల సంస్కృత సమాస సంధితము. ఒక్కొక్కసారి ఈ సమాసములు రెండు పాదములాక్రమించును. భక్తికి చిదిమిన చిప్పిలు ద్రాక్షాపాకమనుకూలము. మరియు ఆముక్త స్తుతిలో కవి ఒక్కడు చేయు స్తుతియేగాని పల్లాండులోవలె భక్తులందరు వాత్సల్యముతో కూడి పాడుడను ఆహ్వానము లేదు. అట్లు కీర్తించుటకు కీర్తించు వారికి వలయు హృదయ పరిపాకముగాని, దాని ప్రయోజనముగాని, పల్లాండువలె ఈ దశావతార స్తుతియందు వివరింపబడలేదు.

ఆముక్త ప్రబంధారంభమందలి ఇష్టదేవతాస్తుతిలో కూడ రాయల ప్రతాపార్జనయే ప్రస్ఫుటముగా ప్రకటితమగును. ఒకటి రెండింటిని వదలినచో నన్నియు విష్ణు పరివార దేవతలయు, ఆయుధములయు విక్రమ స్ఫూర్తియే కనుపించును. మొదటి రెండు పద్యములలో విష్ణుశృంగారలీలలుండును. ఇష్టదేవతాస్తుతి యంతయు రాయల శృంగార, ప్రతాపార్జనలకు పతాక.

<u>పల్లాండు - తన్మయత:-</u>

"పల్లాండు - పల్లాండు" అను మధుర ధ్వనుల ఆ వృత్తిని వినుచుండగనే మొదట స్ఫురించునది విష్ణుచిత్తుని నిర్భరవాత్సల్య భక్త్యావేశము. ఆయన కూడ నరసింహ, రామ, కృష్ణావతార చేష్టలను (పా: 5,6,7,10), సుదర్శన పాంచజన్య ప్రతాపమును (పా-2) తడవును. కాని వానిలోని వీరము అంగముగా నుండి, అంగియగు భక్తి రసమును మ్రింగివేయదు. భక్తులకొక యాశ్వాసమును కల్పించును, భక్తిని ప్రోదిచేయును. మరియు ఈ ప్రశంస కృతకాలంకారములతో కప్పబడక, సహజోక్తి రూపమున ప్రకాశముగ నుండును. ఇక పల్లాండు శైలి ప్రసన్నలలితముగా నుండును. పాఠకుడు దాని భావములోనికి చొచ్చుట సులువు. సంస్కృత పదము లత్యల్పములు. అవియయిన తత్సమ రూపమున నుండవు. (కోటి-కోడి) సమాసములు రెండు మూడు పదములకు మించవు. (మణి వర్ణ=మణి వణ్ణ) అర్థగ్రహణమునకు ప్రయాస పడనక్కలేదు.

**అందరకు ఆహ్వానము:-**

ఈ పల్లాండులను విష్ణుచిత్తుడొక్కడే పాడి యానందించుటతో తృప్తిపడక, ఆ యానందము నందరకు పంచనెంచును. కైంకర్యసౌఖ్యమున కోరికయున్న యందరును వచ్చిచేరుడని ఆహ్వానించును. (పా-3,4,5) వచ్చినవారికి వెంటనే స్వామి కళ్యాణోత్సవమునకు అంకురార్పణ చేయు పనుల నప్పచెప్పును. (పా-3) ఇతర కూటములలోని వారు మనసార తమ గోష్ఠిలో చేరదలచినచో వెంటనే వచ్చి చేరుడని యాహ్వానించును. పొట్టకూటికి దోసిలొగ్గి ఇతర మతముల నాశ్రయించిన వారిని వర్జనును. (పా-3) తమ గోష్ఠిలో చేరినచో గలుగు శ్రేయస్సును వర్ణించును. ఆత్మానుభవ రూపమాత్రమై భగవత్ స్వరూప రూప గుణానుభవాది ఆనందలబ్ధికి శాశ్వతముగా దూరమగు కైవల్యమున చిక్కుకొనక (జైనులు) ముందే వెంటనే వచ్చి తమ గోష్ఠిలో చేరుమనును. అట్లు చేరినచో పరమాత్మను చుట్టుకొని పలుయేండ్లు మంగళమును పాడుచు, సమష్టి గోష్ఠిలో నానందానుభూతి ననుభవింతురని చెప్పును. (పా-12).

**ఇహపరోజ్జీవనము:-**

మరియు ఈ యాత్మోజ్జీవనముతో పాటు భగవంతుని గూర్చి పాడినచో, ఆయనే ధారక (అన్న) పోషక (క్షీర) భోగ్య (చందన) వస్తువులను ప్రసాదించి ఆ భక్తుల నిహమున కూడ నుజ్జీవింప జేయునని. (పా-8).

విష్ణు చిత్తుని కాలమున వైష్ణవము విరక్త క్లేశకర సాధనలను ప్రచారము చేయుచు ప్రజలలో వ్యాపించెను. తమిళనాడులో కళభ్రులను విదేశీయ రాజుల ఆశ్రయమున ప్రజలలో వ్యాపించిన నిరీశ్వరములగు జైన, బౌద్ధముల నెదురుకొనుచుండెను. వైష్ణవము కూడ జ్ఞాన వైరాగ్యములను బోధించినను, భగవత్ప్రసాదమునే వైష్ణవున కిహపరములందుజ్జీవన మార్గములను చూపును. పరమున భగవత్సన్నిధి లబ్ధమగు ఆనందమును, ఇహమున భగవత్ప్రసాదిత ధారక పోషకాదులను చూపును. వీనిని విష్ణుచిత్తుడాసక్తి కరముగా వర్ణించును. సరికి సరి

నేయి జేర్చిన మంచి పాయసము (పోషకము): పట్టిదాకు పక్కలు, చెవులకు కుండలములు, మంచి చందనము (భాగ్యము) (పా-8) స్వామి ధరించి విడిచిన పీతాంబరము, తులసీ మాలలు, ఆయన ఆరగింపగా మిగిలిన ప్రసాదము (ధారకము) (పా-9), ఇవన్నియు తనవలనే భక్తులందరకు లభించునని చెప్పును. తాను, తన తండ్రి, ఆయన తండ్రి, ఆయన తండ్రి, ఆయన తండ్రి, ఆయన తండ్రి తాతయు ఏడు తరములనుండి పరంపరగా ప్రయోజనాంతర రహితులై, భగవంతుడవతరించిన శుభనక్షత్ర సమయోత్సవమున (తిరు ఓణ తిరు విళవిల్) దాస్యము చేయుచున్నామని తమ దృష్టాంతమును చూపును. అట్లే మనమందరము బడలిక తీరునట్లు పలుయేండ్లు, పలువేనవేలేండ్లు అవి పాడుదుమా యని ఆహ్వానించును. (పా-6) సమస్త జనులు కులభేదములతో నిమిత్తము లేకుండ, నమోనారాయణ' అను శ్రీవైష్ణవ మంత్రమును నాడు నగరము అందరెరుగునట్లు భక్తి పరవశులమై పాడుదము రమ్మనును- (పా-14). మునుపటి కులమును వదలి పలు యేండ్లు పలువేన వేల్లేండ్లు అని జయధ్యానము చేయుదము రమ్మనును- (పా-5).

<u>రెండవ పాశురము - శ్రీవైష్ణవ ద్వయము:-</u>

పరమేశ్వరునే దీవించుట పల్లాండు పరమ విశిష్టత. అది మొదటి పాశురముననే యున్నది. రెండవ పాశురమున తత్తుల్యమగు మరియొక విశిష్టమంగళాశాసనము కలదు. దానిని శ్రీవైష్ణవ హృదయ మనవచ్చును.

అది యిట్లు- (1) దాసులమగు మాకును, (2) మీకును, (3) ఎడబాటు లేకుండ, (4) పలు వేల యేండ్లు (అడియో మోడుమ్ (2) నిన్నోడుం (3)పిరివిన్ఱి, (4)యాయిరం పల్లాణ్డు)

(1) ఆభరణమై (2) మీ కుడి వక్షమున (3) నివసించు (4) నిత్య యౌవన వతికిని (5) పలు యేండ్లు!

(1) వడిరాయ్ (2) నిన్వలమార్ పినిల్ (3) వాళ్ గిన్ఱ (4) మజ్జైయుమ్ (5) పల్లాణ్డు-

ఈ రెండవ పాశురమున కాంక్షింపబడినది.(1) సాంఖ్యులు, జైనులు, లక్షించునట్లు ప్రకృతి నుండి వేరయిన జీవాత్మ ఏకాకియై యుండు కేవల స్థితికాదు. (2) మరియు వ్యక్తిత్వమే లేక, ఇట్టి దట్టిదని చెప్పరాని బ్రహ్మనిర్వాణము కాదు.

<u>పరమ పదము:-</u>

అదొక పరమ పదము. దానిలో పల్లాండు పాడెడి భక్తుని ముక్తాత్మ విష్ణు సామ్యమగు అప్రాకృత దివ్య మంగళ విగ్రహము ను ధరించి యుండును. అతని వలె ముక్తులయినవారు అచటనే ఉందురు. మరియు ఎన్నడును ప్రకృతి బంధమెరుగని నిత్య సూరులుందురు. వీరందరు ప్రేమించి కొలుచునట్టియు, వీరందరిని ప్రేమించి అనవధిక జ్ఞానానంద పాత్రులను జేయునట్టియు పరమేశ్వరుడుండును. దయామయియై జీవులు మోక్షార్హులగునట్లు సాయపడు శ్రీదేవి యుండును.

ఈ పరమ పదమున పరమేశ్వరి పరమేశ్వరులకును, ముక్తాత్మయగు భక్తునకును తక్కిన అందరకును నిత్య సంశ్లేష, నిత్యశ్రీ నిత్య మంగళానందములు కలుగును. మానవుడు భగవంతుని నుండి విడదీయరానివాడు. జీవి భగవల్లాభము నెట్లు కోరునో, ఈశ్వరుడు జీవలాభము కోరును. జీవి పొందు ముక్తి జీవికేకాక, పరమేశ్వరునకును ఆనందదాయకమగును. పల్లాండులో రెండవ పాశురమున మొదటి పాదములో పలుయేండ్లు వర్థిల్లవలెనని కోరినదీ పరస్పర సంశ్లేష సుఖానుభూతినే! మరియు జీవేశ్వరులను కూర్చునది శ్రీదేవి. ఈమె పరమేశ్వరునినుండి ఎన్నడును విడదీయరానిది. ఇందు వలననే రెండవ పాదమున ఆమెకును పరమేశ్వరునకును నిత్య సంశ్లేషమునకు మంగళాశాసనము చేయబడినది. ఈ దివ్య దంపతులు, నిత్యముక్తాత్మలు కలిసి యానందించు పరమ పదమునకు విష్ణుని సుదర్శన పాంచజన్యాదులు రక్షకులుగా నుందురు. . . పా-2. వారికి పలుయేండ్లు.

<u>త్రివిధ గీతి:-</u>

విష్ణుచిత్తుని పల్లాండు' మంగళాశాసనమునొక (1) విజయ గీతిగ (2) ప్రచార గీతిగ (3) స్వరక్షణ గీతిగ భావించవచ్చును.

**1). విజయగీతి:-**

ఇది విష్ణుచిత్తుని సభావాద విజయానంతరము విష్ణునకు, విష్ణు భక్తులకు, నిత్య (1) నిత్య విజయమును గోరుచు (2) గెలుపు టూరేగింపున (3) పాడిన పాటయగుటచే (4) దీనిని వైష్ణవ విజయగీతి యనవచ్చును. (5) మరియు నాడు నగరము లెరుగునట్లు నమోనారాయణాయని, పలుయేండ్లు, పలుయేండ్లు అని నినదించెడు ఈ పాట నేటి కాలమున (6) ఒక నాయకుడో (7) పార్టీయో (8) గెలిచినపుడు వారు (9) చిరకాలము (10) వర్థిల్ల వలెనని కోరు జిందాబాద్ జై' ల వంటిదే యనవచ్చును.

**2). ప్రచారగీతి:-**

ఇతర కూటములలోని వారికి కేవలమాత్మ దర్శనము మాత్రమే లభించి జీవి ఏకాకియై భగవదనుభవాదులకు శాశ్వతముగ దూరుడగును. తమ గోష్ఠిలో భగవదనుభవాది నిత్యభోగము, ఐహికోజ్జీవన హేతువగు భగవత్ప్రసాదము లభించుననియు, అందుచే ప్రజలు తమ పూర్వకులములను వదలి తమలో చేరి ఊరు నాడు మారు మ్రోగునట్లు నమో నారాయణాయ' యని పాడుడనియు, ప్రబోధించుటచే నిది ప్రచారగీత మనవచ్చును.

**3). స్వరక్షణ గీతి:-**

శత్రువులను భస్మము చేయుచు, జ్యోతిగా వెలుగుచు, బాణాసురుని వేయి చేతులనుండి రక్త ప్రవాహమును వ్యాపింపజేయుచు ఎర్రనికాంతితో భ్రమించు చక్ర చిహ్నముతో (2-7 పాశురములు) వైష్ణవులు భుజములందు అంకితులై యున్నారని చెప్పుటచే, ఈ పల్లాండు వారికి స్వరక్షణాశ్వాసమును కలిగించును. కళభ్రులను పరరాజుల పాలనలో మూడు వందలేండ్లు (250-550-A.C) మత పీడ ననుభవించిన యా నాటి వైష్ణవులకే స్వరక్షణ ముఖ్యము. శైవ అద్వైతాద్యనేక మతస్థుల వలన వారినవమానించు రాజుల వలన కూడ వైష్ణవులకు ఆ కాలమున తీవ్రముగా వత్తిడి యుండెడిది.

1). భగవంతునాశీర్వదించుట. 2)శ్రీదేవి సహితుడగు భగవంతునితో భక్తులు నిత్య సంశ్లేషమును కోరుట- ఇవి రెండును విష్ణుచిత్తుని పల్లాండు పాటకు ప్రాణభూతములైన రెండు విషయములు. వీనిని రాయలు దశావతారస్తుతిలో ఏల వదలెనో తెలియదు. రాయల స్తుతి మేధావిష్యము, జ్ఞానదశలోనిది అగుటయు, విష్ణుచిత్తుని పల్లాండు హృదయ సంబంధి, ప్రేమదశలోనిది అగుటయు దీనికి కారణము కావచ్చును. మరియు రాయలు పండితుడు, పరాక్రమశాలి. విష్ణుచిత్తుడు తల్లి, వాత్సల్యజలధి!

<u>రక్ష్య రక్షక భావము</u> - భగవంతుని సర్వశక్తి మత్వమును, రక్షకత్వమును, భావించి భక్తులతని వలన రక్షణ కోరుట లోక సామాన్యము. కాని పల్లాండు గీతమున విష్ణుచిత్తుడు తానే రక్షకుడైన భగవంతునికి రక్ష కల్పింపగోరెను. దీనిని సంప్రదాయకు లిట్లు వివరింతురు. (1) జ్ఞానదశలోని భక్తుడు భగవంతుని స్వరూపాను సంధానము, సర్వజ్ఞత, సర్వశక్తిమంతత, సర్వరక్షకత్వాదులను చేయుట వలన - భగవంతుడు రక్షకుడు, తాను రక్షుడు - అను భావమతని యందు వ్యవస్థముగ నుండును. (2) ప్రేమ దశయందలి భక్తుడు భగవంతుని సౌందర్య, లావణ్య, సౌకుమార్యాదుల వదే వదే యనుసంధించి, వాత్సల్యముతో హృదయము ద్రవించి - వీనికేమి చెరుపు వచ్చునోయను అతిశంక గలిగి, భగవంతుని యందంతకు పూర్వము గల రక్షకత్వా ధ్యవసాయము జారిపోయి, అతనిని రక్షించు మార్గము వెదకుచు, తడబడి, రక్ష్యత్వము, భగవంతునియందు, రక్షకత్వము తన యందు, ఆరోపించుకొనును. ఇట్లు జ్ఞాన దశలోని రక్ష్య రక్షక భావము ప్రేమదశలో తారుమారగుచున్నది. సీతారాములను రేయింబవలు కాచిన లక్ష్మణుడు, శ్రీరంగనాథుని ఊరేగింపుటుత్సవమునకు సాయుధుడై నడచిన పిళ్లైయు, రంగావిల్లి, ధనుర్దాసు - ఈ సర్వరక్షకునకు తామే రక్షకులుగావర్తించిరి.

<u>పెరియాళ్వారు ప్రత్యేకత</u>

ఆళ్వారులలో పరాంకుశ, పెరుమాళ్, పరకాలాదులు (నమ్మాళ్వారు, కులశేఖరుడు, తిరుమంగై) కూడ మంగళా శాసనమున రుచిగలవారైనను, విష్ణుచిత్తుడు దీనినొక ప్రత్యేక ప్రబంధముగా చేసినందున, ఆయనకు దీనియందెక్కువ యభినివేశము కలదని యేర్పడుచున్నది. (అళ్లంగరాచారి - <u>తిరుప్పల్లాండు - పెరియాళ్వారు - తిరుమొళి</u> 1968)

## రాయల దశావతార స్తుతి

<u>రామ బాణములు</u>

రాయల దశావతార స్తుతిలో ఉత్ప్రేక్ష్యాద్యలంకారముల నెక్కువగ వాడెననుకొంటిమి. వానిలో హృద్యములైనవి రెండు మూడు, మరింత కృతకములై, వినుగు గొల్పునవి యెక్కువనున్నవను కొంటిమి. దీనికి కొన్ని దృష్టాంతములను చూతము.

<u>రామావతారము</u>

రామావతారము (1) ఒక్కమాట (2) ఒక్క భార్య, (3) ఒక్క బాణముగ ప్రజలలో ప్రసిద్ధము. రాముడు ప్రతాపార్చకుడు. రామావతారస్తుతికి వినియోగించిన రెండు పద్యములలోను రాయలు రామబాణములనే వర్ణించెను.

<u>(1) ఋష్యమూకమున రామబాణము</u>

రావణుని శరీరమందలి ధాతువులు (వసా, మాంస, అస్థి, మజ్జాదులు, ఏడు). ఇవి, ఇంద్రుని వజ్రాయుధమైనను ఛేదించ లేనివి. రాముడు తనబలమును గూర్చి సుగ్రీవుని నమ్మించుటకు వదలిన ఒక్క బాణము సప్తతాళ వృక్షములను ఖండించి, అంతట నిలువక, ముందుకు దూసుకొని పోయెను. ఇది రావణుని సప్తధాతువులను ఛేదించుటకు చేసిన పరిశ్రమవలె నుండెను. ఈ అస్త్రము మాకు సిరులొసగు గాక (4-26)

<u>లంకాపురిలో రామబాణములు</u>

లంకా బహిరంగ ణోత్క్రాంత రామధనుర్నియుత బాణముల ధాటి అప్రతిహతము. వాని ధ్వని కర్ణభేదకము. రాయలు సీసమాలికలో ధట్టించి ప్రయోగించిన శక్తి ధ్వన్యాశ్రిత పదజాలమూ రామబాణములకు తగినట్టిదే! (1) అవి రథస్థ రాఘవు నుండి బయలుదేరుచునే, వానికి కట్టిన రెక్కల ఝూత్కారములచే వారధికి దిమ్మెర పుట్టించెను. (2) ఆ యలుగులు పరమ వేగముచే గల్గిన యగ్నితో కలిసి, మండుచున్న రావణ రక్తమున చొచ్చి ఛూత్కారములు చేసెను. (3) అవి యోధ కవచములను, హృత్పుటములను దూసికొనిపోయి లంకాప్రాకారములకు తగిలి మాటి మాటికి ఠాత్కారములను కలిగించెను. (4) వాని ధాటికి కూలిన ఉగ్ర రక్షః కబంధ భారముచే భూమిని మోయు ఫణీంద్రుని పడగలు - అత్యంత ఆర్తి కలిగి - అతడు ఫూత్కారములతో బుసలు కొట్టెను. (5) ఈయందరనిట్లు పీడించిన ఆ బాణములు డస్సిన గుల్మములకు నిరంతరము నీడ నిచ్చెను.

ఇట్టి రఘుకుల స్వామి, రమావల్లభుని దివ్యకార్ముకోత్ప్రేరిత బాణ సమూహము పాపములడచు గాత! - అని ప్రార్థన-(4-27)

<u>గోవర్ధనోద్ధారణ</u>

ఇది సత్య పరాక్రముని శ్రమైక సాధ్యఝూత్కార, ఛూత్కార, ఠాత్కారాదులతో గాక, లీలాంగులీకృత ఇంద్రజాలముతో పాఠకునలరించును.

యదువీరుని కరాగ్రమందలి నగాంచలములు గ్రక్కుచున్న ఇంద్ర కల్పిత వర్షధారలు, చంద్రకాంతపు టద్దముల వలయమువలె ఏటుచూచిన కృష్ణుని ప్రతిబింబించి, ఏడు దినములుగా గోపకులను నారాయణమూర్తి కవచ రత్నముచే ((1) రత్న కవచము (2) మంత్ర కవచము) పరిరక్షించినట్లుండెను. (4-29)

ఈ రామకృష్ణుల చేష్టలు కేవలము భక్తి స్ఫోరకములు గాకున్నను భావుక రంజకము లనవచ్చును. తక్కినవి అవతార వర్ణనలు.

**పరశురామ స్తుతి**

దీనికి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి టీక, వ్యాఖ్యానము లిట్లున్నవి.

(1) గండ్రగొడ్డలి గలహరీ! క్షత్రియుల భార్యల నేత్రజలముచే నైన వర్షాకాలమందు, నీ విజయ ఖ్యాతియను హంస, క్రౌంచ పర్వతమునందు స్పష్టమయిన నీ బాణముచే జేయబడిన రంధ్రము గుండ పోగా చూచిన హంసలు మనస్సునందు ఆ కీర్తి హంస యొక్క చేష్ట (క్రౌంచ రంధ్ర గమనమును) పొదుకొని (స్వాభావికమై) వదలిపోకుండుట చేత, వాన వచ్చినపుడవి ఆ దారినే నేడును పోవుచున్నవి. కడుపు నేలవైపు పట్టుకొని చరించునవైన పశుపక్ష్యాది జంతు సమూహము ముందుపోయిన దాని వెంబడిని పోవునదగును గదా!

ఇది దండాన్వయము. దీనినర్థము చేసికొనుటకు కొన్ని పురాణ కథలను, కవి సమయములను అనుసంధించుకొనవలెను. (1) ధనుర్విద్యలో శివ శిష్యుడైన పరశురాముడు, తన సహాధ్యాయియగు కుమారస్వామితో నయిన పందెములో క్రౌంచ పర్వతమునొక్క బాణమున తూటుపడవేసెను. ఇది పురాణ కథ. (2) ఆ తూటు వలన అతని కోదండ విద్యాకీర్తి వ్యాపించెను. (i) ఆ కీర్తి తెల్లనిది (ii) హంసకూడ తెల్లనిది, అందుచే ఆ కీర్తియే ఒక హంస (iii) మరియు వర్షాకాలమున హంసలు మానససరోవరమునకు బోవును (iv) అవి క్రౌంచ రంధ్రముగుండా పోవును. ఇవి కవి సమయములు, వీనిని పురాణ గాథకు సమకూర్చగా ఏర్పడిన భావము.

క్షత్రియ భార్యల కన్నీటి వర్షాకాలమున, పరశురాముని పరాక్రమ కీర్తిహంస, అతనిచే భేదింపబడిన క్రౌంచ పర్వత రంధ్రము గుండా పోవుటచే, ఆ హంస సంతతికిని, అట్టియలవాటే ఏర్పడి నేటికిని అవి మానస సరోవరమునకు క్రౌంచ రంధ్రము గుండా పోవుచున్నవి. దీనిలో "రూపకాను ప్రాణితమైన హేతూత్ప్రేక్షయు, సామాన్యముచే విశేష సమర్థన రూపమయిన యర్థాంతర న్యాసంబును గలవు. (వే. వేం. రా. శా.)

రామ బాణములు 'ఢాం' అని మ్రోగి శత్రువులను చంపెను. వర్షధారలలో కృష్ణుడు ప్రతిబింబించెను. అవియచట అపుడున్న వస్తువులలో, ఎట్లు వినిపించెనో, కనిపించెనో భావించబడెను.

ఇక పరశురాముడు విద్యార్థిగా నున్నప్పుడు క్రౌంచ పర్వతమున రంధ్రము చేసెను. అప్పుడాయనకు కీర్తి కలిగెను. ఆ కీర్తి తెల్లనిది. కనుక హంస. ఆ హంస మానస సరోవరమునకు పోవలెను. పోవుటకు సమయము రావవలెను. అది వర్షా సమయము కావలెను. ఎన్నాళ్ళకో ఆ వర్షము వచ్చెను. ఆ వర్షము రాజుల భార్యల కన్నీరు, ఆ కన్నీరు పరశురాముల వారి భర్తలను చంపుటచే కలిగిన దుఃఖము వలన కలిగినవి.

ఇట్లు కృతకమైన వర్షాకాలము రాగానే , కృతకమైన హంస, క్రౌంచ రంధ్రములో గుండా మానససరోవరమునకు వెళ్ళెను. హంసలు వెళ్ళుట మేత కొరకు కావచ్చు. ఈ కీర్తి హంస కచట నేమి ప్రయోజనమో మరి!

కవుల యూహలు కొన్ని కృతకములే యైనను రమ్యముగ నుండును. అదిలేని ద్రావిడ ప్రాణాయామముల గతిని, ఈ పరశురాముని హంస రాజపత్నుల దుఃఖవర్షమును ప్రదర్శించును.

<u>మణీ గృహము -</u>

విష్ణుచిత్త సూరి ఇట్లు వినుతింపగా, హరికాయనపై జాలి కలిగెను. ఆ భక్తుడు దేవిని కోరలేదు. కోరడు. నతిచే "నిజమనః కంజాత సంజాత పుష్కలమాధ్వీకఝురి"లో మురారి సుఖించగా జూచి, తాము చొక్కి ధన్యాత్ములైరని కృత్యాదిని స్తుతింపబడిన ద్వాదశ సూరులలో నొకడు. (1-10) కాని, అంతర్యామియగు హరి యెరుగనిది లేదు. **(5-157).**

పాండ్యుడిచ్చిన ధనము మునీశ్వరుడేమియు శేషించకుండ భవద్భాగవత గృహములకు సాత్కరించి-అయ్యో! కడురిక్తత నొందునని స్వామి యెరుగును. అందుచే విలుబుత్తూరులోని విష్ణుచిత్తునింటిని మణిమయముజేసి, సిరులతో నింపుమని విశ్వకర్మ కానతిచ్చెను. అతడట్ల కావించెను.

<u>రాయల దాననీతి :-</u>

సాక్షాత్కృతుడైన విష్ణునా ముని నట్లాదరించి చూపుల కగోచరుడయ్యెను. (4-32, 33)

స్వామి యాజ్ఞ విశ్వకర్మ నిర్మాణము - మూలగ్రంథమున లేదు. (వే. వెం.డు. ఆచార్యులు - వావిళ్ళవారి ప్రతి - పీఠిక - 1914)

వదాన్య శేఖరుడు, ప్రభువునగు రాయలు పాత్ర భూతుడగు యాశ్రితు నూరక పోనిచ్చునా! అట్లు పోనిచ్చుట రాచ మర్యాద గాదు. నీతిగాదు. ఇట్టి సందర్భమున ఆయన దాననీతిని నాల్గవ యాశ్వాసమున యామునుని నోట చెప్పించుట వినదగు.

**పాత్ర భూతు లెప్ప బరికించి యుతడదు**
**గకయు వొకడు పెప్పకయు మునుపుగ**
**బవన పండ్లు దిగిన పరిగ స్వప్నము గన్న**
**వెటిగ వొసగి వెఱగు పఱచు టొప్పు (4.......274)**

రాయలా వెఱగుపడు దానమునిపుడు స్వామిచే నాశ్చాపింపజేసెను.

ఇంతకు పూర్వకథలో పాండ్యరాజుచే విద్వాంసులందరకు రాయలు పారితోషికములను గుప్పింపజేసి, వానిలో కొన్ని సేవకుల చేతుల నుండి జారి దారిపొడవున మోకాటి బంటిగ మెరసెనని వర్ణించెను. (4-4) కాని, స్వామిచే నిప్పించిన సిరుల నిప్పుడే వర్ణించక సమయము వచ్చినప్పుడు "శ్రీశదత్తశ్రీలు (విష్ణుచిత్తు) గృహమున ద్రవ్వి తండలములయ్యె"నని (తరుగనివిగా నుండెనని) చెప్పును. (5-38)

## <u>విష్ణుచిత్తుని ఊరేగింపు – రాయల శిల్పము</u>

ఆముక్తమున గల గద్య భాగములన్నిటిలోను, ఊరేగింపును గూర్చినది అత్యంత దీర్ఘము. ఇది వేదము వారి పెద్ద సైజుముద్రిత ప్రతిలో (1927) తొంబది మూడు పంక్తుల నాక్రమించినది. ఇందలి వర్ణసముదాయము 37 మత్తేభములలోని, అక్షరములను మించును. ఇందలి వివిధ దృశ్యములను ప్రదర్శించిన పద్ధతిని బట్టి

చూడగా రాయలు వీనిని ప్రత్యేక శ్రద్ధతో అనేక చిన్న నాటికలుగా నిర్మించినట్లు తోచును. ఇందాయన రచనా శిల్పము నైదు దృక్కోణముల నుండి నధ్యయనము జేయవచ్చును.

(1) ఒక్కొక్క దృశ్యమున గల సంఘటనల క్రమ పరిణామము, వాని పరాకాష్ఠ (climax)

(2) అందు పాత్రల మానసిక, వాచిక, ఆంశిక చాలనము, వాని క్రమోన్మీలన.

(3) నాటకమున కవసరమగు సూక్ష్మ వివరముల బాహుళ్యము - వానిని గూర్చిన రాయల నిశిత పరిశీలన.

(4) సమకాలిక వాస్తవిక జీవన చిత్రణ - వివిధ వృత్తులకు చెందిన వ్యక్తుల తీరులు.

(5) రాయల హాస్యప్రియత - జీవన వినోదము

<u>ప్రజల పొంగు - స్థానికుల బ్రహ్మారథము</u>

విష్ణుచిత్తుని విజయోత్సవమును చూచుటకు పద్మాక్షుడాకసమున గరుడ వాహనారూఢుడై ప్రత్యక్షమై విష్ణుచిత్తుని దశావతార వినుతికి ప్రీతిజెంది, అతని నాదరించి, చూపుల కగోచరుడయ్యెను. అంతవరకు నిలిచిపోయిన యూరేగింపు మరల సాగెను. మధురలోనే ఊరేగింపును చేరిన మధుర పౌరులు త్రోవలో వెనుకకు తగ్గక మునిని భజింపుచు, వెంటరాగా, నూరేగింపు విలుబుత్తూరును సమీపించెను. (4-33)

విలుబుత్తూరు దేవాలయ స్థానికులు, ప్రజలు - ఆ మునిని చూడవలెనను క్రొత్త యుత్సాహముతో నిండిపోయిరి. ఆ ముని తామెప్పుడెరిగిన ఏకాంగియే. తులసి వనము త్రవ్వుచున్న కృషి పండితుడే గాని శాస్త్ర పండితుడు కాడు. దేవళమో, ఇల్లో తప్ప, ఊరు దాటి యెరుగడు. అట్టివాడు రాజధానికెట్లు పోయెనో! రాజసభలో నెట్లు మెలగెనో! విద్వాంసుల నెట్లు గెలిచెనో! జాలె దానంతటది యెట్లు తెగెనో! ఊరేగింపు సమయమున ఆకసమున దేవునే జూచెనట! అదెట్టి మహిమో! మత్స్యధ్వజ మహారాజే

ఆయనను తన మహాగజము నెక్కించి పంపుచున్నాడట! దొరలను, రాకుమారులను పంపెనట! వారాయనను కొలిచి వచ్చుచున్నారట! ఏమిదింత! ఏమి వైభవము! అని తలచిన కొలది ప్రజల కాయనను చూచుకోరిక పెరిగెను. దానితోపాటు వారి ఉత్సాహము పొంగెను. ఆ పొంగుతో నగరము నలంకరించిరి. ఆ పిమ్మట స్థానికులు ముందు నడచిరి. ప్రజలు వారి కూడ నడచిరి. ఉభయులు కలసి వాద్యములు మ్రోయుచుండగా వేశ్యల మేళముతో గూడి విష్ణుచిత్తుని కెదురేగిరి. ఊరుదాటి చాల దూరముననే ఆయన ను కలసిరి.

ముందుగ ఆలయ స్థానికులా మునికి ఆలయ మర్యాదలు నడపిరి. దైవ ప్రసాదితమగు పట్టు పారి వట్టము (పరివట్టము) నాయన తలకు జుట్టిరి. సాష్టాంగ ప్రణామము లాచరించిరి. లేచి, ప్రాంజలులైరి. బంగారు కవచాలంకృతమగు బ్రహ్మరథమున (బ్రాహ్మణులు మోయు వాహనము) ఆ భాగవత పతంపము నుంచి మోయసాగిరి. అప్పటి ఊరేగింపులో మధుర పౌరులు, విలుబుత్తూరు వారే గాక, పరిసర "జానపద జనములు" కూడ వచ్చి చేరిరి. వీరందరు కలసి మెలసి నడచిరి.

ఊరేగింపు క్రమము

ఊరేగింపున రాయలు ప్రదర్శించిన వివిధ దృశ్యములను సవివరముగా చూచుటకు ముందు, వాని స్థాల క్రమమును గుర్తించుట యుక్తము.

(1) ఊరేగింపులో నందరికన్న వెనుక విష్ణుచిత్తులవారి బ్రహ్మ రథముండును. (2) దానిముందు పట్టణము నుండి వచ్చిన గొప్ప యేనుగులపైన ఘోట్టాణ దేశాశ్వములపైన నెక్కివచ్చెడు సామంత భూకాంత కుమారులుందురు. (3) వారిముందు - అశ్వ, గజ, ఘంటల కనుప్రాసలైన మంజు మంజీర ధ్వనులతో ముందుకు నడచుచు, మరల వెనుదిరుగుచు నృత్యము చేయు విలాసినులుందురు. వీరి ముందు, అనగా ఊరేగింపు అగ్రమున అసంఖ్యాక వాద్యత్రయ పరంపరలు వాయించు వాద్య విద్యోప జీవులుందురు. ఈ యూరేగింపు క్రమములో రాయలనేక సమకాలీన దృశ్యములను ప్రదర్శించును.

యుద్ధ గజములు - రాకుమారులు

ఆ యూరేగింపంతటికి శోభను కల్గించునవి రాజధాని నుండి వచ్చిన ఆడ, మగ, యేనుగుల గుంపులు, ఇవియుద్ధ గజములు, ఇవి తమపైన అలంకార కవచములుగా పరచిన రత్న కంబళుల చిత్ర వర్ణనములతో ప్రకాశించెను.

ఈ రాచ యేనుగుల గుంపుల మెడలపై నెందరో సామంత భూకాంత కుమారులుండిరి. వారు తళతళ మెరయు బంగారు అంకుశములను చేతులలో పూని, విష్ణుచిత్తుని సేవించుచు వచ్చుచుండిరి. ఏనుగులపై వచ్చెడు రాచవారిని జూచుటకు జానపద ప్రజ తెగబడి వచ్చిరి. వారిని పదే పదే చూచిరి. ఒకరికన్న నొకరు ముందుకు బోవుటకు సంభ్రమించిరి. చేతులెత్తి నిక్కి మ్రొక్కిరి. వెనుకనున్న వారు త్రోయుటచే మెత్తిగిలిరి. ముందుకు సాగుచునే వెనుకకు మరల మరల మొగములను త్రిప్పి, మగిడి, మగిడి రాకుమారులను పొగడుచు, చలించెడి కనుపాపలు వెళ్ళుకొని వచ్చునట్లు చూచుచు నడచిరి. రత్న కంబళులు, కనకాంకుశములు నిక్కి మొక్కుటలు కనుపాపలు - ఈ సూక్ష్మవివరములు కవి నిశిత పరిశీలనకు దృష్టాంతములు. జానపదుల సంభ్రమము - ఏనుగులపై వారికి హాస్యాస్పదముగ నుండి యుండును. ఇది రాయల గుప్త హాస్యమున కొక మచ్చు.

రాకుమారులు - నటీ విలాసినులు :-

ఏనుగులపై నాసీనులైన సామంత రాకుమారులు తమముందు నాట్యము చేయు విలాసినులపై విచ్చలవిడిగా పువ్వులను, పండ్లను విసరు కోడెగము - రాయలీ వీధి శృంగారము నొక చిన్ననాటికగా ప్రదర్శించును. ఇది ఊరేగింపులోని మొత్తము ఎనిమిది దృశ్యములలోను పెద్దది. ఊరేగింపును వర్ణించు తొంబది మూడు పంక్తులలో మువ్పది యొక్క పంక్తుల నాక్రమించును. దీనిలో రాయలు వేశ్యల హావభావములను, శృంగారపు చేష్టలను, అలంకార విశేషములను సూక్ష్మ వివరములతో వివరించును.

గజ కంధరములపైన కూర్చుండి, సదర్పముగ కనకాంకుశములను పూని ఆళ్వారును 'సేవించి' వచ్చెడు రాకుమారులను సేవించుటకు - ఇంతకుముందు చెప్పిన జానపదులవలె గాక, వారికధిపతులగు గ్రామ గ్రామణులు వచ్చిరి. వారు జానపదులవలె మగిడి మగిడి చూపులతోను, పొగడ్తలతోను గాక, రాకుమారులను నారంగ, మాతులుంగ జంబీర ఫలములతోను, మొల్ల పూబంతులతోను సత్కరించిరి.

<u>కళావతులపై పూబంతులు</u>

కాని, రాకుమారుల చూపి గ్రామణులపై లేనేలేదు. తమముందున్న నాగవాసములపై నున్నది. వారిలో తమకు పూర్వానుభుక్తలగు చంద్రముఖులు కనుపించగనే వారిలో నొక క్రొత్త సరదా రేకెత్తెను. అంతకు కొంచెము ముందు వారికి సన్మాన పూర్వకముగా గ్రామీణులందజేసిన ఫలపుష్పములు వారి సరదాను వెల్లడించుటకుపయోగపడెను. వానిని వారు తమ పూర్వానుభుక్తలపైకి వేయ నుత్సహించిరి. కాని సరాసరి వారిపై వేసినచో తమ రహస్యమందరికి తెలిసి పోవును. అందుచే, వారా పుష్పాదులను మేళపు నాయకురాండ్రగు కళావతులపైకి నైచినట్లు విసరిరి. ఆ కళావతులు వయసుచెల్లినవారు. మరియు విద్యావతులు - మేలమాడినను, పరులు సందేహింపదగిన వారు కాదు. నిజమునకా కళావతులా రాజకుమారులు తమ యూరు వచ్చినపుడెల్ల ఆ పడతుకలను వారికి కూర్చు తార్పుడు కత్తెలు.

<u>పడతుకల దాగిలి మూతలు</u>

ఆ పుష్పఫలాదులు వేసినది కళావతులపైననే అయినను అవి పడినది పూర్వానుభుక్తలయిన చంద్రాస్యల పైననే. వానిని తప్పించుకొనవలసినది వారే! వారీదుండగమున కాశ్చర్యము నటించిరి. కాని, మొగములందలి మొలక నవ్వులు వారి సంతోషమును వెల్లడించెను. అది ఇతరులకు కనుపించనీయక వారు మొగములు త్రిప్పుకొనిరి. గుంపులో కలిసిపోవు మద్దెలవారి మూపుల మరుగున చటుక్కున దాగబోయిరి. ఆ గమన వేగమునకు వారి చెవి కమ్మలు కదలాడి ధళధళత్తరళము

లాయెను. అట్లు పోవుచునే వారు సాభిప్రాయముగ, సవిలాసముగ ఇంచుక ఓర చూపులతో తమ విటుల వంక జూచుచునే యుండిరి. ఆ చూపులుయ్యాల జంపాలలై ఏనుగులపై రాకుమారుల స్పృశించెను. వారట్లు ముందుకు నడచుచు, వెనుకకు చూచుచు పోవుటలో వారి ధమ్మిల్లములు (సిగలు) కొంచెముగా కదలెను. ఈ సూక్ష్మ వివరములను రాయలీ దృశ్యమున కంటికి గట్టినట్లు ప్రదర్శించును.

<u>మార్దంగికుల పిచ్చి</u>

మార్దంగికుల వెనుక దాగిన చంద్రముఖుల విలాసమంతటితో ముగియదు. మార్దంగికుల వెనుక విలాసినులు దాగుటచే యూరి వారందరు మార్దంగికుల వంక జూడసాగిరి. ఇది యెరిగి మార్దంగికులు చెలరేగి ముఖములు బిగించుకొని వీరికేమి పిచ్చిపట్టినదాయని ప్రేక్షకులాశ్చర్యపడునట్లు అడుగడుగున వంగుచు, మద్దెలల ముఖములను మర్దింపజొచ్చిరి. రాయల సూక్ష్మ హాస్య దృష్టికిది యుదాహరణ.

<u>నాగవాసములు బయటపడుట</u>

మార్దంగికుల శరీరమును వంచుటచే నాగవాసములు వారి వారి వెనుక దాగుటకు వీలుపడదు. ఇంతలో రాకుమారులు వారిపైకి నారంగ పుష్పకదంబములను మరల విసరజొచ్చిరి. అది వచ్చెడి దెసలను గమనించుచు ఆ పడతులు వదులైన తమ శిగ ముడులను దిద్దుకొనుచుండిరి. అప్పటికిని నారంగాదులు వారి పైకి వచ్చి పడుచునే యుండెను. వానిని తప్పించుకొనుటకు వారు అభినయ కాలమున త్రిప్పునట్లు కరాబ్జములను వెనుకకు త్రిప్పిరి. వారట్లు తిరుగుడు పడునప్పుడు చెవి పువ్వులు, అవతంసములు, కపోలరంగములందు మెమ్మదిగ చలించుచు మృదువుగ గరిడీలు చేసెను. ఆశ్చర్య హాసకుందములతో గూడిన వారి మొగములు తరపి వెన్నెలల దుంపలవలె నుండెను. అందుచే పవలే వెన్నెలలు చూడనయ్యెను. ఇన్ని సూక్ష్మ వివరములతో రాయలు తన కాలపు యూరేగింపులందలి శృంగార చేష్టలను సజీవముగ ప్రదర్శించును.

<u>ముది వేశ్యల మురువు-</u>

రాకుమారుల చేతులకందిన నారింజలు, పూగుత్తులు, పెలవయి కొంత తెరచి గర్లెను. ఆ వంకు చూచుకొని, చతురోక్తి వాచాలులగు వృద్ధవేశ్యలా రాకుమారులకు మ్రొక్కిరి. కాని, చెండు దెబ్బలుతిన్న తరుణులు మ్రొక్కక, ఒక్కింతక ఓరమోమిడి ఆ ముది భామల ప్రక్క ప్రక్కల నాదిగిరి. తమకును, ఆ రాకుమారులకును "తొంటియుంటు" దలంచి, తలవాంచిరి. "వారు మ్రొక్కకుండు "వంచనను" రాకుమారులోరకంట జూచిరి. వారికా తరుణులచే "యొక్కనక్కముసకు మ్రొక్కింయకొను వేడ్క" బుట్టెను. ఇంతవరకు వెల్లడిగానీయని రీతి, సామాన్యపు నవ్వులాటగా తమ యాగడములను సాగించిరి. ఇప్పటి మ్రొక్కుబళ్ళ వేడుకవలన, వారి సుమాళము (ఉత్సాహము) దాగక, అందరకు బట్టబయలయ్యెను. అయినదేమి? అక్కడ పుడమి ఱేడు లేనందున వారు సామాన్య మానవులను లెక్కొనరు. "ఏమేమి! విద్యా వయోవృద్ధులగు మీరు మ్రొక్కగా వారు మ్రొక్కమిరియట్లు? మ్రొక్కింపుడు!"- అని గద్దింతురు.

<u>ముద్దరాండ్ర మూతి విరుపులు</u>

ఈ కల్ల గద్దింపులను విన్న యా విలాసినుల మోము దమ్ములందు మొలక నగవులు గ్రక్కున బొడమి, వానికి వేరొక్క వింత తెలివి యొక్కెను. అంతట వారు మ్రొక్కకనే మరొక ప్రక్కన గుమికూడి నడుము తోడి చేడియల వద్దకు పోయి, ఎఱ్ఱని పెదవులు మలచి, లోలోన మెల్ల మెల్లగా "ఉమక్" అను అనాదర శబ్దము చేసిరి. ఈ మూతి విరుపులా దొరలకును, తమకును నెంతో పొందుకలదను పెద్దరికమును తోటి వారికెరుక పరచుటకే!

<u>కేలిరిగి పొమ్ము దక్కించుకొనుట</u>

వెంటనే యా 'కేలిరిగిన' చాటూక్తి వాచాలలైన ముసలి జాణలు పొమ్ము దక్కినదను ఆ వయసుకత్తెలను ముందటికి నూకి, అక్కక్క! మ్రొక్కవే! మన

హలివేలుపు! అని బుజ్జగించిరి. ఎట్టకేల కొడబడిరి. అపుడా తరుణులు ("త్రపాతరళనయనలై" లజ్జచేత చంచలములయిన నేత్రములు గలవారై) "కక్కసాన" (బలవంతముగా) విరళాంగుళాంజలి" బంధముతో మ్రొక్కిరి. అనగా, అంటీ, అంటని వ్రేళ్ళతో మ్రొక్కు, బళ్ళ గావించిరి. ఇట్లు కక్కసాన మ్రొక్కించిన ముదుసళ్ళు, చెలరేగి "సయ్యాట యెడపడక యుండు" కూతలు పెట్టిరి. అప్పుడా ముది భామలు పక్షులను పట్టుటకు జిగురుపూసి పేర్చిన కొయ్యల వలె ఆ యువతుల చుట్టునల్లుకొనిరి. వారి నా తరుణులు కల్ల కోపముతో కొట్టుదురు. తమ వింతజేసినందుకు రాజ సంఘమును కసరు చూపులతో చూచుచు వారి కగపడకుండ చాటున కేగుదురు. ఆ విసురు వడకకు వారి కంకణములు చలించి క్రేం-క్రేం అను సంకుల ధ్వని కలిగెను.

ఈ నగవు వెల్లి, చురుకు చూపులు, చాటుకేగుటతో నాటికలోని శృంగారము చరమ స్థాయికి జేరును. ఈ చేష్టలన్నియు రాజధాని వాసులగు రాకుమారులను, విలిబుత్తూరు వారగు పడతుకలనొక చోట ప్రక్కప్రక్కనే కూర్చుటచే కలిగినవి. ఈ సర్వచర్యయు వారికి వారికి వినోద కారణమనుటలో సందేహములేదు. జానపదుల మ్రొక్కుబళ్ళలో అంతర్వాహినిగానున్న హాస్యమిచట " కొమిరె హరిణలోచనల" మ్రొక్కింపులో శృంగారరస సమ్మిళితమై మాన్యులకును వేద్యమై వెల్లడిగ ప్రవహించును.

<u>రాయల స్వామ్యభవమా?</u>

ఇంతటితో రాయలీ వీధి శృంగార నాటికను ముగించును. ఈ నాటికయంతయు ఆయన సమకాలిక జీవనమును గూర్చిన సూక్ష్మ పరిశీలన, పరిజ్ఞానమునకు నొక చక్కని యుదాహరణము. ఈ బహిరంగ శృంగార ప్రదర్శనకు కారణము చెప్పుచు కవి - ఊరేగింపున పుడమిరేడు లేనందున రాచకొడెకాండ్రు సామాన్య మానవులను లెక్కచేయక, పిచ్చటిల్లి విచ్చలవిడిగా తమ చిత్తోత్సాహము నందరకు వెల్లడించిరని వ్యాఖ్యానించును. రాయలు స్వయముగ పుడమి రేడయిన

పిమ్మట ఆయన యెదుట నిట్టివి జరుగవు. మరి యీ కంటి కదలికలు, పెదవి విరుపుల వంటి సూక్ష్మ వివరములను టెలివిజనులోవలె ప్రత్యక్షముగా నెట్లు ప్రదర్శింపగలిగెను? ఆయన తండ్రియగు నరసానాయకుడు విజయనగర దండ నాయకులలో ముఖ్యుడగు సాళువ నరసింగరాయుని సేనానాయకుడు. ఆ దశలో ఆయన తండ్రితోపాటు దక్షిణార్కాటు జిల్లా ఆరణి తాలూకా దేవకీ పుర గ్రామమునను, తిరుపతి సమీపమున చంద్రగిరియందును నుండెను. రాయల బాల్య యౌవనము లీ ప్రదేశములందు సామంత రాకుమారుల ఠీవితో గడచెను. విష్ణుచిత్తుని ఊరేగింపున వర్ణించబడిన "సామంత భూకాంత కుమారీ ధట్టముల" రాకుమారుల శృంగార చేష్టలు రాయల చిన్ననాటి స్మృతులయి యుండును. కనుకనే వానినింత సూక్ష్మ వివరములతో ప్రదర్శింప గలిగినట్లు తోచును.

వాద్యకారులు

కళావతుల మేళమునకు ముందు భాగమున వాద్యకారుల మేళములు మ్రోగుచుండెను. ఆ వాద్యములు జాతినిబట్టి మూడు విధములు. అవి వరుసలు వరుసలుగా తీరి అసంఖ్యాకముగా నున్నవి. వానిలో కొన్ని -

(1) మద్దెల (2) సుతిపోయుతిత్తి (3) రుంజ (4) తంబుర (5) కంచు తాళములు (6) ఉరుమ (ఒక విధమగు చర్మవాద్యము) (7) కన్నెర (8) చిన్నబాక (9) వీణ (10) ముఖ వీణ (11) పిల్లనగ్రోవి (12) డోలు (13) నాగస్వరము (14) భేరి (15) పెద్ద బాక (16) కుండ వాద్యము (17) డప్పు (18) డుక్క (19) డక్కి (20) చక్కి (21) తాళములు - ఈ వాద్యపరంపరలు మ్రోగుచు ముందు త్రోవ తీయుచుండెను. ఊరేగింపచ్చటచ్చట నాగుచుండెను. అపుడు నాట్యకత్తెలు వెనుదిరిగి చేయు నాట్యములతో ఊరేగింపు మెల్లమెల్లగ సాగెను. ఇచట పేర్కొనబడిన వివిధ వాద్య విశేషములు సమకాలీన వాద్యోపజీవులను గూర్చిన రాయల కూలంకష పరిజ్ఞానమును తెలుపును.

**ఆంధ్ర గంధకారులు**

ఊరేగింపు జన సమ్మర్దములో చెలరేగు సామూహికోత్సాహపు పొంగులో వ్యక్తులు తమకు సాధారణమగు నిబ్బరమును కోల్పోయి సామాన్య ప్రవర్తనను మరచి విచ్చలవిడిగా ప్రవర్తింతురు. రాయులీ సామూహిక మనస్తత్వమును (*Mob Psycology*) రాకుమారుల ఉత్సాహములో, వీధి శృంగారములలో ప్రదర్శించి, తన దృష్టిని ఊరేగింపులోని మరొక భాగమునకు త్రిప్పును.

ఇపుడాయన దృష్టి నాకర్షించువారు నగరి యేనుగులపై నూరేగు ఆ దేశపు కొమరు ప్రాయపు రాచవారు కారు. గంధకార వృత్తితో జీవనము వెళ్ళబుచ్చు ఆంధ్రదేశీయులగు ముదుసళ్ళు. స్వస్థలములు ప్రమాదములకు లోనగుటచే వృద్ధాప్యమున విలుబుత్తూరుకు వలస వచ్చినవారు. అచట రసికుల బాంధవ్యము వలన బంధు వియోగమును మరచినవారు. పేరున కంధ్రులైనను, పరిమళ ద్రవ్యములను, పూలమాలలను, కూర్పుట - మొదలగు పనులయందు ఆంధ్యము లేనివారు, వారు అన్యదేశీయులగు నాగరికులతో నెంత సహవాసము చేసినను, తమ వేస బాసలెంత మొరటువయినను, అవి స్వదేశీయములగుటచే వానిని మానలేదు. వారి కొంకి సిగలు, చెవుల సంకులు, వార్ధక్యముచే వంగిన భుజములు, కావి దుప్పట్లు - వారిని పట్టి యిచ్చును.

ఈ యంధ్ర గంధ కారులకు తమ విద్యను, భక్తిని, చిరకాలము నుండి అణగారిన యుత్సాహమును - ప్రకటించుటకు ప్రజలలో కలసి మెలసి తిరుగుటకు, ఈ యూరేగింపొక అపూర్వావకాశమును కల్పించెను. వారు కూడ - ముందటి దృశ్యములోని పౌర జానపద జనములవలెనే - రాచయేనుగులపైన, ఘోట్టాణ ఘోటకముల పైన నూరేగు రాకుమారులకు తమ బాసలో, పాటి పాటి (చిన్ని, చిన్ని) పద్దెపు ముక్కలతో వెఱ్ఱి మొఱ్ఱి కైవారములు చేసిరి. ఒడలు తెలియని యావేశములో ఒకచోట నిల్వక రాచవారిపైన, ఆడువారిపైన, విచక్షణ లేకుండ పరిమళ సమృద్ధమగు చల్లని బుక్కామును విరివిగా చల్లిరి. అది దట్టముగ యెంతో పైకెగిరి సృష్టించినంతను

గుప్పిటబట్టి, వస్తు భేదములను అస్పష్టము చేసెను. ఆకసమున కొక చాందివిర్లు చండకర కిరణములను మాటు పరచెను.

**పన్నీరు**

ఈ ఆంధ్ర గంధకారుల విద్యా ప్రదర్శనము ఆకసమును బుక్కాములతో నింపుటతో పూర్తికాలేదు. ఇంకను పన్నీటి విద్య మిగిలియున్నది. దానిని ప్రదర్శించుటకై వారు పన్నీరు నిండిన తోలు తిత్తులనొత్తిరి. ఆ తుంపురు లాకసమున కెగసి వంపు తిరిగిన ధారలుగా క్రిందికి దిగెను. ఈ ధారల వలన ఆ యూరేగింపు అగ్రభాగమున నున్న వాద్య విద్యోప జీవుల వాద్యములను వెచ్చబరచుటకు అగ్గిని వెతుకబోయిరి. వాద్యములు లేనందున యూరేగింపులు మొత్తమా సమయమున విలాసినుల నృత్యము జూచుచు, నృత్తమును జూడ నిలచి మెల్లగా నడుచు చుండెను. పాటి పాటి పద్యాల మ్రొక్కులతో, వెల్లి వెల్లి కైవారములతో, బుక్కాము పన్నీరులతో, అటువారు నుండి ఆడువారి వరకు పరువులిడుచు, భూమ్యాకాశముల బోరు కొలిపి, యూరేగింపు నాపినదే ఆంధ్రుల ఆ యావేశమాగలేదు! ఇందలి రాయలవారి హాస్యప్రియత, అన్యదేశీయ వేషభాషా స్వభావములను గూర్చిన పరిశీలన - గుర్తింపదగినది.

**మిండతండములు**

రాయల దృష్టిలో రాకుమారులు, విలాసినులు, వారి శృంగార చేష్టలు, పట్టణవాస సంబంధమైనవి. వీటికి ప్రతిగా ,ఆయున ప్రజల మూకలో "అప్పిందున" నడచు మిండతండములను, వారి పుండరీకాక్షులను, యూరేగింపు నుండి విడదీసి ప్రదర్శించును. వీరు గ్రామీణులు. నాసిరకపు రసికులు. వీరి ప్రవర్తన అందుకు తగ్గదే! ఊరేగింపు నిలచిన యవకాశముతో గుంపులోని తమ 'పుండరీకాక్షుల'తో కలిసి చలిదియన్నపు భోగమునకై బాట ప్రక్కకు బోయిరి. ఆ బాటకిరుప్రక్కల అతి హృద్యములగు నుద్యానములు క్రమ్ముకొని యుండెను. అందలి చెట్లకు నీరుపారు కాలువలు ఎఱ్ఱ కలువలతో గూడి సుమనోహరముగనుండెను. అందలి నీరు రెల్లుపూల ప్రతిబింబముచే తెల్లగా మిలమిలలాడుచుండెను. చలిది యన్నపు సరసులా కాలువలు దిగి, యొడ్డులందు కూర్చుండి, చలిది మూటలు విప్పిరి.

**చలిది భోగములు**

ఆ చలిది భోగములు గేదె పెరుగు మీగడలతో చిక్కగా పిసికి యుంచినవి. ఆరబెట్టిన నారింజ, అల్లపు ముక్కలు దానికి నంజుళ్ళు. దానిని వారు పోకపొత్తులలో పెట్టుకొని తిననారంభించిరి. రాకుమారుల ఫల పుష్పముల శృంగారపు సయ్యాటకీ చలిది యన్నపు శృంగారము వికృతి. వీని నెదురెదురుగ ప్రదర్శించుటలో రాయలు మరల చెప్పీ చెప్పని హాస్యమును కల్పించును. ఇది రాయల వ్యంగ్య గర్భిత హాస్యము.

**దాసరుల గోపాల భిక్ష**

కథారంభమున రాయలు విలుబుత్తూరును లలితోద్యాన పరంపరలు, సువర్ణ సౌధములతో సుభిక్షమగు పాండ్యనగరోర్వీ రత్న సీమంతముగా వర్ణించును. అపుడు మన కచట ఆకలిచే మాడు వారెవ్వరు కనుపించరు. వారి నా సందర్భమున పేర్కొనుటలో నౌచితి యుండదు. కాని సమగ్ర దృష్టిగల రాయలీ సందర్భమున మిండతండములతో బాటు బిచ్చగాండ్రను ప్రదర్శించెను.

అంతవరకు వారు పొట్టనింపుకొనుటకై తిరిగి, తిరిగి వేసారి, ఆకలిచే కృశించి, ఒక ప్రక్కన మోసరిలి యుండిరి. వారికీ చలిది యన్నములను చూడగనే ప్రాణము లేచివచ్చెను. దాని నారగించు మిండతండములను సమీపించి గోపాల భిక్ష యాచించిరి. తమకు పెట్టెడు మీగడ పెరుగుల చలుదులు దధినవనీత ప్రియుడు, సర్వాంతర్యామి యగు బాలగోపాల దేవునకు ప్రీతికరములని వారి విజ్ఞప్తి.

ఇట్లే - శ్వేత ద్వీపమును బోలి సకల సంపన్నమైన శ్రీరంగమున గూడ రాయలు యాచకులను ప్రదర్శించును. కాని ఆ యాచకులు విరక్తులగు భాగవతులు. వారు శరీరధారణకు వలయు ధాన్యమును మించి ఎవరేమి పెట్టినను వానినక్కడే క్రుమ్మరించి పోవుదురు. భిక్షింపబోయిన యిండ్లనుండి వెడలు దేవతార్చనా భక్ష్యముల వాసనలనైన పీల్చక శ్వాస యుడుపుదురు. ఆ యిండ్ల నుండి నృత్తగీతములతో బయల్వెడలు శౌరి స్తుతినైన చిలుకల, గోరువంకల ధ్వనులను విన్నట్లు ఉపేక్షా భావముతో నేందురు.

ఇట్లు భిక్షువులలో గూడ ముముక్షువులను గుర్తించి రాయలు గౌరవించును.

<u>వాద్యముల ధిమి ధిమి</u>

ఈ దక్షిణ భిక్షములిట్లు సాగుచుండగా, అగ్గిని వెదుకబోయిన వాద్యకారులా కాలువ యొడ్డులకే వచ్చిరి. ఆ యొడ్డులందెన్నో లావుపాటి స్తంభములపై నమర్చిన దీపగోళికలతో రేయింబగళ్లు వెలుగు జగజ్జ్యోతులుండెను. వాని జ్వాలలు ధగ ధగ మండుచు, దీపగోళికల రంధ్రముల నుండి పైకిలేచుచుండెను. జగజ్జ్యోతియనగా వత్తికి బదులు వస్త్రఖండములతో వెలుగు దీపము. అచటనే నిప్పు కణికలున్న ధూపకుండిక లుండెను. అగ్గికై వెదకు వాద్యకారులా రెండు సెగలపై వాద్యముల నీరారునట్లు కాచిరి. వాని నాదు పరికించుటకై వాయించిరి.

<u>చిలుకల బెదురు -</u>

ఆ ధిమి ధిమి ధ్వానములకా బాట రెండు వైపులనున్న తోటలలోనున్న చిలుకలు బెదరెను. ఈవలి తోటలోని వావలి తోటకు; ఆవలి తోటలోని ఈవలి తోటకు బారులు బారులుగా నెగిరి చేరుచుండెను. ఆ పచ్చని చిలుకల బారులా రెండు తోటలకు కట్టిన దట్టపు తోరణములై మనోహరముగా  కనుపించెను. ఈ వివరములన్నిటిని రాయలొక చిన్న వాక్యమున ప్రదర్శించెను. ఇది ఆయన వర్ణనలోను, రచనలోను గల ఇమిడిక కొక చిన్న దృష్టాంతము. ఆంధ్ర గంథకారుల యావేశమిన్ని హాస్యాస్పద పర్యవసానములకు కారణమయ్యెను.

<u>ఊరేగింపు భాగవతులు</u>

ఈ విస్మృత హాస్య ప్రహేళిక నింతటితో ముగించి, రాయలు వెంటనే, మరియొక బృందము వారి యావేశ దృశ్యమును సుకుమార హాస్యముతో ప్రదర్శించును. రాచవారి కోడిగములతో మొదలయి వాద్యకారుల ధిమి ధిముల బెదురు చిలుకలతో పర్యవసించిన యూరేగింపున కోలాహలము మిక్కుటమయ్యెను. ఊరేగింపున సంకీర్తనపరులగు భాగవతబృందములా రణగణలో తమ పాట యేపాటియు

వినరానందున పాటమాని, మూక గట్టి, తల విసరుచు, నోరు తెరచుచు, కేలు సరచుచు, నడచిరట! ఇది రాయల సుకుమార హాస్యమున కొక చక్కని దృష్టాంతము. తలలు విసరుట స్వారస్య గ్రహణమును, నోరు దెరచుట ఆశ్చర్యానందములను, కేలు సరచుట తాళమునైచుటను సూచించునని మహా మహోపాధ్యాయుల వారి వ్యాఖ్య.

**రాయల హాస్యవాహిని**

మూగ భాగవతుల తలత్రిప్పులతో నిశ్శబ్దముగ బయలుదేరిన రాయల సుకుమార హాస్యము తరువాతి దృశ్యమున పరాకాష్ఠనందుకొనును. అపుడది గణికల "గేలి'తోను 'కోహోల'తోను, చప్పట్లతోను ప్రక్కనున్న తోటలను మార్మ్రోగించును. రాచవారి యెక్కసక్కెములతో, సుమాళములతో, వైభవోత్సాహములతో నారంభమైన యూరేగింపునకీ నూతన పరిణామముల వలన పూర్వముకన్న తగ్గని విభవము చిగురొత్తును. రాయల హాస్యప్రియత్వమూరేగింపు ఆదిమధ్యాంతములలో నంతర్వాహినిగ సాగుచునేయుండును. ఈ యూరేగింపుననే గాక, రాయల హాస్యప్రియత కావ్యమంతట నచ్చటచ్చట తొంగి చూచుచునే యుండును.

**సాలె కొమరుల ప్రహసనము**

భాగవతుల పిమ్మట హాస్య కోలాహలమునకు పాత్రులైన అభాగ్యులాయూరి చిల్లర జాతుల యువకులు. వీరు తక్కిన యందరివలె రంగమెక్కరు. ఊరేగింపు సమాప్తమగునపుడు వత్తురు. వీరు తమ పెద్దల సంతసరుకులను మోయుటకు సంతరించిన యాడు గుఱ్ఱములకు పుట్టిన పిల్ల గుఱ్ఱములనెక్కి ఊరేగింపు వేడుక జూచుట కెదురు వచ్చిరి. ఇచట రాయలు వారి వారి కులములను, వాహనములను, అలంకారములను, అగచాట్లను- నగుబాట్లను గూర్చి ఎన్నో సూక్ష్మ వివరముల నాసక్తికరముగ ప్రదర్శించును. వీరాయూరి సాలె, యుగసాలె, పట్టు సాలె, వాని, సైడాలి, సాతు (గోనెల నేయువారు) ఏతుల (చాపెలనల్లువారు) జాతులలో మేటులగు వారి కొమరులు. వీరందరు చిల్లర జాతులవారని స్ఫురింపజేయుటకు, కవి వీరందరిని మూకుమ్మడిగా పేర్కొనును. వీరి తండ్రులకు 'మేటి'యను బిరుదు తగిలించుటలో

నొక విధమగు రాచరికపు హాస్యము తొంగిచూచును. ఇందుకు భిన్నముగా రాయలు రాజధాని నుండి యేనుగులపైన, గుఱ్ఱములపైన, రాజవీథిలో వచ్చి, విలుబుత్తూరు యూరేగింపులో వీధి శృంగారములకు దిగిన వారిని, "సామంత భూకాంత దర్పంబు" లని 'రాజసంఘంబు'లని, దొరలు - రాజకుమారులు" అని సన్మానముతో పేర్కొనుట గమనీయము. వారు చిల్లరకులముల వారైనను ఆ వీటి మేటి వారి కొమరులమను అభిజాత్యము గలవారు. వారు కాలినడకను రాక, తమ గుఱ్ఱపు పిల్లలపై నెక్కి వత్తురు. ఈ మేటి సాలి యుగసాలి.........కొమరుల కాసంత గోడిగల సంతానమే భాగ్యము. మురిపెము.....అందుచే వాని నెన్నో విధముల నలంకరించిరి. వాని కాలి పాదవున వ్రేలాడుకుంచెలను (ఎఱ్ఱకుచ్చులను) కీలించిన గవ్వదండలతోను, గంటలతోను నలంకరించిరి. వీనిపై నమర్చిన జీనులింతకన్నను వింతయైనవి. అవి వారి మగ్గములలో మిగిలిపోయిన గుడ్డపీలికలతో చేసినవి. ఈ పీలికలను వారు నల్లమోలుగు చెక్కకాచిన చిక్కని మడ్డిలో వాన్చి నల్లని రంగు పట్టించిరి. వీనిని జేనకొకటి, మూరకొకటిగా చేర్చి, పాదవుగా కుట్టించిరి. తమ గుఱ్ఱపు పిల్లల వీపులపై నటు నిటు వ్రేలాడు జాలర్ల జీనులుగా శోభిల్లునట్లు పన్నిరి.

కవి - వారి గుఱ్ఱములు బలిసి, నిగ నిగలాడుతున్నవని చెప్పుచునే, అవి సంత గుఱ్ఱముల సంతానమని, పగలు కాలుగట్టి విడువగా - ఊరి పోరంబోకుల గరిక మేయునని, రేయి నల్ల దాణా తినునని, పిడుకలతో గౌరవములతో తోమబడినవని, వాని బండారమును బయలుజేయును. అవి అలంకృతములని చెప్పుచునే వానిపై జీనులు గుడ్డపీలికలతో గుట్టిన బొంతలని చెప్పి నవ్వును. ఈ కుఱ్ఱ గుఱ్ఱముల గుంపు ఏ కట్టె కంబళి పీలికను చూచినను బెదురునట! విలుబుత్తూరు యువకులు తమ నాటు గుఱ్ఱపు పిల్లల నలంకరించిన అమాయిక గ్రామీణ పద్ధతిలోనే, తమను గూడ సింగారించుకొనిరి. వారు తమ వస్త్రములను బాగుగా యుతికి తెల్లబరచుకొనిరి, వానికి కుంచెలతో ఇందుప గింజల నూనె వ్రాసి వాసన పట్టించిరి. ఉతికి తెల్లబరచుకొన్న పల్లెటి వాసనగల వస్త్రములే వారి రచణములు (అలంకారములు)

ఇట్లు తమ సంత గుఱ్ఱపు పిల్లలను, తమను రవణించుకొని, అమాయకులగు ఆ "మేటి" యుగసాలె తొగసాలె కొమరు లూరేగింపు వేడుకను చూచుటకెదురు వచ్చిరి. కాని వీరూరేగింపు కొంత గడచిన తరువాత వచ్చుటచేతను, గుఱ్ఱములనెక్కి వచ్చుట చేతను, నూరేగింపు మొదటి దశలోనే వచ్చి పరస్పర సమేతులై కలసిమెలసి నడచుచున్న పౌర జానపదులతో కలియలేకపోయిరి. అట్లు కలియుట వారి యుద్దేశము కాదు. ఊరేగింపు వేడుక జూచుటయే వారికి ప్రధానమగుటచే అలంకృతులయి, అలంకృతములయిన గుఱ్ఱముల నెక్కివచ్చిరి. వీరిని వర్ణించుటలో కవి - వారికి తమ తండ్రులను గూర్చి, తమనుగూర్చి - తమ గుఱ్ఱపు పిల్లలను గూర్చి కల స్వాభిమానమును ధ్వనింపజేయును. దానిని శృంగభంగము చేయుటకే కాబోలు - వారిని హాస్యాస్పదమైన దుస్థితికి చేర్చును.

ఆ గుఱ్ఱపు పిల్ల లూరేగింపున కెదురు వచ్చుచునే ఊరేగింపు తొలిభాగమున గుమిగూడి వచ్చు యుద్ధ గజముల యుద్ధతిని జూచెను. అవి గొంగడి పీలికను జూచినను, తమ నీడను జూచినను బెదురు స్వభావము గలవి గదా! ఇకనేమి! యెన్నడెరుగని కొండంత యుద్ధ గజములను, వాని రంగు రంగుల రత్నకంబళములను చూడగానే ఆ పిల్ల గుఱ్ఱముల కెక్కడలేని భయము పుట్టి ఉత్సవ ప్రజల నడ్డదిడ్డముగా త్రొక్కి పారిపోసాగెను.

అనుభవములేని ఆ కొమరు రౌతులు వాని నడుపుట పెట్టుటకు వెంటనే వాటిపై కెక్కి రెండు చేతుల వగ్గములను కుదియ బట్టిరి. కళ్ళెముల యదుపెరుగని ఆ కుఱ్ఱ గుఱ్ఱములు మరింత రెచ్చిపోయి ప్రజలను కలమెల త్రొక్కుచు ప్రక్కకు పోయెను. వృద్ధులు, స్త్రీలు, రోగులు - వారిని తిట్టసాగిరి. ఆ తిట్టులకు వారు ఇట్టు, అట్టు, అనలేకపోయిరి. గుఱ్ఱములు వెఱ్ఱిగా దూకుచుండుట వలన ప్రాణములు పిడికిట బట్టుకొని పోయిరి. వానినా పిల్ల గుఱ్ఱములు చేయువలసినంత చేసెను. అవి యాబాట ప్రక్కన క్రొత్తగా, మెత్తగా, లోతుగా దమ్ముచేసియున్న వరి పొలముల లోనికి దుమికి,

పిరుదుల వరకు దిగబడెను. ఆ బురద నుండి వారు పైకి రాలేక, దిగుచోటు లేక, వ్యథపడుచు నలుదెసల జూచిరి. ఏదైనా సాయము వచ్చునని వారి యాశ!

గుఱ్ఱములతోపాటు బురదలో కూరుకొని సాయమునకై ఎదురుచూచు ఆ మేటి సాలె కొమరులకు వచ్చిన సాయమా యూరేగింపులోని గణికా కదంబముల గేలి! ఆ విలాసినులు చేతులు చరచి చప్పట్లు కొట్టుచు 'కోహో'యని పెద్దగా కూతలు పెట్టిరి. వారి చప్పట్లచటి యుద్యానమందలి దట్టమయిన చెట్ల గుంపులలో ప్రతిధ్వనించెను.

ఈ కోలాహలముతో కవి యూరేగింపు వర్ణనను ముగించును. దానికి మొదటి కంటె తక్కువగాని విభవమును చిగురొత్తించును. రాచవారి యెక్కసక్కెములతో, వైభవోత్సాహములతో నారంభమైన యూరేగింపునకీ నూతన పరిణామముల వలన మరింత హాస్యస్ఫూర్తి సిద్ధించును. తమ గుఱ్ఱముల బెదురుతో, జనులతిట్లతో, బురదలో కూరి యా దౌర్భాగ్యులు వెఱ్ఱి మొగములు వేయుటతో రాయల హాస్యము ద్విగుణమై పైకిలేచును. దానికి గణికల గేలి, కోహోలు, చప్పట్లు, హంగుదారులు, ఊరేగింపు ప్రథమ దృశ్యమున - చతురోక్తి వాచాటలగు వృద్ధవేశ్యల నవ్వులతోను, చివరి దృశ్యమున తరుణ వేశ్యల కూతలు, చప్పట్లతోను అంతమగుట గమనీయము. వేశ్యలు రాకుమారులకు హాస్యపాత్రులు; చివరి సాలెకొమరులు వేశ్యలకు హాస్యపాత్రులు. కావ్య నాటకాలంకార మర్మజ్ఞుడగు రాయలు విష్ణుచిత్తుని యూరేగింపు నైదారు రంగములతో కూడిన చిన్న హాస్యమయ జీవన్నాటికగా ప్రదర్శించును.



# యామునాచార్యుని కథ

ఊరేగింపు ముగింపున విష్ణుచిత్తుడాయూరి మన్నవారు స్వామిని సేవించి, రాజకుమారులనంపి, ఆత్మీయభవనమున ప్రవేశించి, "తొంటికంటె శత గుణంబుగా భాగవత పూజా ప్రవణుండై యుండె ననుచు -రాయలు విష్ణుచిత్తుని కథనాపును. అది విష్ణుచిత్తుని యిల్లగుటచే కవి - అచట పూర్వము నుండి జరుగు భాగవతపూజను మాత్రమే చెప్పును, ఆలయములో నిత్యమతడు చేయు మాలా కైంకర్యము నిచట చెప్పడు. దాని నాయన కథ యతుకుటకు తరువాత ప్రస్తావించును. ఈ మధ్యలో మధుర నుండి వచ్చిన ప్రభువులను, విలుబుత్తూరు వేశ్యలను, సన్మాన పూర్వకముగా నావలకు బంపవలసి వచ్చెను. అది రాయల రాచమర్యాద పాటింపునకు మరొక దృష్టాంతము. ఆ మర్యాదల నాయన "మధుర ప్రభువులు తమకు కామకలు వట్టినవారి యిండ్లలో నృపార్హ ఉదార స్నాన భోజన క్రియలచే ఉజ్జ్వలులై; ఆరాత్రి హరి కొలువున- వివిధ నాట్య స్పర్ధలను శ్రీ శ్రీ వేషధారుల వాదులు సరిదేర్చి పంపిరి. పిమ్మట స్వామికి మణి వస్త్ర భూషణముల నెన్నిటినో, నిష్ఠతో సమర్పించిరి. వేకువనే తిరిగి పాండ్య నగరికి బోయిరి". అని చెప్పును. ఇచట విష్ణుచిత్తుని కథ తునిగి పోయెను. (4.36-37)

<u>తునిగిన కథ- తులసి దామము అతుకు:-</u>

ఇంతటితో విష్ణుచిత్తుని చరిత్రలో రెండవదగు వాది దశ ముగిసెను. ఇక ఆయన ఆముక్తమాల్యదను పెంచు మూడవ దశలో ప్రవేశింపవలసి యున్నది. అందుకు- శిశువగు ఆముక్తమాల్యద విష్ణుచిత్తునకు తులసి వనమున లభించుట చెప్పవలెను. సభా విజయము తరువాత విష్ణుచిత్తుని చరిత్రలో చెప్పదగిన మొదటి ఘటన అదియే. అది మొదలుగ వారిరువురి కథ యారంభించును. కాని కవి- ఆ కథను అయిదవ యాశ్వాసము వరకు ఆపి, విష్ణుచిత్తుని కథతో సంబంధములేని యామునా చార్య చరిత్ర నారంభించును. యామునా చార్యుడు కూడ రాజసభలో వాదించి వైష్ణవ దర్శనముద్ధరించెను. ఇంతకు మిగిలి విష్ణుచిత్త యామున కథలకే సామ్యము లేదు. ఇట్లు సంబంధము లేని కథ నతుకుటేట్లు? ఈయతుకుకై కవి-

ఊరేగింపు చివర విష్ణుచిత్తుడు తన యిల్లు ప్రవేశించి, భాగవత పూజా ప్రవణుడైయుండెనని చెప్పిన దానిని పునః ప్రస్తావించి, అచట చెప్పక వదలిన విష్ణుచిత్తుని తులసీదామ కైంకర్యమును దానికి తోడ్పరచును.

ప్రభువులరిగిరి క్రమ్మఱ బాండ్య నగరి
కమ్మునియునట్లు వైష్ణవాభ్యర్చనంబు
తన చిరంతన తులసికాదామ కరణ
దాస్యమును జేసికొనుచు దత్పరతనుండె- (4.37)

ఈ యతుకుచే కవి విలుబుత్తూరు స్వామికి తులసీ మాల్యకైంకర్యము జేయు విష్ణుచిత్తుని మనకండ్ల యెదుటికి తెచ్చును. ఈ దృశ్యము రెండవ యాశ్వాసమున విష్ణుచిత్తుడు మధురకు పోవుటకు ముందు పాఠకుడు చూచిన దృశ్యమును జ్ఞప్తికి తెచ్చును. ఆ దృశ్యమున విల్లిబుత్తూరులో "విష్ణుచిత్తుడతుల తులసీ సుగంధి మాల్యమును మూలమంత్రమున మన్నారు నక్కు, సేర్పబోవును. మన్నారు ఆయనను మధుర రయమున బొచ్చి పాండ్యుని దివాణమున నిండి వ్రేలెడి దుర్మదాంధుల పోడిమి మాన్పి తన మహిమను ప్రకటించి రాజును వైష్ణవునిగా జేయుమనును. స్వామి మాటలు విని యనుభవము క్రొత్తయగుటచే విష్ణుచిత్తు డపుడు వడ వడ వడకి సభావాదమునకు తానశక్తుడనని విన్నవించును. స్వామి మొలక నగవొప్ప శ్రీదేవి మొగము జూచి, "హరి యనివేళ గెలిపింతు నాదు మహిమ ముదిత కను"మని- ప్రాభవ"మెప్పుబలికి - విష్ణుచిత్తుని వంకజూచి - "నీ యిప్పుడె- మిన్నకపోవోయి" అని యాజ్ఞాపించును.

<u>రెండవ మాల- స్వామి ప్రీతి:-</u>

మరి యిపుడు స్వామి తన కార్యము జయప్రదముగా నిర్వహించి వచ్చిన విష్ణుచిత్తునాదరింప వలెను. ఆ మెప్పు నాయన ఒక కథ చెప్పుటచే వెల్లడించును. ఆ కథయే యామునా చార్యుని చరిత్ర. అతడు కూడ విష్ణుచిత్తుని వలెనే దర్శన ముద్ధరించినవాడు. ఈ కథను స్వామి తన ప్రక్కనున్న శ్రీదేవికిని, మాలారోపణము కావించి, ఇంటికి పోబోవు విష్ణుచిత్తునకును, ఏకాంత కుటుంబగోష్ఠిలో వలె వినిపించును.

స్వామి మాటలాడుటకు కవి ఆలయము నిర్జనముగా నుండు సమయము నెన్నుకొనును. మరియు విష్ణుచిత్తుడు మూలమంత్ర పూర్వకముగా మాలను సమర్పించు వేళ నెన్నుకొనును. మూలమంత్ర జపనిష్ఠవే విష్ణుచిత్తుని చిత్తము నిర్మలమై ఆయన అతీంద్రియ శ్రవణ శక్తి జాగృతమై యుండును. పూర్వము కూడా ఆయన అట్టి సందర్భముననే స్వామి యానతిని వినగలిగెను.

కవి విష్ణుచిత్తుని కథయందు యామున కథనేరీతిగా చొప్పించెనో విందము.

"ఒక్కనాడు మధ్యాహ్నసమయ మాలికా సమర్పణానంతరంబున మందిరంబునకు బోవ నతనిం బ్రసాద మందస్మిత సుందర వశీక్షణంబగు కటాక్షంబున వీక్షించి పక్షిపుంగవ కేతనుండు పుండరీక నికేతన కిట్లనియె".

మరల ఆ స్వామియే! మరల ఆ దేవియే! మరల ఆమెను చూచియే! మరల ఆ మందస్మితమే! కాని పూర్వము స్వామి విష్ణుచిత్తుని 'భక్తికిదమెచ్చి'యు- వెలుపలికి 'నీ యిచ్చయె మిన్నక పోవోయి' అని అదలించెను. అపుడా దాసుడు మారుపలుక వలికెను. అపుడు "నిన్ను నొప్పింతును (నె) భూనాయకు సభ" అన్న స్వామి ప్రతిజ్ఞ నెరవేరినది. ఆ గెలిపించుట అయినది. ఇదంతయు స్వామి మహిమ. అందుచే అది ఆయనకు తృప్తి. అందుచే ఆయన విష్ణుచిత్తుని వంక "ప్రసాదమందస్మిత సుందర" కటాక్షమున వీక్షించి, ఆ మహాత్మునివలెనే తన కృపాతిశయమున వైష్ణవ దర్శన ముద్ధరించిన యామునుని కథను చెప్ప నారంభించును.

ఆ చెప్పుట- శ్రీదేవిని, విష్ణుచిత్తుని- కుటుంబ గోష్ఠిలో చేర్చి చెప్పుటచే విష్ణుచిత్తుని సన్మానించినట్లగును. ఆ ప్రసంగమునాయన శ్రీదేవితో - యామునా చార్యుడొక్కడు- నీ మహాత్ముడొక్కడును గాదె దర్శనంబుద్ధరించి రస్మదీయ కృపాతి శయమున"- అనుచు నారంభించును. అనిన నిందిరాదేవి- "ఇతని కథయెటిగినది కా యతడేమి యొనర్చె" నని యడుగును. దానికి సమాధానముగా స్వామి యామునా చార్యుని కథ చెప్పెను.

<u>ఋతువర్ణన - రాజనీతి - రాయల ఆసక్తి</u>

కథ చిన్నదే గాని - కవి దానిలో వర్షా శరద్ఋతువులను దీర్ఘముగ వర్ణించును. అట్లే దీర్ఘముగ యామునునిచే రాజనీతి నుపన్యసింప జేయును. విష్ణుచిత్తుని కథకివి ఉపయోగించునట్లు తోచదు. ఇవి రాయలకు ఋతువర్ణన - రాజనీతులందపారమగు కోర్కెను తీర్చుట కేర్పడినట్లు తోచును. ఇదే కారణమున ఆయన రెండవ యాశ్వాసమున మత్స్యధ్వజుడు భోగినీ సంగతికి బోవునపుడు వెను వేసవి విభవము వర్ణించెను. అయిదవ యాశ్వాసమున గోదా కన్య భగవద్విరహమునకు పూర్వరంగముగా వసంతమును తనివితీర వర్ణించెను. మూడవ యాశ్వాసమున ఖాండిక్యుడు కేశిధ్వజునేమి చేయవలెనని మంత్రులతో మతనములాడునపుడా మంత్రుల ముఖమున రాజనీతి నుపన్యసింపజేసెను. మరియు రాయలు యామున చరిత్ర నవకాశముగ దీసికొని వెఱ్ఱి శైవము ముదిరిన" యొక పాండ్యరాజు దుష్పరిపాలనను, అతని హాస్యాస్పద వేషభాషలను పక్షపాతియైన అతని సభలో పరతత్త్వవాదన కవకాశము లభించుట కష్టసాధ్యమను విషయమును విపులీకరించును.

<u>కాల వ్యత్యాసము</u>

కాని అసలీ యామునుడు విష్ణుచిత్తునకు రెండు వందలేండ్ల పిమ్మటివాడు. రామానుజులు ముప్పది యేండ్ల వాడయి యున్నపుడాయన మరణించెను. విష్ణుచిత్తునికి ఇంత పిమ్మటి కథ నెన్నియో మార్పులు చేసి విష్ణుచిత్తుని కన్న పూర్వ చరిత్రయని చెప్పించుటకు కారణము రాయల మతాభినివేశమును, ఋతు, రాజనీతి వర్ణన ప్రీతిని, రాజుల మత దురభిమానమున ప్రజలకు కలుగు బాధలను, వారి హాస్యాస్పద ప్రవర్తనను వెల్లడిచేయు కోర్కెయు, అయి యుండును.

విష్ణుచిత్తుని కథకీ కథ ఉపయోగించకున్నను, దానిని సంగ్రహముగ జూచుటవలన ఆముక్త సమగ్ర దర్శనమున కుపయోగించును. మరయు కవి వర్ణించిన రీతినే నిజమని మన మనుసరించినచో నది విష్ణుచిత్తుని చైతన్య వికాసమునొక ముఖ్య ఘట్టముగ గుర్తించగలుగుదుము.

# యామునా చార్యుని చరిత్ర

<u>వెఱ్ఱి శైవుని పాలన</u> (కథ అంతయు చెప్పునది మన్నవారు - శ్రోతలు శ్రీదేవి - విష్ణుచిత్తుడు)

మత్స్యధ్వజుని పూర్వవంశ్యుడగు పాండ్యరాజొకడు వెఱ్ఱిశైవము ముదిరి, హరుడె పరతత్త్వమని, నా (విష్ణు)నుతి వినక, నా ప్రతిమలకు నతియొనర్పక, నా ఆలయములకు ఉత్సవములకు ఉలుకుచు, తెంపు లేకుండ జంగములను పూజించుచు, వేద విద్వజ్జన పూజను నీట గలిపి, గృహదేవతలను నిప్పుస్తుచే నిగురబెట్టి, భౌమవారపు వీరభద్ర పళ్ళెరముల నిడుచు, సంకర దాసమయ్యల గుంపులకు సంతృప్తిగా తొంబదియారు శ్రాద్ధ చయములు పెట్టుచు, ఆద్యములైన దేవాలయములు పూజా నైవేద్యములు లేక పడిపోగా, రాజ్యమంతటట జంగముల విరాళమఠముల నిలిపి, శైవమతమున పై మెట్టుకుచేరి (ఉత్తర శైవంబుచెంది), జందెము త్రెంచి, పతితులైనను లింగధారి గురువులే శుశ్రూషార్హులనుచు, ఉపనిషత్తులు వారిచే నుడ్వి వినుచు, ఏ జంగము చెప్పినను ఆశ్చర్యపడుచు, శివలింగము దాల్చిన మూకలు చేయనిదే పాపముగా - తాము అవును కాదు అనక వారి యాచారము అవునను విప్రుల కగ్రహారము లిచ్చుచుండెను. అతడు రాజ్యము పాలించునపుడు తనకు వశమైన తామ్రపర్ణిలో తప్ప మరి యెచట పుట్టని (పుట్టరాని) ముక్తామణీ సంపదయెల్ల మాహేశ్వరుల బొం తలకే తీరెను. అప్పుడు బ్రాహ్మణులు కొందరు జన్మభూమిని విడువలేక యుచ్చకులయి, నుదుటి విభూతిని గడ్డముల కానువరకు పెట్టుకొని, రుద్రాక్షలు ధరించిన సందిటిలో శైవసూత సంహిత నిరికించి, ఆ రాజు సభలో దూరజొచ్చిరి.

జంగమాచారమును స్వీకరించియు (శిలము బట్టియు) రహస్యముగా గంజాయి, సారాయిలను సేవించు నఠములను ఆ రాజు బైట వేయజాలక, విప్రస్ఖాలిత్యములను సభలో బయలుచేసి, శైవులకు కన్ను గీటెడివాడు.

**వైష్ణవి యగు రాణి**

కాని, ఆ రాజు మహిషి విష్ణ్వారాధన పరాయణురాలు. వైష్ణవాచారములను పాటించెడిది. భర్త విష్ణుభక్తుడు గాకుండుటచే ఆమె దరి కానని దుర్వార వ్యధకు పాలయ్యెను. కాని ఆమెలో విష్ణుభక్తి పుట్టినను, పతిభక్తి విష్ణున కిష్టముగుటచే, భర్తయందు భక్తి విడదు.

కథ చెప్పుచు విష్ణుచిత్తుల తన వాసుదేవ తత్త్వమునిట్లు వివరించును.

**వాసుదేవతత్త్వము**

"బ్రహ్మరుద్రాదులు నా తనువులే. వారిని పూజించుట నిజముగ నన్ను పూజించుటే! ఆ యుపాసకుల యీప్సిత ఫలమునిచ్చువాడను నేనే! అట్లయినను తరతమ వృత్తులున్నవి. కేవలము శరీర భేద దృష్టితో ఆ దేవతలను నాకన్న భిన్నులని తలచు మూర్ఖులు సేవించుట అను నా వాసుదేవతా స్థితిని భావింపక చేయు పూజ అశాశ్వత ఫలముకలదై మరల మొదటికే త్రిప్పును"

మరియు ఈ రహస్యము నెరుగక, ఆ రాజు తామసుడై, కృతమాలా తామ్రపర్ణ నదీ తీరములో 'తరచయు' యున్న నా భక్తులను సామాన్య బుద్ధితో జూచును వారి వృత్తులకు కలుగు నుపద్రవముల నుపేక్షించి, రక్షా విముఖుడై యుండెను. ఇది చూచి నేను - ఆ దేశమున కారాజే ఏలికయగుటయు, రక్షణ శిక్షణములు రాజు ముఖమున గాక నేనే సాక్షాత్కరించి చేయునందునను, పాండ్యరాజుకు ప్రజారక్షణేచ్ఛ న్యాయాభిముఖ్యమున గాని పుట్టమియు తలచి, చిరుత నాడె ఆచార్య కులమున వేద శాస్త్ర ముఖ్య విద్యలభ్యసించుచున్న యామునుడను వైష్ణవ వటువికి రాజాస్థానమెక్కి వాదిజయము సేయవలెనని పుట్టించితిని.

**కోట పడమటి ద్వారము**

యామునుడు మధుర చేరెను. కాని ఆస్థాన మెక్కుటెట్లు? తానా వైష్ణవుడు. విశేషించి వటుడు. రాజు - విష్ణుభక్తి విముఖుడు. శైవము ముదిరిన వాడు. ఆయన

సభలో వైష్ణవులకు చోటులేదు. ఈ స్థితిలో ఒక వైష్ణవుడు, అందులోను ఒక వటువు - రాజమతమునకు విరోధముగ వాదించవచ్చెనని రాజుకు చెప్పగలవారెవరు? రాణి వైష్ణవి. సభాప్రవేశమున కనుమతి సంపాదించుటకు ఆమె గాక మరొక గతిలేదు. యామునుడిట్లాలోచించి, కోట పడమటి ద్వారమున నానా దేశాగత దీన వృద్ధ భూసుర కుటుంబములకు, మిథ్యాయాచకులకు కాషాయ కౌపీన ధారణ మాత్రమున సన్యాసులుగ చెల్లుబడియగు స్మార్త వైష్ణవ సన్యాసులకు, బ్రహ్మచారులకు గుప్తాగుప్త ప్రకారములతో రాణివాసము పంపు ద్రవ్యమును తెచ్చియిచ్చు ముదుసళ్ళగు దౌవారికులలో నొకని ద్వారా విష్ణుపాద భజన, కథాశ్రుత పూర్వయగు రాణికి ఆశీర్వచనాక్షతలతో పాటొక విన్నపమును జెప్పిపంపెను.

<u>రాణికి విన్నపము</u>

"నేను వైదేశికుండను. వైష్ణవ వటుడను. వాది యున్నయెడల విష్ణుతత్త్వమే పరతత్త్వమని వాదించి గెలిచెదను. వసుధావరుడు విష్ణుభక్తి విముఖుడు గనుక వైష్ణవుని మనవి విన్నవించుటకెవ్వరయిన భయపడుదురు. నీవు విష్ణుభక్తి పరాయణవు. పతిహితాచారవు కనుక నీకు విన్నవించి పంపితిని. నీ విభుడు నీకు విధేయుడు. నీవాయనకు విన్నవించి, నన్ను రప్పించి వాదము సేయించగలిగిన యెడల, వాదించి గెల్చి, నీ భర్తకు భగద్భక్తి బుట్టించి కృతార్థుని గావించెదను."

ఇదివిని రాణి గ్రీష్మమున నిరుత్సాహి యగు నెమలి కోమలి (కేకిరమణి) నవమేఘధ్వనికి అలరుచందమున నలరి ఏకాంతమందారాత్రి నర్మగోష్ఠిలో తన ప్రాణేశునకు యామునుని విధ మెఱిగించెను. అతడది వినుచునే ఇట్టట్టు పడుచు "ఎట్టెట్టూ! అతడు వాదముచేసి శివమతమును జయించుటకు వచ్చెనో! చూతముగా! రావింపుము!" అనెను.

రాత్రి గడచెను. ప్రభాతమయ్యెను. రాజు పరిమిత జనముతో నాస్థానమున కొలువయ్యెను. భర్త యెదుట సంతోషితయై, చంద్రునివలె కలకలలాడు ముఖముతో నున్న రాణి అతని యనుమతిని సంపాదించి, ప్రతీహారిచేత నా బ్రాహ్మణ కుమారుని పిలువ బనిచెను.

అతడు ద్వారము జొచ్చి, యచట గరుడ పచ్చలు పరచిన నేలపై వజ్ర వేదిక యందు చివురాకులతో ఎర్రనై అందముగనున్న ఒక రావిచెట్టును చూచి, వాదమునకు సాక్షిగా నుండుమని దానికి ప్రదక్షిణము జేసి, సభను సభలో నున్నరాజును జూచుచు ముందుకు సాగెను.

<u>శైవ రాజు సభ</u>

ఆ సభ మూడు మెట్లపై యెత్తున విశాలముగ నిర్మింపబడెను. గోడలు చిత్రితములై యుండెను. నేల పసిడి గచ్చుతో నమరెను. అందొక మహా రత్న కంబళముపైనున్న చిరుగద్దెపై రాజు కూర్చుండి యుండెను. అతడొక గుండ్రని దిండుపై మోచేతినానించి, నంది ముద్రగల యుంగరపు ముంజేత చెక్కిలి జేర్చి ఆగమములు వినుచుండెను. ఆయన చుట్టు తివాచిపై వృద్ధమాహేశ్వరులు గూర్చుండి యుండిరి. వారు జటాధారులు, శార్దూల చర్మ ఖండావృతుల. రాజు ధరించిన ముత్యాల హార సంధులలో గూడ ఎన్నో రుద్రాక్షలుండెను. నొసటి విభూతి వింజామరల గాడ్పులకు రాలుచుండెను. విశాల నయనము లరుణములై యుండెను. చెవి కట్టులలో బంగారము పొదివిన చిన్న రుద్రాక్షల గుత్తులు మెరయుచుండెను. తలపైన పాగ, దానిపైకి వచ్చునట్లు దువ్వలువ గప్పియుండెను. ప్రక్కన నొక స్త్రీ తాంబూల కరండమును (అడపము), వాడి కత్తిని పట్టుకొని యుండెను. రాణి తెల్ల చామరమును వీచుచుండెను.

ఇట్లొప్పుచున్న పాండ్యుని జూచి, యామున వటువు, వినీతుడై సమీపించి, యజ్ఞోపవీతమును కానుక యిచ్చి కూర్చుండెను. ఆ విశ్వంభరా భర్త అతని నాదరింపక సంరంభియై

**సంగతి యేమోయి యిసుమంత లింగజాపు**
**తత్వ నిర్ణయ వాదంబు తరమె నీకు?**
**వోడి తేపకు బట్టి మొట్టోయనంగ**
**లింగమును గట్టకుడగ, నెఱింగి వాదువు**
**వాదుల మటంచు జెప్పించి వత్తు; రోట**

లైన దయనీది యేమైననని విలజ్జ
జాటుదనమున సభలెక్క, చారవకాంద్రు
పొరువారల మర్ది చెప్పంగనేల!

అని కటువుగ పలికెను. కాని దేవి వంక జూచునప్పుడట్టి సంరంభియగు ఆ రాజా దరహాసితుడే అయ్యెను. మరియు ఆమెతో ముందుగ అనుకొనని పందెమొడ్డెను.

"అన్మనన్మతన్మదోడిన
భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ దప్తవు మురి
ఘస్మ రచక్రాంకితుండ గాగలవాడన్-"

"ఉవిదా! యీ నీదు విద్వాంసుడోడెనేని నీకు నితనికే నన్ను పూనికయు" - అనెను. అందుకామె

ఒప్పితిమి దేవరానతి దప్పకున్న
జాలు మటి పంచభూతముల్సాక్షిగాగ

అని భర్త సవాలు నంగీకరించెను.

యామున వటువా యిరువురి ప్రతిజ్ఞలు విని, తాను ధరించిన జింక చర్మము పెళ పెళలాడగా - అర్ధముక్తాసనుడై, పసుపు పీలికగట్టి చేతనున్న మోదుగ కోలతో చేసిన ఆషాఢదండముపై కెగయుగా, ప్రాంజలితో, వినీతుడై, ధృతితో విన్నపము' అనుచునిట్లు పలికెను.

దేవా! యిట్లని యావతి
యీ వలదు - ఏ గడుపు గూటికిటరా, వాడ
భ్యే వారి బ్రోవ భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెనెగాదే!

"ఎవ్వడే సర్వభూతస్మృతిత్త్రిరంగు
నకును బ్రోచె నతని యూనతి యె తెచ్చు
నెఱిగినవి నాల్గు వాదున నెల్లని లెస్స
యతడ బొంకిన నేమి సేయంగ వచ్చు!"

రాజా! వింతమే అయినచో కానిమ్ము! నా ఉక్తులతో పరాజయ హేతువు కలిగినచో, నన్ను అమ్మ తెచ్చిన విద్యాంసుడనని కనికరింపవద్దు. ఎట్లు కావింపవలయునో అట్లట్లే చేయుము."

యామునుడిట్లు "ఉలుకు విడిచి పలికి" మరల కూర్చుండి రాజానుమతిని పొంది, వాదమునకు తలపడెను.

ఇచట ఆయన వాద సరణిని వర్ణించుటకు కవి విష్ణుచిత్తుని వాదారంభమును వర్ణించు రెండు పద్యములను మరల ఉదహరించును. అది ఆ నాటి సభావాదములన్నిటి తీరు (*technique*) అయియుండును.

యామునుడు మొదట ఒక మేటి కలిముఖుడయి, పిమ్మట తన వాదమును మొదలిడి, అన్నిటికి అన్ని దూషణములు, వేగపడక, సభ యొడబడునట్లు పలికి, ప్రక్కమాటల నెన్నక, ఒక్కొక్క మాటతోనే పరాజయ హేతువు నమగ్రహించి, అందరు దొమ్మి రేగగా కలగక, అందరను ఉద్రేకము శమించునట్లు తీర్పు నిలిపి, మరల ఆ మొదలి వానికే తిరిగి శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకు నైక్య కంఠము కల్పించి, స్వీయ మతము జగమెరుగునట్లు రాద్ధాంతముజేసి, అతనిని విజితుని గావించి, దయతో విడిచిపెట్టెను.

నీ వేమంటివి దమ్ముం
చావలి వానికిని మగిడియట్లనె వానిం
గావించి, యొకడొకడురా
నా విప్రుడు వాద సరణి నందర గెలిచెన్!

విష్ణుదేవుడే పరతత్త్వమనియు, విశిష్టాద్వైతమే మతమనియు, ప్రతిష్ఠించెను. అప్పుడెదురుగ నున్న రావిచెట్టున-

ఓహో! ఇది నిజము, రాజా! నారాయణుడే పరతత్త్వము. అతనిని కొలువుమని ఒక పలుకు వినవచ్చెను.

అది విని అచట కూడిన వేద బాహ్యులగు గుంపులు (పాషండ షండంబు) తలవంచుకొనిరి. ఆ రాజా మహోత్సవమునకు 'హర్షాద్భుత రసోత్తరంగి తాంతరంగుడై' భుజగశయన పద పద్మములందు భక్తి పాదుమి కృతార్థతను పొంది, పాండ్య మండలమునకు సోదరీ పుత్రుడే పట్టార్హుడు కావున, బ్రహ్మచారియగు యామునునకు తన కడగొట్టు చెలియలిని పరిణయము చేసి, అరణముగ నా మహాత్మునకు ధారా పూర్వకముగా నర్ధరాజ్యమిచ్చి, యువరాజును చేసి, సాంగ వేద విదుడగు నతనికి అథర్వవేద మభ్యస్తమని యెరిగి, దానిలో దివ్యాస్త్ర మంత్రములుండుటయు తెలిసి, అతనిని హెచ్చరించి, దుస్సాధ్యంబగు విరోధియూథమును సాధింపుమని దండయాత్రకు పనిచెను. అందుకా యామునుడు సన్నద్ధుడగు సమయమున అతని పురోహిత ప్రధాన మంత్రివర్గము, వర్షాదినములు సమీపించినవని, అవి గడిపి, శరత్సమయమున విరోధి సంహారమునకు విజయము సేయుమనియు చెప్పిరి. ఆ తీరునతడు రాజునకు తెలిపి, అతని సమ్మతితో నిలచెను.

ఆ నిలుచుట నిలుచుట - అరువది యొక్క మహాకల్పనలతో గూడిన వర్ష ఋతువును (4-76-136) నలుబది యేడు విచిత్రాలంకారములతో శరదృతువును (4-137-183) నింపాదిగ కృష్ణదేవరాయ భుజాని వర్ణించుట కవకాశమిచ్చెను.

ఇట్లు శరత్సమయము ప్రవర్తిల్లగా, క్షత్రియ ధర్మము స్వీకరించిన వాడు గనుక, యామునుడు దిగ్విజయయాత్ర ధర్మమని ఆరు విధములైన బలములను తోడ్కొని, సామంత రాజులనాకర్షించి, కాల్బలముల యీటెలకు కట్టిన ధ్వజ వస్త్రములు పెళపెళలాడగా, వాద్యధ్వనులు మీరగా, ఆ ద్విజరాజన్యుడు దిగ్జైత్రయాత్రను కావించెను (4-185)

నూట యెనిమిది వర్ణనలతో వర్షా శరత్తులపై కనువరచిన రాయలు చైత్రయాత్ర నొక్క పద్యమున ముగించెను. ఇది భక్తి ప్రధాన కావ్యమగుటచే గావచ్చును.

పిమ్మట యామున ప్రభువు యజ్ఞములు చేసి, దానములతో నానాదేశ విప్రులను తనుపుచు, సంపన్నతతో, ఎల్లప్పుడు "బహుభోగోన్నతుడై" అశంకతో ఆదమరచి యుండెను.

అతడట్లుండుటకు అతని పితామహుడగు నాథముని శిష్యుడైన శ్రీ పుండరీకాక్షునకు అనుగు శిష్యుడగు శ్రీరామ మిశ్రుడు దుఃఖించి ఇట్లు తలచెను. "పరమ గురు పౌత్రుడగు నితనికిట్టి బంధమెట్లు? ఇతడు యోగ సామ్రాజ్యము మరిచి , సామ్రాజ్యమున నాసక్తుడయ్యెను. ఇతని పితామహుడు ఘటికాచలపు సెలయేటి నీట మూడు వేళల స్నానము కావించి, సంధ్యావందనాదులు తీర్చి, ఆ కొండ దరుల నేకాంత గుహలో దర్భాసనమున నుండి, లక్ష్మీ నారాయణుని అంఘ్రి పుండరీకమును తన హృత్పుండరీకమున భావించి, ఉత్పులక హర్షాశ్రుడై, ప్రొద్దు తిరుగగా యజ్ఞోపవీతముతోను, తామర పూసల తావళముతోను, యోగ (ధార్యమగు పట్టు) పట్టముతోను రొమ్ము ప్రకాశించుచుండగా, ఆ కొండ యందున్న సుందరబాహు శౌరిని సేవించి, ఇంట పతివ్రతయైన భార్య ముండ్ల ముస్తెకూర (అలర్క శాకము) వండగా, ఇలు ముకుందున కర్పించి అగ్నిహోత్రమును తీర్చి, తనుయాత్రను నడిపెడువాడు. (4-190)

విషయాతురుడని, వానిని విడువుమని లోట్రువడి యనుటకంటె వేరే పగయున్నదా! నేర్పుతో, కథాదుల నొక వెంబడి అతనికే తోచునట్లు పలికి, విషయమైత్రిని పాపుట యొప్పును. లోకములో కన్నతండ్రికి సైతము తన పుత్రాదుల దుర్వ్యసనము వారింప వశపడదట. రాజ్యవ్యసనమును వారించుట కెవ్వడైనను ఎంతవాడు? కనుక, రక్తపు వంటనిచ్చి, నల్లగ్రోలనిచ్చి (రక్తమును త్రాగనిచ్చి) మెల్లగ చివ్వంగి నోటి జింకను లాగునట్టి నేర్పుగల వేటగానివలె విషయాసక్తుని తృష్ణను తీరనిచ్చి త్రిప్పుట మంచిది. అట్లోర్చుట మంచిదయినను నితని నింక నుపేక్షింపరాదు. ఉపాయమున చేరబడి ఏదో ఒక్క రీతిని త్రిప్పవలెను. లోకములో ఆహార దోషము విజ్ఞాన నాశనమునకు మూలకారణము" (4-194)

అని ఇట్లు శ్రీరామ మిశ్రుడు తర్కించి, నవకపు చిగురులతోను, పువ్వులతోను అందమైన, ముల్లు యేర్పడని అలర్క శాకము నాదుగుగ సమకూర్చి తెచ్చి - "ఒక వైష్ణవుడు కానుకిచ్చె" నను యామునుని వంట బ్రాహ్మణులచేత పంపెను. అతడు ప్రియపడి వండించి యారగించెను. రామమిశ్రుడు కొన్నాళ్ళిట్లు ప్రతిదినము తెచ్చియిచ్చుచుండెను. (4-196)

ఒకనాడు యామునుడు భోజన సమయమున సకల శాకములను రుచిజూచుచు, ఆయలర్క శాకమును నంజుచు "దీనిని తెచ్చు భాగవతుని భోజనమైన వెంటనే మాకు కనిపింపుడని పాణి పాద ప్రక్షాళనా చమనములు కాగానే అతనిని కల్పించుకొని నమస్కరించి, వచ్చిన ప్రయోజన మడిగెను.

అతనికి రామమిశ్రుడిట్లు చెప్పెను.

"రాజా! మీ పెద్దలు కూర్చిన నిక్షేపమొకటి కావేరి నదీ జలాంతర్ద్వీపమున నున్నది. అది నీకు జూపవచ్చితిని. నాకేటికి నిక్షేపము అనవద్యు. నిధియు, గనియు నరనాధుల సొమ్ము కనుక దాని విధమంతయు విన్నవించెద. నాకర్ణింపుము (శ్రీరంగనాధుడే ఆ నిధియని లోనిభావము)

ఓ రాజా! ఆ నిధిని శాంతమై, శ్వేతమై, పడగలపై మణులు ప్రకాశించు త్రాచుపామొకటి చుట్టియుండును. పూర్వమానిధి యొక రాక్షసునిచే స్వీకరింపబడినదను ప్రసిద్ధి యుండెను. ఆ రక్షస్సు దానిని యేడాదికో, ఆరు నెలలకో గాని చేరదు.

ఆ నిధి వెలుగు ఎట్టి అంజనము లేని దృష్టికైనను అగుపడును. అయినను అది ఇంత అంతకాదు. (నిరంజనుడు - పరమాత్ముడు దృష్టి అతనియందు బుద్ధి)

ఆ నిధిపై వెలలేని రత్నమొకటి మెరయును. (కౌస్తుభము) ఆ నిధిలో పద్మశంఖ సంఖ్యల కొలది ధనమున్నది. (నాభిపద్మము - పాంచజన్యము) ఇన్ని పలుకులేటికి? అది అక్షయము, అనంతము, అద్యము. నీకొక్కనికే గాని చూపరాదు. (ఏకాంత రహస్యాన దేశము) (4-200)

అని శ్రీరామ మిశ్రుడు విన్నవించగా, సంతసించి, అతడు ముందు త్రోవ తీయుగా, యామునుడు సేనా సమేతుడై, శ్రీరంగమునకుపోయి కావేరి చంద్రపుష్కరిణుల తీర్థమాడి, రంగనాథుని సేవించి, సాభిప్రాయముగా మిశ్రుని వంక జూచెను. అతడు-

**మీ పెద్దలు గూర్చిన ని**
**క్షేపమ్మిది గొమ్మటంచు శ్రీ రంగపతి**
**శ్రీ పదయుగ్మము జూపిన**
**నా పృథ్వీపతి హఠాదపాస్త భ్రముడై (4-202)**

గ్రక్కున తన పూర్వదశ తలంచి - యున్నాళ్ళు తన ప్రమాదంబునకుం బరమ నిర్వేదమ నొంది, 'నీవెవ్వండ?' వనుటయు, రామమిశ్రుడు "నేమీ పితామహుండగు నాథముని ప్రశిష్యుండ, నయ్యోగి వరుండు భావి భవజ్జన్మంబెరింగి, భాగవత వతంసంబగు నీచేత నివ్విశిష్టాద్వైతంబు సకల భూతరహితముగా వెలయుంగలదియని నిశ్చయించి నీకు ద్వయంబుపదేశింపుమని తన శిష్యుడగు పుండరీకాక్షున కుపదేశించిన నతండు భోగాసక్తుడవైన నిన్ను పాయంబున తెలిపి నీకుపదేశింపుమనుటయు బని వింటి"ననెను.

అది విని యామునుడు రామమిశ్రునకు సాష్టాంగముగా ప్రణమిల్లి అతనిచేత పంచసంస్కార సంస్కృతుండై, అంత నిలువక సన్యాసాశ్రమమునకు రాదలచి, తన స్కంధావారమునకు తిరిగి వచ్చి, కుమారునందు రాజ్యభారము పెట్టి, బంధుమిత్రామాత్య సమేతముగు బల చతుష్టయమును ప్రకృతి వర్గమును, నతని కొప్పగించి అతనికి రాజనీతిని సవిస్తరముగ స్వీయానుభవపూర్వకముగ నుపన్యసించి, సర్వజగములు,ధర్మ ప్రతిష్ఠితములు గావున, ధర్మమాచరించుము, దేవ పితృ ఋషి ఋణములను దీర్చి, సమానులలో నుత్తమ శ్లోకుడవై రాజ్యపరిపాలనము చేయుమని అతని నభిషిక్తుజేసెను. (4-286)

ఈ కథ యంతయు మన్నవారు స్వామి ఒకానొక మధ్యాహ్న సమయమున విష్ణుచిత్తునకును, శ్రీదేవికిని, కుటుంబ గోష్ఠిలోవలె ప్రసాద మందస్మితుడై ఆనతిచ్చినది.

<u>చరిత్రలో యామునుడు</u>

యామునుడు రంగనాథముని పౌత్రుడు. రంగనాథముని దాక్షిణాత్య శ్రీవైష్ణవ ప్రథమాచార్యుడు. రంగనాథముని తమిళ వైష్ణవ భక్తుల గీతములను (ఆళ్వారుల దివ్యప్రబంధములను) విస్మృతి పథము నుండి యుద్ధరించి, వానిని శ్రీ రంగాది వైష్ణవ క్షేత్రములలో సంస్కృత వేదములతోపాటు పాడుటకేర్పాటుజేసి, విశిష్టాద్వైత దర్శనమును నిర్మించుటకు యత్నించెను.

ఈయన పిమ్మట యామునుడు శ్రీరంగమున ఆచార్య స్థానము వహించి, నాథముని ననుసరించి దివ్యప్రబంధాధ్యయనమును, వైష్ణవ గోష్ఠిని వృద్ధిచేసి, సిద్ధిత్రయాది విశిష్టాద్వైత దర్శన గ్రంథములను, స్తోత్ర రత్నమును రచించెను. ఆయన చరమ కాలమున రామానుజులను తన పిమ్మట ఆచార్యునిగా నియమించవలెనని కంచి నుండి పిలిపించెను గాని ఆయన వచ్చులోపలనే మరణించెను. (1017-1137) రామానుజులు వచ్చి ఆయన చేతి వ్రేళ్ళు మూడు ముడిచి యుండుటజూచి, అవి ఆయన కోర్కెలకు గుర్తుగా గ్రహించి, దాని ననుసరించి బ్రహ్మసూత్రములకు శ్రీ భాష్యమను మహావ్యాఖ్యానమును నిర్మించి, విశిష్టాద్వైతమునకు సువ్యవస్థిత దర్శనమును స్థాపించి శ్రీరంగము కేంద్రముగా శ్రీ వైష్ణవ గోష్ఠిని బలపరచి విస్తరింపజేసెను. గురు పరంపరా ప్రభావమున యామున చరిత్ర విపులముగా నున్నది.

<u>ఆముక్తమున యామున చరిత్ర</u>

ఆముక్తమున యామున చరిత్ర చిన్నదే. అది నాల్గవ యాశ్వాసమున గల 286 గద్య పద్యముల ఏబడి యేడింట నిమిడినది. కాని కథా మధ్యమున కవి వర్షా శరదృతువులను, రాజనీతిని, విస్తరించుటచే ఈ యాశ్వాసము తక్కిన యన్నిటికన్నను పెద్దదయినది.

<u>విష్ణుచిత్తుని చైతన్య వికాసము</u>

ఊరేగింపు పిమ్మట విష్ణుచిత్తుడు తన యింటికి చేరెను. కాని, ఆ యిల్లాయనకు "పుండరీకాక్ష మహిమానులబ్ధ వైభవముతో", 'నానాలంకార సహితము'గను, రత్నకాంచన

సమయంబుగను గనుపించెను. పూర్వము యోగీశ్వరుడు న్యాయార్జిత విత్తమున త్రైష్ఠిక భాగవతులకు అన్నము పెట్టుచుండెను. ఇప్పుడతనికి తన గృహమున 'శ్రీశ దత్తశ్రీలు' ద్రవ్యితండములుగ' గనుపించెను వానితో నతడు తొంటికంటె శతగుణంబుగా భాగవత పూజా ప్రవణుడై యుండెను. మరియు ఈయన వైష్ణవాభ్యర్చనమును, తన చిరంతన తులసీదామకరణ దాస్యమును జేసికొనుచు, తత్పరతతో నుండెను. ఈ తత్పరతయే ఇచటి నుండి ఈయన ప్రవర్తనకు కీలక సూత్రము. అనగా ఈయన జగత్తున అంతర్బహిరములందు చూడబడు వినబడు సర్వమునందును నారాయణ వ్యాప్తి ననుభవించుచుండెనని తెలుసు.

పూర్వమీయన "శాంతి దాంత పరతంత్రతత బరమైకాంగిగా నుండి, జడభరతునివలె, తన జ్ఞాన మితరులెరుగని రీతిని వర్తించు (దుర్విభావ్య బోధుడై 1-78) భాగవత సమారాధనలో "నాస్తి శాక బహుతా క్షుపయా భోక్తవ్యమను" ఉపచార వాక్యములు పలుకుచు "ఇతర మెరుగక, కాలము గడుపుచుండెను. అప్పుడతడు "ఇతః పురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధుడు", అప్పుడతని ప్రజ్ఞ అంతర్ముఖము.

రాజ సభావాదము మొదలుగ నది బహిర్ముఖమై, రాజసభ నుండి ఇంటికి చేరిన పిమ్మట ఆయన ప్రజ్ఞ వైష్ణవ పురాణ సంహితా వ్యాఖ్యారచన" ప్రౌఢి గడుపుచుండును (5-38)

పైన వివరించిన విష్ణుచిత్తుని సాధన, అతీంద్రియ చైతన్య వికాసము, రాజసభకు పూర్వము జపయోగరూపమగు స్వశక్తి స్వప్రయత్నములచే నిర్వహింపబడుచుండెను. ఇది మొదటి మెట్టు. ఈ దశలో ఈయన అంతర్ముఖుడు. మన్నారు యాదేశమును వినుటతో నిది అప్రయత్న దశను చేరును. ఈ రెండవ మెట్టులో ఈయన సాధన సభలోను, సభానంతరము దైవశక్తిచే నిర్వహము కాసాగును. మరియు ఈయన భావము అంతర్బహిరములందు నారాయణునే చూడసాగును. ఈ దశలో ఈయన ప్రజ్ఞ బహిర్ముఖము కూడ అగును.

ఈ పరిణామమింకను సాగి ఆయన "నడచిన, ఉన్న, మానక, యొర్దియేని చేయుచున్నను, "మది బాయక అటని (విష్ణుని) సామ్యముగని" వారికి తనకు భేదము లేని స్థితికి చేర్పవలెను. (3-86)

ఈ పరిణామ క్రమములో యామునుని కథ వినుట ఒక ముఖ్య దశ. ఇది ఆయన శ్రీదేవితోపాటు విష్ణు కుటుంబ గోష్ఠిలో చేరి వినగలిగెను. అంతకు పూర్వము విష్ణుచిత్తుడు తన చిత్తమున విష్ణుని బంధించినను, విష్ణువే తనను సంబోధించినను, విష్ణువుతో తాను మాట్లాడినను, విష్ణువు తనకు సాక్షాత్కరించినను, తానాయనను స్తుతించినను, తన యిల్లు విష్ణు కృపచే మణిమయమయినను ఆయన కనుభూతములైనవి - విష్ణుని ప్రభుత్వ విభుత్వములే. విష్ణుని సాన్నిధ్య, సామీప్య సౌలభ్యములాయునకు యాముని కథను శ్రీదేవితోపాటు వినుటతో ననుభూతికి రాసాగెను.

ఈ కుటుంబ సంబంధమే ఇక ముందు విష్ణుచిత్తుని కథకు కీలకము. ఆ సంబంధము వలననే ఆయనకు "శిశువగు ఆముక్త మాల్యద" లభించెను. మరల ఆ సంబంధమును పురస్కరించుకొనియే - ఆయన ఆమెను రంగనాధునకిచ్చి పెండ్లిజేసెను.



